శ్రీకృష్ణాయ పరబ్రహ్మణే నమః.

అఖిలకలికల్మషాపహంబగు

# శ్రీమద్భాగవతము

## ఆంధ్రవచనము.

మూఁడవభాగము. (627-1010)

బ్రహ్మశ్రీ కేతవరపు - వేంకటశాస్త్రిగారిచేఁ

ప్రణీతము

శ్రీదేవరాజసుధీమణిపరిశోధితము.

ఆనందముద్రణాలయమున ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనివారిచేఁ

ప్రకటితము.

1925.

# ౪ విషయసూచిక.

## పంచమస్కంధము.

# పటములపట్టిక.

నీశ్వరుండను. దేవుఁడు, మనుష్యులు ననెడి నామభేదములుగా ని రూపభేదములుగాని లేకపోవుటచేఁ గేవలము ద్రష్టనై యుందును. నేనొకప్పుడును సంకోచము నొందనిజ్ఞానముగలవాఁడను. నేను బ్రకృతిపురుషసంబంధము గలవాఁడనైనను దద్గతములగు జడత్వమునుగాని పరిణామము నొందుటనుగాని యజ్ఞత్వమును గాని దుఃఖిత్వముగాని పొందక వర్తించుచుందును ఓయీ! సూక్ష్మము లగుప్రకృతిపురుషులే స్వరూపముగాఁగలిగి సమస్త హేయగుణముల విసర్జించి కల్యాణగుణములు గలిగిన నేను త్రిగుణాత్మికయగు నాప్రకృతియందు సంకల్పరూపమగు జ్ఞానముచే జీవునిమూలమునఁ బ్రవేశించి చతుర్ముఖునిమూలమున విశ్వమును సృజించుచు. నేను స్వయముగా నే పరిపాలించుచు, రుద్రరూపమున సంహరించుచు, నాయాకృత్యములకుఁ దగిన సంజ్ఞలను (బ్రహ్మావిష్ణుశివనామములను) ధరించుచున్నాను. కావునఁ జిదచిదాత్మకమగు ప్రపంచమనెడి కార్యరూపముగాను, సూక్ష్మదశను ౨ ప్రకృతిపురుషులే శరీరముగాఁగల కారణరూపముగాను, నున్నవాఁడను నేనొక్కఁడనేకాని నాకంటె నితరవస్తువు లేదని యెఱుంగుము. విశ్వమంతయు నాస్వరూపమే యగుటచేతను నాకంటె వ్యతిరిక్తమగువస్తువు లేకపోవుటచేతను, మద్వ్యతిరిక్తమగు స్వతంత్రవస్తు వున్నదనుట దేహాత్మభ్రాంతిమూలకమే. మఱియుఁ గార్యావస్థను, గారణావస్థను బొందియున్న ప్రకృతిపురుషులు శరీరముగాఁ గలిగి ప్రకృతిపురుషులలోఁ బ్రవేశించియుఁ దద్గతదోషములను బొరయక * స్వసమానమగు

---

* ఇందులకు మూలము. "అద్వితీయే" అనియున్నది. "అద్వితీయ" యనుపదమున కర్థము రెండవవస్తువు లేనివాఁడని చెప్పరాదు. తనతో సమమగు

ద్వితీయవస్తువు లేనివాఁడనై స్వాధికమగు మఱియొకవస్తువుతో శూన్యుండనై హేయగుణము లేమియును లేక స్వరూపము చేతను గుణములచేతను సర్వాధికుండనై యున్న నాయందు నాకు శరీరభూతములగుటచే నన్ను విడిచి వేఱుగానుండని బ్రహ్మరుద్రాది భూతములను, స్వతంత్రించి వేఱుగా నుండెడివానినిగా బ్రహ్మజ్ఞానములేని మూఢులు చూచుచుందురుగాని జ్ఞానులట్లు చూడరు. * ఇంతియకాక దేహాత్మభ్రాంతి గలవాఁడయినను

---

ద్వితీయవస్తువు లేనివాఁడని యర్థము చెప్పవలెను. "యస్యాచోళనృపస్సమాఽపిడ ద్వితీయోఽస్తిభూతలే" అను చోట చోళనృపతితో సముఁడగువాఁడు లేఁడని యర్థముకాని వానికంటె నితరుఁడు లేడని కాదు. అట్లెయిట నూహింపవలెను.

* ఇందులకు మూలము: "త్రయాణామేకభావానాం యోనపశ్యతి వై భిదాం। సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాంతి మధిగచ్ఛతి" అనియున్నది. ఇట "ఏకభావానాం = ఒకనియందు సత్తగల, త్రయాణాం = బ్రహ్మవిష్ణురుద్రులకని యర్థము చెప్పి, ఈముగ్గురికంటె నతిరిక్తమగు మఱియొకపదార్థము గలదని యూహించుచున్నారు. కాని యది యయుక్తము. గొప్పతనమెప్పుడును జగత్కారణమందుండవలయును గావునను, అట్టి జగత్కారణత్వము "ఆత్మేశ్వర ఉపద్రష్టా" అనుశ్లోకముచే విష్ణువునకే కలదని చెప్పఁబడినది కావునను, నావిష్ణువుకంటె నుత్కృష్టమగువస్తువు మఱియొకటిలేదని చెప్పవలసియున్నది. మఱియు "తస్మిన్ బ్రహ్మణ్యద్వితీయే కేవలే పరమాత్మని" అనుశ్లోకముచే విష్ణువు సర్వోత్కృష్టుఁడని యొక్కఁడనే చెప్పియున్నాఁడు. కావున విష్ణువుకంటె మఱియొకయుత్కృష్టవస్తు వున్నదని యోజింపరాదు. మఱియు గొందఱు "ఏకభావానాం" అనుపదమునకు "ఏకస్వరూపులని చెప్పి ముగ్గురికిని తాదాత్మ్యమును వర్ణించుచున్నారు. కాని యదియును యుక్తము కాదు. బ్రహ్మరుద్రులు జీవులనియుఁ గర్మవశ్యులనియు, విష్ణువునకు నియమింపఁదగినవారనియు, నారాయణునివలన బ్రహ్మరుద్రులు జన్మించిరనియు,

బురుషుఁడు శిరస్సు మొదలగు నవయవములలో నొకదానినైన నపరకీయముగాదనియుఁ దనకంటె వేఱుగానుండఁ దగదనియుఁ

"నారాయణాద్బ్రహ్మాజాయతే" "నారాయణా ద్రుద్రోజాయతే" ఇత్యాది శ్రుతులందుఁ జెప్పఁబడుచున్నది. కానఁ దత్స్వరూపులగు బ్రహ్మరుద్రులకుఁ బరబ్రహ్మమయిన విష్ణువుతోఁ దాదాత్మ్యమునంగీకరింపరాదు. ఆలోచింపఁగా "బ్రహ్మనారాయణః శివశ్చనారాయణః॥ శ్లో॥ బ్రహ్మనారాయణాఖ్యోసౌ కల్పాదౌభగవాన్యథా। ప్రజాస్ససర్జభగవా న్బ్రహ్మ నారాయణాత్మకః। తతస్సభగవాన్విష్ణూరుద్రరూపధరోవ్యయః। తతః కాలాగ్నిరుద్రోసౌ భూత్వాసర్వహారోహరః। సర్గస్థిత్యంతకరణీం బ్రహ్మవిష్ణుశివాత్మికాం। ససంజ్ఞాంయాతి భగవానేకఏవజనార్దనః॥" ఈ మొదలగు ప్రమాణములవలన బ్రహ్మవిష్ణుమహేశ్వరుల కైక్యమున్నట్లు గానవచ్చుచున్నను,నంతమాత్రముననైక్యమంగీకరింపరాదు. శ్రు॥ "నారాయణా ద్బ్రహ్మాజాయతే॥ నారాయణాద్రుద్రోజాయతే। నారాయణాద్ద్వాదశాదిత్యారుద్రావసవ స్సర్వాణిచ్ఛందాంసి। నారాయణాదేవసముత్పద్యంతే॥ ఏకోహవై నారాయణ ఆసీత్। నబ్రహ్మా। నేశానః। ఏకోహవై నారాయణఆసీత్। నబ్రహ్మానచశంకరః। సముని రూర్భూత్వా సమచింతయ త్తతఏతేవ్యజాయంత విశ్వో హిరణ్యగర్భోగ్నిర్యమవరుణరుద్రేంద్రాః॥ శ్లో॥ యన్నాభిపద్మాదభవన్మహాత్మా ప్రజాపతిః। తత్ర బ్రహ్మచతుర్ముఖోజాయతసోఽగ్రేభూతానాం మృత్యుమత్యసృజత్త్ర్యక్షం త్రిశిరస్కంత్రిపాదం। ఖండపరశుం। బ్రహ్మణఃపుత్రాయజ్యేష్ఠాయ॥ శ్లో॥ బ్రహ్మదక్షాదయః కాలస్తథైవాఖిలజంతవః। విభూతయోహరేరేతా జగతస్సృష్టిహేతవః। రుద్రఃకాలాంతకాద్యాశ్చ సమస్తాశ్చైవ జంతవః॥" ఇత్యాదులందు భగవంతుఁడగు విష్ణువునకును, బ్రహ్మ రుద్రులకును బరస్పరము భేదమున్నట్లు గానవచ్చుచున్నది. కావునఁ ద్రిమూర్తుల కైక్య మంగీకరింపరాదు. మఱియు మూలమున "త్రయాణాంభావానా" మని విష్ణువుతో బ్రహ్మరుద్రులను గలిపి యుచ్చరించినంతమాత్రమున బ్రహ్మరుద్రులు విష్ణువు సమానులనియుఁ జెప్పరాదు. శ్లో॥ 'సృష్టింతతఃకరిష్యామిత్వామావిశ్య ప్రజాపతే।' "హరోహరతితద్వశః" ఇత్యా

దప్పక చూచుచుండును. అట్టి నాయం దాసక్తమగుచిత్తము గలపురుషుఁడు భూతముల నాకంటె వేఱుగానుండఁ దగనివని

---

దిస్థలములందు నారాయణుఁడే బ్రహ్మరుద్రులందావేశించి సృష్టిప్రళయంబుఁ జేయుచున్నట్లు తోఁచుచున్నది కాన నారాయణుఁడు సర్వోత్కృష్టుఁడనియు నతనితో సమానులు లేరనియు తెలియునది. ఇంతియకాక మూలమున "సర్వభూతాత్మనా" మని "త్రయాణాం" అనుదానికి విశేషణము చేయఁబడినది. ఆలోచింపఁగా త్రిమూర్తులుగూడ సర్వభూతములకు నంతరాత్ములని యర్థము వచ్చుచున్నదని బ్రహ్మరుద్రులుగూడ సర్వభూతస్వరూపులని చెప్పరాదు "ఏష సర్వభూతాంతరాత్మాఽపహతపాప్మా దివ్యోదేవ ఏకో నారాయణః । అంతః ప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా॥ మమాంతరాత్మా తవచ యేచాన్యే దేహిసంజ్ఞితాః" అనునీ శ్రుతిస్మృతుల ప్రమాణముచే నారాయణుఁడే సర్వభూతములకు నంతరాత్మయైయున్నట్లు తెలియవచ్చుచున్నది. బ్రహ్మరుద్రులు జీవులు కావున వారణుస్వరూపులు. అణుస్వరూపులగువారు సమస్తభూతములకు నంతరాత్ములై యుండుట యసంభవము. మఱియు "తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః। ప్రతిపేదే అహంమనురభవం సూర్యశ్చ కక్షీవానృషిర్విప్రః । త్వంవా అహమస్మిభగవో దేవతే । అహంవై త్వమసిభగవో దేవతే । తద్యోఽహం సోఽసౌ సోఽహం అహంహరిస్సర్వమిదంజనార్దనః। అస్మైతిరూపశ్ఛందంతి గాయంతిచ" ఈ మొదలగువానియందు విష్ణువే సర్వభూతములకు నంతరాత్మయనియు నతఁడే పరమాత్మయనియుఁ దెలియవచ్చుచున్నది. కాన బ్రహ్మరుద్రులు సర్వభూతముల కంతరాత్ములని గ్రహింపరాదు. కావున "ప్రియోహిజ్ఞానినోఽత్యర్థమహంసచ మమప్రియః" "జ్ఞానీత్వాత్మైవ మేమతః" ఈ మొదలగు ప్రమాణములచే జ్ఞానులయిన బ్రహ్మరుద్రులు నాకు మిక్కిలి ప్రియులగుటచేతను, నాకుశరీరభూతులగుటచేతను, వారలకుఁ జేసినయపరాధము నాకుఁ జెందును. కావున నోదక్షా! ఇట్లు నాకుశరీరభూతులగు బ్రహ్మరుద్రులనుగూడ నీశ్వరులఁగా భావింపక యొక్క నారాయణుఁడే బ్రహ్మరుద్రరూపముగాను స్వయముగాను నున్నాఁ

తలంచుచుండును. కావుననే పురుషుఁడు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్గురుగలరని మనంబున భావింపక విష్ణువొక్కఁడే యీశ్వరుఁడనియు, నతఁడే బ్రహ్మరుద్రులయి యుద్భవించుచున్నాఁడనియుఁ దలంచునో వాఁడు క్రమముగా మనశ్శాంతిని బొంది ముక్తుండగును" అనియిట్లు భగవంతునివలన నుపదేశమును బొంది దక్షుఁడు తానొనరించెడుక్రతువుచే హరి నారాధించి స్వర్గమందును భూమియందునుగల దేవతలకెల్లఁ దనకిని వారివారికిఁ దగునట్లు భాగముల నర్పించి పూజించెను. పిమ్మట సమాహితచిత్తుఁడై దక్షుఁడు యాగభాగము నర్పించి రుద్రునిఁగూడఁ బూజించెను. పిమ్మట సోమపానము చేయువారలను జేయనివారు నగు దేవతలను బూజించెను. ఇట్లుచేసి దక్షుఁడు ఋత్విజులతోఁగూడ నవభృథస్నానము గావించెను. అంత దేవతలు తనప్రభావముచేతనే సమస్తసిద్ధులను బొందిన దక్షునకు ధర్మాసక్తమగు బుద్ధినొసంగి దివంబునకేఁగిరి. ఓవిదురా! సతీదేవి యిట్లు పూర్వదేహమును విడిచి హిమవంతుని భార్యయగు మేనకాదేవిగర్భంబునంబుట్టి పార్వతి యనునామము గలదయి సర్వదా శంకరునే భజించుచుఁ, బ్రళయకాలమందు దనన్యగతిక యగు మాయ పరమపురుషుని వరించునట్లు శివుని వరించినదని వినియున్నాను. దక్షాధ్వరధ్వంసియగు న శంకరుని యత్యద్భుత చరిత్రమును నేను బృహస్పతికి శిష్యభూతుండను, భగవద్భక్తుఁడునగు నుద్ధవునివలన వినియున్నాను. ఓవిదురా! న

---

ని యెవఁడు తెలిసికొనునో సమస్తమును బ్రహ్మముగా భావించుచున్న యా పురుషుఁడు మనశ్శాంతిని బొంది ముక్తుండగును. అని నారాయణుండు దక్షున కుపదేశించెను.

రుండు భక్తిశ్రద్ధాసమన్వితుండై శంకరుని యద్భుతచర్యలతోఁగూడిన యీచరిత్రమును జక్కఁగఁ బఠించినవాఁడు సమస్తపాపములవలన విముక్తుండగును. పరిపూర్ణంబగు నాయువు నొందును. మఱియు నెవ్వఁడీచరిత్రమును వినునో వాఁడు నట్టి ఫలంబులఁ జెంది వర్తించును. ఇందుల కెంతమాత్రము సందియము లేదు. ఇది యేడవ అధ్యాయము.

---

ఓ కౌరవశ్రేష్ఠా! నీకు మనుపుత్త్రికల వంశములను వర్ణించి చెప్పితిని. ఇంక స్వాయంభువమనుపుత్త్రుల వంశంబుల వర్ణించెద. అంతకుముందుగా నొకకథ చెప్పవలసియున్నది. వినుము. బ్రహ్మకు సనకాదులయిన కుమారులు పుట్టిరని చెప్పియున్నాను. వారిలో మరీచ్యాదులు గృహస్థులైరి. కాని సనకాదిమునులును నారదుండును, హంసుండును, నారుణియు, యతియు ననువారలు మాత్రము గృహస్థాశ్రమంబు చేకొనక బ్రహ్మనిష్ఠులయి యూర్ధ్వరేతస్కులై సంచరించిరి. అందుచేత వారి వంశంబులు వర్ధిలలేదు. బ్రహ్మపుత్త్రుఁడు ధర్ముండనువాఁడు కలండు. ఆయధర్మునికి మృషయనెడి భార్యయందు దంభుఁడను కుమారుండును, మాయయను కుమారికయుఁ గలిగిరి. ఆమాయాదంభులు సోదరులైనను సహేర్తంబువలన భార్యాభర్తలయిరి. ఆమిథునము సంతానరహితుఁడయిన నిరృతి చేరఁదీసి దంభునిఁ గుమారునిఁగాను మాయను గోడలిగాను నెంచికొని వర్ధించె. ఆదంపతులకు లోభుండను కుమారుండును, నికృతియును బుత్త్రియుం బుట్టిరి. సోదరులయిన నికృతిలోభులు దంపతులై క్రోధుండను పుత్త్రుని హింసయనెడి కన్యకను బుట్టించిరి. అంత వారలిరు

వురు దంపతులై కలియను బుత్త్రుని దురుక్తియను కుమారికం బడసిరి. అంతఁ గలియు దురుక్తియు దంపతులై భీతియనుకూఁతును మృత్యువను కుమారునిం బడసిరి. పిమ్మట నాభీతి మృత్యువులు దంపతులై యాతన యను కుమారికను నిరయ మను కుమారునిఁ బడసిరి. ఇది యధర్మ్ముని వంశము. వెనుక వర్ణింపఁబడిన మాయాదంభాదులు సంసారహేతువగు నధర్మవృక్షమునకు శాఖలచందంబున నలరుచుండురు. శ్రేయస్కాముఁడయిన మానవుఁడెన్నఁడు వానిదరికేఁగుట యుక్తముకాదు. ఈయధర్మాదుల సృష్టినే ప్రతిసర్గ మని చెప్పుదురు. ఓ విదురా! ఇఁక స్వాయంభువుని వంశమును వర్ణింతును వినుము. స్వాయంభువునకు శతరూప యనుభార్యయందుఁ బ్రియవ్రతోత్తానపాదులనుకుమారు లిరువురు కలిగి రని చెప్పియున్నాను. వా రిరువురు విష్ణువుకళలను ధరించి లోకమును రక్షించుటకయి యుదయించిరని తెలిసికొనుము. ఆ యిరువురు రాజకుమారులలో నుత్తానపాదుఁ డనువానికి సురుచి సునీతి యను నిరువురు భార్యలు కలరు. ఆభార్యలలో సురుచిపతికి మిక్కిలి ప్రియురా లయినది. రెండవభార్య సునీతి సత్ప్రవర్తనకల దయినను నతనికిఁ బ్రియురాలు కాకపోయెను. ఉత్తానపాదునకు అప్రియురాలయిన సునీతికి ధ్రువుఁడను నొకకొమరుండు కలఁడు. ఆసురుచికి నుత్తముఁడను నొకకొమరుండు కలఁడు. ఒకనాఁ డుత్తానపాదుఁ డొక్కచోఁ గూర్చుండియుండఁగా సురుచిపుత్త్రుఁడయిన యుత్తముఁడును సునీతిపుత్త్రుఁడయిన ధ్రువుఁడును దండ్రియొద్ద కేతెంచిరి. ఆసమయమున సురుచిపుత్త్రుఁడు వడివడి నరుదెంచి తండ్రి తొడపయిఁ గూర్చుండుట కభిలషింప నపుఁడా కుమారునిఁ దొడ

పయి నధివసింపఁ జేసి యతని యభిలాషమును నెఱవేర్చెను. ఆసమయంబున ధ్రువుండుకూడ నరుదెంచి తండ్రి తొడమీఁదఁ గూర్చుండుటకుఁ బ్రయత్నించెను. కాని యతఁ డందుల కంగీక రింపఁడయ్యె, అంత ధ్రువుండు చేయునదిలేక క్రిందనే నిలిచి యుండెను. అది చూచి సురుచి రాజునకుఁ దనయందును దనపు త్త్రునియందును మెండుగ దయగల దని గ్రహించి మిగుల సంత సించి గర్వించి, చిన్నిమోముతో నున్న ధ్రువునిఁజూచి పరిహాస ముగా ని ట్లనియె. "కుమారా! ఏలచిన్నబోయెదు? తండ్రితొ డపై గూర్చుండుటకు నీ వర్హుఁడవు కావు. తండ్రియంకము నధి వసింపఁదగినంత భాగ్యము గలవాఁడవయినచో నాగర్భమం దే జనింతువు. నీకట్టిభాగ్యత లేదు.కనుక నే దురదృష్టవంతురాలైన యీ సునీతిగర్భమందుఁ బుట్టితివి. ఇప్పు డొకపనిచేయుము. నీవుపోయి హరినిగూర్చి తపం బాచరించి నాగర్భమందుఁ బుట్టు నట్లు వరంబుఁ వేఁడుము.అట్లయి ననీకో ర్కె నెఱవేఱఁగలదు.''అని యిట్లు పలికిన సవతితల్లివాక్యములు చెవులకు ములుకులవలె వున నాటినఁ గ్రోధావిష్టమానసుండయి దండతాడితంబయిన సర్పంబుచందంబున నిట్టూర్పువుచ్చుచుఁ,గన్నీరు కాల్వలుగట్ట దుఃఖించుచు నాస్థలమునుబాసి తనతల్లియయిన సునీతి మంది రంబున కరుదెంచెను. అట్లు శోకాకులితస్వాంతుడయి వచ్చిన తనకుమారుంజూచి సునీతి మిగుల విచారించుచు నెదురుసని కొనివచ్చి తొడలపయి నిడుకొని పురజనులవలన సురుచిపల్కిన వాక్యంబులు విని మిక్కిలి దుఃఖించి ధైర్యంబువిడనాడి దావా గ్నిచేఁ దహింపఁబడిన లతచందంబున శోకాగ్నిచే దహింపఁబడి మాటిమాటికి సవతివాక్యంబులఁ దలంచుకొనుచు నిట్టూర్పు

చ్చుచుఁ, గన్నులనుండి బాష్పధారలను బ్రవహింపఁ జేసెను. ఇట్లు కొంతవడి దుఃఖించి ధైర్యంబుఁ దెచ్చికొని యేడ్చుచున్న కుమా

### సునీతి ధ్రువుని నోదార్చి తపంబునకుఁ బంపుట.

రుం జూచి యోదార్చుచు నిట్లనియె. "ఓముద్దుకుమారా! దుఃఖముచే నేమి ప్రయోజనము? పూర్వజన్మమందు మన మెవరినో దుఃఖింపఁ జేసితిమి. కావున మన కిట్టిదుఃఖము సంప్రాప్తమయినది. ఎవరికయినఁ దా నొనర్చినకర్మమును దా ననుభవింపక తీఱదు. నాయనా! సురుచి వాక్యము సత్యమే! నేను మిగుల దురదృష్టవంతురాలను. అట్లు కానిచోఁ బెండ్లాడినభర్త నన్ను భార్యనుగాఁ జెప్పుకొనుటకును సిగ్గుపడునా? లోకములో భర్తలు భార్యల నెంతో గౌరవముతోఁ జూచుచుందురు. అట్టి గౌరవము నాకు లేదు సరియే కదా? యతనిభార్య ననిపించుకొనుటకయిన యదృష్టము లేదు. అకటా! భర్తలగౌరవముఁ బడయు నంతటియదృష్టము ఉత్తమురాండ్రకుఁ దక్క నావంటి పాపాత్మురాలికి సంభవించునా? దురదృష్టవంతురాలనగు నాగర్భమందుఁ బుట్టినవాఁడవు కావున నీవును దురదృష్టవంతుడవే. నావంటి పాపాత్మురాలిగర్భమందు జనించితివి. కనుక నీసవతితల్లి పల్కిన కారుమాటలు పడవలసివచ్చినది. లేనిచో నట్టిమాటచే నొప్పింపఁబడి దుఃఖమునకుఁ బాత్రుండవు కావుగదా? నీసవతితల్లి చెప్పినట్లుగానే తండ్రితొడపైఁ గూర్చుండఁ గోర్కి పుట్టినచో హరిని గూర్చి తపం బాచరింపుము. నీవు మాత్సర్యమును విడిచి యామె వాక్యమునే సత్యముగాఁ జేయుము. నారాయణుని నారాధించుటవలన సమస్తమనోరథంబులును సమకూరును. పూర్వము బ్రహ్మ విష్ణువు నారాధించియె చతుర్దశభువనములలో సృ[illegible]

మయిన పదవినిఁ జెందియున్నాఁడు. మఱియు నీతాతయగు స్వాయంభువమనువు నిశ్చలమయినభక్తితో నారాయణు నుద్దేశించి గొప్పదక్షిణలతో యాగంబుల నొనరించి యతని సంతసింపఁజేసి భూలోకమందును స్వర్గలోకమందును బ్రశస్తములయిన సుఖము లనువిభవించి మోక్షము నందెను. నీవు నట్టి భక్తవత్సలుఁడయిన విష్ణువు నెస్మరించుచు నుత్కృష్టమయిన తపము నాచరింపుము. అందులకు నారాయణుండు సంతసించి నీమనోరథము నెఱవేర్చునుగాని నెఱవేర్పకపోఁడు. ఆశ్రయించిన నట్టి భక్తవత్సలునే యాశ్రయింపవలెను. కాని సామాన్యుల నాశ్రయించిన లాభమేమి? మఱియు నావిష్ణువు యోగీశ్వరుల చేత నైతిను వెదుకఁబడుచుండును. అఘటనఘటనాసామర్థ్య మాతనికేఁడన్య నింకొకరునకు లేదు. అతఁడే ముక్తిప్రదుఁడు. అతఁడే సర్వలోకాధిపతి. అట్టి మహానుభావునియందు నీమానసంబును జేర్చి నిజధర్మంబుల విడనాడక యతనినే శరీరమధ్యమున నున్నదహరాకాశమందు వెలయుచున్న పరమాత్మనుగా భావించి సేవింపుము. నీదుఃఖముల నశింపఁ జేయఁజాలువాఁడు నారాయణునికంటె మఱియొకఁడు లేఁడు. బ్రహ్మాదులును, దనయభిలషితమును నెఱవేర్చుకొన లక్ష్మియు,సంతతమతనిస్మరించుచు వెదకుచుందురు. కాన నతనినే యాశ్రయింపుము.''అనిపలికిన పరమహితదాయకంబులయిన తల్లివాక్యంబులను విని తనకుఁదానే సమాధానముచేసికొని ధైర్యమవలంబించి నారాయణుండే ది

నారదుండు ధ్రువునికడకు వచ్చుట.

క్కని తలంచి ధ్రువుండు తనతండ్రిపురంబును విడిచి చనియె.ఆసమయంబున సకలలోకచరిష్ణువగు నారదుఁ డచ్చటి కేతెంచియు

తనిచే యథావిధిగ సత్కృతుండయి యాతనియుద్యమంబు దెలిసికొని పాపవినాశనకరంబయిన తనకరతలంబును ధ్రువునిశిరంబున నిడి యాతని దీవించి తనలో నిట్లనుకొనియె. "అయారే! ఈ పిల్లవానిధైర్యం బేమని కొనియాడుదు! మానం బీతనికిఁ బ్రాణంబుకంటె నుత్కృష్టమయినట్లు గానవచ్చుచున్నది. తనపినతల్లి యాడిన దురుక్తులను మానసంబున నిడికొని చిన్నవాఁడయ్యును ధైర్యంబవలంబించి తపంబాచరింప వనంబునకుఁబోవ సిద్ధపడుచున్నాఁడు. ఈ క్షత్త్రియబాలుని ప్రభావ మేమని వర్ణింతును? ఈతనిచర్య నాకు మిగుల నబ్బురంబు గొలుపుచున్నయది" అని యిట్లులనుకొని బాలుండైన ధ్రువున కిట్లనియె. "ఓరాజకుమారా! సకల సంపదలతో నిండియున్న మీమందిరంబును విడిచి యెట కేఁగుటకుఁ బ్రయత్నించుచున్నావు? నీప్రవర్తన మరసిచూడ నీవు స్వబంధుజనకృతమయిన యవమాన మనెడునగ్నిచే సంతప్తుండవయినట్లు తోఁచుచున్నది. నీవృత్తాంతమును దెలియఁజేయుము"ని తెలిసియుఁ దెలియనివిధంబున నడుగుచున్న నారదునిం గాంచి ధ్రువుం డిట్లనియె. "ఓమునిసత్తమా! మీరు యోగదృష్టిచే నావృత్తాంతమును దెలిసికొంటిరా యేమి? మీరు తలంచినతలంపు నిక్కువంబు. మాపినతల్లి దురుక్తులనెడి బాణంబుల నామనంబునకు గాయంబు కావించినది. అట్టిమనంబును సమాధానము చేసికోలేను. ఆదురుక్తిబాణక్షతంబును భగవత్పాదారవింద ధ్యానంబనెడి రసాయనంబుచే మాన్పుకొందు" ననుడు

— నారదుఁడు ధ్రువునకు హితోపదేశముఁజేయుట. —

విని నారదుం డిట్లనియె. "ఓరాజకుమారా! నీవు పిల్లవాఁడవు. నీవు సంతతము క్రీడలచేఁ గాలక్షేపము చేయువాఁడవు. కాని

పెద్దవాఁడవు కావు. ఆటపాటలలోఁ గాలముపుచ్చఁ దగినంత చిన్నప్రాయముగల నీకు మానావమాన వివేచనము తగదు. నీ కట్టి మానావమానవివేకము కలిగినచో నందువలన మోహముదక్క నితరమయిన యసంతోషహేతువు లేదు. మఱియు నది దేహము నాత్మగాఁ దలంచుటవలనఁ గలిగినది కాని యాత్మసంబంధమయినది కాదు. ఇంతమాత్రంబునకై నీ విట్లు వంతగించి తపంబునకై పయనంబుకట్టుట యుక్తము కాదు. మఱియు బుద్ధిమంతుండౌరులవలనఁ దనకుఁ బ్రాప్తమగుచున్న సుఖదుఃఖంబులను దైవవశంబులుగాఁ దలంచి నిత్యసంతుష్టుండయి యుండుఁగాని, దుఃఖములు వచ్చినప్పుడు రిత్తవిచారంబు మనంబునఁ బెట్టుకొనండు. మఱియు సుఖంబు లరుదెంచునప్పుడు పరమానందంబును జెందండు. అట్లుగాక నీవు తల్లినియోగంబును దలయం దిడుకొని భగవదనుగ్రహంబు సంపాదింపఁ దలంచితివేని యాభగవంతుని గూర్చి నీకుఁ గొంచెము తెలియఁజెప్పెదను. పిమ్మట నాభగవదారాధనము కష్టమో సులభమో నీకే తెలియును. నాయనా! లోకేశ్వరుండయిన యీశ్వరుని యనుగ్రహమునడయుట మిగులఁ గష్టము. పెక్కుజన్మంబులనుండి భగవదారాధన మొనర్చుచు, సంతత మతనినే మనఃపద్మంబుల సంస్మరించుచుఁ, దదేకనిష్ఠులై, నిస్సంగులై వర్తించు మునీశ్వరులయిన నాతనిమార్గమును సరిగఁ దెలిసికొనలేక మోహమునుఁ బొందుచున్నారు. అతనియనుగ్రహంబు వడయుట కెన్నియో జన్మములు దారవ్రాయవలసి యుండును. కాని యది యొక్కజన్మముతోనే లభించునది కాదు. ఈవాక్యము లనుభవముఁబట్టి చెప్పుచున్నాను. కాని నోటికివచ్చినట్లు లెల్లఁ బలికినవి కావు. మహానుభావులయిన

మును లేఁ భగవన్మార్గమును గనుఁగొనలేరని చెప్పవలసియుండఁగాఁ బసిబాలుఁడవయిన నీవెట్లు కనుగొనఁగలవో యోజింపుము. కావున భగవదనుగ్రహము పడయుట దుస్సాధంబు. నీవాప్రయత్నము వదలుము. నీవు ప్రయత్నించుట వృథాప్రయాసమగును కాని సఫలము కానేరదు. యత్నము చేయనిచో భగవంతునివలన శ్రేయస్సుపొందుట యెట్లని శంకింతువేని చెప్పెద నాలింపుము. శ్రేయస్కాలము సంప్రాప్తమయినప్పుడు నీవు ప్రయత్నింపవచ్చును. కాని యిప్పటికీ ప్రయత్నము విడువుము. మఱియు భగవంతునిచే విహితములయిన సుఖదుఃఖంబు లనుభవించుచు, నిట్లనుభవించుటవలనఁ బుణ్యపాపరూపములయిన కర్మములు క్షయమునుబొందుటచే మోక్షముసంప్రాప్తమగునని యాత్మను సంతసింపఁజేయుచుఁ బఱఁగువాఁడు మాయామండలము నతిక్రమించియున్న వైకుంఠమును బొందుచున్నాఁడు. ఇదియునుంగాక పురుషుండు తనకంటెను గుణాధికుఁడయిన వానినిఁజూచి యసూయ చెందక సంతసింపవలయును. తనకంటె గుణహీనులయిన మానవులను బరిహసింపక కరుణింపవలయును. తనతో సముఁడయి యుండువానితో స్పర్థ చేయక స్నేహము చేయవలెను. ఇట్లు ప్రవర్తించినవాఁ డాధ్యాత్మికాది తాపత్రయము చేత నెన్నఁడును సంతప్తుండు కాఁడు.'' అని యిట్లుపదేశించుచున్న నారదునిఁగాంచి ధ్రువుం డిట్లనియె. ''ఓమునీంద్రసత్తమా! నీవు కృపాళుండవు. కావుననే సుఖదుఃఖంబులచేఁ బరిభూతులయి వర్తించు మావంటివారికి మనశ్శాంతి కలుగున ట్లుపదేశించితివి. అట్టిశాంతి మాయంతట మేము గ్రహింపలేము. సరియేకదా? మీవంటి మహాత్ములు దెలియఁబఱుచుచున్నను దెలిసికొనునంత బుద్ధి లేని

వారము. నీవు మహాత్ముండవును, సర్వసముఁడవును కనుక వచ్చి మావంటివారిని జూపులచేఁబవిత్రులఁగాఁ జేసి యుపదేశింపఁబూనుకొంటివి కాని మఱియొక్కరుండట్లుచేయునా? చేయఁడు. మఱియు వాఁడు పరులు దుఃఖించుచుండ మనకేమని యుపేక్షించుచుండును. మహానుభావుండ వగు నీయుపదేశించిన యుపదేశమునకు మిగుల సంతసించితిని. కాని నీయుపదేశము మాపినతల్లియగు సురుచి దుర్వాక్యంబులనెడి శరపరంపరచే వినిర్భిన్నంబై గాయపడియున్న నామానసంబును బ్రవేశింపఁజాలకున్నది. నీవుచెప్పినప్రకారము కొందఱుమహాత్ములు పరులు తమ్ముఁ దూలనాడినను "దైవవశంబువలన నిట్లు సమకూడినది" యనితలంచి యూరకుండఁగలరు. వారలను నేను జూచియున్నాను. కాని నేను భయంకరమయిన క్షాత్త్రధర్మము నవలంబించియున్నాఁడను. అందువలన నే యవినీతుండనయి వర్తించుచుండుదును. ఇట్టినాయందుఁ బ్రవేశించిన భవదుపదేశంబు సఫలంబు కాకున్నది. మఱియు భవదుక్తప్రకారము తక్కినవారలు పరుల నిందావాక్యములను సహించిన సహింతురు గాని క్షత్త్రియులుమాత్రము సహింప నొల్లరు. నేనును క్షత్త్రియవంశసంభవుండ నగుటంబట్టి మాపినతల్లి వాక్యంబులకు సహింపలేకున్నాను ఇప్పుడు నేను ముల్లోకములయందు నుత్తమమైయుండు పదంబును గోరుచున్నాను. అట్టి మనోరథప్రాప్తికై ప్రయత్నించియున్న నాకు సాధుమార్గం బేదియయిన నుపదేశింపుము. నీవు మునీంద్రులలోనెల్ల నగ్రగణ్యుండవు. పరోపకారశీలుండవు. పరోపకారంబు చేయుటయే వ్రతముగా నేర్పఱిచికొని వర్తించుచున్నావు. సృష్టికర్తయగు బ్రహ్మయూరు

వులనుండి యుద్భవించితివి. ఓసత్తమా? వీణె శ్రుతివేసి సంతతము నారాయణుని పరమపావనచరిత్రంబులఁ బాడుచుఁ బరోపకారపారీణుండ వయి వర్తించు నీకు నావంటివానికోర్కెఁ దీర్చుట యవశ్యకర్తవ్యంబు.'' అని యిట్లు ధ్రువుండు పలుకుచున్న గంభీరవాక్యములకు నారదుండు మిగుల సంతసించి యతనిని గరుణారసపూరితములు లయినచూపులచే సంతసింపఁజేయుచు నిట్లనియె. ''కుమారా! నీనిశ్చయంబునకు మిగుల సంతసించితిని. మీతల్లి యగునునీతి యుపదేశించినమార్గము మిగుల యుక్తమయినది. ఆమార్గము నీ వవలంబించినచోఁ దప్పక కార్యసిద్ధి పొందఁగలవు. మఱియు లోకములోఁ బురుషుం డెవ్వఁడేని ధర్మార్థకామమోక్షములలో నొకదాని నపేక్షించినచో నట్టివానికి భగవదారాధనరూపమయి యుపాయముదక్క మఱియొకటి లేదు కావున నీవును ధర్మాదిసాధనభూతమయిన భగవదారాధనను సలుపుము. అట్టి భగవదారాధన సలుపుటకుఁ దగిన ప్రదేశము యమునాతీరమునందున్న మధువనముదక్క మఱి యొకటిలేదు. అది సిద్ధాశ్రమభూమి. మిగులఁ బవిత్రమైనది. అట్టిస్థలంబునఁ దపంబాచరించువాఁడు తప్పక భగవంతుని సాక్షాత్కారముఁ జేసికొనఁగలఁడు. అందులకు సందియములేదు. ఆస్థలముఁనకుఁబొమ్ము. నీకు శుభంబగుఁగాక. నీవచ్చటికేఁగి నిర్మలములయిన యమునానదీపుణ్యజలంబుల స్నానము గావించి నిత్యకృత్యంబుల నిర్వర్తించికొని కుశసమూహముచే నాసనంబు కల్పించుకొని యందుపవేశించి రేచక పూరక కుంభకము లనెడి ప్రాణాయామత్రయముచేత మనశ్చాంచల్యమును దొలంగించుకొని, భగవంతుని ధ్యానముసేయుము.

## నారదుఁడు ధ్రువునకు నారాయణునాకారముఁ జెప్పుట

ఓ నృపకుమారా! ధ్యానింపఁదగిన భగవంతుం డెట్టివాఁడో చెప్పెదను వినుము. ఆభగవంతుఁడు సర్వదా యనుగ్రహాభిముఖుఁడై ప్రసన్నమయిన వదనముకలవాఁడై సుందరమయిన కనుబొమలుకలవాఁడయి యుండు. అతఁడు చక్కనిచెక్కిళ్లుకలవాఁడై, సమస్తబృందారకులలోను మహనీయమయిన సౌందర్యముచే నొప్పుచు భక్తులకు శరణభూతుఁడయి యుండు. అతనికి రమణీయము లయిన యౌవనయనములుగలవు. అతనికి నెఱ్ఱనియధరోష్ఠంబును, బద్మపత్రవిశాలములయిన నేత్రములును గలవు. అతఁడు చూచువారిచూపులకు సుఖరూపుఁడయి వర్తించు. అతఁడు సమస్తలోకములకు శరణ్యుండై దయాసంబునకు సముద్రమువంటివాఁడై శ్రీవత్సలాంఛనముచే వెలయుచునుండు. అతఁడు నల్లనిమేఘమువలె వెలయుతనుద్యుతులచేతను వనమాలచేతను నలరుచుండు. అతఁడు కౌస్తుభము మొదలగు నాభరణంబులచే నలంకృతమగు మెడగలిగి శంఖచక్రగదాదులచే భూషితమయిన బాహుచతుష్కముకలవాఁడై యుండు. అతనికిఁ జంద్రసంకాశమయిన కిరీటముకలదు. అతఁడు పీతకౌశేయముచేఁ బరివేష్టింపఁబడి యుదంచితములయిన కాంచననూపురములుకలిగి నేత్రములకానందదాయకమయిన యంగసౌష్ఠవము కలిగియుండు. అతనికి వజ్రమణులవలె నలరుచున్న నఖపంక్తిచే సుందరమయిన పాదారవిందములు కలవు. మఱియు నతఁడు భక్తులహృదయకమలములందు నివసించుచుఁ బ్రేమాతిశయమును వెలువరించు చూపులు కలిగి వర్తించు. అట్టిభగవంతునిరూపము నేకాగ్రమయిన మనంబుతో ధ్యానము సేయవలయును. అట్లు కొంతకాల

ము ధ్యానించినచో నతనినిరతిశయసౌందర్యమును జూచుచుఁ బరమసుఖమునందుచున్న మనంబు శాంతినిరూపమునుండి మగిడి రాలేదు. ఇట్లు నీవొనరించుచు నారాయణమంత్రమును జపింప

—••◆◆ నారదుఁడు ధ్రువునకు నారాయణమంత్రమును జెప్పుట ◆◆••—

వలయును. ఆమంత్రము నిరతిశయ మైనది. రహస్యముగానుంపఁ దగినది. అది "ఓం నమో భగవతే వాసుదేవాయ" యని ద్వాదశాక్షరసంయుత మయినది. ఈమంత్రమును జపించుచు, దేశకాలవిభాగమును దెలిసి ద్రవ్యప్రచురమయినపూజను భగవంతునికిఁ జేయుచుండునది. ఈమంత్రమును నేడురాత్రులు భక్తిసంయుతుండై జపించినచో దేవతాసందర్శనమునుఁ జేయఁగలఁడు. ఆభగవంతునిపూజకై పవిత్రమయిన జలమును, బుష్పమాలికలను, కందమూలఫలాదులను, భుజపత్రవృక్షములచర్మములను, దూర్వాంకురంబులను, భగవంతునికిఁ బ్రీతిదాయకములయిన తులసీదళములను, సంపాదింపవలయును. ఇట్లు ద్రవ్యములను సంపాదించి శంఖచక్రాదిమండలములచే నలంకృతమయినభూమియందు వాసుదేవునిఁ బూజింపవలయును. ఇట్లుచేసి పురుషుఁడు జితేంద్రియుఁడై, మితభాషియై, ధ్యానోపయుక్తమయిన మనస్సుగలవాఁడై, స్వేచ్ఛాయుక్తము లైన యవతారములను ధరించుటచే దేవమనుష్యాదులతో సజాతీయునిఁగాఁ జింతింపఁబడుచుండని భగవంతునిహృదయపద్మమందు జేర్చి, ధ్యానంబుచేయుచు వాసుదేవ మంత్రంబుచేత నేభగవత్పరిచర్యలను జేయువలయును. ఓరాజకుమారా! ఇట్లు మనోవాక్కాయముల నేకముగాఁ జేసి నిరతిశయభక్తిసంపన్నుండై భగవంతునియారాధనంబునల్పినచో భగవంతుండు తప్పక భక్తుని యభిలషితంబును నెఱవేర్పక మానఁ

డు. మఱియు విరక్తుండయిన మానవుఁ డీచెప్పిన ప్రకారము భక్తియోగముచే నారాయణుని నారాధించినచోఁ దప్పక మోక్షము నందఁగలఁడు" అనియిట్లు నారదుఁ డుపదేశింప ధ్రువుండు మిగుల సంతసించి తనకార్యమును సాధించుకొనుటకుఁ బుణ్యము గు మధువనమున కభిముఖుండయి పోయెను. అనంతరము నార

**నారదుఁ డుత్తానపాదునిఁ జూడఁబోవుట.**

దుం డుత్తానపాదుని యంతఃపురంబునకుఁ బోయి యతనిచే నర్చితుం డై సుఖాసీనుం డై రాజున కిట్లనియె. "ఓమహీపాలకా! నీవు సవిచారస్వాంతుఁడనయినట్లు తోఁచుచున్నది. కారణమేమి? ధర్మాదులయిన పురుషార్థములలో నేదయిన నశించినదా యేమి?" యని యడుగుచున్న నారదునకు నరనాయకుం డిట్లనియె "ఓ మునీంద్రా! స్త్రీజితుండనై దుష్టవృత్తినై, కఠినచిత్తుండనై వర్తించు నేను బంచవర్షప్రాయుండయిన నాకుమారునిజననితోఁ గూడ నింటనుండి వెడలఁగొట్టితి. అక్కటా! స్త్రీజితుఁడనయిన నాజన్మంబు కాల్పనా? అయ్యో? ఎట్టిదుష్కార్యంబు చేసియుంటిని. ఎంతకఠినహృదయుండనైతిని! [ప్రేమాతిశయమును వెల్లడి చేయుచుఁ దండ్రి నగునాయంకపీఠి నారోహింపఁ దలంపుతో వచ్చుచున్నపిల్లవానిఁ జేరఁదీయక వద్దని వారించితిని. అక్కటా! నావంటిదుర్మార్గుఁ డీ లోకమందు మఱియొకరుఁ డుండునా? ఆ పిల్లవాఁడు మందిరము విడిచి యడవికిఁ బోయినాఁడఁట! వనమందు శ్రమనొంది యాఁకలిఁగొని యసహాయుఁడై వాఁడినముఖారవిందముగల్గియున్న యాబాలు నేమృగములు చంపి భక్షించునో కదా"! అనియిట్లు విచారించుచున్న రాజుం జూచి నారదుం డిట్లనియె. మానవనాథా! నీవు విచారింపఁబని లేదు. నీకుమారున కెంత

మాత్రము భయములేదు. అతఁడు దైవముచే రక్షింపఁబడు చున్నాఁడు. మఱియు నీకమీఁద నబ్బాలుండు లోకంబులోఁ గీర్తిమంతుం డై ప్రకాశింపఁగలఁడు. అతఁడు మిగుల దుష్కర మయినను భగవదారాధనముసలిపి యతనిసంతసింపఁ జేసి యత నివలన వరములనుబడసి నీకీర్తిని బ్రపంచకమందుఁ బ్రకాశింపఁ జే యుచు శీఘ్రకాలములోనే రాఁగలఁడు. విచారమునొందకుము?" అనియిట్లు నారదుఁడు పల్కి యతని వీడ్కొని సురలోకంబున కేఁగె. అంత నుత్తానపాదుండు దాఁ జేసిన కార్యంబునకు మనంబున మిగుల వగచుచు రాజ్యలక్ష్మిని నిరాకరించి ధ్రువునిపయిఁ దనచి త్తంబిడి సంతతి మఱనినే ధ్యానించుచుండెను. అట్లు ధ్రువుండు

## ధ్రువుండు మధువనంబునఁ దపం బొనరించుట.

మధువనంబునకుఁబోయి యమునయందుఁ దానములాచరించి యారాత్రి యుపవసించి సమాహితచిత్తుం డై నారదోపదిష్టమా ర్గంబునఁ బరమపురుషునారాధింప నారంభించెను. మూఁడేసిదినం బులకొకపర్యాయము వెలఁగపండ్లను, రేఁగుపండ్లను, నాహారము గాఁ గావించుకొని, శరీరస్థితి ననుసరించి వర్తించుచు నొక్కమా సంబు హరిపూజనంబుగావించెను. అంతనుండి యాఱేసిదినంబుల కొకపర్యాయము జీర్ణపర్ణంబుల నాహారంబుగాఁగొనుచు, హరి పూజఁగావించుచు రెండవమాసంబునుగడపె. అనంతరము ధ్రు వుండునిశ్చలుండై నవరాత్రంబుల కొకపర్యాయ ముదకభక్షణ ముగావించుచు, మూఁడవమాసమున హరి నారాధించె. అప్పటి నుండి ద్వాదశదినంబులకొకపర్యాయము వాయువునుమాత్రమే భక్షించుచు జితశ్వాసుండై నాలవమాసంబున నరవిందాక్షుని పాదపద్మముల నర్చించి భజించెను. అంతనుండి యలయక నిరు

చ్ఛ్వాసుండై యేకపదంబున నిలువంబడి స్తంభాకృతిని వహించి, నైదవమాసంబున హరి నారాధించి సేవించుచు విషయముల నుండి యింద్రియములను మఱలించి మనంబును హృదయపద్మంబున నిర్బంధించి భగవంతుని దివ్యమంగళవిగ్రహము నారాధించుచు, గోచరప్రపంచమును మఱచియుండె. ఇట్లు నిశ్చలమానసుండై మహత్తత్త్వము మొదలు పృథివి వఱకుఁగల భూతములకును నవి సృజించిన చేతనములకును ధారకుఁడును, ప్రకృతికిని జీవుల కీశ్వరుండు నగు భగవంతుని ధ్యానము సేయుచున్న ధ్రువుని తేజఃపుంజమును సహింపలేక యూర్ధ్వలోకము లన్నియుఁ జలింప దొడంగెను. ఆతనిపాదాంగుష్ఠము నేలమోపియున్న కారణంబున భూమి సహింపలేక క్రిందికిఁ గ్రుంగిపోయి గజేంద్రముచే నధిష్ఠింపఁబడిన నౌకవలెఁ గుడియెడమపార్శ్వంబుల కొక్కొక్క పర్యాయము వంగఁజొచ్చెను. మఱియు నా ధ్రువుండు చరాచర విశ్వమం దున్న నారాయణుని ధ్యానించుచున్న సమయంబుల నూర్ధ్వలోకములవా రాతపోగ్నిసంతాపమును సహింపలేక యుచ్ఛ్వాసవాయువును విడువఁజాలక పీడితులై నారాయణుని సన్నిధికిఁ బోయి నమస్కరించి "ఓ నారాయణా! అనాథులమైన మమ్మును రక్షింపుము. నీకంటె మాకుదిక్కు లేదు. మాప్రాణవాయువులు నిరోధింపఁబడుచున్నవి. ఇందులకుఁ గారణమేమో తెలియఁజాలము. మాయందు దయయుంచి యీ బాధనుండి మమ్మును దొలఁగించి రక్షింపుము. శరణ్యుఁడవని యెంచి నీసన్నిధికి నరుదెంచినారము. మారక్షణభారము నీదే" యని వేఁడుచున్న దేవతలయందుఁ గరుణించి నారాయణుం డిట్లనియె. "ఓ సురలారా! మీ రెంతమాత్రము భయపడకుఁడు. ధ్రువుండను నొక

బాలకుండు నన్నుంగూర్చి ఘోరంబుగఁ దపం బాచరించుచున్నాఁడు. నేనుబోయి యాతని కిష్టవరంబులిచ్చి తపంబు మాన్పించెదను. కావున మీరు మీనిలయముల కేఁగుఁడు. అతఁడు ప్రాణనిరోధము చేయుటవలన మీకండఱికిఁ బ్రాణనిరోధము కలిగినది. సమస్తమునకును నిశ్వాసోచ్ఛ్వాసములనిచ్చు నే నతనిహృదయమున బంధింపంబడియుండ మీకెట్లు ప్రాణనిరోధము కలుగక మానును" అని పలికిన దేవతలందఱు నారాయణునికి నమస్కరించి తమతమ నెలవులకేఁగిరి. ఇది యెనిమిదవయధ్యాయము.

---

## నారాయణుఁడు ధ్రువునకు సాక్షాత్కరించుట

అంత నారాయణుండు తనభక్తునిఁజూడవలయునని నిశ్చయించి గరుడు నధివసించి మధువనంబునకుఁ బోయెను. అట ధ్రువుండు నిశ్చలభక్తియుతుండయి యోగవిపాకముచేఁ దీవ్రమయిన బుద్ధికలవాఁడై, తనహృదయమను పద్మమందొక్కమాఱు మెఱపుఁదీవచందంబున మెఱసి తత్క్షణమె యంతర్ధానము చెంది బహిర్భాగంబున నిలిచియున్న నారాయణునిఁ జూచి భయభక్తులుచెలంగ సరభసంబున లేచి నేత్రముల జూచుచున్నవాఁడుంబోలెను, నాస్యముచే ముద్దుగొనుచున్నవాఁడుంబోలెను, బాహువులచేఁ గౌఁగిలించుకొనువాఁడుంబోలెను, నతనికి సాష్టాంగదండప్రణామంబులు గావించి, భగవంతుని నుతించుటకుఁ దలంచుచుండెను; కాని నుతించుట యెట్లో తెలియక పోవుటచే వెలవెలఁ బోవుచుండెను. అప్పుడు సర్వాంతర్యామియయినభగవంతుండుధ్రువుని ప్రవర్తన మరసి దయాళువై వేదమయంబై నతనశంఖంబును న

తనికపోలంబునఁ దాఁకించెను. అంత ధ్రువునకు జీవేశ్వరనిర్ణయవిభాగము, వేదార్థప్రచురములయిన వాక్యంబులు సుద్భూతంబులయ్యె. అందువలన నబ్బాలకుండు సంతసించి భక్తిసంయుతుండై సర

### ధ్రువుఁడు నారాయణుని వినుతించుట.

భసత్త్వంబును విడిచి హద్దులేని కీర్తిగల భగవంతు నిట్లు నుతింప నారంభించె "దేవా! నీవఖండశక్తిమంతుండవు. నీదివ్యమంగళవిగ్రహమును నుతింపఁబూనియు నుతింపలేకయున్న నావాగింద్రియమును నీసంకల్పరూపజ్ఞానముచేఁ బ్రవేశించి నిన్ను నుతింపఁదగినంత శక్తిగలుగునట్లు చేసినావు. అఘటితము లగువానిని ఘటింప సామర్థ్యముగల నీకిది యెంతయుఁ దగియున్నది. మఱియు స్వశరీరభూతములయిన హస్తచరణాదులగు కర్మేంద్రియములను, శ్రవణాదులగు జ్ఞానేంద్రియములను, నంతఃకరణచతుష్టయమును, తదధిష్ఠానదేవతలను బ్రవేశించి జీవముకలదానినిగాఁ జేయుచున్నావు. ఇట్లు జీవాంతరాత్మవై జ్ఞానాదిషడ్గుణములు గలిగి వర్తించు నీకు నమస్కారము. కానవచ్చుచున్న సమస్తజగంబును వివిధరూపములుగా మార్చుటకు సమర్థమయి, సత్త్వాదిగుణరూపమై, సమస్తకార్యముల నొనరింప నుపయోగపడునదై నిన్ను విడిచి యుండలేని ప్రకృతిచేత సృజించి, కార్యకారణభూతములై సత్త్వాదిగుణమయములై యున్న పదార్థములందు జీవశరీరకుఁడవయి ప్రవేశించి వాస్తవముగా నీవొకఁడవైనను, పొట్టివియును బొడుగయినవియుఁ, దిన్ననివియు, వంకరయయినవియు నగు కట్టెలందు *వహ్ని యుపాధినిబట్టి నానారూపములఁ గా

*ఇట వహ్నిదృష్టాంతమువలన, వహ్ని పొట్టివియును, దీర్ఘములును దిన్ననివియు, వంకరయయినవియు నగు దారువులందు వెలుఁగుచున్నప్పుడా యగ్నికి,

నవచ్చునట్లు నానా విధములుగాఁ బ్రకాశించుచున్నావు. ఓ దేవా! చతుర్ముఖుండు మొదట విశ్వమును సృజింపఁదగిన జ్ఞానములేనివాఁడయి నిన్ను శరణుచెంది నీవలనఁ దాదృశజ్ఞానమును సంపాదించుకొని నిద్రించినవాఁడు మేల్కొన్న చందంబునఁ బ్రబుద్ధుండయి సమస్తప్రపంచమును సృజించెను. బ్రహ్మకునట్టి జ్ఞానమిచ్చిన మహానుభావుండవు నీవే? అట్టి నీపాదమూలము, తాపత్రయముచే బాధితులగువారికి మోక్షప్రద మయినది. ఓ పరమేశ్వరా! నీవు సమస్తమును బ్రాణవంతముగాఁ జేసి జ్ఞానమొసంగు మహోపకారివి. ఆయుపకారమును దెలిసికొన్నవాఁడెవఁడు నిన్ను సేవింపఁడు? అనీయుపకారము నెవఁడు మఱవఁగలండు? ఓ దేవా! నీవు కల్పవృక్షంబువలె నాశ్రితుల యిష్టముల నెఱవేర్చువాఁడవు. ఇంతియగాక నీవు జననమరణాదుల లేకుండఁజేసి నిరతిశయమగు మోక్షము నీయ సమర్థుండవు. అట్లు మోక్షము నీయ సమర్థుండగు నిన్ను సేవించి నీయనుగ్రహము సంపాదించుకొనియు మేము మోక్షసుఖమునుగోర నపేక్షింపక నరకప్రాయమయినను సంసారమం దుండఁదలంచుచు, శవప్రాయమగు శరీర మనుభవింపఁతగిన సుఖములను గోరుకొనుచున్నాము. ఆలోచింప మేము దాఁటఁదరముకాని నీమాయవలన మోహితులమై జ్ఞానహీనులమయి యున్నామనుట నిక్కము కదా; ఓయీ! స్వర్గముగూడ సుఖము లొసఁగూర్చుచుండ దానిని, దాని నపేక్షించువారిని, నిందించి మోక్షమును దానిఁ గో

దారుగతములగు పొట్టితనముగాని పొడవరితనముకాని తిన్నఁదనముగాని వంకరతనముగాని లేనివిధమునఁ జిదచిత్తులయందుఁ బ్రకాశించుచున్న పరమాత్మకుఁ దదీయములయిన దోషములు పొరయవని తెలియవచ్చుచున్నది.

రుచున్న నిష్కాములను నేలకొనియాడెదవనియడుగుట యుక్త ముకాదు. నీపాదకమలములను ధ్యానించుటవలనఁగాని నీభక్తుల కథలను వినుటవలనగాని మానవులకు సంప్రాప్తమగు సుఖము స్వభావసిద్ధమయి యష్టగుణరూపమయియున్న మోక్షసుఖమను భవించినను గలుగఁజాలదు. నీపాదముల స్మరించువారికిఁగలుగు సుఖము మోక్షసుఖ మనుభవించువారికే కలుగునప్పుడు కల్పాను భవానంతరమున, యమునిచే భగ్నములగు విమానములనుండి జారిపడుచున్న దేవతలకు లభించునా? లభింపనేరదు. నీపాదభ జనసుఖమునకుఁ గైవల్యమే సమానముగానప్పుడుతక్కిన సుఖము లెట్లు సరిపడును? కావున నిరతిశయమగు నానందసుఖంబులనిచ్చు నిన్ను సర్వసుఖముల నపేక్షించిన మేము మందభాగ్యుల మను టకు సందియము లేదు. అయినను మహాత్ములసంగమువలన నీగు ణకథామృతమును ద్రావి మదించి తాపత్రయమును దోలం గించుకొని దుఃఖబహుళమయి దుస్సహమయియున్న సంసార సాగరమును దరింపఁగలను. కావున దుష్టగుణరహితుడవయి యుదారగుణములు గలిగిన నీయందు నిరంతరమును భక్తిని జూపుచున్న మహాత్ముల స్నేహము నాకుఁ గలుగునట్లు లనుగ్ర హింపుము. ఓపద్మనాభా! నీపాదారవిందములందున్న సుగంధము నాఘ్రాణించిన భక్తులలో నొకఁడయినను మరణశీలమయినను మిగులఁ బ్రియముగాఁగానవచ్చుశరీరమును దన్ను ననువర్తించు పుత్రాదులను స్మరింపఁదలంచునా? ఓ దేవా! నీవు స్థూలరూప ముకంటెను సూక్ష్మరూపముకంటెను విలక్షణుండవు. కావున నే స్థూలరూపమును బురస్కరించుకొనివచ్చు జననమరణములు లేనివాఁడవు. స్థావరములచేతను, పశువులు, పక్షులు, అండజము

లు, దేవతలు, మనుష్యులు మొదలగుచరములచేతను, నంతటను వ్యాప్తమయి, చిదచిదాత్మకమయి మహత్తత్త్వము మొదలు పృథివివఱకు ననేకవిధములయి విచిత్రము లయినయాకారములు కలదై బ్రహ్మాండరూపమగు నీస్థూలరూపము నెఱుఁగుదును. స్థూలరూపమునకంటెఁ బరమయి దివ్యమంగళ విగ్రహరూపమయి, దేనివిషయమై, దేవమనుష్యాదులతో సమమయిన దనువాదముకాని, నిర్విశేష మనువాదముగాని చెల్లదో యా నీసూక్ష్మరూపమునుగూడ నెఱుంగుదును. మఱియుఁ గల్పాంతమందుఁ జిదచిదాత్మకమగు ప్రపంచమును నీజఠరమందుంచికొని స్వానుభవైకశీలుండవయి శేషసహాయుఁడవయియా శేషతల్పమందు యోగనిద్ర ననలంబించియుండి సముద్రమునంటి నీనాభికుహరమునుండి వెలువడి కాంచనమయమై,లోకాత్మకమైయున్న పద్మమునందు లోకములసృజింపఁదగిన బ్రహ్మను బుట్టించితివి.ఇట్టి యనంతశక్తివగు నీకువందనంబులర్పించుచున్నాను.ఓయీ!జీవునికివలె స్థూలసూక్ష్మశరీరములు గలవాఁడనైనచో నాకును వానికినిఁ గల భేదమేమియని యందువేని చెప్పెద. నవధరింపుము.

**జీవేశ్వర భేదనిరూపణము.**

దేవా! నీవు కర్మాధీనుండవుకాక స్వేచ్ఛచేతనే దివ్యమంగళగుణములుగల రూపములు జగత్పాలనము నిమిత్తము ధరింతువు. జీవుఁ డట్లుకాక కర్మవశ్యుఁడయి కర్మాయత్తము లగుశరీరములను దాల్చుచుండును. యజ్ఞారాధ్యుఁడవగు నీవు ప్రకృతిపురుషులకంటె వ్యతిరిక్తుఁడవు. జీవుఁడు ప్రకృతివిలక్షణుఁ డయినను దానికి లోఁబడియుండును. నీవు సంకోచమునొందని సంకల్పరూపజ్ఞానముచే సర్వదేశములందును సర్వకాలములందును స

ర్వావస్థలయందును లోకంబుల కనిష్టనిరసనంబును, నిష్ట
ప్రాప్తిని గలిగించుచుందువు. నీవు నిత్యముక్తుఁడవు. జీవుఁడు
నిత్యముక్తుఁడు కాఁడు. నీవసంకుచితజ్ఞానవంతుండవు. జీవుఁడు
కర్మాయత్తుం డగుటంజేసి సంకోచవికాసరూపమయియున్న జ్ఞా
నముకలవాఁడు. నీవు స్వభావంబువలననే నిర్వికారుండవు. జీవుఁ
డు స్వభావగుణంబువలననే వికారియై వర్తించును. ఇందువలన
నీకును జీవునకును భేదము గలిగియున్నది. వెనుక వర్ణించిన ముక్త
త్వాది గుణంబులు ముక్తునికిఁ గలిగియున్నను నీకును ముక్తుని
కిని భేదము కలదు. నిత్యముక్తుండవయిన నీవు ముక్తులందంత
రాత్మవై ప్రకాశించి ధారకుండవయియున్నావు. జగత్కార
ణమవు. ముక్తులట్టివారలు కారు. మఱియు నీవు సత్త్వరజస్తమో
గుణ పరిణామములయిన లోకంబుల కధిపతివి. షడ్గుణపరిపూర్తి
తుండవు. దేవా! వివిధశక్తియుక్తంబులయిన జ్ఞానాదులొక్క
యాధారమందుండియును బాహ్యాభ్యంతరంబునం జేసి నీయందే లీన
ము లగుచుండును, మఱియు నీవు దేశముచేతను, గాలముచేత
ను, వస్తువుల చేతను, బరిచ్ఛేద్యుండవు కావు. నీవు విశ్వోత్పత్తి
కారణుండవు. ఆనందస్వరూపుఁడవు అట్టి పరబ్రహ్మస్వరూపుఁడ
వయిన నీపాదపద్మముల కభివందనంబులు గావింతు. నీపాదంబుల
నే శరణునొందుచున్నాను. ఓ దేవా! సర్వపురుషార్థప్రదుండవ
యిన నీవు నిష్కాములముకాక సకాములమై తుచ్ఛఫలంబుల
నాసించి నిన్నుఁగొల్చునట్టి మావంటిదీనులను బ్రేమించి నవప్ర
సూతయగు గోవు తనవత్సను స్తన్యపానంబునొసంగి కాపాడు
చు వృకాదిభయంబులను దొలఁగించి రక్షించుచునున్న విధం
బున మాయపేక్షించిన కోర్కులదీర్చి సంసారభయమువలన

రక్షించుచుందువు" అని సత్యసంకల్పుఁడయిన ధ్రువుం డిట్లు భగవంతుని నుతించి యతనిపదకమలంబుల స్మరించుచు మిన్న కుండఁజూచి దాసులం దనుగ్రహముగల నారాయణుండు ధ్రువునిఁ గరుణావలోకనంబులచేఁ జూచుచు నాతనిస్తోత్రంబునకు మిగుల నానందించి యిట్లు పలికెను. ఓబాలకా! నీభక్తికి మిగుల సంతసించితిని. నీవెందులకై తపం బాచరించితివో యా నీయభిమతంబు నాకవగతమయినది. ఆనీమనోరథము దుష్ప్రాపమయినను నీయందున్న ప్రేమాతిశయముంబట్టి నీకొసంగుచున్నాను. నీకు శుభమగుఁగాక. కట్టుస్తంభంబుచుట్టును గోమహిష్యాదులు పరిభ్రమించుచున్నట్లు ధర్ముఁడు నగ్ని మొదలగువారును, సప్తర్షులును నక్షత్రరూపులయి నాపదమునకుఁ జుట్టును దిరుగుచుందురు. అట్టి దీప్తిమంతమయిన నుఁటియొక పదంబు లోకంబుల లేదు. అది యితరులకు దుష్ప్రాపంబు. అది లోకత్రయము నశించినను నశింపదు దానిని నీకు నిరువదియాఱువేలవత్సరంబు లతిక్రాంతము లయినతరువాత సంప్రాప్తంబగు. అంత దనుక భూమియందుండి పిత్రర్పితమయిన రాజ్యంబును పరిపాలించుచుండుము. నీతండ్రియగు నుత్తానపాదుం డిప్పుడు రాజ్యభారంబు సహింపనోపక నీకొసంగి వానప్రస్థుండై చను. నీసోదరుఁడగు నుత్తముండు మృగయావిహారార్థం బడవికేఁగి సర్పదష్టుండై కాలధర్మంబు నొందు. నీపినతల్లియగు సురుచియుఁ గుమారుని వెనుక నరణ్యంబునకుఁబోయి యచ్చట దావాగ్నిచేఁ జుట్టఁబడి ప్రాణముల గోలుపోవును. అందువలన నీవు నిష్కంటకంబుగా రాజ్యంబు పరిపాలించుచు ధర్మమార్గంబులఁ బ్రజలన డిపించుచుఁ బుష్కల దక్షిణలనొసంగి పౌండరీకాది యాగంబు

లచే నన్నుఁ దృప్తిపొందించి యీలోకమందు సమస్తసౌఖ్యముల ననుభవించి పిమ్మట నాపాదపద్మంబులను సంస్మరించుచు సప్తమహర్షి మండలముకంటె నూర్ధ్వభాగమం దున్నదియు సమస్తలోకములచే నమస్కరింపఁబడుచున్నదియు, మదనుగ్రహమువలనఁ బొందఁబడినదియు నగు నుత్తమస్థానమును బొందుము. దానినుండి మగుడఁ బుట్టుకకు రావు" అనియిట్లు పలికి నారాయణుండు ధ్రువునకు వలసినకోర్కె నొసంగి యతఁడు చూచుచుండఁగనే, గరుడవాహనారూఢుండై వైకుంఠమున కేఁగెను. అంతధ్రువుండును భగవదనుగ్రహమువలనఁ బరులకు దుష్ప్రాపంబయి యున్న యుత్తమపదంబు నొందియు స్వాభావికానందము కలిగింపనిద నెడి కారణమున మిగుల సంతుష్టి జెందక తనపురంబునకుఁ బోయెను" అనియిట్లు చెప్పిన మైత్రేయుం జూచి విదురుండిట్లనియె. "ఓమునీంద్రా! ధ్రువుండు సకలయోగీశ్వరులకు దర్శనీయుండయిన నారాయణు నారాధించి సాక్షాత్కరింపఁ జేసికొని పరులకెవ్వరికిఁ బొంద నలవికాని పదంబును బొందియు సంతసింపక తన్ను నకృతకృత్యునిగాఁ దలంచుటకుఁ గారణమేమి?" అనియడిగిన విదురునకు మైత్రేయుం డిట్లనియె. "కౌరవ్యా! ఆధ్రువుఁడు తనమనంబును విచారంబునకు లోనగునట్లుగాఁ జేయుటకుఁ గారణంబుం దెలిపెద వినుము. ధ్రువుండు తనపినతల్లి పల్కిన ప్రల్లదంబుల కుల్లంబున సైఁపలేక ముక్తిప్రదుఁడయిన భగవంతుని ప్రత్యక్షము గావించుకొనినను ముక్తి నపేక్షింపక సాధారణపదమున భిలషించెను. అందువలన నాతఁడిట్లు తనమనంబున విచారింపఁదొడంగెను. అయ్యో! నే నెంత తెల్వి లేనిపని చేసితిని. జితేంద్రియులైన సనందాదులయిన ననేకజన్మంబులచే నభ్యసించిన సమాధియోగము

చే భగవంతుని సాక్షాత్కరింపఁజేసికొనిరి. కాని నేను సమాధియోగముచే నాఱుమాసముల కాలములోనే భగవంతునిసాక్షాత్కరింపఁజేసికొని యతని దివ్యమంగళవిగ్రహమును గాంచి స్తోత్రాదులచే నాతనిసంతసింపఁజేసి యతని పాదమూలంబు చెంత కొంతవడి వసించియు దేహాభిమానంబు గలవాఁడనై భగవంతుని పాదమూలంబులకు దూరీకృతుండనైతిని. అకట! నాచేసికొన్న దుష్కార్యంబునకు నేనెంతయు విలపింపవలసియున్నది. దురదృష్టవంతుఁడు చేతికిదొరకిన పెన్నిధినైనఁ బాఱవైచుకొనునుగాని తత్ఫలము ననుభవింపలేఁడు. ఆచందంబుననే నేనుం బెన్నిధి వంటివాఁడును ముక్తిప్రదుఁడు నగు నారాయణునిని బ్రసన్నునిఁ గావించుకొనియు నతనివలనఁ బరమానంద దాయకములయిన నిత్యసుఖముల నపేక్షింపక యనిత్యసుఖములను గోరుకొనియున్నాను. అమృతమునువిడిచి హాలాహలమును గోరుకొన్న నావంటి తెలివితక్కువవాఁ డుండునా ? అకటా! మహాత్ముండైన నారదుండు "మానావమానవివేకము మోహమునఁబడఁద్రోచి దేహాత్మభ్రమమూలకంబయి యసంతోషహేతువగు" నని చెప్పియున్నాఁడు. ఆతనివాక్యంబు తథ్యం బాయె. నాకట్టిమానావమానవివేకమె లేనిచో నా కింత దేహాభిమానంబు గలుగునా? గలుగదు. దేహాభిమానంబు లేనిచో నేను బరమపదంబునకే ప్రయత్నింతునుగాని యిట్టి తుచ్ఛపదంబును గోరికొందునా ? ఇంతకుఁ దాఁ జేసినకర్మంబుల ననుభవింపక తీఱునా? నేను దుర్బుద్ధినుండనై నారదునివాక్యంబుల సరకుగొనక దురత్యయమయిన భగవన్మాయను సమాశ్రయించి దేహాభిమానము కలవాఁడనై యబ్రహ్మాత్మకమయిన మఱియొకవస్తువు లేకపోయినను మాపిన

తల్లియు నా మెకుమారుఁడు ను శత్రువులనెడి భేదబుద్ధిగలవాఁడ నయి యా భేదమనెడిమహారోగంబుపాలయి దురంతమయిన తాపంబు ననుభవించుచున్నాను. నాతపంబు వ్యర్థమయినది. నాపడసినయభిమతంబు నీచమయినది. మఱియు ముక్తీశ్వరుఁడయిన భగవంతుని యనుగ్రహంబును సంపాదించి యతనివలన దేహాభిమానమును యాచించుకొంటిని. నావృత్తాంతంబంతయుఁ జక్కఁగ యోజింపఁ జక్రవర్తియనుగ్రహంబును సంపాదించి యతండడిగినవరంబు లిచ్చెదనని పలికినప్పుడు చేరెఁడునూకల నిప్పింపుఁడని కోరికొనుబుద్ధిహీనుని వర్తనమును బోలుచున్నది. లోకములో మహానుభావులు భగవంతుని పాదారవిందములందలి పరాగమును వహించి సంతత మతని నే సేవింపఁ దలంపు గలవారయి యతనిదాస్యముదక్క మఱియొకవస్తువును గోరికొనరు. అట్లు కోరుచున్నవారలు బుద్ధిహీనులా? వారలవృత్తాంతములను జక్కఁగనరసి భగవత్పాదారవిందసేవను గోరికొనిన నెంత బాగుగ నుండునని విచారించె" నని చెప్పి వెండియు నిట్లనియె. అట్లు ధ్రువుండు తనపురంబున కభిముఖుండై వచ్చుచుండఁ గొందఱుపురజనులు పర్విడిపోయి రాజును సమీపించి 'దేవా ! మీ కుమారుండగు ధ్రువుం డరుదెంచుచున్నాఁడని చెప్పిరి.' కాని యాయుత్తానపాదుఁడు "ఆ ! ఏమీ ! యిది ! నాకుమారుఁడు వచ్చుచున్నాఁడా ? ఇది యసత్యము. నాకుమారుఁడెక్కడ? వచ్చుటయెక్కడ! నాకుమారుఁడెక్కడనో వనమందు మృగంబులచేఁ జంపఁబడియుండును. జచ్చినవాఁడు బ్రదికివచ్చుటయెట్టిదో నాకుమారుం డరుదెంచుటయట్టిది. అయిన మంగళగుణుండైన నాకుమారునిఁ జూచునంతటి యదృష్టముకలదా?" అని యిట్లు

పలుకుచు ధ్రువునిరాక యసత్యమని తలంచుచుండెను. అంతటఁ

ఉత్తానపాదుఁడు పురంబునకు వచ్చుధ్రువు నెదుర్కొనుట.

జారులువచ్చి ధ్రువునిరాక సత్యమని నమ్మఁబలికినవిని పూర్వము నారదుం డాడినపల్కులు స్మరించుకొని సత్యంబని నిశ్చయించి యమితానందభరితాంతుండయి యట్టివార్తలనుఁ గొనివచ్చినవారి కమితమగు ధనంబును గానుకగా నొసంగి యుత్తుంగహయము లతో నలరుచున్నదియుఁ గాంచనమయంబయినదియునగు రథం బు నారోహించి బ్రాహ్మణులతోను, కులవృద్ధులతోను, మిత్ర బాంధవామాత్యులతోను, గూడికొని మంగళవాద్యఘోషలు చెలంగఁ బురంబునుండి బయలు వెడలి కుమారునిఁజూడ వేడుకచే నతివేగముగా నెదుర్కొనఁ జనియెను ఆసమయమున సురు చియు, సునీతియుఁ గాంచనమయములయిన పల్లకీలలోఁ గూ ర్చుండి. రాజు ననుసరించిరి. ఇట్లు కొంతదూర మెదురుగఁ జని వచ్చుచున్న యాముద్దుకుమారుం జూచి రథము నిలుపుమని సారథి కాజ్ఞాపించి యతఁ డట్లుచేయ నరథసంబున దిగి ప్రేమపరవశుం డై పోయి నారాయణపాదసంస్పర్శనంబుచే సమస్తపాపంబులం దొలంగించుకొని వచ్చినకుమారుని సమీపించి యాలింగనము చేసికొనెను. ఇట్లు రాజు కుమారునిఁ గౌఁగిలించుకొని యా తనిమూర్ధమును మాటిమాటికి మూర్కొనుచుఁ గనులనుండి వెలువడుచున్న యానందబాష్పబిందుసందోహముచే నాతనిస్నా నము చేయించెను. అంత ధ్రువుండును దండ్రిపాదముల కభి వందనములు గావించి దీవనలను బడసి తరువాతఁ దల్లుల యొద్ద కేఁగి సాష్టాంగదండప్రణామంబు లాచరించెను. అంత సురుచి తనపాదములకు నమస్కరించిన యారాజకుమారుని

లేవఁదీసి యాలింగనముఁ గావించుకొని "చిరాయుర్భవ" యని దీవించెను. ఓవిదురా! చూచితివా? సవతితల్లియయిన సురుచికి సైత మెట్టిప్రేమ జనించినదో. పల్లమునకు నీరు ప్రవహించునట్లు తనసద్గుణములచే హరిని సంతసింపఁజేసిన వానినందఱు జనులును ననుసరించుచుందురు. అనంతరము ధ్రువుండు నుత్తముండు నన్యోన్యమాలింగనంబు గావించుకొని పులకితాంగులయి యానందబాష్పముల విడిచిరి. అనంతరము సునీతి ప్రాణంబులకంటెఁ బ్రియతముం డయి తనకు నమస్కరించినకుమారు నాలింగనంబు చేసికొని తదంగసంస్పర్శంబువలన సుఖం బనుభవించుచు మనోవ్యథలను దొలఁగించుకొనెను. మఱియు వీరమాతయగు న సునీతి కుమారునిఁ జూచినసంతోషాతిశయముచేత నయనంబులనుండి బాష్పజలంబును, నాబాష్పములచేఁ దడిసిన స్తనంబులనుండి క్షీరంబులను స్రవింపఁజేయుచు బుత్త్రప్రేమను వెలిపుచ్చెను. అంతట సమాత్యాదిజనులందఱు రాజుం జూచి, "ఓమహీపాలా! నీయదృష్టంబు మిగుల మంచిది. లేనిచో సుగుణవంతుఁడయినకుమారుఁడు నష్టప్రాయుం డయ్యుఁ దిరిగి లభించునా? నీపూర్వపుణ్యవశమువలన మఱల నీకుమారుం బడసితివి. ఈసుగుణవంతుం డీభూమండలంబు నెల్లఁ జక్కఁగఁ బరిపాలింపఁగలండు. ఏవాని పాదభక్తులు దుర్జయ మయిన సంసారమును జయించుచున్నారో యాభగవంతుఁడు పూర్వజన్మంబున నీచే నర్చితుండై యుండును. లేనిచో నీకింత యదృష్టము సంభవించునా?" అని ఇట్లు జనంబులచే నుతింపఁబడుచు నుత్తానపాదుండు తనయిరువురుకుమారుల నొకగజంబు పైనధిరోహింపఁజేసి సమస్తపరివారంబు గొలుచుచుండ మహో

నందంబుతోఁ బురంబుఁ బ్రవేశించెను. ఇట్లు రాజు పురంబును బ్రవేశించి మనోహరములయిన మకరతోరణంబులచేతను, గదలీస్తంభంబులచేతను చూతాశోకాదిపల్లవంబులచేతను, ముత్యాలసరములచేతను, సదీపములయిన యుదకకుంభంబులచేతను, గడుఁజక్కఁగ నలంకృతంబులయిన ద్వారంబులుగలవై కాంచనమయమయిన పరిచ్ఛదంబులచే నొప్పు గోపురంబులచేతను, బ్రాకారంబులచేతను, మందిరములచేతను, గనుల పండువు లొనరించుచున్నవై పన్నీటిచేఁ గలయంపి చల్లఁబడియున్నవైన వీథులం బడి పోవునప్పు డుభయపార్శ్వంబుల నుండు మేడల పయినుండి యంతఃపురస్త్రీలు లాజలను బుష్పంబులను గురియింపఁజొచ్చిరి. మఱికొందఱు పురస్త్రీలు రాజునకును రాజకుమారులకును పుష్పఫలాదులను గానుకలగా సమర్పించి యాశీర్వాదంబుల నొసంగుచుండ ధ్రువుం డందఱిచే సత్కృతుం డగుచు నెడనెడ వారు చేయుచున్న మధురగానంబుల విని సంతసించుచుఁ, జనిచని తన తండ్రిగారి మందిరంబును బ్రవేశించెను. ఇట్లు ధ్రువుండు కనకరత్నమయమయి కన్నులకు విందు గొలుపుచున్న జనకభవనంబును బ్రవేశించి జనకుఁ డయిన యుత్తానపాదునిచే మిగుల గౌరవింపఁబడుచు స్వర్గమందున్న దేవపతివలె మిగుల సౌఖ్యముల ననుభవించుచుండెను. మఱియు ధ్రువుండు పాలనురుఁగువలె, మృదువులును, దెల్లనివియు, సువర్ణమయములును, నగు శయ్యలయందు శయనించుచు, మహార్హములై రజతమయములయి యలరుచున్న యాసనంబులఁ గూర్చుండుచు, స్ఫటికరత్నఖచితములును, మరకతమాణిక్యమయములు నగు కుడ్యములచేతను, దేవకాంతలఁ బోలుయువతీ

రత్నముల చేతనుఁ బ్రకాశించుచున్న మందిరములయందు సంచరించుచు, వివిధములయిన తరుబృందములచేత సుందరమయి విహంగమముల కలకలంబులచే వీనుల విందుగొలుపునట్టి యుద్యానవనములయందును, హంసలు, కన్నెలేడిపిట్టలు మొదలగు జలవిహంగముల నినాదములచేఁ బొలుపారుచు, బద్మకువలయాదులచే నిండినవయి రత్నమయములయిన సోపానములచేఁ బ్రకాశితములై యలరారుచున్న దిగుడుబావులయందును విహరించుచుఁ గాలము పుచ్చుచుండెను. అంత నుత్తానపాదుఁడు యుక్తవయనువాఁడైన తనకుమారునిఁ జూచి మిగులసంతసించి మంత్రుల యనుమతినిఁ బొంది ప్రజానురంజకుఁడయిన ధ్రువునికి మహా వైభవముతోఁ బట్టాభిషేకము కావించెను. అనంతర ముత్తానపాదుండు తన్ను ముదుసలివానిఁగా నెఱింగి ముక్తికిఁ దగిన యుపాయము నాలోచించుచు విరక్తుండై రాజ్యమును బురమును బంధువులను విడిచి తపం బొనరింప వనమునకుఁ బోయెను ఇది నవమాధ్యాయము.

---

అనంతరము ధ్రువుండు ప్రజానురంజకముగా రాజ్యమును బరిపాలించుచు శింశుమారుఁడను పేరుగల ప్రజాపతితనూజను భ్రమియనుదానిని బెండ్లియాడి కల్పుఁడు వత్సరుఁడు ననునిరువురఁ బుత్త్రులం బడసె. మఱియు వాయుపుత్త్రికయగు నిడాదేవిని వివాహమాడి యువతిజనంబులకు మన్మథునివలెనున్న యుత్కలుఁ డనుకుమారునిఁ గనియెను. ఆధ్రువునిసోదరుం డయినయుత్తముండు మృగయాకుతూహలుండయి యడవికిఁబోయి హిమవన్నగంబున సంచరించుచు నొకయక్షునిచే వధింపఁబడియె.

ఆతండు పెండ్లి చేసికొనకయే చచ్చుటచే సంతతి లేదయ్యె. తన కుమారుని మరణవార్తను విని సురుచి దుఃఖసంతప్తయై వనంబుఁ బ్రవేశించి కార్చిచ్చుచే నావరింపఁబడి మృతినొందె. అంత ధ్రువుండు భ్రాతృమరణంబునకు మిగుల దుఃఖించి తన్మరణంబు యక్షకృతంబగుట తెలిసికొని కోపాగ్నిచే సంతప్తహృదయుండయి జయశీలుండయిన యరదంబెక్కి యక్షులకు నివాసభూతంబయిన యలకాపురంబునకుఁ బోయెను. ఇట్లు ధ్రువుండు పోయి పోయి యక్షబృందంబులచే సంకులంబయి హిమాలయపర్వతముల కనుమలలో నున్న యలకాపురంబును బొడగాంచి సమీపించి దశదిశలును బ్రతిధ్వనినాదంబు లిచ్చునట్లు తన శంఖమును బూరించెను. ఆశంఖ ధ్వని నాలకించి యక్షస్త్రీలందఱు మిగుల భయంపడిరి. అప్పు డలకాపురీరక్షకభటు లాశంఖధ్వానమునకు సహింపక కోపావిష్టమానసులై శస్త్రాస్త్రధారులయి పర్విడి వచ్చి ధ్రువునిఁ జుట్టుముట్టిరి.

## ధ్రువుండు యక్షులతో యుద్ధము సేయుట.

అంత ధ్రువుండు తన్నుఁ జుట్టుముట్టి వచ్చుచున్న యక్షులం బొడఁగాంచి శత్రుభయంకరంబయిన తన కార్ముకంబెక్కిడి యొక్కొక్కనిపయి మూడేసిబాణంబులం బ్రయోగించి యొక్కొక్కనిని నొప్పించెను. వార లాదెబ్బలకుఁ దాళఁజాలక యాతని పరాక్రమంబునకును గరలాఘవంబునకును నచ్చెరువడి నుతించుచు సతీకోపంబూని పాదతాడితంబు లయినసర్పంబులవడువున లేచి చాపంబులెక్కువెట్టియొక్కొక్కరొక్కొక్క బాణషట్కంబును బ్రయోగించి ధ్రువుని నొప్పించిరి. మఱియు నాయక్షులలో బలశాలురైనవారు ధ్రువుండొనర్చినయపకారంబునకుఁ బ్రతీకా

రము సేయఁదలఁచి యాధ్రువుని, నతనిసారథిని,పరిఘములు, పట్టి
సములు, ఖడ్గములు, గండ్రగొడ్డండ్లు,శక్తులు,చిత్రపుంఖములుగల
బాణములును,వర్షమట్లఁ గురియించి ముంచిరి. ఇట్లుపదుముగ్గురు
యోధులొక్కపెట్టునఁ దాఁకి బాణవర్షములు గురియింప నావ
ర్షంబులచే నావృతులయిధ్రువుండును బరిచారకులును మేఘబృం
దంబులచే నావృతము లయినపర్వతములచందంబున నదృశ్యు ల
యిరి.అది చూచి యాకసంబునఁ దిరుగుచున్న సిద్ధబృందంబులు
ధ్రువున కపాయంబు వాటిల్లెనని తలంచి హాహాకారంబులు సేయు
చు "అక్కటా ధ్రువుం డనుసూర్యుండు యక్షు లనుసముద్రం
బునం గ్రుంకె" ననిపలుకుచు మిగుల విచారింపఁజొచ్చిరి. ఆసమ
యంబున యక్షులందఱు మిగుల సంతసించుచు "మేమే జయము
పొందితి" మని భావింపఁదొడంగిరి.అంత ధ్రువుండు దన్నావరించి
యున్ననీహారంబును భేదించుకొని వచ్చు సూర్యునిచందంబున
శరవర్షమును భేదించుకొని బయలువెడలి వచ్చి ధనుష్టంకార
మును గావించుచుఁ దద్ధ్వనిచే శత్రుసమూహంబులకు భయంబు
గలిగించుచుఁ, బుంఖానుపుంఖంబుగా బాణములఁ బ్రయోగించు
చుండ నాబాణపరంపర, మహామారుతంబు మేఘబృందంబులఁ
జెల్లాచెదరుగఁ జేసినట్లు లాశత్రుసమూహమును జెదరఁగొట్టెను.
ఆసమయంబున ధ్రువునిచేఁ బ్రయుక్తములయిన బాణంబులు మ
హా రభసంబునఁబోయి పర్వతముల భేదించు పిడుగులవడువున
శత్రువులకవచములను భేదించి దేహములం బ్రవేశించెను. ఇట్లు
ధ్రువునిబాణపరంపరచే ఖండింపఁబడిన కుండలమండితములయిన
శిరంబులచేతను, స్వర్ణతాళములఁ బోలినయూరువులచేతను,
సుందరములయినబాహువులచేతను, సమూల్యములయినయలం

కారములచేతను, దలపాగలచేతను, సంకులమయి యున్నయుద్ధభూములు వీరులకు మిగుల మనోహరముగాఁ బ్రకాశించుచుండెను. ఇట్లు చంపఁబడఁగా మిగిలిన యక్షులు ధ్రువుని సాయకములచే ఖండితములయిన యవయవములు గలవారలయి యాతనిధాటికకు సైఁపలేక సింహమునుజూచి భయపడి పర్విడు గజంబులవలె నలుదిక్కులకుఁ బర్విడఁజొచ్చిరి. అంత ధ్రువుఁడు యుద్ధభూమియందు శస్త్రపాణియయియున్న శత్రువునుగానకయలకాపురమును జూడనిచ్ఛకలవాఁడయినను "శత్రువులు పెక్కుమాయలుకలవారు కావుననట్లుచేయుటయుక్తముగా" దనితలంచిపురంబునుజొరక సారథితోఁ బ్రసంగించుచుండె. ఆయవసరంబున మేఘగర్జితమువలెభయంకరమయినశబ్దము వినవచ్చె. దానివలన మగుడశత్రువులు తనకుఁ బ్రతీకారము చేయఁదలంచి వచ్చుచున్నట్లుభావించి జాగరూకుఁడయియుండె. అంతమహామారుతంబు ధూళులచే దిక్కులఁగప్పుచు ప్రబలముగా వీవఁజొచ్చెను. కనురెప్పపాటుకాలములోనేమేఘబృందంబులుగగనభాగంబును గప్పిగర్జితములచేతను భయమునుగలిగింపఁ జొచ్చెను. ఇట్టులా మేఘములుకొంతవడి భయంకరముగసంచరించుచు రక్తమునువిణ్మూత్రములను, బూయమును, మాంసమును, వర్షింపఁదొడంగెను. మఱియు నాకసమునుండి కబంధములు పడఁజొచ్చెను. సకలదిక్కులయందు నాయుధములను ధరించి ప్రయోగించుచున్నవీరులు కనఁబడఁజొచ్చిరి. విషాగ్నులను వెడలఁగ్రక్కుచున్న సర్పములు గజములు శార్దూలాదిక్రూరమృగములు నల్గడలఁ బర్విడఁ జొచ్చె. ఆసమయంబున సముద్రము ప్రళయకాలమందువలె ఘోరముగా ధ్వని సేయుచు భూమిని ముంచుచు మహాతరంగములచే మి-

గుల భయంకరముగా విజృంభించెను. ఇట్లు పలువిధము లయిన మాయలుగల్పించి యారక్షస్సులు ధైర్యవంతులు కానివారికి భయము పుట్టునట్లుచేసిరి. అంత ధ్రువుం డసురమాయనుజూచి దానిని దప్పించుకొనుట మిగుల దుస్సాధ్యంబని తలంచి యేమి యుం జేయ నిష్టపడక యున్నసమయంబున మునీంద్రులందఱు ధ్రువుని సమీపించి, "ఓరాజా! నీ వెంతమాత్రము భయపడకుము. నీకు శుభంబులు కలుగుఁగాక. భగవంతుండగు నారాయణుని నామ స్మరణమె మానవులను భయంకరమయిన మృత్యువు నుండి తప్పించుచున్నది అతఁడీమాయను నశింపఁజేయలేఁడా? శీఘ్రముగా నాతఁడు నీశత్రువులను నీమాయను నశింపఁజేయుఁ గాక" యని పలికిరి. ఇది పదవయధ్యాయము.

---

అంత ధ్రువుండు మునీంద్రులవాక్యంబులవిని యాచమనముఁ గావించి నారాయణాస్త్రమును వింటఁదొడిగెను. ఓవిదురా! ఇట్లు ధ్రువుండునారాయణాస్త్రమునుసంధింప గుహ్యకులచేని ర్మింపఁబడిన మాయలన్నియు, జ్ఞానోదయముకలిగినపిమ్మట నశించెడి రాగద్వేషాదులవలె నశించెను. పిమ్మట ధ్రువుండు నారాయణాస్త్రమును ప్రయోగించి మఱియుఁగలహంసపక్షములచే నలంకృతములై నిశితములై స్వర్ణమయములయిన పుంఖములు కలవై యొప్పుచున్న మఱికొన్ని శరంబులను బ్రయోగింప నవి భయంకరవంబులై వనమును బ్రవేశించు మయూరములచందంబున శత్రుబలంబులను బ్రవేశించెను. అట్లు ధ్రువుఁడు ప్రయోగించిన బాణములచేఁదాడితు లయిన యక్షులు కోపావిష్టమానసులై యాయుధములను ధరించి సర్పంబులు పడగలెత్తికొని గరుత్మం

తునిపయిగవిసినట్లు గవియ నారంభించిరి. అదిచూచి ధ్రువుండునిశి తశరంబులను వింటసంధించి యాశత్రువులశిరస్సులను బాహువులను గంఠములను ఛేదించి యర్కమండలంబును భేదించివారిని యోగీశ్వరులు ప్రవేశించుచున్న యూర్ధ్వలోకమునకుఁబుచ్చెను. ఇట్లు ధ్రువుండు ప్రళయకాలరుద్రునివలె యక్షానీకంబులఁ జెండాడుచు వర్తించుచుండ నదిచూచి యతని పితామహుండయిన స్వాయంభువమనువు మునీంద్రులతోఁగూడ నచ్చటి కరుదెంచి యాతని కిట్లనియె.

—స్వాయంభువుండు ధ్రువునితో యుద్ధము మాను మనిచెప్పుట.—

ఓవత్సా! సమ్మోహాత్మకమయిన యజ్ఞానముచేఁ గలిగినదియుఁ బాపహేతువయినదియునగు కోపంబును జెంచి నిరపరాధులగు నిందఱపుణ్యజనుల నేల చంపితివి? చాలు. ఇంకనైన యుద్ధముఁడుగుము. ఓయీ! ఈకృత్యము సత్పురుషు లాచరింపవలసినది కాదు. సత్పురుషనిందితమయినయీకృత్యము నావంశమందుఁబుట్టినవా రాచరింపఁదగినది కాదు. ఈయక్షులు నాసోదరుండయినయుత్తమునిఁ జంపియుండఁగా నిరపరాధు లెట్టులగుదురు? సాపరాధులను జంపినఁ బాపముండునా?' అనియందువేని చెప్పెదవినుము. ఓభ్రాతృవత్సలా! నీవు భ్రాతృస్నేహముచే నీవాపనిచేయుటయుక్తమే. కాని యొక్కయక్షుఁడపరాధము చేసినంతమాత్రమునఁదక్కినయక్షులనందఱిని సంహరించుట తప్పు. మఱియుఁదన కొకఁడపరాధముచేసెనని మగుడ వానికిఁ బ్రత్యపకారముచేయఁబూనుట దేహాత్మాభిమానముగల పశువుల కుచితముకాని భగవద్భక్తులయి వర్తించుసాధువుల కెంతమాత్రము తగినదికాదు. దేహాత్మాభిమానముగలమూఢులచే దురారాధ్యుండును సర్వాం

తర్యామియునగు నారాయణుఁడే సర్వభూతాత్ముఁడై యున్నట్లు భావించియతనికంటె నన్యమగువస్తువేదియు లోకమున లేదని నిశ్చయించి యింతకుఁబూర్వము హరినిసమారాధించి యతనియనుగ్రహబలంబుచేను త్తమపదమును జెందితివి. అట్టిభగవద్భక్తుఁడవయిన నీవుపాపకృత్యములనాచరించుటతగునా? మఱియునీవుభగవద్భక్తుండవుకావున భక్తులకుఁదగిన సన్మార్గము నవలంబించి లోకమునకట్టి సన్మార్గమును గఱపుటయుక్తము. కానియిట్టిక్రూరకృత్యము లాచరించుట తగదు. నీవుభగవంతునికిని భగవద్భక్తులకును సమ్మతుఁడ వయియుండవలయును. నీవిట్టిదుష్టకార్యంబులాచరించినచో నీవు పరమాత్మకు విరోధివై యుందువు. 'ఓయీ! భూతద్రోహముచేసిన భగవద్భక్తి తొలంగునా' యని యడుగనవసరంబులేదు. భగవద్భక్తుండయినవాఁడు, సాపరాధులను సహించుచుండవలయును. దుఃఖితులనుజూచి సహింపక కరుణారసమును వెలిపుచ్చుచుండవలెను. సమస్తజంతువులను భేదబుద్ధిచేఁ జూడక వానితో మైత్రిచేసి మెలంగవలయును. సర్వభూతములయందు సమభావము కలిగియుండవలయును. అట్లయినచో భగవంతుండు ప్రసన్నుండు కాఁగలఁడు. అట్లుకాక కొన్నిభూతములయెడ విరోధ మవలబించినచో నతఁడు ప్రసన్నుండుకాఁడు. ఆహరి సర్వభూతములయందు నంతరాత్మయయియుండుటచేతను, దేవమనుష్యాదులందఱు నతనికి శరీరభూతులగుటచేతను, నతనికి శరీరభూతులయిన దేవమనుష్యాదులలో నొకని కపకారముచేసినచో నాయపకార మతనియందే పర్యవసన్నమగుచుండఁగానతం డెట్లు ప్రసన్నుండు కాఁగలఁడు? కావున భూతద్రోహము చేసిన భగవంతునికిఁ దనయం దనుగ్ర

హము తప్పును. 'ఓయీ ! భగవదనుగ్రహము లేక పోయినఁ
బోనిమ్ము. అందువలన నష్టమేమి?' యన వలనుపడదు ప్రతిమ
నుష్యుఁడును భగవదనుగ్రహమును సంపాదింపవలయును. పురు
షుఁడు సర్వాత్మస్వరూపుఁ డయిన భగవంతుని నుపాసించుచుఁ
దితిక్షాదిగుణములచే భగవంతునిఁ బ్రసన్నునిఁగాఁ గావించుకొ
నినచోఁ బ్రాప్తభగవత్స్వరూపాదయుండగుటచేఁ గామక్రోధాదులవ
లన విముక్తుఁడై సకలశోకరహితానందదాయకమయిన వైకుంఠమున
కేఁగుచున్నాఁడు. అందువలన భగవంతునికి వ్యతిరిక్తులమయి వ
ర్తించుట తగదు. మఱియుఁ బంచభూతంబులచేతఁ బ్రారంభిం
పఁబడి దేవమనుష్యాదిశరీరరూపముగాఁ బరిణతమయి రెండువిధ
ములయి యున్న స్త్రీపురుషులు సంగమించుటవలనఁ బ్రాణికోటి
యుద్భవించుచున్నది. పంచభూతపరిణామముకల స్త్రీపురుషస్వ
రూపములగు రెండుశరీరములవలన స్త్రీపురుషరూపములు సంభ
వించుచున్నవి. అవి పంచభూతాత్మకములే కదా? ఈ స్త్రీపురుషశ
రీరసృష్టియుఁ బ్రజనితమయిన సృష్టియుఁ బరమాత్మకు శరీరమైన
మాయను సంబంధించిన సత్త్వాదుల తారతమ్యసంబంధమువల
ననే కలుగుచున్నది. కలిసియున్న యాత్రిగుణములందు రజో
గుణసంబంధ మధికముగా నుండి తక్కినగుణములు తక్కువగా
నున్నయెడల సృష్టి జరుగుచుండును. సత్త్వగుణ మధికముగానుండి
తక్కిన వల్పముగా నున్నయెడల స్థితియు, దమోగుణమధికము
గానుండి తక్కినగుణములు తక్కువగా నున్నయెడల నాశనము
ప్రవర్తిల్లుచుండును. సృష్టిస్థితిలయములకు సత్త్వాదులే కారణ
ములు. ఇందువిషయమయి యీశ్వరుఁడు నిమిత్తమాత్రుఁడయి
యుండును. అట్లుసమస్తమునకు నిమిత్తమాత్రుఁడయిన భగవం

తునిసన్నిధియందుఁ గార్యకారణరూపమయిన ప్రపంచమంతయు నయస్కాంతము సన్నిధినిలోహామువలెఁ జలించుచుండును. ఆయీశ్వరుఁడు కర్త కాకపోయినను సృష్టిస్థితిలయములకు హేతుభూతమయిన సత్త్వాదిగుణములు మిశ్రితములగుటకుఁ గారణమయిన కాలరూపశక్తిచేత, సత్త్వాదిగుణప్రవాహముచేఁ గర్మాధీనులయిన దేవమనుష్యాది రూపముగాను, సుఖదుఃఖతారతమ్యము గలుగునట్టుగాను వ్యవస్థచేయఁబడిన ప్రపంచమును సృజించుచున్నాఁడు. స్వయముగా హంతగాక ప్రపంచమునంతను లయమును బొందించుచున్నాఁడు. అయ్యారే! ఆభగవంతుని చేష్ట నూహింప శక్యముకాదు కదా! మఱియు నాకాలస్వరూపుఁడయిన పరమాత్మ పిత్రాదిమూలకముగా సృష్టికావించుచున్నాఁడు. మృత్యుమూలముగా సృష్టినాశనమును గావించుచున్నాఁడు. పరమాత్మకుఁ బ్రజలందఱు సమానులే! అతనికి శత్రువులు లేరు. మిత్రులు లేరు. ప్రసరించున్న వాయువును రజఃకణము లనుసరించి ప్రవర్తించుచున్నట్లు సమస్తభూతములు సకలనియామకుఁడయిన భగవంతు ననుసరించి ప్రవర్తించుచుండును. ఆభగవంతుఁ డాయాభూతముల కర్మముల ననుసరించి యాయుర్వృద్ధినిగాని, యల్పాయువునుగాని ప్రాణులకు నొసంగుచుండును.అందువలన భూతముల నాశనమునకుఁ దత్కృత పూర్వకర్మమే కారణముగాని మఱియొకటి కాదు.కొందఱు సుఖమునకుఁ బుణ్యము కారణమనియు దుఃఖమునకుఁ బాపము కారణమనియు,భావింతురు. మఱికొందఱు ప్రకృతిపురుషపరిణామస్వభావమే సుఖదుఃఖకారణమందురు. కొందఱుకాలస్వరూపము కారణ మని తలంతురు. ఒకకొందఱు పరమపురుషు

సంకల్పమే సుఖదుఃఖకారణంబు కాని మఱియొకటికాదందురు. ప్రకృతిపురుషవిలక్షణుఁ డయినభగవంతుని సంకల్పమే ప్రపంచకమునకు సృష్టిస్థితిలయములను గలిగించుచున్నది. అట్టిభగవత్సంకల్పము నెవఁ డెఱుంగును? ఓకుమారా! నీభ్రాత యగును త్తమునిమరణమునకు భగవత్సంకల్పమే కారణము కాని యీకుబేరానుచరు లెంతమాత్రమును గారు. ఇట్లు భగవంతుఁడు లోకములసృజించుచుఁ బెంచుచు, లయించుచు నున్నను నాతఁడెప్పుడును గుణకర్మములకు వశుఁడయి యుండఁడు. మఱియుఁ జిదచిదాత్మకమయిన భూతసంఘములయం దంతరాత్మరూపుఁడయి యుండి యాయాభూతముల కర్మములను బురస్కరించుకొని తదనుగుణమయిన ఫలము నొసంగుచు నియామకుఁడయి వర్తించుచున్నాఁడు. ఆతఁడే సమస్తభూతముల యుత్పత్తివినాశాదులకుఁ గారణభూతుఁడు. ఆతఁడే శక్త్యాత్మకమయిన మాయచే లోకముల సృజించుచుఁ, బెంచుచు, లయమును బొందించుచు నున్నాఁడు. ఓకుమారా! తన్నుభజింపనివారికి సంసారబంధముల నొసంగుచుఁ, దన్నుగొలుచువారికి మోక్షము నొసంగుచున్న భగవంతుని స్వప్రకాశకునిఁగాను, జగదాధారకునిఁగాను, సర్వభూతాత్మకునిఁగా నిశ్చయించి భజింపుము. ఆనారాయణునికంటె నధికుఁడెవ్వఁడు లేఁడు. బ్రహ్మాదిదేవతలు సైతమతనియాజ్ఞచొప్పునఁ బ్రవర్తింపవలసినవారే. మఱియు వృషభాదులు నాసికారజ్జువులచే బంధింపఁబడి మానవులకు వశములయి సకలకార్యముల నెఱవేర్చుచున్నట్లు బ్రహ్మాదిదేవతలందఱు పరమాత్మ మాయాపాశముచే బద్ధులయి యతనికి వశులై సతతము భక్తితోఁ బూజల నర్పించుచుందురు. అట్టి బ్రహ్మాదు లేయు

తనికి వశులయి కైంకర్యము చేయుచున్నప్పుడు మనవంటి వారిసంగతి వేఱ చెప్పవలయునా? మనమందఱ మా భగవంతునికి వశులమై యున్నాము. కనుక నాతని కానందము కలుగునట్లు కర్మములనాచరించి యతనియనుగ్రహము నొందుటయే యుక్తకార్యము. మఱియు నీవు పంచవర్షప్రాయుఁడవయి యున్నప్పుడే, సవతితల్లియగు సురుచివాక్యములకు సహింపలేక ప్రాణాస్పదురాలయినను దల్లిని విడిచి వనమున కేఁగి యతినిష్ఠాగరిష్ఠుండవయి భగవంతు నారాధించి ప్రత్యక్షముఁ గావించుకొని ముల్లోకములకు శిరోభాగమందున్నదై యుత్కృష్టమైయున్న పదమును బొందితివి. ఇప్పుడు నయితము కడుభక్తితో నాపరమాత్మనే సేవించుచుండుము. ఏజీవాత్మయందు దేవమనుష్యాదిరూప మగు ప్రపంచము లేకపోయినను బుణ్యపాపకర్మములచే నున్నట్లు బ్రతీయమాన మగునో; ముక్తాత్ముఁడయిన యట్టి జీవాత్మయందు నంతరాత్మగా నున్నవాఁడను. హేయగుణములు లేక వికారశూన్యుఁడయి నిరుపమానమహిమ గలిగి నిత్యముక్తుఁడై యున్న పరమాత్మను మనంబునఁ గనుఁగొని సేవింపుము. 'ఓయీ! నేనింతకుముందు భగవంతుని సేవించి యతనియనుగ్రహమును బడసితినే. మరల నిప్పుడతని నేల భజింపవలయు' నని యడుగుదేని చెప్పుచున్నాను వినుము. నీవు పూర్వము భగవంతుని సేవించి యతనిదయను సంపాదించితివి. నిశ్చయమె! కాని నీవప్పుడహంకార మమకారములతోఁ గూడికొని భగవంతుని నారాధించితివి. అందువలననే నీకుఁ బ్రాకృతస్థానము లభించినదికాని పరమపదము లభించినదికాదు. కావున నీ విప్పుడు ప్రత్యగాత్మశరీరుఁడై షాడ్గుణ్యసంయుతుఁడై దేశముచేతను కాలముచేతను

వస్తువుచేతను బరిచ్ఛిన్నుండుకాక గేవలానందరసస్వరూపము గలిగి సమస్తశక్తిసంయుతుండై యున్న పరమపురుషునియందు నిర్హేతుకమయిన భక్తినిం జూపుచు, వర్తించితివేని యహంకార మమకారములచే దృఢపడియున్న యవిద్యాగ్రంథిని భేదించి ముక్తుండవు కాంగలవు. ప్రస్తుతము నీవు కోపావిష్టమానసుండవయి యున్నావు. ఇట్టులు కోపమునవహించుట యుక్తము కాదు కోపము సమస్తపురుషార్థములకుం బ్రతికూలమయినది. కోపముకలవాండొక్కపురుషార్థమునయిన సంపాదించుకొనలేండు. ఆకోపమునెడి రోగము తనకును బెఱవారికిని భయంబును ననర్థమును గలిగించును. బుద్ధిమంతుండట్టికోపరోగమునకు వశుడై యుండండు. నీవు నట్టి నాచెప్పిన తత్త్వవాక్యంబులనెడు నౌషధమును బానముచేసి దానిని దొలంగించుకొని బాగుపడుము. నీవు కోపాతిశయముచే యక్షులను సంహరించి దిక్పాలకుండయి మహాగౌరవముతో వర్తించుచున్న కుబేరునకు నపకారము జేసితివి. అట్టిదేవతల కపకారము చేసినమర్త్యుండు శ్రేయస్సులను బొందుట కష్టము. అట్టిమహాత్ములకుం గోపము వచ్చినచో మనకులము నశించుట సిద్ధము. కావున మనకులమును నశింపం జేయునంతటికోపము కుబేరునికి రాక పూర్వమే నీవతనియొద్దకుం బోయి వేండుకొని యనుగ్రహమును సంపాదింపుము. అట్లైనచో నే మనకులము నిలుచునుగాని లేనిచో నిలువదు. నీవు కుబేరునిపాలికి వేగముగాం బొమ్ము. అతనిం బ్రార్థింపుము'' అనిస్వాయంభువమనువు మనుమండయిన ధ్రువునికిట్లు తత్త్వముపదేశించి ధ్రువునిచే నభివందితుండయి, మునీంద్రులతోంగూడం దనపురంబునకుం బోయెను. చతుర్థస్కంధమున నేకాదశాధ్యాయము.

విరోధ ముడిగిన ధ్రువునిఁ గుబేరుఁడు చూచుట.

అంతధ్రువుండుపితామహునివచనంబులను దలధరించి కోపము నుడిగి యుద్ధంబు సాలించి కుబేరానుగ్రహంబు సంపాదింప సమకట్టుచున్న సమయంబునఁ గుబేరుం డాతనియభిప్రాయ మెఱింగి యక్షచారణాదులచేఁ బరివేష్టింపఁబడి ధ్రువుఁడున్నతావున కరుదెంచి బద్ధాంజలియైనయాతనికిట్లనియె. "ఓక్షత్రియబాలకా! నీవు పెద్దలవాక్యములందు గౌరవముంచి కోపమునుండి మఱలితివి. కావున నేను మిగులసంతసించితిని. నీవు పాపరహితుఁడవయి వర్తింపుము. 'ఓయీ నేను బుణ్యజనవధ గావించియుండఁగా పాపరహితుఁడ నెట్లగుదు'నని విచారించుటకు నవకాశము లేదు. నాయనుచరులయిన యక్షులు నీసోదరునిఁ జంప లేదు. నీవు యక్షులను జంప లేదు. భూతముల యుత్పత్తి వినాశములకుఁ గాలస్వరూపుఁడయిన యీశ్వరుఁడే కారణభూతుఁడు. 'ఓయీ! నాచేతులతో నేను బ్రయాసము చెందుచు సమస్తయక్షులను జంపియుండ నీశ్వరుఁడు చంపినాఁడనుట యెట్లు?' అనియందువేని చెప్పెద వినుము. పురుషుఁడు దేహముకంటె విలక్షణమగు నాత్మనుగూర్చి చక్కఁగఁ దెలిసి యుండవలయును. కానియాతనికి నట్టితత్త్వజ్ఞానము లేక పోవుటవలన సంతతము దేహము నాత్మగా భావించుకొనుచుండును. అందువలన 'నేను వానినిఁ జంపితిని' 'నీవు వానినిఁ జంపితివి' యనెడిబుద్ధి స్వప్నబుద్ధివలెనే*యన్యథాజ్ఞానస్వరూపమయినది.

---

*అన్యథాజ్ఞానమనఁగా నొకవస్తువునందు మఱియొకవస్తువు ధర్మమున్నదనెడిబుద్ధియే-శంఖము తెల్లగానుండుట ప్రసిద్ధము. పైత్యాదిదోషములు గలవానికా శంఖము పచ్చగాఁగానవచ్చును. అప్పుడు వాఁడు శంఖము పచ్చగానున్నదని భావించును. ఇప్పుడువానికి ధర్మియగు శంఖమనెడిబుద్ధి గలిగినను దానియందుం

డు తెలుపనెడి ధర్మము పసుపనెడి ధర్మముగా తోఁచుచుండ నట్లు శంఖమందున్న తెల్లఁదనమును బచ్చఁదనముగా భావించుట యన్యథాజ్ఞానము. విపరీతజ్ఞానమనఁగా, నొకవస్తువునుఁ జూచి మఱొకవస్తు వనుకొనుటయే. ముత్తెపుచిప్పను జూచి రజత మనుకొనును. అట్లు రజతము కానిదానిని రజత మనుకొనుట విపరీతజ్ఞానము. స్వప్నావస్థయందిట్టి జ్ఞానములు కలుగుచుండును. స్వప్నము పురుషునికి నొకవస్తువున నున్న ధర్మమును మఱియొక ధర్మముగాను, నొకవస్తువు మఱియొక వస్తువునుగాను దోఁపించును, కాని యది యెప్పటికిని వాస్తవము కాదు. ప్రస్తుతమున "నేను చంపితిని" "నీవు చంపితివి" అనుబుద్ధి యన్యథాజ్ఞానవిపరీతజ్ఞానరూప మయినదయె. "నేను" అనెడిపదము చేతను, "నీవు" అనెడిపదము చేతను దేహమందున్న యాత్మ చెప్పఁబడుచున్నది. కాని దేహము చెప్పఁబడలేదు. కావున, "నేను" అనుపదమున కర్థము కాని దేహమును "నేను" అనుపదమున కర్థముగు నాత్మనుగా భావించుటయే విపరీతజ్ఞానము. మఱియు నొరులను జంపనివి కాన నాత్మయందును, దేహమందును, హననకర్తృత్వము లేదు. అట్లు హననకర్తృత్వములేని దేహాత్మలయందు హననకర్తృత్వరూపధర్మము నారోపించుటయే యన్యథాజ్ఞానము. "ఆత్మ చంపునది కాదు. చంపఁబడునదియుఁ గాదు" అనునర్థము గీతలలోఁ గూడఁ జెప్పబడినది. 'శ్లో. యఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతం. ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే, ఎవఁడాత్మ యొరులను జంపునని తలంచునో, యెవఁడాత్మ యొరులచేఁ జంపఁబడుచున్నదని భావించునో, వా రిరువురు యాథార్థ్యజ్ఞానము లేనివారు. అంతియ కాని యాత్మ మఱియొక దానిని జంపలేదు. మఱియొక దానిచే నాత్మ చంపఁబడదు. ఈహేతువుచే నాత్మకు హననకర్తృత్వము లేదని యెఱుంగునది. ఒకవేళ నాత్మకు లేక పోయినను దేహమునకుఁ గలదని యూభావింపరాదు. దేహమెల్లప్పుడును బుట్టుచున్నది. ఎల్లప్పుడును నశించుచున్నది. ఈవిషయము గీతలలోఁ జెప్పఁబడినది. శ్లో. అథచైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతం। తథాపిత్వం మహాబాహో నత్వం శోచితుమర్హసి,, ఈదేహము నిత్యము పుట్టుచున్నట్టుగాను నిత్యము నశించుచున్నట్టుగాను తలంచుచున్నావు. కావున నిత్యము మృత

* దేహాత్మబుద్ధి వాస్తవముగా సుఖమునకుఁగాని దుఃఖమునకుఁ గాని హేతువు కాక జననమరణరూపసంసారమును, స్వభా

---

మయిన దేహమందు హననకర్తృత్వముకాని హననకర్మత్వముకాని యారోపించి దుఃఖింపరాదని భావము. కావున దేహమందుఁగూడ నట్టిధర్మములనారోపింపరాదు. ఈ చెప్పుటవలన హననక్రియలోఁ గర్తకాని కర్మకాని కాక యున్నను దేహమందును నాత్మయందును నటువంటి బుద్ధిగలుగుట యన్యథాజ్ఞానవిపరీతజ్ఞానములనుండియే యగుయును, నట్టి యన్యథాజ్ఞానవిపరీతజ్ఞానము లనాదిగావచ్చుచున్న యవిద్యారూపమగు నజ్ఞానమువలనఁ గలుగుచున్నవనియుఁ జెప్పుటచే నది స్వప్నబుద్ధివలెనే యర్థశూన్యమయినదని తెలియుచున్నది. అన్యథాజ్ఞానవిపరీతజ్ఞానము లవిద్యవలనఁ గలుగుచున్నవనువిషయము గీతలలోఁ జెప్పఁబడినది- “శ్లో. అనాత్మన్యాత్మబుద్ధిర్యా అస్వే స్వమితి యా మతిః। అవిద్యాతరుసంభూతం బీజమేతద్ద్వివిధం స్థితం” అనఁగా, ఆత్మకానిదేహమందాత్మబుద్ధియుఁ దనది కాని వస్తువునందుఁ దనదనెడి బుద్ధియు, నవిద్యావృక్షమువలనఁ బుట్టి రెండువిధములుగా నున్నబీజమే యని యర్థము. కావునఁ బ్రస్తుతమునఁ గుబేరుఁడు ధ్రువునితో “ఓయీ! నీవు యక్షులఁ జంపుటలో వ్యాపారము చేయుటయు, నందువలన శ్రమఁ జెందుటయు నీయాత్మకు గాని దేహమునకుఁ గాని లేదు. అయిన నది యన్యథాజ్ఞాన విపరీతజ్ఞానములచే నట్లు తోఁచుచున్నది. కావున నీ విందులకయి విచారింపవలదని యుపదేశించెను.

* ఇటుఁ గుబేరుఁడు ధ్రువునకిట్లు చెప్పెను. ఓ ధ్రువుఁడా! నీవు యక్షులను జంపినట్లును, యక్షులు నీతమ్మునిఁ జంపినట్లును భావించుచున్నావు. మఱియు జంపుటకు వ్యాపారము చేసినట్లును, నందువలనఁ గలిగిన యాయాసము చెమ్మట మొదలగువాని ననుభవించుచున్నట్లును, ప్రత్యక్షముగా మీరుఁ జూచుచున్నారు. కాని హననాదికర్తృత్వముకాని, యందువలనఁ గలుగునాయాసము చెమ్మట మొదలగునవి కాని, మీ రనుకొనునట్లు లాత్మకు లేవని “హన్తా చేన్మన్యతే హన్తుం” “య ఏనం వేత్తి హన్తారం” మొదలగు ప్రమాణములవలనఁ దెలియవచ్చుచున్నది. అట్లే దేహమునకుఁ గూడ లేవని “అథ చైనం నిత్యజాతం

వసిద్ధముగ గుణాష్టకము గలయాత్మయందు నట్టిగుణములు లేవనెడి విపరీతజ్ఞానమును, గలిగించుచుండును. ఇట్లు మహానర్థములు గలిగించుచున్న దేహాత్మబుద్ధిని విడువవలయును. మీా రనుభవించితి మనిన స్వేదశ్రమాదులు కూడ సద్వారకముగా భగవంతునికే చెందుచుండును. అందువలన నీవెంతమాత్రమును విచారింపకుము. ఓధ్రువకుమారా! నీకు శుభమగుంగాక. నీ వికఁ నీముందిరఁబున కరుగుము. చిదచిద్రూపమగు ప్రపంచమే శరీరముగాఁ గలవాఁడగుటచే సర్వభూతములును నాత్మయు నతఁడేయని గ్రహించి యింద్రియముల కగోచరుఁడయినను యోగీశ్వరుల మానసంబులచే ధ్యానింపఁదగిన చరణకమలములతో నొప్పుభగవంతుని సర్వదా భజింపుము. ఆ భగవంతుని సామాన్యునిగాఁ దలంపకుము. అతఁడు సంసారమును మొదటికి ఛేదించినవాఁడు. మఱియు నతఁడు భజించువారిసంసారబంధంబులనుగూడ ఛేదింపఁజాలినవాఁడు. అతఁడు

---

నిత్యం వామన్యసేమృతం। తథాపిత్వాం మహాబాహోశత్వం శోచితు మర్హసి॥ అనువాక్యమువలనఁ దెలియవచ్చుచున్నది, కావున హననాదిక్రియలలో మీారు కర్తలనునది యజ్ఞానమువలనఁ గలుగుచున్నది. కాని యది వాస్తవముకాదు. హననాదిక్రియలందుఁ జెమ్మటయాయాసము మొదలగువాని మీారనుభవించుచున్నట్లు తలంచుచున్నారు. కాని యాస్వేదశ్రమాదులు గూడ సద్వారకముగా భగవంతునికే చెందుచుండును. అదెట్లు చెందునని సందియమొందనవసరములేదు. "కాఠిన్యవాన్యో బిభర్తి తస్మై భూమ్యాత్మనే నమః" ఇత్యాదులందు భూమియందుండు కాఠిన్యాదులు భూమిశరీరకుఁడగు నీశ్వరునకు సద్వారకముగాఁ జెందునట్లు మీా రనుభవించుచున్నట్టులు తలంచుచున్న స్వేదశ్రమాదులుగూడ సద్వారకముగా మీాయంతరాత్మయైయున్న భగవంతునికే చెందుచుండును. కావున నెంతమాత్రమును విచారింపఁదగదని భావము.

సత్త్వాదిగుణప్రచురగమై, తనకుఁ గార్యసాధనియై యున్న తన మాయను లోఁబఱుచుకొని దానికి నియంతయై యున్నాఁడు. కావున నిట్టి భగవంతుని మోక్షమపేక్షించి కొలువుము. ఓనృపకుమారా ! నీవింక సంకోచమువిడిచి యేది నీకిష్టమో దానిఁ గోరుము. ధర్మార్థకామములలోనీ కేదయిన నిష్టమయినచోఁ గోరుము, వరమిచ్చెదను. నీవు సంసారమున బ్రహ్మాదులకుఁ బూజనీయుఁ డగునారాయణునిపాదపద్మముల సంతతము భజించుచుఁ దదాసక్తచిత్తుఁడవై యుండువని విందుము. నీవు త్రివర్గము నపేక్షింతువా?'' అని యిట్లు కుబేరుఁడు వర మడుగుమని నియమింపఁగా భగవద్భక్తుఁడును మహామతియు నగుధ్రువుండు తరింపఁ దరముగానిదయిన సంసారమును దరింపఁజేయఁజాలిన దృఢమగు హరిస్మరణమును గోరుకొనెను. కుబేరుండది విని సంతోషపూర్వకముగా ధ్రువునకు వరం బొసంగి ఆతఁడు చూచుచుండఁగనే యంతర్ధానము చెందెను. ధ్రువుండును దన పురంబున కరిగెను. అనంతరము ధ్రువుండు పురోడాశాది ద్రవ్యములచేతను, ఋత్విజుల వ్యాపారములచేతను, ఇంద్రాదిదేవతలచేతసుఁ బ్రకాశితమయి విస్తారములగు దక్షిణలు గలయాగములచేతను, గర్మములకుఁ దగినఫలం బిచ్చు నారాయణుని నారాధించెను. మఱియును సమస్తభూతములందు నంతరాత్మయై ధారకుఁడై కావుననే సర్వశబ్దవాచ్యుఁడై సత్త్వాదిగుణరహితుఁడై, యాశ్రితరక్షకుఁడై యున్నభగవంతునియందు నవిచ్ఛిన్నమగు భక్తిఁగలవాఁడయి ధ్రువుండు తనయందును సకలభూతములందును నంతరాత్మయై యున్నయాభగవంతుని సాక్షాత్కారము చేసికొనెను. ఓవిదురా! ప్రజలు సుస్వభావము కలిగి ధ్రు

ష్ఠాణసేవాపరాయణుం డయి దీనులందు వాత్సల్యము గలిగి రక్షించుచు, ధర్మముల మర్యాదలు చెడకుండఁ గాపాడుచున్న ధ్రువునిఁ దండ్రినిగా భావించి సేవించిరి. ధ్రువుండు సుఖ మను భవించి పుణ్యకర్మమును, దుఃఖ మనుభవించి పాపకర్మమును, నశింపఁజేసికొనుచు నిరువదియాఱువేలవత్సరంబులు భూమిని బరిపాలించెను. ఇట్లతఁడు సావకాశచిత్తుఁడయి బహుసంవత్స రములు గలిగి పెక్కుయాగము లొనరించుటచేఁ ద్రివర్గసాధన మయియున్న కాలమును గడపి కుమారునకు రాజ్యమొసంగెను.

ధ్రువుండు తపంబునకై బదరికావనంబున కేఁగుట.

అనంతరము ధ్రువుండు దేహమును మాత్మకు మగునీ ప్రపంచక మంతయు జీవునియందుఁ బ్రకృతిసంబంధమువలనఁ గలిగిన దని యుఁ, బ్రకృతిపరిణామరూపమైనదనియు, స్వప్నమందుఁ గాన వచ్చు గంధర్వపురమునలె నున్నదనియుఁ దలంచెను. ఆరీతిగా నే యతఁడు దేహము, భార్యలు, పుత్త్రాదులు, స్నేహితులు, చతు రంగబలయుక్త మగుసైన్యము, ధనము, మనోహరము లగు విహారభూములు, జంబూద్వీపాత్మక మగుభూమండలము, స్థిర ములు కావని నిశ్చయించి వానిని విడిచి విశాల మగుబదరికా వనంబున కేఁగెను. ధ్రువుం డచ్చట విశాలమగు బదరకావన మందు నిర్మలమును బవిత్రము నగుజలమందుఁ దానమాడి, యింద్రియంబుల నియమించి, స్వస్తికము మొదలగు యోగాస నములచే వాయువును బంధించి, శ్రోత్త్రాదులగు నింద్రియంబుల నన్నింటినిమనస్సునొక్కచోఁ జేర్చుకొని,భగవంతునిదివ్యమం గళ విగ్రహమునందు మనస్సునుఁ బ్రవేశింపఁజేసెను. ఇట్లు చేసి భగవంతునికంటె విజాతీయ మగువస్తువు లేదనువిశ్వాసము కల

వాఁడయి భగవత్స్వరూపమును ధ్యానము సేయుచు సమాధి నవలంబించెను. ఇట్లు ధ్రువుండు ప్రతిదినమును భగవంతుని యందు భక్తిని వర్ధిల్లఁజేసికొనుచు, నానందబాష్పధారలచేఁ దడియుచుఁ, బులకాంకురములు శరీరమందు వ్యాపింప, హృదయము సంద్రవింప, దేహాత్మాభిమానమును విడిచి యాత్మ మనస్సత్త్వాది ధర్మములలోఁ దానెచ్చటనున్నట్టుగాఁ గలంపలేదు. ఇట్లుండి కొంత కాలమునకు నుదయించిన పూర్ణచంద్రునివలె దన కాంతులచే దశదిక్కులను బ్రకాశింపఁజేయుచు నాకాశమునుండి భూమికిఁ దిగుచున్న యొకదివ్యవిమానమును బొడఁగాంచెను. తరు

ధ్రువునకొఱకు వైకుంఠసదనమునుండి విమానము వచ్చుట

ణాతి నాలుగుభుజములు గలిగి శ్యామలవర్ణముతో నొప్పుచు, యౌవనారంభ పదవియందుండి యరుణపద్మములవంటి నేత్రములు కలవారయి, గదలను ధరించి, ప్రశస్తములగు వస్త్రములఁ దాలిచి, కిరీటముచేతను, ముత్యాలహారములచేతను, భుజకీర్తులచేతను, సుందరములగు మకరకుండలములచేతను, మిగుల నొప్పారుచు విమానాగ్రమున వెలయునిరువురు దేవతాశ్రేష్ఠుల నతఁడు చూచెను. ఇట్లు చూచి ధ్రువుండు వారిని నారాయణమూర్తికింకరులనుగా నెఱింగి, భయసంభ్రమములు మనంబునఁ బెనఁగొనుటచేఁ బూజాక్రమమును మఱచి, భగవంతుని నామములను మాత్రమే పఠించుచు దోసిలిబంధించి వారికి నమస్కరించెను అంత భగవంతునికిఁ బ్రియభటులగు నందసునందులిరువురును. విష్ణుపాదపద్మములందుఁ దనచిత్తము నుంచి వినయసూచకముగా మెడను వంచి నమస్కరించినధ్రువునిఁ గాంచి మందహాసము సేయుచుఁ, బ్రీతి పూర్వకముగా నిట్లు పలికిరి. "ఓ

రాజా ! నీకు శుభమగుఁగాక. నీకు భద్రమగుఁగాక. సావధా నుండవయి నా వాక్యంబుల వినుము. నీవయిదేండ్ల ప్రాయము గలిగినప్పుడు తపంబున నీభగవంతుని మెప్పించితివా జగదాధారకుఁడగు నాభగవంతుని సేవకులము. నిన్ను భగవత్పదము నకుఁ గొనిపోవుట కయి వచ్చినారము. ఓమహాత్మా ! నీవన్యులచే సాధింపరానిదగు విష్ణుపదమును సాధించితివి. అందలి కంటె మీఁదుగా నున్న సప్తమహర్షులుగూడ నాపదమును బొందలేక చేయునది లేక చూచుచున్నారు. మఱియుఁ జంద్రాదిగ్రహంబులును నక్షత్రంబులును నాపదమునకుఁ జుట్టును దిరుగుచుండును. భగవద్భక్తులకు బాంధవులై శమదమాది గుణములతోఁ గూడికొని, దేహము ప్రకృతిపరిణామమనియు, నాత్మ జ్ఞానస్వరూపమనియు, భగవంతుఁడు సర్వాంతర్యామి యనియుఁ దలంచుచుఁ గావుననే తగువిధముగా దానమానాదులచే సకలభూతముల సంతోషింపఁ జేయుచు, సిద్ధప్రాయులయియున్న వారాపదమును సులభముగాఁ బొందుదురు. ఓ విదురా ! భగవంతుని ప్రాపునిఁగాను బ్రాపకునిఁగాను సాధారముగాను దలంచుచున్న ధ్రువుఁడు ముల్లోకములకును స్వచ్ఛమగు చూడామణివంటివాఁ డాయెను. బంధింపఁబడిన గోమహిషాదులు సస్యముల భక్షింప నెంచి మహావేగముతోఁ గట్టుస్తంభంబు చుట్టును దిరుగుచందంబున సూర్యచంద్రాదినక్షత్రముల సమూహము లాధ్రువమండలంబుచుట్టును నిత్యంబును బరిభ్రమించుచుండును. నారదుఁడు వీణ వాయించుచు బ్రహ్మసత్రయాగమందు భగవంతునిమాహాత్మ్యమునుగూర్చి ప్రసంగము వచ్చినప్పుడు ధ్రువుని మహిమను దెలుపు మూఁడు శ్లోకములను

గానము చేసెను. ఆశ్లోకములయర్థమును వివరించెద వినుము. "ఓ మహాత్ములారా! పతివ్రతయగు సునీతికి మాఁగుఁ డగు ధ్రువుఁడు చేసిన తపంబునకుఁ బ్రాప్తమగు పదవిని బొందుటకు వేదవాదులగు మునీశ్వరులయినను సమర్థులుకారు. అట్లుండ రాజులు సమర్థుల గుదురని చెప్పఁదగియుండునా? ఆ ధ్రువుఁడు సవతితల్లి యగు సురుచివాక్యము లనెడి బాణములచే భేదింపఁబడి, కావుననే మిగుల బాధనొందుచునై దవసంవత్సరముననే వనంబునకుఁ బోయి నా యాజ్ఞానుసారంబుగాఁ దపంబు చేసి వశుండుగాని వాఁడయినను, భూతమైత్ర్యాదిగుణంబులచే భగవంతుని వశము గావించుకొని యుత్తమపదంబును జెందెను, భూమియందే రాజయినను మనంబుచేతనైనను నాపదమును బొందవలెనని తలంపలేఁడు. అది యైదాఱువత్సరంబుల కాలములోనె వైకుంఠమును బొందించును" అని చెప్ప విని యచ్చటివా రాశ్చర్యము నొందిరి. ఓవిదురా! సజ్జనులకు సమ్మత మయి, యధికకీర్తి గలవాఁడయిన ధ్రువుని చరిత్రంబును నీవడిగితివి. కావున దానినిఁ బూర్తిగాఁ జెప్పితిని. ఓరాజా! ఆపదమును నీజనకాదులు గాని యితరులు గాని యిదివఱకెప్పుడు నధిష్ఠించి యుండలేదు. కావుననే యది సర్వలోకములకును వందనీయమయినది. అది విష్ణుసంబధియైనది. అది సర్వోత్కృష్టమయినది. అట్టియుత్తమస్థానమును నీ వధిష్ఠింపుము. ఓమహానీయా! ఈ విమానము భగవంతునిచే నీనిమిత్తమంపఁబడినది. కావున నీ వీవిమానాగ్రమునందుఁ గూర్చుండ నర్హుండవు" అని పలికిన నందసునందులమధురవాక్యంబు లాలకించి భగవంతునికిఁ బ్రియుఁ డయినధ్రువుండు స్నానము గావించి నిత్యకర్మముల నెఱవేర్చుకొని యలంకరించుకొని మును

లకు నమస్కరించి యాశీర్వాదములఁ బొందెను. అనంతర మ
తండు విమానాగ్రమును బూజించి దానిఁ జుట్టును దిరిగి నమ
స్కరించి నందసునందులపాదములకుఁ గూడ వందనము లర్పించి
హిరణ్మయరూపమును దాల్చి దాని నధిష్ఠింప నిచ్ఛగించెను.
ఆసమయంబున దేవదుందుభులు మొరసెను. ఇంకను వాద్య
విశేషము లగుమృదంగాదులు వాయింపఁబడెను. గంధర్వాదులు
గానముచేసిరి. పుష్పవర్షములు కురిసెను. అప్పుడు ధ్రువుఁడు
స్వర్గలోకము నధిష్ఠింపఁ దలంపుగొని దీనురా లగుతల్లిని విడిచి,
దుర్గమ మగుస్వర్గమునుగుఱించి పోవుచున్నానని తల్లిని స్మరిం
చుకొనెను. అంత నందసునందు లాతనియభిప్రాయము నెఱింగి
విమానముచేఁ బోవుచున్నసునీతి నతనికిఁ గానవచ్చునట్లు చేసిరి.
అతఁ డందులకు సంతసించి విమానముచేఁ బోవుచు మార్గమం
దచ్చటచ్చట విమానారూఢు లయిన దేవతలు తన్నునుతించుచుఁ
దనపైఁ గుసుమవర్షములు గురియఁజేయుచుండఁగా నాదిత్యాది
గ్రహములస్థానములను గ్రమముగాఁ జూచెను. ఇట్లు ధ్రువుఁడు
నందసునందాదులచే నడిపింపఁబడుచున్న విమానముచేఁ బో
వుచు ముల్లోకములను, సప్తర్షులను సైత మతిక్రమించి యున్న
దియు కల్పాంతపర్యంతముండెడిదియు నగు విష్ణుపదమును
బొందెను. ఆపదము స్వీయకాంతులచేఁ బ్రకాశించుచున్నది.
దాని కాంతిచేతనే ముల్లోకములును బ్రకాశించుచున్నవి.
అది నిష్కరుణులచేఁ బొందఁ దరముకానిది. సర్వభూతము
లందును మైత్రిగలిగి వర్తించువారికిఁ బొందఁదగినది. ఆధ్రు
వచరిత్రము, వినువారికి ధనమును సంపాదించిపెట్టును; మ
హాయశంబు నార్జించును; ఆయుర్దాయము నిచ్చును. అది మంగ

శప్రదమైనది. అది స్వర్గమును సంపాదింప సమగ్రమైనది. అది ధ్రువస్థానమును బొందింపఁగలదు. అది మనఃపీడను నిరాకరించును; అది ప్రఖ్యాతిని గలిగించును. అది సమస్తపాపములను దొలఁగించును. ఈధ్రువచరిత్రము నెవరు మాటిమాటికిని శ్రద్ధతో వినుదురో వారి కాధ్యాత్మికాదులగు తాపములను నశింపఁజేయుభగవద్భక్తి జనించును. ఆచరిత్రమును వినువారికి సంది అకంటె గొప్పతనమును దాని సంపాదించునుపాయమును లభించును. మఱియు వారికి శీలాదిగుణములును తేజంబును గౌరవంబును సంప్రాప్తమగును. శ్రద్ధాళుఁడై పురుషుఁ డీధ్రువచరిత్రమును ప్రాతఃకాలమందును, సాయంసమయంబునను, బ్రాహ్మణసభలందుఁ బున్నమయందును, సమావాస్యయందును, శ్రవణనక్షత్రయుక్తమగు దినమందును, సంక్రమణములందును, నాదివారమునందును, సప్తమియందును జదువుచుండవలెను. నిష్కాముఁడయిన భగవద్భక్తుండు శ్రద్ధాయుక్తులగు వారి కీచరిత్రమును వినిపింపవలెను. అట్లు నిష్కామమునఁ జే వినిపించువాఁడు స్వయముగా సంతుష్టుఁడగును. వాఁడట్లు చేసినచో వానిఁ జూచి భగవంతుండు కూడ సంతోషించును. తత్వజ్ఞాన మొసంగని వానిని భగవన్మార్గమందుఁ బ్రవేశింపఁ జేసి జ్ఞాన మొసంగిన మహాత్ముని దేవత లందఱును ననుగ్రహింతురు. ఓవిదురా! ఎవఁడు చిన్నతనంబుననే తల్లిని, గ్రీడాసాధనములనువిడిచి,విష్ణువును శరణుపొంది లోకమందుఁ బ్రసిద్ధుఁడై పుణ్యకీర్తిపరుం డాయెనో యాధ్రువుని చరిత్రము నీకుఁ బూర్తిగాఁ జెప్పితిని. ఇది పండ్రెండవయధ్యాయము.



ఓపరీక్షిన్మహారాజా ! మైత్రేయునిచే వర్ణింపఁబడిన ధ్రువ చరిత్రమును విని భగవంతునియందు భక్తిభావమును వృద్ధిచేసి కొన్న విదురుండు మఱికొన్ని వృత్తాంతంబులఁదనకుఁజెప్పవలసిన దని యడుగ నారంభించెను. ఓమునీంద్రా ! నారదుఁడు ప్రచేత నుల సత్రమునందు ధ్రువమహిమను వర్ణించె నని చెప్పితివి. ఆప్రచేతను లెవ్వరు ? ఎవని పుత్త్రులు? వా రెవరికులమందుఁ బ్రఖ్యాతులైరి ? వా రెక్కడ సత్రయాగమును జేసినారు ? ఎవఁడు పంచరాత్రాదులగు నాగమముల నుపదేశించి శ్రీహరి పూజావిధానము నంతను దెలియఁజేసెనో యానారదుండు భగవద్భక్తుఁడనియు, భగవంతుని బ్రత్యక్షముగాఁ గనఁదగిన శక్తి గలవాఁడనియు నెఱుంగుదును. మఱియు నా నారదు నిచేత నే తమతమ వర్ణాశ్రమములకుఁ దగినధర్మముల నాచ రించి వానిచేతి నే యజ్ఞభోక్తయగు భగవంతుఁ డారాధింపఁదగిన వాఁడని చెప్పఁబడియె. మహానుభావుఁడగు నట్టి నారదునిచేఁ బ్రచేతనులసత్రమందు వర్ణింపఁబడిన కథల నన్నింటి వినఁ గుతూ హాలపడుచున్న నాకుఁ బూర్తిగాఁ జెప్పుము' నావుడు మైత్రేయుం డి ట్లనియె. 'ఓవిదురా! ధ్రువునకు ఉత్కలుఁ డనుపుత్త్రుఁడు కలఁ డని చెప్పితిని. ఆయుత్కలుఁడు తినతండ్రి యగు ధ్రువుండు వనంబున కరిగినపిమ్మటఁ దనకుఁ బ్రాప్త మయినసార్వభౌమ సంపదలను సింహాసనమును జేకొన నిష్టపడలేదు. అతఁడు పుట్టి నది మొదలు రాగద్వేషాదులకు మనమందెడమీయక యున్న వాఁడు. కావునన నే రాగులై వర్తించువారితో స్నేహము చేయ లేదు. మఱియు నతఁడు సమదర్శియై యాత్మకు శరీరభూతమైన లోకమును నట్టిశరీరములకు ధారకుండయిన యాత్మను,విమర్శించి

చూచెను. అతఁడు ప్రత్యగాత్మను బ్రహ్మశబ్దవాచ్యునిఁగాను సుఖ స్వరూపునిఁగాను, దేహాదులు లేనివానిఁగాను జ్ఞానరసమే స్వభావముగాఁగలవానిఁగాను, ధర్మభూత మగునానందగుణము గలవానిఁగానుఁ దలంచి స్వస్వరూపజ్ఞానము ననుసంధించుకొనుచు, దత్త్వజ్ఞాన మనెడియగ్నిచే సమస్తకర్మబంధములను దహింపఁజేసికొని తాను దేహాదులకు విలక్షణుఁడని యెఱిఁగి, యాత్మస్వరూపముకంటె నన్య మగుదాని నొల్లకుండెను. అతఁడు జడునివలెను, జెవిటివానివలెను, వెఱ్ఱివానివలెను, మూఁగవానివలెను, గానవచ్చుచున్నను బుద్ధివిశేషముచే వారలను బోలక మంటలు లేని యగ్నివలెఁ బ్రకాశించుచుఁ దనమాహాత్మ్యమును వెల్లడింపక ప్రవర్తించుచుండెను. మంత్రులును గులవృద్ధులును నట్టియుత్కలునిఁ జూచి జడునిగాను, వెఱ్ఱివానిఁగాను దలంచి వానివిడిచి భ్రమికుమారుఁడయి యుత్కలునికన్నఁ జిన్నవాఁడయియున్నవత్సరుని రాజుఁగా జేసిరి. ఆవత్సరునికి సర్వర్ధియను స్త్రీలలామ ప్రియభార్య. అతఁ డామెయందు పుష్పార్ణుఁడు, తిగ్మకేతుఁడు, ఇషుఁడు, ఊర్జుఁడు, వసువు, జయుఁడు, నాఁబడు నార్వురఁ బుత్రులం బడసెను. ఆపుష్పార్ణునకుఁ బ్రభ యనియు దోష యనియు నిరువురుభార్యలు కలరు. అందుఁ బ్రభ యనుభార్యకుఁ బ్రాతర్మధ్యందినసాయము లనునామములుగల ముగ్గురు కుమారులు కలిగిరి. రెండవభార్య యగు దోషకుఁ బ్రదోషుఁ డనియు, నిశీథుఁడనియు, వ్యుష్టి యనియు, ముగ్గురుపుత్రులు పుట్టిరి. వారిలో వ్యుష్టియనువానికిఁ బుష్కరిణియనుభార్యయందు సర్వతేజుఁడనుకుమారుఁడుపయించెను. సర్వతేజునకు నాకూతి యనుభార్యయందుఁ జక్షుస్సంజ్ఞ గల మను వనుకుమారుండు వొడమె.

ఆమనువునకు నడ్వల యనుభార్య గలదు. అతని కానడ్వలయం దు, ఋరుఁడు, కుత్సుఁడు, త్రితుఁడు, ద్యుమ్నుఁడు, సత్యవంతుఁడు, ఋతుఁడు, వ్రతుఁడు, అగ్నిష్టోముఁడు, అతిరాత్రుఁడు, ప్రద్యుమ్నుఁడు, శిబి, యుల్ముకుఁడు, నాఁబడు పవిత్రు లగుపన్నిద్దఱు పుత్త్రులు గలిగిరి, వారిలో నుల్ముకుఁడు పుష్కరణి యనుభార్యయందు, అంగుఁడు, సుమనసుఁడు, ఖ్యాతి, క్రతువు, అంగిరసుఁడు, గయుఁడు, నాఁబడు నార్వుర నుత్తమకుమారులం గనియెను. వానిలో నంగుఁడు సునీథ యనుభార్యయందు వేనుఁ డను పేరు గల దురాత్ముఁడగుపుత్త్రునిఁ బడసెను. కాని యాభూపాలుఁడు కుమారుఁడగు వేనుని దుష్టస్వభావమును జూచి మిక్కిలి దుఃఖించి, పురము నుండి వెడలిపోయెను. ఓవిదురా! వజ్రాయుధమువంటి వాక్కులు గలమును లతని దుష్టస్వభావమును జూచి సైఁపఁజాలక శపించిరి. ఆశాపమువలన వేనుఁడు మృతి నొందెను. ఆసమయమున రాజు లేకపోవుటచే దొంగలు చెలరేఁగి ప్రజలను బాధించి వారివస్తువులను నపహరింపఁ జొచ్చిరి. అప్పుడు మునులు వేనుని దక్షిణకరమును మథింపఁగాఁ బృథు రాజు నారాయణాంశముచే జన్మించె'ననెను. అదివిని విదురుండు మైత్రేయున కిట్లనియె. 'ఓమైత్రేయా! సుస్వభావుఁడును, సజ్జనుఁడును బ్రాహ్మణభక్తిగలవాఁడును, మహాత్ముఁడు నగునంగభూపాలునకుఁ దండ్రికి కీర్తి పుట్టించునంతటి దుష్టత్వము గలకుమారుఁ డెట్లుగాఁ బుట్టెను? అసాధువుల శిక్షింప వ్రతముఁబూనిన వేనునియం దెట్టి యపరాధమును జూచి ధర్మకోవిదు లగుమునులు శపించిరి? రాజు దిక్పాలురయంశంబువలన జన్మించి ప్రజలఁ బాలించును. అట్టిరాజు పాపాత్ముఁ డయినను జంపఁదగినవాఁడు కాఁడే? నీవు

ప్రకృతి పురుషేశ్వరుల తత్త్వ మెఱిఁగిన వారిలో నుత్తముఁడవు. కావున నీవు, భక్తుఁడనై శ్రద్ధ గలవాఁడనై యున్న నాకు సునీథ పుత్త్రుఁ డగు వేనుని చరిత్రమును వివరించి చెప్పుము' అని పలుకుచున్న విదురుని వాక్యంబులు విని మైత్రేయుం డిట్లనియె.

మైత్రేయుండు విదురునకు వేనుని చరిత్రమును చెప్పుట

ఓ విదురా! అంగభూపాలుఁడు యాగములలో నుత్తమ మయిన యశ్వమేధమును నారంభించెను. ఆయాగమందు వేదాధ్యయన సంపన్ను లగు ఋత్విక్కులచేఁ బిలువఁబడియుఁ దేవతలు హవిర్భాగములనిమిత్తము రాలేదు. అది చూచి యచ్చెరు వంది ఋత్విజు లంగభూపాలునిఁ జూచి యిట్లనిరి. "ఓ రాజా! నీవు దేవతలనిమిత్త మొసంగిన హవిర్భాగములను నాయా దేవతలు వచ్చి గ్రహింపలేదు. ఆహవిర్ద్రవ్యములు నిర్దుష్టము లైనవే? అవి నీచేత శ్రద్ధచే సంపాదింపబడినవే? యాగాంగము లగు మంత్రములుగూడ స్వరయుక్తముగా నక్షరలోపములు లేకుండ నుచ్చరింపఁబడినవే. ఋత్విజులుకూడ మంత్రోచ్చారణమందు మిగుల సామర్థ్యము కలవారే. ఇట్లు భక్తిశ్రద్ధలచేఁ జేయఁబడుచున్న క్రతువునందు దేవతలనిమిత్తము రవంతయేని యపరాధంబు చేసినట్లు తెలియఁగము. యాగాదికర్మములందు గుణదోషములఁ జూచునట్టి దేవత లేకారణమున స్వకీయభాగముల స్వీకరింపకున్నారో తెలియకున్నది. కాని మఱియెవ్వరిచేత నైనను దేవహేళనము చేయఁబడి యుండును. లేనిచో నిట్లు జరుగదు. ఆహేళన చేసినవారిఁ దెలిసికొనము" అని ఋత్విజులు పలుకుచున్న వాక్యంబు లాలకించి మిక్కిలి దుఃఖించి యంగభూపాలుఁడు యాగమందు మౌన మవలంబించినవాఁ డయ్యెను సదస్యుల

యాజ్ఞానుసారముగా మౌనమును విడిచి యచ్చటసభాసదులం జూచి దేవతలు రాకుండుటకుఁ దగినకారణము నడుగ నిట్లనియె. 'ఓ సభాసదులారా! ఈయాగమునందు దేవతలు వచ్చి సోమ పాత్రములఁ గొనకుండుటకుఁ గతంబేమి? దేవతలకు నేనేమి యప రాధము చేసితిని? మీరు చెప్పవలయును' నావుడు సభాసదు లతని కిట్లనిరి. 'ఓరాజా! నీ వీజన్మమునఁ బాపమును గొంచె మేనియుఁ జేయలేదు. కాని పూర్వజన్మంబున నీవు చేసిన పాప మొకటికలదు. అందుచేత నే గుణాధికుఁడవైనను నీకు సంతానము లేదు. నీ వపుత్త్రుఁడ వగుటచే దేవతలు వచ్చి యజ్ఞభాగంబులఁ గొనలేదు. కావున నిప్పుడు పుత్రకామేష్టిని జేయుము. యజ్ఞ భోక్త యగుభగవంతుఁడు నీకుఁ బుత్త్రు నొసంగును. నీవు శ్రీహ రినే పుత్త్రునిగాఁ గోరితివి కావున సకలదేవతలతో నతఁడు వచ్చి తన భాగంబును జేకొనును. దేవతలును దమతమ యాగ భాగంబులం దప్పక చేకొందురు. ఇట్టి తుచ్ఛవరంబుల నారా యణుం డిచ్చునా? యని సందియమంద నవసరంబులేదు. ఏజ నుఁ డేప్రకారముగాఁ దన్ను నారాధించునో వాని కాయా వరంబులను హరి తప్పక యొసంగును.'' అనువాక్యంబులను విని ఋత్విజు లంగరాజునకుఁ బుత్త్రుఁడు సంభవించునిమిత్త ము యజ్ఞరూపుఁ డగువిష్ణువునకుఁ బురోడాశము నొసంగిరి. అంతఁ గనకమయము లగుస్వచ్ఛవస్త్రముల ధరించినపురుషుఁ డొకఁడు సువర్ణపాత్రముచే లెస్సగాఁ బక్వ మయినపాయ సాన్నమును స్వీకరించి యగ్నిగుండమునుండి బయలు వెడలి వచ్చెను. అప్పుడు బుద్ధిమంతుఁ డగునంగరాజు బ్రాహ్మణుల యనుజ్ఞ నొంది దోసిలి బంధించి పాయసమును గ్రహించి

తాను స్వయముగా నాఘ్రాణించి సంతోషభరితుం డయి తన భార్య కొసంగెను. అంత సునీథ పురుషునిఁ గలిగించునట్టియాపాయసమును భుజించి పతియనుగ్రహమువలన గర్భమును ధరించి నెలలు నిండినతోడనే కుమారు నొక్కని గాంచెను. అబాలుఁ డధర్మాంశమువలన నుద్భూతుఁడగుటచే బాల్యమునుండియు నధార్మికుఁడాయెను. ఒకనాఁ డంగరాజకుమారుఁ డగు వేనుఁడు విల్లెక్కువెట్టి, వేఁటకాఁడై, వనమందు సంచరించుచుఁ గ్రూరుఁడయి, దీనము లయినమృగములను జంపెను. అట్లు, చంపుచున్నవానిఁ జూచి జను లందఱును భీతు లయి 'ఇదిగో వేనుఁడు వచ్చుచున్నాఁ' డని యఱవఁజొచ్చిరి. మఱియు వేనుఁడు క్రీడాస్థానమునందు విహరించుబాలురను స్నేహితులను బలాత్కారముచేఁ బట్టుకొని క్రూరుఁ డయి దయారహితుఁ డయి, పశువులను జంపినవిధమునఁ జంపెను. అంగరాజు దురాత్ముఁ డగుకుమారునిఁ జూచి నానావిధము లయినయుపాయములచే వాని మంచిమార్గమును ద్రొక్కింపఁజూచెను; కాని ప్రయోజనము లేకపోయెను. అంత నంగుఁడు దురాత్ముఁ డగుకుమారుని దుష్టవర్తనము మాన్పింప సమర్థుఁడు కాని యప్పుడు మిక్కిలి దుఃఖించుచు నిట్లనుకొనెను. 'ఏలోకములో నెవరుసంతానము లేనివారో, యెవరు దుష్టు లగుపుత్త్రులవలన దుర్భరమగు దుఃఖంబునుబొందరో, వారు పూర్వజన్మమున భగవంతు నెక్కుడుగాఁ బూజించి పుణ్యవంతులయి యుందురు. ఎవనివలన నరులకు నపకీర్తియు నధర్మమును సంభవించుచున్నవో, యెవనివలన నందఱతోను విరోధమును నపార మయినమనోవ్యథయు సంప్రాప్తమగుచున్నవియో, యేపనివలన ననేకులు క్లేశములను బొందు

చున్నారో తనకు మోహముచే బంధనము కల్పించు నాదుష్టపుత్త్రునిఁ బండితుఁడెవఁడు లెస్సఁగా మన్నించును? ఆలోచింపఁగా గ్రమక్రమమున మోహముకలిగించి సంసారదుఃఖంబుగలిగించు మంచిపుత్త్రునికంటె గృహములను దుఃఖభాక్కులఁగాఁ జేసి మర్త్యులకు సంసారముమీఁదరోతపుట్టించు దుష్టపుత్త్రులే శ్రేష్ఠులని తలంచెదను. మోహము కలిగించు పుత్త్రులకంటె వైరాగ్యము గలిగించువారే యుత్తములు కదా?" అని యిట్లుంగి రాజు మిగుల నిర్వేదమునొంది యర్ధరాత్రమందు నిద్రనుండి లేచి, నిద్రించుచున్నసునీథను విడిచి యెవ్వరికిని గానరాకుండఁబలువిధములగు సంపదలచేఁ దులదూఁగుగృహంబునుండి బయలుదేఱి వనంబునకుఁ బోయెను. అనంతరము పురోహితులు మొదలగువారును, ప్రజలును దమప్రభువు వైరాగ్యమును బొందినవానిగాఁ దెలిసికొని యందులకు మిగుల దుఃఖితులయి భయమునొందుచు భూమియందు వెదక నారంభించిరి; కాని కుత్సితయోగులు తమహృదయమందుండిన పరమపురుషునిఁ గనుఁగొనలేని చందమున నాసమీాభూములందే వర్తించుచున్నను రాజును దెలిసికొనలేక పోయిరి. తరువాతఁ బురోహితాదులు ప్రభువు జాడలను దెలిసికోలేక విఫలప్రయత్నులయి విడుచుచు నొకచో సంఘముగా నున్నఋషులను బొడగాంచి నమస్కరించి ప్రభువు కానరాలేదని విన్నవించుకొనిరి. ఇదిపదుమూఁడవయధ్యాయము

---

అంత లోకములకు క్షేమముగోరుచున్న భృగ్వాదులగు మునులందఱును, బ్రజలను బరిపాలించురాజు లేకపోవుటచేఁ బ్రజలందఱును బశుసామ్యమును బొంది విచ్చలవిడిఁ జరింతురని తెలిసి

వీరమాతయగు సునీథకు నావృత్తాంతమును దెలిపి మంత్రిమొదలగువారి కసమ్మతుఁ డయినను వేనుని భూమికి రాజుఁగా జేసిరి.

### వేనునికి మునులు పట్టము గట్టుట

ఇట్లు భయంకరముగ శిక్షించువేనుఁడు సింహాసన మెక్కి రాజ్యముఁ బాలించుచున్నట్లు తెలిసికొని చోరులు మొదలగువారు పాములకు భయపడుచున్న యెలుకలవలె దాఁగఁజొచ్చిరి. అంత సింహాసనాసీనుం డగు వేనుండు లోకపాలుర యైశ్వర్యములవంటి యైశ్వర్యములు గలవాఁడగుటచే మిగుల గర్వించి జ్ఞానహీనుం డయి తన్నుఁ దాఁ బొగడికొనుచుఁ దన్ను మహాబుద్ధిమంతునిఁగాను మహాభాగ్యవంతునిఁ గాను దలంచుకొనెను. ఇట్లు వేనుం డైశ్వర్యమదముచే బుద్ధిహీనుఁడై నిరంకుశమగు మదగజమువలె సూర్ధ్వగమనముగలరథము నధిష్ఠించి భూమ్యాకాశములు చలించునట్లు తిరుగుచు, "ఓ బ్రాహ్మణులారా! యాగములఁ జేయరాదు. హోమాదులను జేయరాదు. దానములఁ జేయరాదు" అని యన్నిచోట్లను భేరీధ్వనులతోఁ జాటించి సమస్తధర్మములను నివారింపఁ జేసెను. యాజ్ఞికులయిన భృగ్వాదిమును లొక్కచోఁ గూడికొని దుష్టుఁ డగు వేనుని చేష్టలను జూచి యతనివలన లోకులకు సంప్రాప్తమగుచున్న దుఃఖంబునుగూడ విమర్శించి దయతో నిట్లు పలికిరి. "అకటా; రెండుకొనలందును మండుచున్న కాష్ఠంబునకు మధ్యంబున నున్న పిపీలకాదులకు రెండువైపులనుండియు భయంబు సంప్రాప్తమగుచున్నట్లు లోకులకిప్పుడు చోరులవలనను బరిపాలించెడి ప్రభువువలనను భయంబు సంభవించుచున్నది ! దేశ మరాజకమయియుండినఁ బ్రజలకుఁ జోరాదులవలన బాధ గలుగునని యూహించి మేము రాజ్యం

బునకుఁ దగనివాఁ డయినను వేనుని రాజాసన మెక్కించితిమి! ఇట్లుండ నిప్పుడు రాజువలనఁగూడ లోకులకుఁ గష్టములు కలుగుచున్నవి. ప్రజలకింక నెట్లుగా సుఖంబు గలుగును? మఱియుఁ బామునకుఁ బాలు వోసి పెంచినను నది పోషకునకు హానినేచేయును. దుష్టజంతువగు దానిస్వభావ మదియ. అట్లె సునీథకడుపునఁ బుట్టిన వేనుఁడు స్వభావముచేత నే దురాత్ముఁడయినను మన మతనిని రాజుగాఁ జేసితిమి. ఇప్పు డతఁడు తనక్రూరత్వమువదలక ప్రజలను జంప నిష్టపడుచున్నాఁడు. అయిన మన మతనిని జక్కనిమాటల చేఁబ్రార్థింతము. ఆమాటల నతఁడు విననిచో మన మెట్లుగా నతని శిక్షించినను నందువలన మనకుఁ బాతకంబు సంప్రాప్తము కాదు. మనము వానిదుష్టచేష్టలను జక్కఁగా నెఱిఁగియు దురాత్ముఁ డగువానినిఁ బ్రభువునుగాఁ జేసితిమి! మనము రాజునుగా జేయుటచేత నే యతఁడు భూతములకు ద్రోహము చేయుచున్నాఁడు. మనమూలముగా భూతములకు బాధలు సంభవించినవి. మనము వీనిని క్రూరత్వమునుండి మఱలించితిమేని భూతద్రోహమువలన జనించిన పాపము మనకుఁ గలుగదు. ఇట్లు మనము ప్రార్థించినను దురాత్ముఁ డయిన వేనుఁడు మనప్రార్థనమును గై కొనకున్నచో లోకాపవాదయును నగ్నిచేత నే మిక్కిలిదగ్ధుఁ డయియున్న వానిని మనతపోబలాగ్నిచే దహింతము" అని యిట్లు నిశ్చయించుకొని మునులందఱును గోపము తెలియకుండునట్లులతనిపాలికరిగి సామవచనములచేఁ బ్రార్థనాపూర్వకముగా నిట్లు పలికిరి.

మునులు వేనునికడ కేఁగుట.

'ఓరాజా! నీకాయువును, సంపదలను, బలమును, గీర్తిని, వర్ధింపఁ జేయ నెంచి చేయుచున్న మా విజ్ఞాపనము సావధానచిత్తుం

డవయి వినుము. ఓభూపాలా ! మనోవాక్కాయకర్మము
లచే నొనర్చినయీశ్వరారాధనరూపధర్మము లోకులను దుః
ఖంబు లేనివారింగాఁ జేయును. ఆధర్మము విరక్తులకు నక్షయమగు
మోక్షసుఖంబును గలిగించును. ఓవీరా ! సరాగులకు లోక
సుఖమును, విరాగులకు మోక్షసుఖంబును నొసంగునీశ్వరా
రాధనరూపధర్మంబును నశింపఁ జేయరాదు. అట్లు చేసినచో
నృపాలుని యైశ్వర్యము పూర్తిగాఁ దొలంగును. ఓరాజా! దుష్టు
లయిన మంత్రి మొదలగువారివలనను జోరాదులవలనను భయం
బు గలుగకుండఁ బ్రజలను బాలించువాఁ డీలోకంబుచేఁ
బూజింపఁబడుచుఁ బరలోకంబునందుఁగూడ సుఖంబు లనుభ
వించును. ఓమహాత్మా ! ఎవ్వని దేశమందును, బురమందును,
నున్న నాలుగువర్ణములవారును, నాలుగాశ్రమములవారును,
తమతమ వర్ణాశ్రమాచారధర్మములచేతను యజ్ఞభోక్తయును
బ్రభువు నగుభగవంతు నారాధించుచుందురో, ప్రజలపాలనరూ
పకర్మమందు జాగరూకుఁ డగునయారాజును జూచి సర్వాత్ముఁ
డును జగత్కారణుఁడును నగుభగవంతుఁడు సంతోషించును.
బ్రహ్మాదులకుఁ గూడఁ బ్రభు వయినభగవంతుఁడు సంతుష్టినిఁజెం
దినచో లోకపాలురతోఁ గూడినలోకము లన్నియు నాదరము
కలవయి భగవత్తోషకుఁ డయినవానికొఱకుఁ బూజల నిచ్చు
చుండును. వారికిఁ బొందరానివస్తువేది కలదు? మఱియు సర్వ
లోకములను, లోకపాలురను దేవత్వముఁ బొందించు యజ్ఞము
లను నియమించుచు, ధర్మాధర్మములఁ దెలుపువేదమే స్వరూప
ముగాఁ గలిగి యాగస్వరూపుఁ డయి తపస్స్వరూపుఁడయి యు
న్నభగవంతుని నీసంపదలనిమిత్తము పూజించుచున్న స్వదేశజ

నుల ననువర్తింపఁ దగుదువు. మఱియు నీదేశమందుఁ గల బ్రాహ్మణాదులు నిరంతరము చేయుచున్న యాగములచేత భగవంతునికి శరీరభూతు లగు నింద్రాదిదేవతలు యథావిధిగా నర్చింపఁబడినవారై సంతసించి యిష్టవరంబుల నిచ్చుచుందురు. అట్టిదేవతలనునీవు హేళనచేయుట తగదు" అని యిట్లు మునులు విజ్ఞానము చేయఁగా విని వేనుం డిట్లనియె. "ఓమునులారా! మీ రందఱు నిశ్చయముగా బుద్ధిహీనులు. మీ ధర్మమును ధర్మముగాఁ దలంచుచున్నారు. మీవంటివా రన్నాదుల నిచ్చి రక్షించురాజును విడిచి యితరుని భజించుచున్నారు. కావున మీరు ధర్మమార్గమును విడుచుచున్నారు. ఏమూఢులు రాజరూపమున నున్న యీశ్వరుని హేళనము చేయుదురో, వారీలోకమందును బరలోకమందును సుఖములఁ బొందక దుఃఖంబునే పొందుదురు. కుత్సితస్త్రీలు నిజభర్తయందుఁ జూపఁదగిన భక్తిని జారభర్తయందుఁ జూపుచుందురు. అట్లే మీరుకూడ బ్రభువగు నాయందు భక్తియుంపక యెవఁడో యజ్ఞపురుషుఁడని వానియందు భక్తిని చూపుచున్నారు. ఆయజ్ఞపురుషుఁ డనఁగా నెవఁడు? నిగ్రహానుగ్రహసమర్థు లగు విష్ణువును, బ్రహ్మయు, నీశ్వరుండును, శంకరుఁడును, నింద్రుఁడును, వాయువును,యముఁడును, సూర్యుఁడును, మేఘుఁడును, కుబేరుఁడును, చంద్రుఁడును, భూమియు, నగ్నియును,వరుణుఁడును, నింకను దక్కుంగల దేవతలును రాజుదేహమందు నివసించుచుందురు. కావున రాజే సర్వదేవమయుఁడని చెప్పవచ్చును. అందువలన నోవిప్రులారా! మీరు మచ్చరమును వెలిఁబుచ్చి నన్నే పూజింపుఁడు.నాకే బలుల నర్పింపుఁడు. నాకంటె నారాధ్యుఁ డగు పురుషుఁ డెవ్వఁడు గలఁడు? " అని

యిట్లు విపరీతబుద్ధియును౯ బాపాత్ముఁడును, దుష్టమార్గగామియు నగువేనుండు ప్రార్థితుండయ్యును,మునులప్రార్థనమును దిరస్కరించి మంగళభ్రష్టుఁడాయెను.ఓవిదురా! ఇట్లు తన్నుఁ బండితునిఁగాఁ దలంచుకొను వేనుఁడు తమ్ముఁ దిరస్కరింపఁగా మునులు లోకములకు మంగళప్రదంబగు తమప్రార్థనను వ్యర్థమైనం జూచి యతని మిగులఁ గోపించిరి. అప్పుడు మునులు "ఈవేనుఁడు స్వభావము చేతనే క్రూరుఁడు. కావుననే పాపకార్యములకు వెఱవఁడు. వీఁడుజీవించుచు లోకమును నిశ్చయముగా బూడిదగాఁ జేయుచున్నాఁడు. వీడు చచ్చుఁగాక, చచ్చుగాక. ఈ దురాత్ముఁడు రాజుగా నుండఁదగఁడు. యజ్ఞపతి యగువిష్ణువునుగూడ సిగ్గులేక నిందించుచున్నాఁడు. ఎవనియనుగ్రహమువలన నిట్టి యైశ్వర్యమును బొందెనో,యావిష్ణువును దురాచారుఁ డగువేనుండుతక్కనన్యు లెవ్వరు నిందింప నెంతురు.?" అని ఇట్లుమునీశ్వరులు నిశ్చయించుకొని యధికమగు కోపము గలవారయి భగవన్నిందచేఁ బూర్వమే హతుఁడయిన వేనుని హుంకారములచేఁ జంపిరి.ఇట్లు మునులు వేనునిఁ జంపి తమయాశ్రమంబుల కరిగినపిమ్మట సునీథ దుఃఖించుచు వేనునికళేబరమును మంత్రసహితమగు యుక్తిచేఁ బరిపాలించెను. అట్లు వెడలినమును లందఱు నొకనాఁడు సరస్వతీనది కేఁగి తజ్జలంబులమజ్జనంబాడి నిత్యాగ్నిహోత్రముల నెఱవేర్చుకొని తత్తీరంబునం గూర్చుండి భగవత్కథలను జెప్పుకొనుచుండిరి. అంతట మహోత్పాతములు లోకభయంకరములై కనిపించె. మును లామహోత్పాతములను జూచి మిక్కిలివిచారించి 'రాజు లేనిభూమియందు దున్నవారికిఁ జోరాదులనుండి దుఃఖంబులు రాక మానునా?' అని పలుకఁజొచ్చిరి. వీ రట్లనుకొను

చుండఁగా నన్ని దిక్కులందును దిరుగుచు ధనాదికమును హరించుచున్న దొంగలవలన విస్తారమగు పరాగము లేచి వ్యాపించెను. మఱియు వారె ధనమును హరించుచున్న దొంగలవలనను రాజు లేకపోవుటచేఁ బరస్పరమును జంపుకొనఁదలంచు లోకులవలనను గలుగుచున్న యుపద్రవమును, దొంగలతో నిండి యరాజకమయి, బలరహితమయి యున్న దేశంబును జూచి, వేనునివలె హుంకారములచే దొంగలను జంప సమర్థులయినను,నందువలనఁ బాపము జనించునని తలంచి దొంగలను వారింపరైరి.ఆలోచింప సమస్తము బ్రహ్మాత్మకమని తలంచుచు,నందులకుఁ దగిన శమాదిగుణములు గలవాఁడై యున్న బ్రాహ్మణుఁడు దీనులరక్షింపక యుపేక్షించినచో నట్టివానితపంబు పగులు వాఱినకుండలోనిజలంబువలెఁ దొలంగిపోవును. కావున నుపేక్షించుటవలనఁగూడఁ దపోవ్యయము గలుగుచున్న దనియు, నంగరాజు వంశజులు సర్వదా హరి నాశ్రయించువార లగుటచే వ్యర్థముకాని పరాక్రమముగల రాజులు పుట్టుచుందురు గావున నీతనివంశ మంతము బొందరాదనియు, నిశ్చయించి ఋషీశ్వరులు మృతి నెందిన వేనునియూరువును బలముచే మథించిరి.అట్లు చేయఁగా నందువలన బాహుకుఁ డనునరుఁ డొకఁ డుద్భవించెను. ఆబాహుకుఁడు కాకివలె మిక్కిలి నల్లనయి, చాల పొట్టియునై పొట్టిచేతులును పెద్దచెక్కిళ్లును గలిగియుండెను. వాఁడు త్రుంపుడుమాట లాడువాఁడు. మఱి లోఁతుగ నడఁగిననాసికయు నెఱ్ఱ

—◆ మునులు వేనుని శరీరమునుండి సృష్టి చేయుట. ◆—

ని నేత్రములును, నెఱ్ఱని తలవెండ్రుకలును, గలిగియుండెను. ఇట్టియాకారము గల పురుషుఁ డుదయించి యవనతుఁడయి యేమి

చేయుదునని దీనముగాఁ బలుకఁగా వానిం జూచి మునులు రాజ్యంబున కనర్హుం డని యెంచి "నిషీద" (కూర్చుండు ము) అని పలికిరి. ఓవిదురా! మునులు నిషీదయని పలుకుటచే బాహుకుఁడు నిషాదజాతికి మూలపురుషుఁ డాయె. వీడు పుట్టు చు వేనుని సమస్తపాపమును స్వీకరించెను. గాన వానివంశ మందుఁ బుట్టినవారు నైషాదులని పిలువబడుచుఁ బురాదు లందునివసింపక పర్వతములం దుండుకాననంబుల నివసించుచుం దురు. అనంతరము మునులు పుత్త్రహీనుఁ డయిన వేనునిబా హువులను మథింపఁగా దంపతు లిరువురు జన్మించిరి. ఇట్లుద యించిన దంపతులనుగాంచి బ్రహ్మవాదులగు మునులు వారలను భగవదంశము వలన జన్మించినట్లు తెలిసికొని పరమసంతోషము ను జెంది పలికిరి. "ఈపురుషుఁడు భువనమును పాలింప లీలావతా రమునొందిన విష్ణువే. ఈస్త్రీలలామయు నారాయణు నెప్పుడును విడిచియుండ నొల్లని లక్ష్మీదేవి కళలధరించి యుద్భవించినది ఈమి థునములోఁ బురుషుఁడు కీర్తిని మిక్కిలి విస్తరింపఁ జేయును. కాన నధికమగుకీర్తిగలిగి పృథుమహారాజను పేరఁ బ్రఖ్యాతుఁడు కాఁగ లఁడు. కీర్తి నివిస్తరింపఁ జేసినవారిలో నితఁడు ప్రథముఁడు. మఱియు నీద్వంద్వములోనిస్త్రీలలామ, సుందరమగుదంతములుకలిగి సద్గు ణములను భూషణములను మిగులఁ బ్రకాశింపఁ జేయునదై, "అర్చి" యను పేరితో వర్తించెడిలక్ష్మియే. కావుననీ పురుషునిబతి గా వరించి సేవించును. మఱియునితఁడు లోకములరక్షింపహరియం శమువలన నుదయించినవాఁడు కావుననిమేము నతనినివిడిచియుం డనొల్లని శ్రీమహాదేవియంశమువలన జన్మించినది. అందువలన దాంపత్యముచితమైనది. ఇట్లు పృథురాజును విప్రులు నుతించు

చుండఁగా గంధర్వులు గానము చేసిరి. సిద్ధులు పుష్పవర్షములను గురియించిరి. అప్సరసలు నృత్యములు సలిపిరి. ఆకాశమున దేవదుందుభులు మొరసెను. కొందఱు మృదంగంబుల ధ్వని చేసిరి. మఱి కొందఱు శంఖంబులఁ బూరించిరి అచ్చటికి దేవతలును మునులును బితృదేవతలును నేతెంచిరి. అంతట లోకమునకు గురువగు బ్రహ్మ దేవతలతోను దిక్పాలురతోను వచ్చి పృథురాజు దక్షిణహస్తమునందు విష్ణువుచేతియందువలెఁ జక్రాదిరేఖ లుండుటనుఁ జూచి యతని నారాయణాంశసంభూతునిఁగాఁ దలంచెను. మఱియు నెవనికి రేఖాంతరములచేఁ బ్రతిహతము కాని చక్రరేఖ చిహ్నితమై యుండెనో యా పరమపురుషుని యంశమువలన జనించినపృథురాజునకు బ్రహ్మవాదు లగు బ్రాహ్మణు లభిషేకము చేయ నారంభించిరి. అంత నన్నిదిక్కుల నుండియుఁ బ్రజ లభిషేకమునకుఁ దగినసాధనములను స్వీకరించి వచ్చిరి. మఱియు నదులును, సముద్రములును, హిమవదాది పర్వతములును, వృక్షములును, సర్పములును, స్వర్గాదులును, ఔక్కల సమస్తభూతములును బృథురాజునకుఁ గానుకలుగొని


మునులు పృథురాజునకు పట్టముఁ గట్టుట

వచ్చినవి. అప్పుడు పృథురాజు మంచివస్త్రములను వైజయంతి యనుపుష్పమాలను, గిరీటాదు లగు నలంకారములను ధరించి చక్కఁగ నలంకరించుకొని భార్యయగునర్చిచే సంయుతుండయి రెండవయగ్నివలెఁ బ్రకాశించెను. ఆసమయమునఁ గుబేరుఁడు సువర్ణమయమయినసింహాసనమును దెచ్చి యతని కిచ్చెను. వరుణుఁడు చంద్రునివలెఁ బ్రకాశించుచు, జలబిందువులను స్రవించుచున్న గొడుగును గానుకగా నొసంగెను. వాయువు చామర

ముల నర్పించెను. ధర్మపురుషుఁడు కీర్తిప్రచుర సుగుపూలదండ నిచ్చెను. దేవేంద్రుఁడు కిరీటమునొసంగెను. యముఁడు దుష్టుల శాసింపఁదగిన దండము నిచ్చెను. బ్రహ్మ వేదమయమగుకవచము నర్పించెను. సరస్వతి యుత్తమమగుముత్యాలహారము నిడెను. విష్ణువు దనయంశముచే జన్మించిన పృథురాజునకుఁ దనచక్రాంశముచే నిర్మింపఁబడిన చక్రము నొకదాని సమర్పించెను. లక్ష్మీదేవి యెడతెగనిసంపదలఁ గలిగించెను. ఈశ్వరుండు పది చంద్రులతో సదృశ మగుఖడ్గము నిచ్చెను. గౌరీదేవి శత చంద్ర మనుపేరుగల కవచము నిచ్చెను. చంద్రుఁడు సుధామయము లగు తురంగములను సతిసుందరమగు రథంబు నిచ్చెను. అగ్ని గోమ్ముతో నిర్మిత మగు కార్ముకము నిచ్చెను. సూర్యుఁడు తనకిరణములవలె నన్నిస్థలంబులందును జొర సమర్థములగుబాణముల సమర్పించెను. భూమి యోగమయములైన పాదుకలను దెచ్చియిచ్చెను. ఆకాశము ప్రతిదినమును బూజార్హ మగు పుష్పములనొసంగెను. మునులు సత్యములగు నాశీర్వచనముల నొసంగిరి. సముద్రుఁడు తనయందుద్భవించిన శంఖము నిచ్చెను. నదులును, నదములును, పర్వతములును రథమార్గంబులనిచ్చెను. అప్పుడు దేవతలలోఁ గొందఱాడిరి. కొందఱుపాడిరి. కొందఱు మృదంగాదులను మ్రోయించిరి. ఆసమయంబున వందిమాగధులు వచ్చి పృథురాజును నుతింపనిలిచిరి. ఇట్లు తన్ను నుతించుటకు వచ్చినవందిమాగధులను బొడంగాంచి మహాప్రభావము గలపృథురాజు మందహాసము చేయుచు మేఘగర్జనమువలె గంభీర మగువచనంబులచే నిట్లు పలికెను 'ఓసూత! ఓమాగధా! ఓవందీ! నాగుణము లిప్పుడు లోకమందు నుంతేనియుఁ

ప్రసిద్ధి కెక్కలేదు. అట్లుండఁగా మీరు చేసినస్తోత్ర మెట్లుగాఁ దగియుండును. లోకమందుఁ బ్రఖ్యాతి నొందినగుణములే నుతింపఁ దగినవికాని యప్రఖ్యాతములు కావు. అట్టివాని వర్ణించినస్తోత్రములు వ్యర్థము లగును. కావున నాగుణములు ప్రసిద్ధిఁ జెందకుండఁగా నన్నుఁగూర్చి మీరు పలికెడుస్తోత్రవాక్యములు వ్యర్థమగునుగాన ప్రస్తుతమున స్తోత్రము చేయకుఁడు. కాలాంతరమందు నాగుణములు ప్రసిద్ధములు కావచ్చును. అప్పుడు స న్నాశ్రయించినగుణములను, నాయశంబును నుతింతురుగాక. మధురవాక్కులు గల వందిమాగధులారా! సభ్యులు నుతింపుఁడనుటచే నుతించుచున్నామని యనకుఁడు. ప్రశస్తకీర్తియగు భగవంతునిగుణములుస్తోత్రార్హము లయియుండగా వానినివిడిచి నీచగుణములు గలనన్ను నుతింప సభ్యులు నియోగింతు రని నేను నమ్మను. ప్రస్తుతమున నీయందుఁ బ్రసిద్ధగుణములు లేకపోయినను మున్ముందు నీకలవడెడిప్రసిద్ధగుణములను నుతించుచున్నా మని యందు రేని చెప్పెద వినుండు. ప్రస్తుతమున సద్గుణములు లేకపోయినను మహాత్ములగుణములను సంపాదింప సామర్థ్యము గలవాఁ డయినను వందిమాగధులచే నెవఁడు స్తోత్రము చేయించుకొనును? వచ్చుకాలంబున శౌర్యాదిగుణములచే శత్రువిజయాదులు తప్పక సంప్రాప్త మగుననుతలంపునఁ దన్నుఁ బొగడించుకొనినవాఁడు కుత్సితుఁడు. వాఁ డాక్షేపింపఁ దగినవాఁడు. వాఁడు లోకులు పరిహసింతు రనుబుద్ధి లేనిమందుఁడు. మఱియు లోకమున బుద్ధిమంతు లగువారు తాము నిరతిశయము లగు సద్గుణములు గలవా రయినను, సద్గుణములను సంపాదింప శక్తు లయినను, దమగుణములు జగత్ప్రఖ్యాతము లగుచున్నను, సిగ్గు

చెందుచు నాత్మప్రశంసలను నిందింతురు. కావున నోవందిమాగధులారా! నేనుత్తమకార్యములచే నింకను లోకంబునఁ బ్రసిద్ధిని గాంచలేదు. అట్లుండ నేను బాలునివలె నెట్టుగా స్తోత్రము చేయించుకొందును?' అనిపలికెను. ఇదిపదునాల్గవయధ్యాయము.

---

సుధారసతుల్యము లగు పృథురాజువాక్యములను విని మునులు చిత్తములు సంతసిల్లి నియోగింపఁగా వంది మాగధులు భగవందంశసంభూతుఁ డగుపృథురాజును స్తోత్రము చేయ నారంభించిరి. ఓమహారాజా! నీవు దేవతలగుణములవంటిగుణములచేఁ బ్రకాశించుచు, నాత్మసంకల్పముచే భూమియం దవతరించిననీమహిమను వర్ణింప మాకు శక్తి చాలదు. నీవు దుష్టుం డగు వేనునిశరీరంబువలన జన్మించినను భగవదంశసంభూతుఁడ వయి యనంతకల్యాణగుణములు గలిగియున్ననీపౌరుషమును వర్ణింప బ్రహ్మాదులబుద్ధులె భ్రాంతిని జెందుచుండ మావంటివారిసంగతి చెప్ప నేల? ఆలోచింప నీమహిమను వర్ణింప సమర్థులము కాము. అయినను నారాయణాంశసంభూతుఁడ వగు పృథురాజుకథామృతమునం దాదరము కలవార మయి మేము మునుల యుపదేశప్రకారముగా శ్లాఘింపఁ దగిననీయద్భుతకార్యములను జగంబున విస్తరింపఁ జేసెదము. ఈపృథురాజు వర్ణాశ్రమధర్మముల నాచరించువారిలో నుత్తముఁడు. కావున నే సమస్తలోకమును ధర్మమందుఁ బ్రవర్తింపఁ జేయుచు, ధర్మమర్యాదలను రక్షించుచు, నాధర్మములకును ధర్మానుష్ఠానపరులకును, విరోధు లగువారిని నశింపఁ జేయుచు నున్నవాఁడు. ఈపృథురా జొక్కఁడే లోకపాలు

### వందిమాగధులు పృథురాజుగుణముల వర్ణించుట.

రగునింద్రాదులకుఁ గార్యోపయోగులయి యపృథక్సిద్ధములయిన యసాధారణగుణములను దన దేహమందుఁ బాలనపోషణాదులచే నీలోకమునకు హిత మగునట్లుగాను, యాగాదులచేఁ బరలోకమునకు హితమగునట్లుగాను, ధరించుచున్నాఁడు. మఱియునితఁడు సూర్యుఁ డెనిమిదిమాసములును దనకిరణములచే లోకమును దపింపఁజేసి జలమును స్వీకరించి వర్షాకాలము రాఁగానే యాజలమును వర్షరూపముగా నిచ్చి రక్షించుచున్నట్లు, తగినకాలమునఁ బన్ను వేసి లోకమునుండి ధనమును గ్రహించుచు దుర్భిక్షకాలమునందు లోకులకు మరల నిచ్చుచున్నాఁడు. ఇతఁడు సకలభూతములందును సమబుద్ధితో వర్తించును. పాదాదులచేఁ దన మస్తకము నాక్రమించువారయినను నార్తితోఁ గూడుకొన్నచో నితఁడు వారియందు మిగుల దయగలవాఁడయి యపరాధముల సహించును. భూమి కెట్టి సహనగుణము కలదో యితని కట్టిసహనగుణము కలదు. ఇతఁడు నరదేవరూపము దాల్చినశ్రీహరియే. ఇతఁడు వర్షము లేక ప్రజలు ప్రాణముల విడుచుచున్నప్పుడు వర్షము గురియించి యింద్రునివలె రక్షించుచున్నాఁడు. ఇతఁడు ప్రేమసహితము లగుచూపులు గలిగి స్వచ్ఛమయినచిఱునవ్వుచే సుందర మయి యున్నతనవదనచంద్రబింబముచే, లోకమును వృద్ధి పొందించుచున్నాఁడు. ప్రవేశమందుఁ గాని నిర్గమించుటయందుఁగాని యితనిమార్గము నొరులు గనుఁగొనలేరు. ఇతఁడు చేయుచున్న కార్యము లొరులకుఁ దెలియఁబడవు. గంభీర మగునితనియభిప్రాయమును నితరు లెవ్వరును దెలిసికొనఁజాలరు. ఇతఁడు విత్తము నధికముగా భద్రముగా

నుంచుకొనుచున్నాఁడు. ఇతఁ డపారమగు మాహాత్మ్యమునకును గుణములకును నిలయభూతుండు. ఇతఁడు సముద్రములచేనావరింపఁబడినవరుణునివలె గూఢ మగునాత్మ కలవాఁడు. ఇతఁడు మనస్సుచేతనైనను శత్రువులకుఁ బొందఁదరము కానివాఁడు. ఇతని పరాక్రమాదులను శత్రువులు సహింపలేరు. ఇతఁడు సమీపస్థుఁ డయియున్నను దూరమందున్నవానివలెఁ జోరుపాదులచేఁ దిరస్కరింపఁబడువాఁడు కాఁడు. ఇతఁడు వేనుఁ డనెడియరణియం దుదయించినయగ్నిహోత్రునివలెఁ బ్రకాశించుచున్నాఁడు. ఇతఁడు చారులచే సమస్తభూతములవృత్తాంతములను జూచుచు, దేహధారణమునకు హేతుభూతుఁ డగునాత్మవంటివాఁ డగు నాయువుచందంబున నుదాసీనుఁ డయి యుండును. ఈపృథురాజు శత్రువులకుమారునినైనను, దండనార్హుఁడు కానిచో దండింపఁడు. తనకుమారుఁ డయినను దండనార్హుఁ డయిన దండించి తీఱును. ఇతఁడు ధర్మమందు ధర్మరాజును బురుడించుసు. సూర్యకిరణము లెంతవఱకుఁ బ్రసరించునో యంతవఱకు నితనియాజ్ఞయు రథమును నిరాటంకముగాఁ బ్రవర్తించుచున్నవి. ఇతఁడు వ్యాపారములచేతను లోకమును రంజింపఁ జేయుచు, మనోరంజనాదిగుణములు గలవాఁ డగుటచేఁ బ్రజలచే రాజని పిలువఁబడుచున్నాఁడు. ఇతఁడు సఫల మగుచున్న సంకల్పముకలవాఁడు. ఇతఁ డెప్పుడును సత్యము నేపలుకుచుండును. ఇతఁడు బ్రాహ్మణులందు సాధువు. వృద్ధుల సేవించును. సర్వభూతములకును శరణమిచ్చును. తగినవారిని మన్నించును. దీనులయెడ వత్సలుఁడై యుండును. పరస్త్రీలయందుఁ దల్లియందువలెనే భక్తి నుంచును. భార్యను దనయర్ధశరీరమునుగాఁ జూచును. ప్రజలప

రాధము లొనర్చినను దోషముల నెన్నక తండ్రి కుమారులను వలెఁ బ్రీతితోఁ జూచుచుండును. బ్రహ్మవాదులకు దానుం డయి ప్రవర్తించును. ప్రాణులకాత్మవలెనే యితఁడు సమస్తజంతువులకు మిక్కిలి ప్రియుఁడు. స్నేహితులకితఁ డానందము వెల్లిగొలుపును. విరాగులయి వర్తించుమహాత్ములతో నితఁడు స్నేహముచేసి మెలఁ లుచుండు. దుర్జనులందు యమసదృశుఁడయి వర్తించు. మహావీ రుం డగునీపృథురాజు బలముచే భూమినుండి యోషధులను సం గ్రహించును. ఇతఁ డీభూమిని తనవింటికొప్పుచేఁ బాధాదిరహిత ముగాఁ జేయును. ఇతఁడు సద్గుణములకు నిలయుంబని వేఱ చెప్ప నేల? ఇతఁ డనంతకల్యాణగుణములు గలభగవంతుఁడే కాఁడా? ఎవఁడు వికారాదులు లేక వర్తించునో, యెవఁడు త్రిజగంబుల కధిపతియో, యాపరమాత్మయే తన కంశభూతుఁడగు*జీవుఁడుగా నవతరించెను. ఏజీవునియం దావేశించి యవతరించె నని యడు గుదువేని చెప్పెదను వినుము. తత్త్వవిదు లేజీవునియందుఁ బ్ర తీయమాన మగుచున్నను బ్రకృతిపరిణామరూప మగు దేవమ నుష్యాదిభేదము సత్యము కానట్లు చూచుచున్నారో యాజీవుని

---

* ఓయీ? భగవంతుఁడు జీవశరీరకుఁడయి తనయంశముచే నవతరించె నని చెప్పితివి. అట్లయినజీవునియందుఁ బ్రసక్తములగుచున్నదోషములన్నియును బరమపురుషునియందుఁ బ్రసక్తములగుచున్నవా యనిప్రశ్నింపరాదు. ఆలోచింప భగవంతుఁడు జీవశరీరకుఁ డగుటవలన దోషములు ప్రతీయమానములగుచున్న ను దేహగతములగు చిన్నతనము ముదుసలితనము మొదలగుధర్మములు జీవుకిని సంభవింపనివిధంబున జీవునియందుఁ గల అజ్ఞత్వాదిదోషములుపరమపురుషు నిఁ జెంగవు. పరమాత్మమాయను వశముగావించుకొని కర్మాదులకు వశుఁడు గాక యుండుటచే నవర్థము లెంతమాత్ర మతనిఁ జెంద నేరవు.

యుందావేశించి యవతరించెను. కావునఁ బృథురాజు భగవంతుని యంశావతార మని చెప్పుదురు. ఈపృథురాజుదయపర్వతపర్యంతము గలభూమండలమును రక్షించును. తనకంటె నధికుఁడగు శూరుఁడు కాని సమానశూరుఁడు గాని లేకపోవుటచే విచ్చలవిడిగాఁ జరించుచు నితఁడు జయశీలమగురథము నెక్కి ధనుర్బాణములను ధరించి సూర్యునివలె దక్షిణముగాఁ బ్రదక్షిణము చేయుచుండును. ఇట్లు ప్రదక్షిణము చేయుచున్న పృథురాజునకు దిక్పాలురును సమస్తజనులును నచ్చటచ్చటఁ గానుకలను సమర్పించుచుందురు ఆదిక్పాలురభార్యలును, నారాజులభార్యలును నితనియశంబును జెప్పుకొనుచు నితని భగవంతునిగాఁ దెలిసికొని తమలోఁ దా మి ట్లనుకొనుచుందురు. "ఈరాజు ప్రజాపాలనమం దధికారము వహించినవాఁడు. ప్రజలకు జీవనోపాయమును జేయఁదలంచుచుండు. ఇతఁడు గోరూపధారిణి యగుభూమినుండి యోషధులను బితికెను. ఇతఁ డింద్రునివలెఁ దనవింటికొప్పుచే లీలగాఁ బర్వతములను భేదించి భూమిని సమముగాఁ జేసెను. వాలమును మీఁదికెత్తి విచ్చలవిడి జరించుసింహమువలెనే యిప్పు డితఁ డాజగవ మనువింటిని ధ్వనిచేయుచు శత్రువుల సహింపరాని పరాక్రమము గలవాఁడయి భూమియందుఁ జరించునో యప్పుడే ధర్మవిరోధులగు చోరాదులు ప్రతిదిక్కునందును నడఁగిపోయిరి. ఇతఁడు సరస్వతీనది యుద్భవించినస్థలమగు బ్రహ్మావర్తమందు నూ టశ్వమేధములు చేసెను. ఇతనినూఱవయాగమును ప్రవర్తిల్లుచుండగా నింద్రుండు వచ్చి యజ్ఞాశ్వము నపహరించెను. మఱియు నితఁడు తనగృహమునకు సమీపమున నున్నవనమం దసహాయుఁడై యున్నవాఁడును భగవంతుఁడు నగుసన

త్కుమారుని భక్తిచే నారాధించి పరబ్రహ్మపదవిని బొందింపఁ జాలినతత్త్వజ్ఞానమునుబడసెను.'' అనియిట్లు ప్రథిత మయినశక్తి గలిగి నిరుపమానమగు పరాక్రమము చేనొప్పినపృథురాజుఁగూర్చి చెప్పుచున్న ప్రబంధరూపములగు గాథలను వినఁగలరు. మఱియు నితఁడు నిజబలముచే లోకకంటకులగు దురాత్ములను జయించి నిరర్గళ మగునాజ్ఞతో దిక్కుల జయించును. సురాసురులు తనప్రభావమును వర్ణింపఁగా భూమికి భర్తయై యుండును. ఇది పదునేనవ యధ్యాయము.

---

అని యిట్లు నుతించుచున్న వందిమాగధులవాక్యములు విని గుణములచేతను సద్భుతకర్మములచేతనుబ్రఖ్యాతిగాంచి, యారాజావందిమాగధులకు వస్త్రములను నగలను బహుమానముగానిచ్చి వారుచేసిననుతికి మెచ్చుకొని సంతోషించెను. అనంతరమతఁడుబ్రాహ్మణులు క్షత్రియులు మొదలగు నాలుగుజాతులను, సేవకులను, మంత్రులను పురోహితులను, దైవికులను, దాంబూలంబమ్మి జీవించువారిని, పురవాసులను, దేశవాసులను, నిజజనులను లెస్సగా గౌరవించె నని మైత్రేయుండు చెప్పఁగా విని విదురుండిట్లనియె. ''ఓమునీంద్రా! కామరూపిణి యగుభూమి యేమికారణంబున గోరూపంబును ధరించెను? పృథురాజు దాని నేల పితికెను? ఆదోహనక్రియయందు వత్సమెక్కడిది? పితుకుటకుఁ బాత్రమేది? పర్వతాదులచే నిమ్నోన్నతయగు భూమి యెట్లు సమముగాఁ జేయఁబడినది? పృథురాజు యాగాశ్వమును దేవేంద్రుఁడేల యపహరించెను? ఓమునీంద్రా! బ్రహ్మవిదులలో నుత్తముఁ డయినసనత్కుమారునివలన నుపాసనాత్మకజ్ఞానముతోఁ

గూడినజ్ఞానమును బొంది పృథురాజే గతిబొందెను? ఈవృత్తాంతములను దెలుపుము. మఱియు శోభనమగు కీర్తి గలభగవంతుని యంశావతారమగు పృథురాజునుసంబంధించినదియు వినువారికి బుణ్యము సంపాదించునదియు నగుకీర్తిని, నింకను మిగిలినసమాచారములనుఁ దెలియఁజెప్పుము. ఓమహాత్మా! నీకును భగవంతునకును నేను భక్తుఁడను. మఱియు నధిక మగుప్రేమ గలవాఁడను. కావున భగవంతుఁడు పృథురాజురూపముగా నవతరించి భూమినుండి యోషధులను బితికినట్టికథను నాకుఁ జెప్పఁదగినవాఁడవు.'' అని యిట్లు విదురుండు వాసుదేవకథనుగూర్చి ప్రశ్నింపఁగా విని మైత్రేయుండు సంతోషించినవాఁడై యావిదురుని నుతించి యిట్లు చెప్పెను. 'ఓవిదురా! పృథురాజు విప్రులయును నుతి నొప్పనఁ బట్టాభిషిక్తుఁడై జనసమూహములను రక్షింపఁ బూనినప్పుడు ప్రజ లన్నములేక క్షీణించి రాజునొద్దకువచ్చి యిట్లనిరి. ''ఓరాజా! చెట్టుతొఱ్ఱయం దుండినయగ్ని చెట్టును దగ్ధము చేయుచున్నట్లు జఠరాగ్ని మమ్మునుఁ దపింపఁజేయుచున్నది. నీవు మాకు జీవనమిచ్చుదాతవు. అధిపతివి. బ్రాహ్మణులచే నీవు సాధింపఁబడితివి. అట్టినీకు మే మిప్పుడు శరణుఁజొచ్చుచున్నాము. ఓ మహారాజా! నీవు మాకు నాహారాదుల నిచ్చి రక్షించెడిదాతవును లోకములను బరిపాలించువాఁడవును. కావున మే మన్నములేకెంతకాలములో మృతి నొందకుందుమో యంతకాలములో నాఁకటిచిచ్చుచేఁ బీడితుల మగుమాకన్న మొసంగి రక్షింప బ్రయత్నింపుము.'' అనిపలుకుచున్న ప్రజలదీనాలాపముల నాలకించి పృథురాజు చిరకాల మాలోచించి ప్రజలన్నములేక క్షీణించుటకుఁ గారణమును దెలిసికొనెను. ఇట్లు చింతించి యోషధుల

నన్నింటిని భూమి హరించినదని నిశ్చయించి త్రిపురాసురహంత యగురుద్రునివలెఁ గోపమూని ధను వెక్కువెట్టి బాణమును ధనువునందుఁ గూర్చెను. ఇట్లు ధనుర్బాణధరుఁడగుఁ పృథురాజును జూచి భూమి భయమువలన గడగడ వడఁకుచు గోరూపమును ధరించి కిరాతకునికి భయపడి పరువెత్తుచున్న లేడివలెఁ బరువెత్త నారంభించెను. అది చూచి పృథురాజు కోపోద్దీపితుఁడై కన్నులెఱ్ఱవాఱుచుండఁగా వింట బాణము సంధించి యాగో వెచ్చటికిఁ బర్విడునో యచ్చటికెల్లఁ బర్విడఁజొచ్చెను. అంతి నా భూమి దిక్కులను విదిక్కులను భూమ్యాకాశంబులను జరించుచుఁ దాఁ బోవుచున్నచోట్లయందెల్లఁ బృథురాజు వచ్చుచుండుటఁ జూచి, మృత్యువును జూచినప్రజవలె మిగుల భయంబు చెంది, లోకమందుఁ దనకుఁ రక్షణోపాయము గానలేక మిగుల సంతాపము నొందుచు మఱలెను. ఇట్లు మఱలి భూమి పృథురాజుం జూచి. "ఓదేవా! ఓబుద్ధిమంతా! నీవు స్త్రీలు వధకుఁ దగనివారన్నధర్మమును జక్కఁగ నెఱుఁగుదువు. ఆపద నొందినవారియెడ వాత్సల్యముకలవాఁడవు. భూతములను రక్షింపఁబూనుకొన్నవాఁడవు. కావున భూతములం దంతర్యామినై యున్న నన్నుఁదప్పక రక్షింపుము. భూతముల రక్షింపఁగంకణము కట్టుకొనినసీవు నిరపరాధ నగునన్నుఁ జంప నేలతెలంచుచున్నావు? ధర్మజ్ఞుఁడ వగునీవు స్త్రీ నైనన న్నెట్లు చంపుదువు? లోకములో సామాన్యజనులుకూడ నపరాధము చేసినను నాఁడువారలను జంపరు. అట్లుండఁగాఁ గరుణాళువులయిన మీవంటివారు నిరపరాధ నగునాఁడుదానిఁ జంపఁబూనరాదని వేఱ చెప్పవలయునా? నేను సమస్తప్రంచమునకును నాధార

మను. నాయందు సమస్తముఁ బ్రతిష్ఠితమైనది. అట్టినన్ను సం హరించి దృఢ మగునావను బ్రద్దలు చేసి యందులోనిజనముల జలముల ముంచినట్టునిన్నును బ్రజలను జలంబులనెందులకుముం చుకొనెదవు?'' అనుచున్నభూమిపలుకులువిని పృథురాజిట్లనియె. "ఓపృథివీ; నీవు నాశాసనము ననువర్తించినదానవుకావు. కావున నిన్నుఁజంపెదను. నిరపరాధనగు నన్నేల చంపెదవని యడిగితివి. కాని నీవు రాజనగు నా యాజ్ఞమీఱుట యనునొకయపరాధము గావించితివి. ఇంతియుకాక నీవు యాగములందు దేవతారూప మునవచ్చి భాగమును బొందుచున్నావు. కాని ధాన్యాదులను నొసంగలేదు. ఇట్లు నీవు పరులు చేసినయుపకారమును మఱచి యుండుట రెండవయపరాధము. ఓయీ! అపరాధమును జేసి నను గోరూపధారిణి వగునన్నుఁజంపుట నీ కుచితము కాదనియం దువేని చెప్పెద వినుము. గోవు ప్రతిదినమును తృణాదికము నెక్కువగాభుజించి పాలుకొంచమేసియు నొసంగనిచో నదితప్పక దండనార్హమయినదే. నీవు నారీతిగనే యాగాదిభాగములఁగొను చు ధాన్యాదులనొసంగమిచే దండనార్హమువే? నన్నుఁజంపినచో ప్రజలయాఁకలిదీఱునా? కావునన ట్లు చేయుటతగదని శంకింపరా దు. ఆకలిబాధకోర్వఁజాలక నలుదిక్కుల వ్యాపించుచు, నార్తు లై యున్న ప్రజలదుఃఖమును నాబాణములచే శాంతి పొందించె దను. మఱియు లోకములోఁ బురుషుఁడైనను స్త్రీయైనను నపుంసకుండైనను,దన్నుఁదాఁ బొగడుకొనుచుఁ గావున నే యథ ముఁడై భూతములందు దయ లేక వర్తించినచో రాజు స్త్రీపురుషాదివిమర్శనమును విడిచి వారిని జంపవచ్చును. అం దువలన రాజునకుఁ బాపము సంభవింపదు. మఱియు నీవు

గర్వించినదానవై "నేను లేకపోయినచో సమస్తమును జలములో మునింగి పోవు"నని తలంచుచున్నావు. కపటగోరూపమును దాల్చిననిన్ను నాబాణములచే నువ్వుగింజలంత లేసి ముక్కలుగా ఖండించి నాయోగబలముచేతనే ప్రజలను నన్నును ధరించెదను." అని యిట్లు పలుకుచు విస్తారమగు కోపమును వహించి యమునివలెఁ బ్రవర్తించుచున్న పృథురాజునకు భూమి భయపడి గడగడవడఁకుచుఁ బాదములపయిం బడి నమస్కరించి దోసిలింబట్టి యిట్లనియె. 'ఓమహాత్మా! నీవు*నిన్ను విడిచి వేఱు

గోరూపధారిణి యగుభూమిపృథురాజును నుతించుట.

గ నుండఁజాలనిమాయచే దేవమనుష్యాదులను గలిగించి యాదేవమనుష్యాదులగు వ్యష్టిజీవులే శరీరముగాఁ గలవాఁడవు.†మ

* దీనిచే భగవంతుఁడు ప్రకృతిపురుషులే శరీరముగాఁ గలవాఁడనియు జగంబునకుఁ గారణుం డగుటయుఁ జెప్పఁబడినది.

† ఓయీ! ప్రకృతిపురుషశరీరకుఁడయినను భగవంతునకిఁ బ్రకృతిపురుషగతము లగుసత్త్వాదిగుణములు గలవని చెప్పితివి. భగవంతుఁడుఁగూడ జీవునివలెఁ బ్రకృతిగుణములు గలవాఁడయినచో జీవునికి నతనికిఁ గలభేద మేమి? అని యందువేని చెప్పెదను విను. భగవంతుఁడు ప్రకృతిపురుషులే శరీరముగాఁగలవాఁడు. కావున శరీర మయినప్రకృతిపురుషులమూలమున నాగుణములు గలుగుచున్నవి. కాని వాస్తవముగాఁ గలుగలేదు. శ్రు॥ కాఠిన్యవాన్యో బిభర్తి తస్మై భూమ్యాత్మనే నమః. ఇత్యాదిస్థలములందు భూమియందుండు కాఠిన్యము సద్వారకముగా భగవంతునికిఁ గలదని చెప్పఁబడినది. కానిస్వభావసిద్ధముగా నున్నట్లు చెప్పఁబడలేదు. అట్లే ప్రకృతిపురుషులు శరీరముగాఁగలవాఁడగుటచేఁ బ్రకృతిపురుషులందున్న సత్త్వాదిగుణములు భగవంతునికి సద్వారకముగాఁ గలవని తెలియునది. అంతియకాని యతనికి సత్త్వాదిగుణములు లేవు. కావున భగవంతుఁడు నిర్గుణుఁ డనిచెప్పుశ్రుతు లుపపన్నము లగుచున్నవి.

ఱియు నీవు ప్రకృతిగుణ విశిష్టుఁడవగుటవలనఁ దన్మూలమున సత్త్వాదిగుణములు గలవాఁడవు. నీవు ప్రకృతిఁగూర్చియు జీవునిఁ గూర్చియు నీశ్వరునిఁగూర్చియు యథార్థమగుజ్ఞానము గలిగియాజ్ఞానముచే, [1] ద్రవ్యభ్రమతోను, [2] క్రియాభ్రమతోను [3] కారకభ్రమతోనుగూడిన [4] షడూర్ములను దొలఁగించుకొనుచున్నావు. కావుననే నీవు ప్రకృతిపురుషులకంటె విలక్షణుఁడ వయి పరమపురుషుఁడవైతివి. అట్టినీకు వందనంబు లర్పించుచున్నాను. మఱియు నీవు సర్వజ్ఞుండవు. సర్వశక్తివి యయినను నిన్ను, నీవురచించినజగంబున కంతర్యామి యగునేనెట్లు వచింపఁగలుగుదును?

---

1. ద్రవ్యభ్రమ యనఁగా, పృథివ్యాదిద్రవ్యములచే నారంభింపఁబడిన దేహము నాత్మగా భ్రమించుటయే.

2. "నేను నడుచుచున్నాను" "నే నిచ్ఛగించుచున్నాను" "నేను ద్వేషించుచున్నాను" అను క్రియలు వాస్తవముగా దేహగతములు. అవి దేహగతములయినను వాని నాత్మగతములనితలంచుటయే క్రియాభ్రమ మనఁబడును.

3. కారకభ్రమ యనగా "అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధం । వివిధాశ్చ పృథక్చేష్టా దైవంచైవాత్ర పంచమం। శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః । న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః। తత్త్రైవం సతి కర్తార మాత్మానం కేవలంతు యః । పశ్యత్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః॥" అనఁగా శరీరము, ఆత్మ, సాధనమును, వివిధములగు చేష్టలు, దైవము, నీయైదును కర్తలు. మనోవాక్కాయములచే నరుఁడేకర్మమును జేయునో యాకర్మ కీయైదును కర్తలు. ఇట్లుండఁ గేవలమునాత్మనేకర్తయనువాఁడు దుర్మతియని భావము. ఇటఁ గర్తృత్వ మయిదింటి యందుండఁగాఁ గేవలమాత్మనే యని తలఁచుటయే కారకభ్రమ యనఁబడును.

4. ఆఁకలియు, దప్పియు, శోకము, మోహము, ముదుసలితనము, మృత్యువు అనునివి యాఱును షడూర్ము లనిపించుకొనును.

కావున నన్ను వేఱురీతిని దలంపక రక్షింపుము. ఓపరమపురుషా! నీవు బ్రహ్మశరీరకుండ వయి సమస్తవ్యష్టిజీవులను సృజించితివి. అట్లు చేసి యాజీవులకు స్థానభూతంబగు నట్లు నన్ను సృజించితివి. ఇప్పుడు ప్రకృతిచేఁ గల్పిత మగు దేవమనుష్యాదిప్రపంచ మంతయు నాయందు న్నది. నీవే నన్ను జీవాధారముగా సృజించి యిప్పు డాయుధంబును గేల ధరించి స్వతంత్రుండ వయి చంపుటకు యత్నించుచున్నావు. ఇట్లుండ నీకంటె నితరుల నెవరిని శరణుఁ జొత్తును? మఱియు నీ వాత్మయే యాధారముగాఁ గలిగి యిట్టిదని యూహింప శక్యముకానిదై స్వసంకల్పముచేతఁ జరాచరమగు ప్రపంచమును సృజించితివి. నీ వట్టిసంకల్పము చేత నే జగంబును గాపాడ నుద్యుక్తుండ వయితివి. అంతియకాని కాలాగ్నిరుద్రాదులయవతారంబు పూని చంపుటకుఁ బ్రవర్తింపలేదు. కావునఁ బ్రజలఁ బాలించుట యనుధర్మమునఁ బ్రవర్తించుచున్న నీవు ప్రజలకు భోగ్యపదార్థములఁగాను, భోగసాధనములఁగాను, భోగస్థానములఁగాను నున్న నన్ను నెందులకుఁ జంపఁ దలంచుచున్నావు? ఓదేవా! నీవు మొదట నొక్కండవయినను బ్రహ్మరుద్రాదిజీవరూపమున నానావిధము లయితివి. అట్టియీశ్వరుండవగు నీచే సృష్టితమును దుర్జయ మగునీమాయచే మోహితచిత్తుల మగు మే మెట్లుగాఁ దెలిసికోఁగలము? ఓమహాత్మా! నీ వచిద్ద్రవ్యము జీవునిపుణ్యపాపకర్మములు, కాలము, జీవుండు, మొద లగుశక్తుల చేత నీప్రపంచమునకు సృష్టిస్థితిలయములఁ గల్పించుచున్నావు. సృష్టిస్థితిలయములకుఁ గారణములయి కార్యోన్ముఖములయి కావున నే పరస్పరము విరుద్ధము లయియున్నశక్తులు గలిగి కారణభూతుండ వయి ప్రకృతికంటెను బురుషునికంటెను విలక్షణుండ

వయియున్న నీకు నమస్కారము. ఓమహాప్రభూ ! నీవు నీయందు నీచేత సృజింపఁబడి పృథివ్యాదిభూతంబులతోను శ్రోత్రాదు లగు నింద్రియములతోను, నంతఃకరణముతోను గూడియున్న, ప్రపంచముస్థాపింపఁదలంచి కర్త్రాయత్తము లగుజన్మాదులు లేకపోయినను యథేష్టముగా నేదివ్యవరాహరూపముదాల్చి సుప్రసిద్ధుండవయిజలములఁజొచ్చినీచే నిర్మితమగుజగంబున కాధారభూతమగు నన్నురసాతలంబునుండియుద్ధరించితివి. ఆయాదివరాహమూర్తివగునీవిప్పుడునీటిపై నావవలెనే యాధారభూతమగునాపయినున్న ప్రజలను రక్షింపఁదలంచి యీరూపముగా నవతరించితివి. అట్లు లోకరక్షణమునకై యవతరించిననీవు మిగులఁ గోపమూని తీవ్రమగుశరములఁ దాల్చి పాలనిమిత్తము గోరూపధారిణి నగునన్నుఁ జంపఁదలంచుచున్నావుగదా! ఈశ్వరునియవతారములును జేష్టలును నీశ్వరసంబంధినియు సత్త్వాదిగుణకార్యములకుఁ బ్రధానభూతయు నగుమాయచే మోహితచిత్తుల మగుమావంటియజ్ఞులచే నెట్లుగాఁ దెలియఁబడును. కావున హిరణ్యాక్షాదివీరులను జంపుటచే మిగులఁ గీర్తి గలిగించునీ యవతారములకు వందనంబులు. ఇది పదియాఱవయధ్యాయము.

---

అని యిట్లు పృథివి పృథురాజును స్తోత్రముచేసినను నతని కోప ముపశమింపలేదు. అతఁడు కోపోద్దీపితుఁ డయి కావుననే చలించుచున్నయధరోష్ఠములు గలిగిభయంకరుం డై యుండెను. అట్టిపృథురాజును జూచి భూమి మిగుల భయము చెంది తనకుఁ దానే భయంబును దొలంగించుకొని యతని కిట్లనియె. 'ఓపృథురాజా!కోపమును బూర్తిగా నశింపఁ జేయుము. నా చెప్పినవాక్య

మును వినుము. తుమ్మెద ప్రతిపుష్పమునుండియును మకరందమును మాత్రమే గ్రహించుచున్నట్లు సారాసారములను విచారింప నేర్పుగలపండితుండు కేవలమును సారమును మాత్రమే గ్రహించి యసార మగుపదార్థమును విడుచును. కావున సారజ్ఞుఁడవగు నీవు నావాక్యములందుఁ గలసారమును గ్రహించి యసా

భూమి పృథురాజునకుఁ గర్తవ్యము నుపదేశించుట.

రములను విడువుము. ఓమహారాజా! ఉపాయమువలన సమస్తము సిద్ధించును. పురుషులకుఁ బురుషార్థము కలిగించునిమిత్తము తత్త్వదర్శు లగుమునీంద్రులు, కృషి, గోరక్షణము, వాణిజ్యము మొదలగు జీవనోపాయముల నీలోకమందు నిర్ణయించియున్నారు. మఱియుఁ బరలోకము విషయమయి స్వర్గసాధనభూతము లగునగ్నిహోత్రాదు లగు నుపాయంబులు కూడ నిర్ణయింపఁబడియున్నవి. ఇట్లుపూర్వము మునులచే నిర్ణీతములగు జీవనోపాయముల నెవఁడు శ్రద్ధాళు వయి యనుసరించి చేయునో వాఁడు సుఖముగానే యుపాయసాధ్యము లగువస్తుజాతమును బొందును. మఱియు విద్వాంసుఁడయినను బెఱవాఁడయినను బూర్వులచేఁ జూపఁబడినయుపాయములను దిరస్కరించి స్వబుద్ధిచేతనే పురుషార్థసాధనములు కానివానినగువానిఁగాఁదలంచి పురుషార్థమును సాధింప నుపాయములు కానివాని నుపాయములుగాను దలంచి, ప్రారంభించినచో వాని కనేకములగు విఘ్నములు సంప్రాప్తము లగును. ఒకవేళ విఘ్నములు గలుగుచున్నను ధైర్యముతోనోర్చి యాయుపాయాభాసములనునారంభించినను ఫలంబు లీయఁదగి యుండవు. ఓరాజా! పూర్వము బ్రహ్మ యీలోకమునిమిత్తమును, యాగాదులమూలమునఁ బరలోకనిమిత్త

మును, నోషధులను సృజించెను. లోకపాలనమందును యాగాదుల నొనర్చుటయందును శ్రద్ధ లేని కొందఱుదురాత్ములచే ననుభవింపఁబడి యాయోషధులు నశించుచుండె. అప్పుడు నేను నీవంటిలోకపాలురచేఁ బాలింపఁబడక తిరస్కరింపఁబడి,యాయోషధుల నందఱు నపహరించుచుండుటఁజూచి వార లనుభవించిన నవి మఱుఁగుఁ బుట్టవనియు, నవి లేనిచో యాగాదు లొనరింపఁ దగదనియు నాలోచించి,యాగాదులకుపయోగించు నోషధులను స్వీకరించితిని. నేను వానిని స్వీకరించి చిరకాల మగుటచే నవి నాయందు నిశ్చయముగా క్షీణించినవి. అయినను వాని నొక యుపాయముచే మఱుఁడ సంపాదింపవచ్చును. ఆయుపాయమును జెప్పెదను వినుము. ఓమహాబాహూ! భూతముల వర్ధించునో రాజా! నీవు భూతములకు బలప్రద మగునన్నము నొసంగఁ దలంచితివేని, గోరూప నగు నా కొకవత్సమును,నొకపాలపాత్రను పాలను బితుకువానిని గల్పింపుము. నీ వట్టిసామగ్రిని సంపాదించినచో నేను నీవిషయమునఁ వాత్సల్యము కలదాన నై పాల రూపమున నున్న యోషధుల నొసంగుదును.ఓవీరా! పర్వతాదులచే నెచ్చుతిగ్గులు గా నున్న నన్నును సమము గాఁ జేయుము. అట్లయినచో మేఘముచే వర్షింపఁబడినజలము వర్షాకాలము గతించినను నాయం దన్నిస్థలముల నుండును. నీ వట్లు చేయనిచో నాయం దొక్కనీటిచుక్క యయినను నుండదు. ఓరాజా! నీకు భద్రమగుఁ గాక."అని యిట్లుభూమిపలికిన ప్రియవాక్యమును విని తాను బితుకువాఁడై ,తనచేతులఁ బాత్రముగాఁ జేసిస్వాయంభువ మనువును వత్సముగా నేర్పఱిచి,సకలౌషధములకు మూలములగు పాలను బితికి భూమియందుఁ జల్లి యోషధులను మొలపించెను.

### పృథువు గోరూపధారిణి యగుభూమివలన నోషధులనుఁ బితుకుట.

పృథురా జిట్లు చేసినపిమ్మట సారాసారములఁ దెలిసినపండితులు గొందఱు గోవువలనఁ బాలు పితికి యన్నివస్తువులందు నుంచి సారవంతములుగాఁ జేసిరి. అనంతరము పృథురాజునకు వశమయినయా గోవునుండి పెక్కుఱు తమ కిష్టము లగువస్తువులను స్వీకరించిరి. అట్లు బితికినవారిని వివరించి చెప్పెదను. వినుము, ఓవిదురా! వసిష్ఠాదు లగుమునులు బృహస్పతిని వత్సముగాఁ జేసి యింద్రియములను బాత్రములుగాఁ జేసి పవిత్రమై ఛందోమయమైనపాలను పితికిరి. పిమ్మట దేవత లందఱును దేవేంద్రుని వత్సముగాఁ జేసి బంగారుకలశమును సంపాదించి మనంబునకు శక్తినిచ్చు వీర్యమును, నింద్రియశక్తి నిచ్చునోజమును, దేహశక్తి నిచ్చుబలమును గలిగించునదై క్షీరాత్మకమైనయమృతమును బితికిరి. తరువాత దానవులు ప్రహ్లాదుని వత్సముగాఁ జేసి యినుపపాత్రమందు గౌడి, పైష్టి, మాధ్వీ యను మూఁడువిధంబు లగు మద్యమును గలిగించుపాలను బితికిరి. అనంతరము గంధర్వులు, విశ్వావసును వత్సముగాఁ జేసి పద్మరూప మగుపాత్రమందు వాఙ్మాధుర్యము నొసంగుపాలను బితికికొనిరి. అప్పుడే యచ్చరలు సౌందర్యముఁ గలిగించుపాలను బితికికొనిరి. అటుపిమ్మటఁ బితృదేవతలు సూర్యుని వత్సముగాఁ జేసి కాల్పఁబడని మట్టిపాత్రయందు దమ కన్నము నొసంగుపాలను శ్రద్ధతోఁ బితికికొనిరి. అనంతరము సిద్ధులు కపిలుని వత్సముగాఁ జేసి యాకాశమును బాత్రమునుగాఁ జేసి యణిమాదిసిద్ధులను గలిగించుపాలను బితికికొనిరి. పిమ్మట విద్యాధరులుగూడఁ గపిలుని వత్సముగాఁ జేసి యాకాశ మనుపా

త్రమునందే, యాకాశగమనము మొదలగు విద్యలను గలిగించు పాలను బితికికొనిరి. తరువాతి నాశ్చర్యరూపముల ధరించుపురుషులు మయుని వత్సముగాఁ జేసి యంతర్ధానముఁ బొందుట, యద్భుతరూపములఁ దాల్చుట మొదలగు మాయల నీయఁ జాలు పాలను బితికికొనిరి. ఆవెనుక మాంసభక్షు లయినయక్షులును, రక్షస్సులును, భూతములును, బిశాచములును, రుద్రుని వత్సముగాఁ జేసి కపాలమును బాత్రముగాఁ జేసి మద్యమువలెనే మత్తత గలిగించు రక్తము నొసంగుపాలను బితికికొనిరి. అనంతరము పడగలు లేనిపాములును బడగ లున్నపాములును, కాటు వేయుటే స్వభావముగాఁ గలపాములును, కద్రూసంతతి యగుపాములును తక్షకుని వత్సముఁగాఁ జేసి రంధ్రము లనెడిపాత్రములందు, విషరూప మగుపాలను బితికికొనినవి. పిమ్మటఁ బశువులు రుద్రుని వాహన మగువృషభమును వత్సముగాఁ జేసి యరణ్యమును బాత్రమునుగాఁ జేసికొని తృణము నొసంగుపాలను బితికికొనెను. తరువాత శార్దూలాదులగుమృగములు సింహమును వత్సముగాఁ జేసి తమ కళేబర మనుపాత్రమున మాంసము నొసంగుపాలను బితికికొనెను. తరువాతఁ బక్షులు గరుత్మంతుని వత్సముగాఁ జేసి కీటాదులనుచరములను ఫలాదు లగునచరములను నొసంగుపాలను బితికికొనెను. వృక్షములుమఱ్ఱిచెట్టును వత్సముగాఁ జేసి. వెగటు, పులుపు మొదలగు వేఱువేఱు రసముల నీఁజాలిన పాలను బిసికొనినవి, పర్వతములు హిమవంతుని వత్సముగాఁ జేసి తమసానువులను బాత్రములుఁగా జేసి గైరికాదిధాతువుల నొసంగుపాలను బితికికొనినవి. ఓవిదురా! ఇట్లు సమస్తజాతులును దమజాతిలో ముఖ్యుఁడగు వానిని వత్సముగాఁ జేసి తమతమపాత్రములందుఁ దమకోర్కుల

నెఱవేర్చుపాలను వేఱువేఱుగాఁ బితికికొనెను. ఇట్లన్నాదులను గోరుచున్న పృథురాజు మొదలగువారు తమ కభీష్టమగునన్నము నొసంగుపాలను బితికికొనిరి. అనంతరము పృథురాజు సంతుష్టుఁడై సమస్తకామములను నెఱవేర్చినభూమిని గుమారికగా భావించి ప్రేమించెను. ఆవల రాజరాజయినపృథువు మిగుల సామర్థ్యము గలవాఁడయి తనవింటికొప్పుచేఁ బర్వతశృంగములను గుండఁజేసి భూమండలమును జాలవఱకు సమముగా నుండునట్లు చేసె. ఇట్లు పృథురాజోషధులను బితికి భూమిని సమపఱచి ప్రజలకు జీవనమునొసంగుచుఁ దండ్రి బిడ్డలనువలెఁ బోషించుచు, భూమియందచ్చటచ్చటఁ బ్రజలకు నివాసములను గల్పించెను. వానిని వివరించెద వినుము. అతఁడు గ్రామములను, బురములను, వివిధము లగుదుర్గములను గల్పించెను. మఱియు, గొల్లపల్లెలను, గోనివాసస్థానములను, సేనానివాసస్థానములను, బంగారము ప్రబలునట్టిస్థలంబులను, కృషీవలులు నివసించుపల్లెలను, బర్వతప్రాంతములందుండెడి ఖర్వటము లనఁబడుగ్రామములను, గల్పించెను. పృథురాజునకుఁ బూర్వము పురగ్రామాదులు లేవా యని యడుగకుము. ఆరాజునకుఁ బూర్వమందచ్చటను బురగ్రామాదులు లేవు. అందుచేఁ బ్రజలకు సుఖము లేకపోయెను. కాని యిప్పుడు పృథువు కల్పించినపురాదులందుఁ బ్రజలు యథేష్టముగాను సుఖముగాను నచ్చటచ్చట నివసించిరి. ఇది పదునేడవయధ్యాయము.

---

ఓవిదురా! పృథురాజోషధులను సంపాదించి, భూమిని సమపడునట్లు చేసి యనంతరము స్వాయంభువమనువున కాశ్రమ

మై సరస్వతీనదిచేఁ బ్రకాశించుచున్న బ్రహ్మావర్తమను సిద్ధక్షేత్రమందు నూ అశ్వమేధయాగములఁ జేయ సంకల్పించెను. పృథు విట్లు శతాశ్వమేధంబులు చేయుచుంటను దేవేంద్రుండు తెలిసికొని యాగములచేఁ దన్ను మించునని నిశ్చయించుకొని, సహింపలేక పోయెను. ఆబ్రహ్మావర్తము మిగులఁ బుణ్యమైనది. ఆక్షేత్రమునకు సర్వాంతరాత్ముండును, జ్ఞానాదిగుణములు గలవాఁడును, సమస్తలోకమునకును హిత ముపదేశించువాఁడును, యజ్ఞములచే నారాధనీయుండును, యాగఫలమొసంగువాఁడును నగునారాయణుండు వచ్చెను. ఆసమయంబున బ్రహ్మరుద్రు లతని వెంబడించి వచ్చుచుండిరి. సేవకులతోఁగూడ లోకపాలురును నతని సేవించుచుండిరి. గంధర్వులును, మునులును, నచ్చరులును నతనిదివ్యచరిత్రముల గానముచేయుచుండిరి. సిద్ధులును, విద్యాధరులును, దైత్యులును, దేవతలును, గుహ్యకులు మొదలగువారును, సునందుఁడు నందుఁడు మొదలగు తనయనుచరశ్రేష్ఠులు నతనిఁ బరివేష్టించి వచ్చుచుండిరి, మఱియుఁ గపిలుండును, నారదుండును, దత్తాత్రేయుఁడును యోగీశ్వరులగు సనకాదులు భగవంతుని పాదసేవయందు వేడుక గలభక్తులును నతని ననుసరించి వచ్చుచుండిరి. ఇట్లు నారాయణుండును దేవతలును మునులును వచ్చి యుండుటచే నాబ్రహ్మావర్తము మిక్కిలి పవిత్రమయినది. అచ్చటిభూమి నేయిమొదలగు హవిస్సుల నిచ్చుచుండెను. మఱియుఁ గోరినను గోరకున్నను నది యభీష్టవస్తువుల నెల్లను సమకూర్చుచు యజమానుఁడగు పృథురాజునకుఁ గూడ నిష్టప్రయోజనముల సఫలముగాఁ జేయుచుండెను. అచ్చటినదులు చెఱకురసము, ద్రాక్షారసము మొదలగు

రసములను, పాలును పెరుగును నన్నపానాదులను, నేతిని,దక్ర మును, గలిగి ప్రవహించుచుండెను.అచ్చటివృక్షములు శాఖోప శాఖలచే విస్తరించి మకరందములను స్రవింపఁజేయుచుఁ బుష్పఫలాదులను వహించుచుండెను. అచ్చటికి సమీపమున నున్న సముద్రములు రత్ననికరములను గలిగి వర్తించుచుండెను. పర్వతములు,భక్ష్యములు, భోజ్యములు, ఉడికినపదార్థములు,నూరిన పదార్థములు నాఁబడు నాలుగువిధము లగుపదార్థముల నిచ్చుచుండెను. అట్టిబ్రహ్మావర్తమున యాగ మొనరించినపృథురాజునకు దిక్పాలకు లందఱును గానుకలుగొనివచ్చి యర్పించిరి. ఇట్లు నారాయణుని యావేశావతార మగుపృథురాజు నభ్యుదయంబును జూచి యింద్రుండు సహింపలేక యతఁ డొనరించు యాగమునకు విఘ్నము గలిగించెను.ఆవిఘ్న మెట్టిదియో చెప్పెదను వినుము. పృథురాజు తొంబదితొమ్మిదియశ్వమేధంబులఁ

—●●◆ ఇంద్రుఁడు యాగాశ్వము నపహరించుట. ◆●●—

బూర్తిచేసి నూఱవయశ్వమేధంబుచే వేదస్వరూపుఁ డగుభగవంతు నారాధించుచుండఁగా నింద్రుండు సహింపలేక యొరులకుఁ గానరానివాఁడయి యాగాశ్వము నపహరించెను. ఇట్లపహరించి యశ్వముతోఁగూడ నాకాశమార్గమునఁ జరుగుచుజటలు మొదలగువాని ధరించి ధర్మమూర్తివలెఁ గానవచ్చుచున్నను నధర్మమార్గమునఁ బ్రవర్తించుచుఁ బాషండధర్మమును గవచము ధరించునట్లు ధరించి యున్నయింద్రుఁ డత్రిమునికంటికిఁ గానవచ్చె. అంత నత్రిముని పృథురాజుకుమారుని కీయుదంతమును దెలిపెను. అది విని మహారథుఁడగు పృథురాజుకుమారుండు కోపోద్దీపితుఁడై యాయింద్రు ననుసరించిపోవుచు “ నిలు

పుము, నిలుపుము" అని కేకవేసెను. అంతట నింద్రుఁడు నిలిచెను. ఆయింద్రుఁడు జటలను ధరించి శరీరమందంతటను భస్మమలందికొని యుంటచే మూర్తిమంతమగు ధర్మమువలెఁ గానవచ్చుచుండెను. పృథుపుత్త్రుఁ డతనిఁజూచి యతని ధర్మమూర్తిగా భావించి బాణములఁ బ్రయోగింపక మరలెను. అంత నత్త్రిముని యశ్వహర్తయగునింద్రునిఁ జంపక మరలివచ్చిన పృథుపుత్త్రునిఁ జూచి యిట్లనియె. "ఓకుమారా! వాఁడే యాగాశ్వమును హరించెను. వాఁడే దేవేంద్రుఁడు. ఆయన దేవతారాధనరూపమగు యాగమునకు విఘ్నముఁగావించినవాఁడు. కావున వీఁడు దేవతలలో నధముండని తలపోయుము. వీని నింద్రుఁడని గౌరవింపక వెంటనే పోయి జయింపుము" అని చెప్పి యింద్రునిపై మరలఁ బంపెను. అంతఁ బృథుపుత్త్రుఁ డత్త్రివాక్యంబుల విని మిగులఁ గోపము వహించి మదగజము ననుసరించిపోవుచున్న సింహమువలె నాకసమునఁ బోవుచున్నయింద్రు ననుసరించెను. ఇంద్రుఁ డది చూచి తనపాషండరూపమును నశ్వమును విడిచి యచ్చటనే యంతర్ధానము చెందెను. అంతఁ బృథుపుత్త్రుఁ డశ్వమును దీసికొని తండ్రియజ్ఞస్థానమునకుఁ బోయెను. అప్పుడు మును లందఱును నారాజకుమారునియద్భుతకార్యమున కానందించి విజయముచేసి యశ్వమును గొనివచ్చెనుగాన విజితాశ్వుఁ డనుసార్థకనామము నతని కొసంగిరి. అనంతర మింద్రుండు గాఢాంధకారమును సృజించి యందుచే నొరులకుఁ గనఁబడనివాఁడయి బంగారపుత్రాళ్లచే యూపమున బంధింపఁబడి యున్నయశ్వమును మరల నపహరించి పూర్వమువలె నాకాశమార్గమునఁ బోవుచుండెను. వాని నత్త్రిమహాముని చూచి విజితాశ్వునకు

జూపించెను. కాని విజితాశ్వుఁడు కపాలమును ఖట్వాంగమును ధరించి యున్నవానిఁ జూచి యశ్వహర్త యని తెలిసికోలేక యుండ నత్రిముని మరల వాని నియోగించెను. అప్పుడు విజితాశ్వుఁడు కోపము వహించి యింద్రునిఁ జంప బాణము సంధించెను. ఇంద్రుఁడది చూచి యశ్వమును పాషండరూపమును విడిచి యంతర్ధానము చెందెను. అంత విజితాశ్వుఁ డాహయమును గొని తండ్రియాగశాలకుఁ బోయెను. ఓవిదురా! యింద్రుండు దాల్చినపాషండరూపమును లోకమునఁ గొందఱు బుద్ధిహీనులు దాల్చుచుందురు. మఱియు నింద్రుఁడు పృథురాజునశ్వము నపహరింపఁ దాల్చినరూపము లన్నియుఁ * పాపషండములే. పాపములయొక్క షండము (సమూహము) కలవారు కావునఁ బాషండులని జగంబునఁ బ్రసిద్ధినిఁగాంచిరి. పృథురాజు యజ్ఞమునకు విఘ్నముకల్పింపనెంచి యింద్రుండు ధరించి విడిచినవియు, ధర్మము కాకపోయినను ధర్మమువలెఁ గానవచ్చుచున్నవియు, ననుకూలముగ లభించుచున్నవియు, నగు మితసంభాషణము దిగంబరత్వము కాషాయవస్త్రములు, భస్మధారణము మొదలైన పాషండాచారములందు నరులకు ధర్మము లనెడిభ్రాంతి కలిగెను. కాని యవి యెంతమాత్రము ధర్మసమ్మతములుకావు. అనంతరము మితము లేనిబలము గల పృథురాజింద్రుఁడు చేయుచున్నవిఘ్నమును దెలిసికొని క్రుద్ధుండయి విల్లునమ్ములు గొని యింద్రునిఁ జంప బాణమును సంధించెను. ఇట్లు దేవేంద్రునిఁ జంపఁ గృతనిశ్చయుండై కోపముచే

* ఇటఁ బాపషండమనఁగాఁ బాపసమూహ మని యర్థము. పాప+షండ='పాషండ' అనఁగాఁ బాపసమూహ మని యర్థము వచ్చినది.

దుర్నిరీక్ష్యుండయి పరులకు సహింపరానిబలవేగములుగలవాఁడ యి యున్న పృథువునుగాంచియత్రి మొదలగుమునులు వారించి యతని కిట్లనిరి. "ఓమహారాజా! నీవు కోపింపకుము. నీయాగము నకు విఘ్నములు కలిగించుచు నీకీర్తిచే హతప్రభుఁడయియున్న దేవేంద్రుని బలవత్తరము లగునాహ్వానమంత్రములచేత, రప్పించి మంత్రబలముచేతఁ బశుపురోడాశముల హోమముచేసినట్లు వహ్నికి వానిని హోమము చేసెదము" అని చెప్పి ఋత్విజులు హోమసాధనములగు స్రుక్కులను గైకొని కోపసంయుతులై హోమము చేయుచుండఁగా బ్రహ్మ యచ్చటికరుదెంచి యా కృత్యమును నివారించుచు నిట్లనియె. "ఓఋత్విజులారా! ఋత్విక్కర్మమును జక్కఁజేయ నధికారము గలమీకు దేవేంద్రుండు వధార్హుండుకాఁడు. ఇంతియు కాక యజ్ఞము భగవంతునిశరీరము వంటిది. అట్లె దేవతలందఱును భగవంతునికి నిరతిశయప్రీతినిఁగలిగించు శరీరమువంటివారు. అట్లుండ భగవంతునికి శరీరభూతమగు యాగముచేత నతనికి శరీరభూతుఁ డగునింద్రునిఁ జంపుట కేల తలంచుచున్నారు? ఓబ్రాహ్మణులారా! పృథురాజు చేయుచున్న ధర్మరూప మయినయీకార్యమును నశింపఁ జేయుట కింద్రుఁడు పూనికొని ధర్మవిరుద్ధము లగు పనులను గొన్నింటిని జేసియున్నాఁడు. ఆపనులు పాషండులాచరింపఁదగినవి కాని మంచివా రాచరింపఁదగినవి కావు. అట్లుండ నింద్రుండాచరించుట గొప్పయన్యాయ మని తలపోయుఁడు. ఇప్పటికిఁ బృథురాజు తొంబదితొమ్మిదియాగములు చేసి యున్నాఁడు. తొంబదితొమ్మిదిమాత్రమే చేసినప్పటికిని బృథు వింద్రునివలె గొప్పకీర్తి గలవాఁడు కాఁగలఁడు" అని పలికి బృథువునుఁ జూచి "ఓరా

## బ్రహ్మ పృథువున కుపదేశముఁ జేయుట.

జోత్తమా! నీవు పెక్కులుయాగములను జక్కఁగ నాచరించితివి. ఈయాగములే చాలును. నీవెప్పుడును ముముక్షువులు చేయవలసినధర్మములు చేయుట మంచిది కాని యిఁక నీదృశకర్మముల నాచరింపఁదగవు. మఱియు నీవు నీమనంబున దేవేంద్రునిగూర్చి కోపించుట యుక్తము కాదు. ఆయింద్రుఁడును నీవును భగవంతునికి శరీరమువంటివారలు. అట్లుండ మీ రన్యోన్యము విరోధమువహించుట యింతేనియు నర్హము కాదు. నీకు మంగళములు కలుగుఁగాక. ఓరాజా! సావధానచిత్తుండ వయి నావాక్యము వినుము. యజ్ఞమునకు విఘ్నము కలిగిన దని చింతింపకుము. లోకమున దైవహతమయిన తనకార్యమును సర్వదా తలంచుకొనెడి పురుషునిచిత్తము కోపాతిశయము గలదయి మోహమును బొందును కాని శాంతిని బొందలేదు. ఇంద్రుం డొనర్చినపాషండకృత్యములచే నీయాగమందు ధర్మసాంకర్యము కలిగినది. కావున నాక్రతువు దేవతలకుఁ బ్రియముఁ గొలుపఁజాలదు. దేవతలకుఁ బ్రియము గొలుపఁజాలనియాగముఁ జేసిన నేమిలాభము కలదు? ఈయాగమును మానుము. నీయజ్ఞమునకు విఘ్నముకల్పించిన యింద్రునిచే నశ్వహరణకాలమందుఁ గల్పితము లయినపాషండధర్మములు చిత్తమును దమవంకకు లాగికొనుచు జనులను దమయధీనులఁగాఁ జేసికొనును. ఇంద్రునిదురాగ్రహమువలన నెట్టి యనర్థము సంప్రాప్తమయినదియో చూడుము. ఓధర్మజ్ఞా! వివిధసిద్ధాంతములకనురూపముగుధర్మము మీతండ్రియగు వేనుఁడొనర్చినయన్యాయమువలన నశించినది. అట్లు నశించినధర్మమును రక్షించుటకు నీవిప్పుడా వేనునిశరీరమునుండి యుదయించితివి. నీవు దు

రాత్ముఁడగు వేనునిదేహమువలన బుట్టినను, నారాయణాంశము వలన జన్మించినకారణమునఁ దండ్రిదుష్టగుణములు నీయందు లేవు. ఇట్లు నారాయణాంశమువలన జన్మించిన నీవు, ఏయభిప్రాయంబునఁ బ్రజాపతులు జగత్తును సృజించియున్నారో, యాయభిప్రాయమును విచారించి వారిసంకల్పమును బూరింపుము. ప్రజాపాలనాధికారము వహించిననీ కిది యెంతయుఁ దగియున్నది. మఱియు లోకమున కనర్థము కలిగించుపాషండమార్గము దేవేంద్రుఁ డవలంబించినమాయయే. అది యధర్మమునకుఁ దల్లి వంటిది. కావున నీవు నాయింద్రమాయను జయింపుము. అట్లుచేయుటకు నీవు సమర్థుండ" వని యిట్లు లోకగురు వయినబ్రహ్మ చక్కఁగ నుపదేశింపఁగా సకలదిక్కులకు నధిపతి యగుపృథువతఁడు చెప్పిన చొప్పున నింద్రునితో సఖ్యముఁ గావించుకొనెను. అనంతర మవభృథస్నానముఁ గావించి విపులము లగుసత్కర్మములు గలపృథురాజునకు యజ్ఞమందుఁ దృప్తు లగుదేవతలు పెక్కువరంబుల నొసంగిరి. అనంతరము సఫలము లగునాశీర్వాదములు గలబ్రాహ్మణులందఱును బృథురాజు శ్రద్ధతో నొసంగెడి దక్షిణలను స్వీకరించి సంతుష్టు లయి, మగుడ సత్కరింపఁబడి యారాజున కాశీర్వచనములఁ గావించిరి. ఓవిదురా! యాగమును జూడ నేతెంచినపితృదేవతలను, దేవతలను, మానవులను జక్కఁగ నతఁడు దానముచేతను, మానముచేతను బూజింపఁగా వారు సంతసించి తమతమనెలవులకేఁగిరి. ఇది పదునెనిమిదవ యధ్యాయము.

అనంతరము జ్ఞానాదిషడ్గుణములు గలవాఁడును, యోగరక్షకుఁడును, సకలయోగములందు నారాధ్యుఁడును నగు పరమపురుషుండు, పృథురాజు యజ్ఞములచేఁ దన్నుఁ దనివిఁబొందింప నానందభరితుం డయి,యింద్రసహితుండై వచ్చిపృథువుతో నిట్లనియె. 'ఓరాజేంద్రా! నీవు నూఱశ్వమేధములు చేయవలెనని సంకల్పించికొని యుండఁగా నీయింద్రుఁడు దానికి భంగముగలిగించినాఁడు. కావున నపరాధి యైనయింద్రుని క్షమింపవలెను. దుస్సహ మగునపరాధము నెట్లు క్షమింతునని ప్రశ్నింపరాదు. ఓ రాజా! లోకములో మానవశ్రేష్ఠములును దేహాత్మలతత్త్వమును జక్కఁగఁ దెలిసినవారును నగు పరోపకారులు దేహమాత్మకంటె భిన్నమయిన దని గ్రహించినవా రగుటచే, దేహాత్మాభిమానముచేత, నపరాధము చేసినను భూతములకు ద్రోహము చేయరు. కావున నీ వాయపరాధమును సహింపవలెను. సన్మతులయిననీవంటిపురుషులు గూడ దేవమాయచే మోహము చెంది దేహాత్మాభిమానముచే భూతములకు ద్రోహము చేయుచున్నచోఁ జిరకాలమునుండి మహాత్ములను సేవించుటవలననీకుఁ బ్రయాసము తప్ప వేఱుఫలము గానరాదు. సన్మతు లగుపురుషులు దేహాత్మాభిమానమును బురస్కరించుకొని భూతములకు ద్రోహము చేయరు. కావుననే దేహాత్మాభిమానముచేతను, స్వతంత్రాభిమానముచేతను. నవిద్యవలనఁ గలిగెడి శబ్దాదివిషయక మగు నిచ్ఛచేతను, గామమువలనఁ గలుగు పుణ్యాపాపరూప కర్మములచేతను, దేహ ముద్భవించుచున్న దని యెఱింగినవారై, ప్రకృతిపురుషేశ్వరుల తత్త్వములను దెలిసికొని, దేహమం దనురాగము గలిగియుండరు. మఱియు నిట్లు శరీరసంబంధము గలి

గించుకొనక శరీరముచే సంపాదితము లయినగృహములందును, దారపుత్రాదులందును,ధనమందును, నేపండితుఁ డయినను మమకారమును జేయునా? ఎవ్వఁడును జేయఁడు? కావునఁ బండితుఁడు దేహాదులనిమిత్తమును దేహానుబంధులనిమిత్తమును, భూతద్రోహమును జేయరాదు. ఇంతియకాక మిక్కిలి భేదముగలిగి యున్న దేహాత్మ లొక్కటి యని తలంపరాదు. ఓరాజా! దేహా

—విష్ణువు పృథువునకు దేహాత్మలకుఁ గల్గుభేదము నిరూపించుట—

త్మస్వరూపములను జక్కఁగ వివరించిచెప్పెద నాలింపుము.ఆత్మ దేవమనుష్యాదిశరీరములం దున్నను,జ్ఞానైకాకారత్వముచే నంతట నేకరూపమై యుండును.దేహము దేవమనుష్యాదిభేదములచే నానావిధము లయియుండును. ఆత్మ నిర్మలమైనది. దేహము మలినమైనది. ఆత్మ స్వయంప్రకాశమైనది. దేహమట్టిది కాదు. ఆత్మ రాగద్వేషాదులు లేనిది. దేహము దోషాదియుక్తమైనది. ఆత్మ జ్ఞానానందాదిగుణముల కునికిపట్టై యుండును. దేహమున కట్టిగుణములు లేవు.ఆత్మ యణుస్వరూపమైనను ధర్మభూతజ్ఞానముచే సర్వమును వ్యాపించియుండును. దేహము సర్వవ్యాప్తము కాదు. ఆత్మ గృహాదులచే నావృతమైయుండదు. దేహము ట్లావృతమై యుండును.ఆత్మ దేహేంద్రియాదులకు సాక్షియై యుండును. దేహమున కట్టిసామర్థ్యము లేదు. ఆత్మ దేహాదులందుఁ బ్రవేశించి ధారకమైయుండును. దేహము ధార్యము.కావున నాత్మ దేహమునకంటె విలక్షణమైన దని తెలియుము.అందుచేత నే దేహమునకుసంప్రాప్తములగు బాల్యయౌవనాదిదశలు దేహాదులకు ద్రష్టయగునాత్మకుఁ గలుగనేరవు. మఱియు దేహా

గతములగు బ్రాహ్మణత్వము మొదలగుజాతు లాత్మకుఁ జెందక పోవుటచేతనే యాత్మ శరీరమునకంటె వేఱయినదని చెప్పవచ్చును. దేహవిలక్షణ మగునాత్మ యెప్పుడైనఁ దెలియవచ్చునా? అని శంకింపరాదు. సుషుప్తియందు దేహగతము లగు బ్రాహ్మణత్వాది ధర్మములు తెలియఁబడక దేహవిలక్షణ మగు నాత్మపదార్థ మనుభూతి మగుచుండును. *ఓరాజా! ప్రకృతిపురుషస్వరూపములను

* పై రెండుశ్లోకములకును ప్రకృతిపురుషవిలక్షణ మైనపరమాత్మపరముగాను నర్థమును చెప్పవచ్చును.

ఓరాజా! పరమాత్మస్వరూపమును వివరించెద. నాలింపుము. పరమాత్మకు సమమయినవస్తువు గాని యుతనికంటె నధికమగువస్తువు గాని లేదు. అతఁడు పాపాదులు లేనివాఁడు. అతఁడు నిరుపాధికుఁడై స్వయముగాఁ బ్రకాశించుచుండును. అతఁడు ప్రకృతిపురుషసంబంధము గలవాఁడైనను దద్గతములయిన అజ్ఞత్వ దుఃఖిత్వాదిదోషములు లేనివాఁడు. అతఁ డనంతకల్యాణగుణములకు నిలయుండు. అతఁడు స్వరూపముచేతను స్వభావముచేతను సర్వవ్యాపియై యుండును. అతఁడు దేహాదులం దున్నవాఁడైనను వానికి లోఁబడియుండువాఁడు కాఁడు. అతఁడు సమస్తము సాక్షాత్కారముగాఁ బ్రత్యక్షము చేసికొనఁగలఁడు. అతఁడు జీవాత్మకంటెను బరుఁడు. అతఁడు సర్వమందును బ్రవేశించియుండి శాసించుచు ధారకుఁడై యుండును. జీవుఁ డిందులకు విపరీతముగా నుండును. అతఁడు నానాకారములు కలిగియుండును. జీవుఁడు స్వయంప్రకాశకుఁ డయినను ప్రకృతివికారములగు దేహాదుల సంబంధముచే మలినుఁడగును. అతఁడు వాస్తవముగా సత్యసంకల్పాదిగుణములు గలవాఁడయినను, నవిద్యామోహితుఁడు. కావున స్వరూపమును మఱచి కల్యాణగుణముల కాకరుండు కాకపోవుటయే కాక యజ్ఞత్వాదిగుణములనుగూడఁ జెందియుండును జీవుఁ డణుస్వరూపుండు కావున సర్వగామియై యుండఁజాలఁడు. అందువలననే జీవుఁడు, దేహాదులచేఁ బరిచ్ఛిన్నుఁడైయుండు. అతఁడు స్వకృతకర్మ ఫల

నీకువివరించితిని. కావున నోమహారాజా! నీవును దేహసంబంధమువ

---

ము ననుభవించువాఁడుగాని సాక్షియై యుండఁడు. అతఁడు పరమాత్మకు వ్యాప్యుఁడైయుండును. అట్లు పరమాత్మ ప్రకృతిపురుషులకంటె విలక్షణుఁడైయుండును; గావుననే ప్రకృతిజీవులు పొందుచున్న వికారిత్వము మొదలగుధర్మములును, కేవలము ప్రకృతిపురుషులందు మాత్రమే యున్న జడత్వాణుత్వాదులును, నా ప్రకృతిపురుషులకు సాక్షియైతదంతరాత్మయై యున్న పరమాత్మకుఁ జెందవు పరమాత్మ ప్రకృతిజీవులకు విలక్షణుఁడయినవాఁడు. ఇట్లు ప్రకృతిపురుషేశ్వరులకు వైధర్మ్యమున్నదని చెప్పుటకు సుషుప్తియే యుదాహరణము. ఓరాజా! ఇట్లు జీవుఁడు పరమాత్మకంటె విలక్షణుండనియు, నతనికి ధార్యుఁడనియు, నేమహనీయుఁడు తెలిసికొనునో, వాఁడుపాసనదశయందుఁ బ్రకృతియుక్తుఁడైనను నుపాసనానంతరమునఁ బ్రకృతిగుణములనుండి విముక్తుఁడగును, ఓరాజా! పురుషుఁ డిట్లు స్వవర్ణాశ్రమముల కుచితములగు నిత్యనైమిత్తిక ధర్మములను నిర్వర్తించుచు, నా ధర్మాచరణములవలనఁ గలుగుఫలము నపేక్షింపక ఇంద్రాదిసకలదేవతాస్వరూపుఁడనై సకలకర్మఫలములను నొసంగుచు నిత్యుఁడనై యున్న నన్ను శ్రద్ధతో భజింపవలయును. అట్లు భజించినమనస్సు క్రమముగా రాగాదులనుండి తొలంగి నిర్మలమైనదగును. ఇట్లు పురుషుఁడు రాగద్వేషాదిగుణములను విడిచి, కావుననే నిర్మలమగునంతఃకరణము కలవాఁడై, యందువలన నాత్మస్వరూపమును, జక్కఁగా నెఱిఁగి, క్షుత్పిపాసాదులగు షడూర్ములను విడిచి, నాకు శరీరభూతమగు నపహతపాప్మత్వాదులగు గుణాష్టకమును బొందుచున్నాఁడు. ఇంతియకాక పృథివ్యాదిభూతములకును, శ్రోత్రాదిజ్ఞానేంద్రియములకును, వాగాది కర్మేంద్రియములకును మనస్సునకును, నధిపతియును, స్వరూపముచేత నే నిర్వికారుఁడును, నగు పరమాత్మ యుదాసీనుఁడై యున్నట్లు తెలిసినమహాత్ముఁడు జీవద్దశయందుఁ గూడ సుఖము నే పొందును. ఓరాజా! పృథివ్యాదిభూతములు జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు చిత్తము, స్వరూపముగాఁ గలిగి ద్రవ్యాత్మకమై కావుననే దేవమనుష్యాదిభేదములచే నానావిధమయిన లింగశరీరమునకు మార్పు గలుగుచుండును

లన సంభవించుసుఖమునందును,దుఃఖమునందునుసముఁడవైయుండి యింద్రియములను నంతఃకరణమును వశముఁగావించుకొని

---

గాని ఆత్మకుఁ గలుగవు. కావున తత్వత్రయము నెఱిఁగినపండితులామార్పులకుజంకి లింగదేహపరియుక్తులై వచ్చుసంపదలందుసంతోషమును విపత్తులందు దుఃఖమును పొందక ప్రవర్తించుచుందురు. ఓయీ! లింగశరీరమునకు మార్పుగల్గుచున్నట్లు పృథివ్యాదిధర్మములకు ధ్యతుఁడై యుండుటవలనఁగల్గుమార్పు ఆత్మయందు లేదా?అనినఁ జెప్పెదను. వినుము. అవును.ఆత్మకుద్రవ్యాద్యధ్యక్షత్వరూపవికార మున్నను నది జ్ఞానవికారరూపమైనది. ఆవికారమైనను ధర్మరూపజ్ఞానమందున్నది.కాని స్వరూపమందున్నది కాదు.కావున నాత్మ కూటస్థుఁడనియు మార్పులేనివాఁడనియుఁ జెప్పవచ్చును. దేహాదిరూపపరిణామము ద్రవ్యసమూహముదే కాని యాత్మది కాదు. ఓయీ! ధర్మభూతజ్ఞానమునకు మార్పున్నదని యంగీకరించుచున్నావు. ధర్మభూతజ్ఞానమునకు మార్పున్నచో ధర్మిభూతజ్ఞానమునకుఁ గూడ మార్పేల కలుగదు? దానిఁగూడ నంగీకరించినపరమాత్మకు కూటస్థత్వము సిద్ధించుటెట్లు? అనినచో సమాధానమును వినుము. కూటస్థత్వమనఁగా వికారములు లేకుండ నుండుటయే యని యర్థము. ఇంతియ కాక కూటస్థత్వమనఁగా నిత్యత్వమనియు నర్థముచెప్పవచ్చును. ఆలోచింప ధర్మిభూతజ్ఞానము నిత్యమే. అయినను దానికిఁ గర్మవిశేషముచే నొకప్పుడు సంకోచమును ఒకప్పుడు వికాసమును గలుగుచుండునని యంగీకరింపవలసి యున్నది. మఱియు నాధర్మభూతజ్ఞానమునకుఁ ప్రసరము కలదు. ఆజ్ఞానమున కట్టి ప్రసరము లేకపోవుటయే సంకోచమనఁబడును. దానికట్టిప్రసరము కలిగియుండుటయే వికాసమనఁబడును. జ్ఞానప్రసరమే కర్మవిశేషముచే సంకోచవికాసములను బొందుచుండుటచే ధర్మిభూతజ్ఞానము గూడ ధర్మిభూతజ్ఞానమువలెనే నిర్వికారమనియు నిత్యమనియుఁ జెప్ప వలనుపడుటచే ధర్మభూతజ్ఞానమును బట్టియుఁ బరమాత్మ నిర్వికారుఁడును నిత్యుఁడును నగుచున్నాఁడు. కావునఁ బరమాత్మకుఁ గూటస్థత్వములో ననుపపత్తి యేమియును లేదు.

యుత్తమాధమమధ్యము లయిన దేవతిర్యఙ్మనుష్యాదులందు దేహాతిరిక్తమగు సామ్యము ననుసంధానము సేయుచు, నీవు సంపాదించి యున్నయమాత్యాదులతోఁ గూడి సమస్తలోకమును సమముగా రక్షింపుచుండుమా. ఓయీ! నాకు మోక్షముఁ గలిగింపక యఖిలలోకరక్షణమును జేయు మని యేల చెప్పెదవని శంకింపకుము. ఓయవనీశా! రాజు ప్రజాపాలనమును ధర్మయుక్తముగాఁ జేయవలయును. అట్లు చేసినరాజు దేహమును విసర్జించిన పిమ్మట ప్రజలపుణ్యములో నాఱవపాలు పొందును. రాజు ధర్మయుక్తముగాఁ బ్రజలఁ బాలింపనిచోఁ బ్రజలవలన పన్ను పుచ్చుకొన్నవాఁడు కావున నే తనపుణ్యమును బ్రజల కర్పించి వారలపాపమును దా ననుభవించును. ప్రజలఁ బాలించుటవలన నిట్టిలాభమును, నట్లు చేయకుండుటవలన నట్టినష్టమును గలదు. కావున రాజునకుఁ బ్రజాపాలనమే శ్రేయస్సాధన మగుచున్నది. అట్లుండ నీవు ప్రజాపాలన మేల చేయరాదు? నీ విట్లు ధర్మయుక్తముగాఁ బ్రజలఁ బాలించినచో నీకు ముక్తికూడఁ దప్పక లభించును. ఓరాజా! బ్రాహ్మణపర్యులకు ననుమతముగా వర్ణాశ్రమోచితధర్మముల నాచరించుచు, దత్ఫలమును నపేక్షింపక, ప్రజలలో దాను నొకఁడనియుఁ దనయందు స్వాతంత్ర్యము నారోపించుకొనక, ప్రజలను రక్షించుచున్నచో బ్రజానురాగము గల నీవు దగినసమయములయందు నీగృహంబులకు విచ్చేయు సనకాదిసిద్ధులను సందర్శించి వారల యుపదేశంబున మోక్షమును బొందుదువు. ఓమానవేంద్రా! నీ శమదమాదిగుణముల చేతను, సుస్వభావముచేతను, వశీకృతుఁడ నైతిని. సుస్వభావాదులచే వశుఁడ నైనట్లు సమచిత్తము గలనేను కృభశ్చాంద్రా

యజ్ఞాదితపంబులచేతను, యోగములచేతను, వశుండను గాను. నీ కేదైనను వరంబు నొసంగెదను. కోరుకొనుము. ఓవిదురా! లోకప్రభు వయిన విష్ణువుచేఁ బృథురాజీప్రకారము శాసింపఁబడి యతని యాజ్ఞను మిక్కిలి యాదరించెను. మఱియు దన యపరాధమును క్షమింపు మని యతని పాదములఁ బడి తన యపరాధమునకు సిగ్గుపడుచున్న దేవేంద్రునిఁ బ్రేమతో నాలింగనము చేసికొని యతనియెడఁ గ్రోధమును విడిచెను. అనంతరము సర్వరూపుఁడైన విష్ణువును, బృథురాజు సమర్పించిన పూజాసత్కారమును గైకొని తనలోకమునకుఁ బోవ నభిముఖుఁడై యుండియు, నిరతిశయభక్తిచేఁ దనపాదములను బట్టుకొని వదలక యున్న పృథువునందలియనుగ్రహముచే నాలస్యము చేయుచుఁ బద్మపత్రములవలె విశాలములయిన నేత్రములతోఁ జూచుచు వెడల లేక పోయెను. ఆపృథురాజునుఁ బ్రాంజలి యై యానందబాష్పములచేఁ గన్నులు నిండుటచే హరినిఁజూడ సమర్థుఁడు కాక గద్గదకంఠముగలిగి యేమియును సంభాషింపనేరక మనస్సుచే హరిని గౌఁగిలించుకొనియుండెను. అనంతరము పృథువు, కన్నీటిని దుడుచుకొని, తనకంటికి గోచరుఁడై * కాలిచే భూమిని స్పృశించుచు గరుత్మంతునిబుజముపై హస్తాగ్రము నుంచియున్న హరిని గాంచి యిట్లనియె. ఓవరదా! నీవు బ్రహ్మాదులకుఁగూడ నధిపతివై వరముల నిచ్చువాఁడవు. అర్థకామాదు

---

* దేవతలు భూమిని స్పృశింపరు. ఐనను విష్ణువు తనపాదముచే భూమిని ముట్టుచున్నట్టు చెప్పఁబడినది. అట్లు చెప్పుటచే విష్ణువు పృథువునందలి కృపాతిశయమువలనఁ దనయొడలు మఱచి చేయఁదగినపని యేదియో తగనిపనియేదియో తెలియఁజాలక పోయె నని తెలియఁదగినది.



పృథువు నారాయణుని నుతించుట

లన్నియు నీశ్వర ఫలంబులు. అట్లు తెలిసికొనియుండియుఁ గొందఱు
సత్త్వాదిగుణానుసారముగా వికారము నొందుచున్న సంసారు
లనుభవింప వలసినవరములను గోరుచుందురు. కాని నేను ముక్తి
నైన నిచ్చు నీవంటిమహాత్మునిదయ వడసి యట్టిక్షుద్రవరములను
గోరను. అట్లయిన మోక్షమును గోరుకొందువా యని యందు
వేని, నేను దానిని గోరను. ఆమోక్షమందు మహాత్ముల హృద
యాంబుజములనుండి ముఖద్వారమునఁ బ్రవహించునీపాదపద్మ
మకరందమును, నీసత్కీర్తిగుణములను వినుటయు నెట్లు సంభ
వించును? అవి లేనిమోక్షముతో నాకుఁ బ్రయోజన మేమి?
కావున మోక్షమును గోరను. నీయనంతగుణములను వినుటకుఁ
బెక్కుచెవుల నొసంగుము. ఇదియే నాకభీష్ట మగువరము. దాని
నొసంగుము. అట్టివరముఁగోరిటి వేమని యడుగు దేని చెప్పెద.
విను. ఓసత్కీర్తిరాశీ! నీభక్తులముఖపద్మమునుండి స్రవించు
చున్న నీపాదపద్మామృతలేశమును గొనివచ్చువాయువును గొం
చెము, శ్వాసించినను, సత్తత్త్వమార్గములను మఱచినసామాన్య
యోగుల మగుమావంటివారికి మరల నీభక్తిని గలుగఁజేయు
చున్నది. అట్లు నీభక్తిని వర్ధించు నీకీర్తిశ్రవణమే నాకు వలయు
నుగాని మోక్ష మక్కఱలేదు. కావున నీగుణశ్రవణమునకుఁ
జాలినన్నికర్ణములనే నాకొసంగుము. మహాత్ములసహవాసము
చేసి వారివలన నీగుణకీర్తులను విని సంతసించెదను. ఇంతియకాక
నీగుణములను వివరించి చెప్పుమహాత్ములసహవాసము లభించినప్పు
డు వారు నుతించుచున్న నీగుణములను లక్ష్మీదేవిసైత మత్యాదర
ముతో వినుచుండఁ గర్మజడుఁడయినపశువుతప్ప గుణగ్రాహియగు

పురుషుం డెవండు వినవిష్టపడఁడు? కావునబద్ధులకంటెను,ముక్తుల కంటెను, నిత్యులకంటెను నుత్తముఁడవయి, సర్వజ్ఞత్వాదులగు ననంతకల్యాణగుణములు గలవాఁడవై యున్న నిన్ను లక్ష్మీదేవి వలెనె నేనును నత్యాసక్తితో సేవించెదను. ఏకవస్తువును భజించునప్పుడు నాకును లక్ష్మికిని గలహము సంప్రాప్తమగునేమో యని భావింపకుము. దేవా! నీవు పరిచ్ఛిన్నుఁడవు కావు. నేనును లక్ష్మియుఁ దదేకనిష్ఠతో నీచరణాబ్జములనుస్మరించుచున్న వారము. కావున మాకట్టికలహము కలుగనేరదు. ఓజగదీశా! ఆలోచింప జగజ్జనని యగులక్ష్మితో నాకు విరోధము కలిగినఁ గలుగవచ్చును. ఆలక్ష్మి చేయుచున్న కార్యములనే నేనునుఁ జేయఁగోరినప్పుడు కలహ మేల సంప్రాప్తముకాదు? అగుఁగాక. అందులకు నే భయపడను. నీవు దీనవత్సలుఁడవు కావున నిమ్నునితో విరోధించినప్పుడు నాయందు బక్షపాతముంచినట్లు లక్ష్మితో విరోధించినప్పుడును నాయందుఁ బక్షపాతమును వహింపకమానవు. భక్తుల నాదరించినట్లు లక్ష్మినాదరింపవని నేనెఱుంగుదును. ఓలోకనాథా! యజ్ఞాదికర్మములందుఁ బ్రకృతివలన మాకు సంప్రాప్త మగు ఫలమంతయు ననర్థదాయక మైనదియె. ఇట్లనర్థదాయక మగు ప్రాకృతఫలమును సాధించుటచే నీచములైనను యజ్ఞాదులు భవదర్పితము లైనప్పుడు నీవు భక్తిని గలిగించి, తన్మూలమున ననంతమును, శాశ్వతమును, నగు ముక్తి నొసంగుచున్నావు. ప్రకృతిసంబంధముచే మేము చేయున దెఱుంగక, యారాధన రూపము లయినయాగాదికర్మములను బశుపుత్రాదు లైనయైహికాముష్మికసుఖముల నపేక్షించి చేయుచుండ మాకట్టి నీచఫలాశనువదలించి శాశ్వతస్థిరఫలమును గలిగించుట దీనవత్సలుఁడవగు

నీకెంతయు సముచితముగానున్నది. ఓ దేవా! యాగాదికర్మములు
తుచ్ఛములైనవి. కావుననే నిష్కాములయినపురుషులు మాయా
గుణము లగుసత్త్వాదులచేఁ గలుగు దేహాత్మభ్రమను నాత్మ,
స్వాతంత్ర్యమైన దను భ్రమను నిరసించియున్న నిన్నుఁ దత్త్వజ్ఞా
నము కలిగినతరువాతనుగూడ సేవించుచుందురు. ఇంతే కాదు.
నిరతిశయానందరూప మగునాత్మానుభవము తమకుఁ గలిగినను
నీపాదపద్మస్మరణము తప్ప వేఱుఫలము నపేక్షింపనిసాధువులు
నిన్ను భజింపక మానరు. ఇట్లుండ నీవు నిన్ను భజించెడినన్ను నుద్దే
శించి, "ఇష్టవరము నిచ్చెదను గోరుము" అని పలికితివి. ఆవా
క్యము జగమునకు వ్యామోహమును గలిగించుచు విషసంయు
క్తమగు క్షీరమువలెనే యనర్థదాయకమని తలంచెదను. భక్తా
నుగ్రహశీలుండ వగునీకిది యింతేనియు నుచితము కాదు. పాశ
తుల్యమగు నీవాక్యముచే, జనుఁడు బంధింపఁబడక యున్నచో ఫల
మోహితుఁడై ప్రవృత్తికర్మముల నాచరించునా? ఆచరింపఁడు.
ఓయీశ్వరా! నీమాయచే స్వాత్మపరమాత్మజ్ఞానము లేక యున్న
జనుఁడు దైవసంకల్పమువలన నిన్ను భజించుచు సత్యస్వరూపుఁ
డవయిననీవలన నర్థకామాదు లయిన సామాన్యఫలముల నేపొం
దినచో వాఁడు నీపాదమూలమునకు దూరీకృతుఁడగుచున్నాఁడు.
కావున నీయంత నీవే కుమారునికి హితముచేయు తండ్రివలెనే
మాకుహితముచేయ నర్హుండవు" అనిపలికినపృథురాజువాక్యము
లు విని సంతసించి నారాయణుండిట్లనియె. 'ఓమహారాజా! నీవు చ
క్కఁగాఁ జెప్పితివి. నీవైహికఫలముల నపేక్షింపలేదు. కావుననా
యందు భక్తికలిగి నీవు స్వర్గమును మోక్షమునుగూడ హేయ
ములుగాఁ జూడఁగలవు. ఓరాజా! నీనడవడికి నేను మిగుల సంతసిం

చితిని. నీవు నామాటయందు శ్రద్ధ యుంచి విడువఁదరముకాని దయినను రోషమును విడిచితివి;మఱియు నావాక్యమును మన్నించితివి. నావాక్యమును మన్నించుటే నాకుత్కృష్టమగునారాధనము ఓమహీశా!నాయందు నీకు భక్తివర్ధిల్లుఁగాక. దైవవశముచే విడువఁదరముగానిమాయను సులభముగా విడిపింపఁజేయు నీదృశమగుభక్తిని గలిగియుంట కానందమొదవెడును" అని పలికి యతఁడుపలికినవచనమును నుతించి యతనిచేఁ బూజితుఁడై యతనినను గ్రహించినారాయణుండు తనలోకమునకేఁగనిశ్చయించెను. అప్పుడు దేవర్షులును,పితృదేవతలును,గంధర్వులును,చారణులును, పన్నగులును,గిన్నరులును,నచ్చరలును,నమరులును, దక్కినభూతములును,భగవదాత్మకబుద్ధి గలపృథురాజుచే యథార్థముగా బూజితులై మార్గభూమినుండి కదలి భగవంతు ననుసరించిపోయిరి. అంతి నారాయణుఁడు గురువులతోఁ గూడి చూచుచున్న పృథురాజుమనస్సు హరించుచున్న వాఁడుంబోలెఁ దనలోకమునకరిగెను. అంతట పృథురాజు తనకు దర్శనమిచ్చి యంతర్ధానముచెందనవాఁడును బ్రహ్మాదిదేవతలకు దేవుఁడు నగువాసుదేవునకు నమస్కరించి తనపురమునకరిగెను. పందొమ్మిదవయధ్యాయము.

---

## పురవర్ణనము.

ఓవిదురా! పృథురాజు తనపురమును బ్రవేశించె. ఆపురము ముత్తెములసరులచేతను, బూలదండలచేతను,వస్త్రములచేతను, బంగారపుబహిర్ద్వారములచేతను, నిక్కలి వాసనగొలుపు ధూపములచేతను వెలయుచు నానందము గొలుపుచుండెను. అందలి రథ్యావీథులన్నియును, జందనము, అగరు మొదలగు పరిమళ

ద్రవ్యములచే సిక్తము లయి యవాంకురములచేతను, దీపము లచేతనుఁ బుష్పములచేతను, ఫలములచేతను, నక్షతలచేతను, పేలాలచేతను, విలసిల్లుచుండెను. మఱియు రంభాస్తంభముల చేతనుఁ, జిన్నపోకవృక్షములచేతను నలంకరింపఁబడినవి. పలు రకములగు చిగుళ్లచే నవి యెంతయు నందము గలిగియున్నవి. అంతటఁ నాపురప్రజలు తమరాజు వచ్చుటకు సంతసించి పలు విధము లగుపూజాద్రవ్యములను, ననేకములగు మంగళద్రవ్య ములను నవలంబించి రాజున కభిముఖులై నడచిరి. అప్పుడు నానాలంకారములచే భూషితలై ప్రకాశితలయి యున్న స్త్రీలు ను రాజాభిముఖులై నడువఁజొచ్చిరి. అంతఁ బృథువు శంఖనినా దములును, దుందుభిస్వనములును, అంతటను వ్యాపింప,ఋత్వి జుల వేదఘోష ప్రబలుచుండఁగా గర్వరహితుఁడై యందఱిచేఁ నుతింపఁబడుచు, దనమందిరమును బ్రవేశించెను. రథ్యాదులం దచ్చటచ్చటఁ బౌరులచేఁ బూజితుఁ డయినపృథురాజు వారల పూజలకు సంతసించి యాపురవాసులకును, జానపదులకును, దేశవాసులకును, నిష్టవరముల నొసంగి. యథార్థముగాఁ బూ జించెను. ఓవిదురా! ఉదారగుణుఁడును మిగులఁ బూజ నీయు డును, నగుపృథురాజు నిర్దుష్ట మగువ్యాపారముకలవాఁడయి, యీదృశము లగునద్భుతకర్మముల నొనరించుచు, భూమండ లమును బరిపాలించెను. అనంతర మతఁడు విపులమగు తనకీర్తి నీలోకమున నిలిపి పరమపదమును బొందెను.” అని మైత్రే యుండు విదురునకుఁ జెప్పెననియు నట్లే శుకుండు రాజున కెఱిం గించెననియు సూతుండు మునులకుఁజెప్పి వెండియు ని ట్లనియె. ఓశౌనకమునీంద్రా! సకలసద్గుణములచే నుద్భూతమై గుణవం

తులచేఁ బూజిత మయినపృథురాజు కీర్తిని విని విదురుండు కథకుఁ డయినమైత్రేయునిఁ బూజించుచు బాగుబాగని నుతింపుచు, నిట్లనియెను. ఓమునీంద్రా! పృథురా జిట్లు బ్రాహ్మణులచే నభిషిక్తుఁడయి దేవేంద్రాదులనుండియుఁ బూజలనుఁ బొంది, విష్ణుసంబంధి యగుపీర్యమును దనబాహువులందుఁ సించి వైష్ణవ బలపూరితము లగుబాహువులచే భూమిని దోహదము చేసి, యింక నేమేమి చేసెను? ఎవఁడుపృథ్వీదోహనాదులగునద్భుతకార్యములొనరించెనో యాపృథురాజుకీర్తిని బుద్ధిమంతుఁ డయినచో నెవఁడాలకింపఁడు? ఏమహానీయుఁడు భూమిపలనఁ బిలికి విడిచినవస్తుసమూహమువలనసమస్తభూపతులు లోకపాలురితో నిదివఱకును బ్రదుకుచున్నారో యుత్తమోత్తమమగునాపృథువుచరితమునువివరించి నాకుఁ దెలియఁజేయుము' అనియడిగినవిదురుంజూచిమైత్రేయుం డిట్లనియె.‘ఓవిదురా! గంగాయమునానదులకు మధ్యముననున్న బ్రహ్మావర్త మనుపుణ్యక్షేత్రమున నివసించుచుఁ, * బూర్వకర్మాయత్తము లగుభోగములను మాత్రమే యనుభవించెను. మఱియు నతఁడు తనశాసనమును సప్తద్వీపములయందును జెల్లునట్లు చేయుచుఁ, దనతో సముఁడగువానిని నుఱొక్కనిఁ గానక

* ఇందులకు మూలము “ఆరబ్ధాన్” అని యున్నది. “ఇట ఆరబ్ధాన్” అనుపదమునకుఁ బ్రాచీనకర్మాయత్తములగుభోగములననుభవించుచుండెననియే చెప్పవలెనుగాని యపూర్వములను సాధించెడిసాధనములను జేయుట చేనారబ్ధములగువానిని గాదని యెఱుంగునది. ముముక్షువునకుఁ బాపమువలెను బుణ్యమును ఫలమును గల్గించి మోక్షమునకు భంగము గలిగించును గానఁ దాదృశపుణ్యమును విడువవలెఁచిన బుద్ధిమంతునకు భోగసాధనకర్మముల నాచరించుట యసంభవము. కాన పృథు వట్లే చేసెనని భావము.

బ్రాహ్మణులను, భగవద్భక్తులను గాక తక్కినవారి నిదగునట్లు దండించుచుఁ బాలించుచుండెను. అతఁ డొకప్పుడు మహాసత్రమును జేయ సంకల్పించుకొని దీక్షితుఁడై యుండెను. ఆమహాసత్రమున దేవతలయు, బ్రహ్మర్షులయు, దేవర్షులయు. మహాసభ యొకటి ప్రవర్తిల్లెను.

పృథువు సభాసదులను బూజించుట.

అప్పుడు పృథు వాసభకు వచ్చినమహాత్ముల నందఱను యథార్హముగాఁ బూజించి సభామధ్యమునం జుక్కలలోఁ జంద్రునివలెఁ బ్రకాశించుచు, లేచి నిలువంబడియె. అతఁ డున్నతుఁడై బలిసినదీర్ఘబాహువులు గలవాఁడయి యుండెను. అతఁడు పద్మపత్రములవలె నరుణములయిన నేత్రములు గలవాఁడు. అతఁడు సుందరమగు నాసయు ముఖమును గలిగి ప్రసన్నుఁడై పరఁగుచుండెను. అతనిస్కంధములు మిక్కిలి బలిసియుండెను. అతఁడు శోభనదంతములును మందహాసమును గలవాఁడు. అతనికి విస్తీర్ణమయిన వక్షస్థలమును బీవరము లయిననితంబములును గలవు. అతనికి మూఁడయినవళులచే సుందరమై, రావియాకువలె మీఁద విస్తృతమై, క్రింద సంకుచితమైయున్న యుదరము గలదు. అతఁడు మిగుల నింద్రియశక్తి గలిగియుండెను. అతని యూరువులు కాంచనమువలె నుజ్జ్వలము లయి, పాదము లున్నతములయి యుండెను. అతని కేశములు సన్నములై, వంకర గలిగి మృదువులై, నల్లనివయి యుండెను అతనికంఠము రేఖాత్రయయుతమయి శంఖమును బోలుచుండెను. అతనిశరీరము శ్లిష్టములై యమూల్యములయి యున్న దుకూలములచేఁ బ్రావృతమయి యుండె. అతనిసమస్తావయవములును సత్రదీక్షచే నాభరణరహితము లగుటచే స్వాభావికశోభను వెలువఱుచుచుండెను. అతఁడు కాంతిమంతుం

డయి, పవిత్రపాణియయి, యుచితకర్మముల నెఱవేర్చియుండెను. అతఁడు సంతాపహారములును స్నిగ్ధములును, నగునేత్రములు గలవాఁడు. ఈదృశుఁ డగుపృథురాజు సభ్యులను సంతసింపఁ జేయుచున్నవానివలె, శ్రావ్యమై, చిత్రపదములు గలిగి మృదులమై, యపశబ్దములు లేక, యర్థగంభీరమయి, యవ్యాకులమయినవాక్యములను బలికెను. "ఓసభ్యులారా! యీసత్త్రమునకు విచ్చేసినమీ కందఱకును భద్రమే కదా? ధర్మములఁ దెలియఁ దలంపుకలవారు తెలియఁదగిన తమయభిలాషమును సత్పురుషుల చెంత విన్నవించుకొనవలెను. నేను బ్రహ్మచేఁ బ్రజలను శాసింప నియుక్తుఁడనైతిని. ఇంతియ కాక ప్రజలను స్వీయము లగువర్ణాశ్రమధర్మములందు నిలుచునట్లు చేయుటకును జీవనము నిచ్చుటకును రక్షించుటకును గూడ నియుక్తుఁడనైతిని. ప్రజారక్షణాదికమును జేయువారలకు కోరికలు లోకములు వచ్చునని బ్రహ్మవాదులు పలుకుచున్నారు. యాలోకములు ధర్మయుక్తముగాఁ బ్రజారక్షణాదికమును జేసిననాకు లభించుఁగాక. మఱియు ప్రజారక్షణాదికమును నేను జేయుచున్నప్పుడు చూచుచుసాక్షియైనయీశ్వరుఁడు సంతసించును. అతఁడు సంతసించిన నాకు ముక్తిత్వకను లభమైయుండును. అట్లు ధర్మయుక్తముగాఁ బ్రజలను శిక్షింపకయే పన్నును గ్రహించుచున్నరాజు ప్రజలపాపమునంతను ననుభవించును. వాఁడు స్వీయమగుజ్ఞానశక్తిని బలాదులనుసయితము గోల్పోవును. కావున, ఓప్రజలారా! మీకుఁ బ్రభువునైననానిమిత్తము మీ స్వాయారహితులై భగవదర్పణబుద్ధిగలిగిపిండప్రదానాదులవలెఁ బరలోకహితకరములైన మీమీవర్ణాశ్రమధర్మముల నాచరింపుఁడు. మీరట్లులొనరించినచో, నాయందుమీ

కెక్కుడనుగ్రహము గలదని తలంతును. ఓ దేవతలారా! ఓపితృదేవతలారా! మీరలసూయారహితులై, నాయనుశాసనము ననుమతింపుఁడు. పుణ్యమునుగాని పాపమునుగాని చేయువాఁడును, చేయించువాఁడును, వాని కనుమతించువాఁడును బరలోకమును బొంది సమఫలమునే యనుభవింతురు. కావున నాయనుశాసనము ననుమతించిన మీరును సత్ఫలమును బొందక మానరు. ఓయుత్తములారా! * ఆస్తికులమతమందు, యాగాదులం దారాధింపఁబడి యాయాగఫలమును దత్కర్తల కిచ్చు

---

*నిరీశ్వరమతఖండనము—సాంఖ్యులు నిరీశ్వరవాదు లిట్లనుచున్నారు. ప్రకృతిపురుషులకంటె వ్యతిరిక్తుఁడగువాఁడును, ఈశ్వరుఁ డను పేరు గలవాఁడును లేఁడు. అట్టులున్నట్టు ప్రమాణము కానరాదు. అతఁ డెప్పుడును గంటికిఁ గానరాకుండుటచేఁ బ్రత్యక్షప్రమాణము పనికిరాదు. అనుమానప్రమాణమును బ్రస్తుతోపయోగి కాదు. అనుమానప్రమాణ మట్టిదనఁగా అనుమానప్రమాణమునకు సాధ్యమును, హేతువు దృష్టాంతము నుండవలెను. హేతువునుబట్టి సాధ్యమును సాధింపవలెను. అనుమానశరీర మెట్లన, 'పర్వతము, నిప్పుగలది. పొగగలది గనుక, వంటయింటివలెనే' అనఁగా వంటయింటియందుఁ బొగయుండుటచే నిప్పున్నట్లు చూచుచున్నాముకాన, పొగయుండుచోటులందెల్ల నిప్పుండక తీఱదు కనుక, పర్వతము పొగగలది కనుక నదియు నగ్నిగలదియె. ఇటఁ బర్వతమందు వహ్ని యున్నదని సాధించుచున్నాము. కాన వహ్ని సాధ్యము. పొగ హేతువు. వంటయింటియందువలె నన్నది దృష్టాంతము. మఱియు సాధ్యమును హేతువును నెప్పుడయిన నొకప్పుడు చూచి యుండవలెను. హేతు వయినపొగ యుండు నన్నిచోటులందును సాధ్యమగునగ్ని యుండక తీరదు. కావున హేతువుఁబట్టి వహ్నిని సాధించుచున్నాము. అట్లై యనుమానప్రమాణమునుబట్టి యీశ్వరుని సాధింపవలసియుండును. కాని యట్లు వలనుపడదు. సాధ్య మగునగ్ని యెప్పుడయిన నొకప్పుడు మనకుఁ బ్రత్యక్షమై యున్నట్లు ఇట సాధ్యమగు బ్రహ్మ

నట్టి యీశ్వరుఁడొకఁడున్నాఁడనియు, నీలోకమందును పరలోక
మందును, విచిత్రములగు భోగభూములును, వాని ననుభవించు

---

పదార్థముగూడఁ గంటికి గోచరమై యుండవలెను. సాధ్యమన నెట్టిదియో
యెఱుంగనప్పుడు దానిని సాధించు టెట్లు? అగ్నిని సాధించుటకు సాధనమగు
పొగయును, దృష్టాంతమగు మహానసమును నున్నట్లు బ్రహ్మపదార్థమును సాధిం
పనట్టి వేడియును లేవు. కాన ననుమానప్రమాణము నిరాకరణీయము శబ్దాదు
లుగూడ నీశ్వరుఁడున్నాఁడనుటకుఁ బ్రమాణము కాదు. ప్రమాదాదిదోషదూషిత
ములగుటచేఁ బ్రమాణములుగాఁ జేకొనఁదగినవి కావు. మఱియు శ్రు॥ సత్యంజ్ఞా
నమనంతం, నిష్క్రియం నిష్కలం॥ ఇత్యాదులగు వేదవాక్యములుగూడ ప్ర
మాణములుగావు. లోకములో వృద్ధులవ్యవహారములకంటె నితరములగు నర్థము
లను బోధించెడిశక్తి శబ్దములకుఁ జాలదు. మఱియు వ్యవహారము కార్యబుద్ధి
పూర్వము నఁ గలదగుటచేఁ గార్యరూపమగు నర్థము విషయమయియే శబ్దము
ప్రమాణము కాని తదితరవిషయములందుఁ గాదు. మనుష్యశబ్దము కరచరణా
ద్యవయవవిశిష్టుఁ డగు నొకవ్యక్తిని జెప్పుచున్నది కాన నాశబ్దమునందే సామ
ర్థ్యము గలదు గాని యితరములందుఁ గాదు. లోకములోనిశబ్దములను వృద్ధులు
కార్యరూపమగు నర్థము నెఱింగియే వ్యవహరించుకొనుచున్నారు కాన వైది
కశబ్దములనుగూడ గార్యరూపమగు నర్థమందే ప్రమాణముగా వ్యవహరింపవల
యును. ఇట్లుండఁ గార్యరూపము కాని యీశ్వరునివిషయమై యెట్లు ప్రమా
ణము లగును? ఇట్లు ప్రమాణములు కానివేదములందుఁ జెప్పఁబడినఫలప్రాప్తి
యు నసంభవమే. "ఓయీ! ఇష్టాపూర్తం బహుధాజాతం, బ్రహ్మవిదాప్నోతి
పరం॥ ఇత్యాదులచే నైహికఫలమును నాముష్మికఫలమును బ్రహ్మోపాసనము
వలన బ్రహ్మప్రాప్తిరూపమగుఫలమును లభించుచున్నట్లు చెప్పఁబడుచున్నదని
శంకింపకుము. ఆశ్రుతులు సమస్తకర్మములందును గర్తయగు జీవాత్మకుయాథా
ర్థ్యమును దెలియఁజేయుటందే యుపపన్నములగుచున్నవి కాని నీవనినట్లు తత్త
త్ఫలప్రదాయకత్వమందు కాదు. ఓయీ! చిత్రపటాదులను పనిఁబూని నై
పుణ్యముతో వ్రాయుచుండుట జూచుచున్నాము. ఆచిత్రపటాదు లాకారు

విచిత్రశరీరములును బెక్కులు గానవచ్చుచున్నవనియుఁ, బ్రకృతిపురుషులకంటె వేఱుగా నీశ్వరుఁడు లేనిచో నిట్టిసృష్టి లభించుట

---

వ్రాయకుండ నంత తాను గలుగుట చూడలేదు. అట్లె మయూరాదులగు చిత్రతరపదార్థములను సృజింప నీశ్వరుఁడు లేనిచో నవి యెట్లు పుట్టుచున్నవి? చిత్రపటాదులు స్వయంభూతము లయినట్లు మనము చూడలేదు కాన నవియు స్వయంభూతములు కావు. వానిఁ జేయువాఁడొకఁ డుండవలెను. వాఁడే ప్రకృతిజీవులకంటె వ్యతిరిక్తుఁడగు నీశ్వరుఁడని యంగీకరింపక తీరదు. అతఁ డుండుటవలనఁ దదుపాసనాదికమువలన ఫలమును సంప్రాప్తమగుచున్నది అని ప్రశ్నింపరాదు. జీవుఁడు పుణ్యపాపరూపములగు కర్మముల నాచరించుచున్నాఁడు. ప్రకృతి జీవుఁ డొనరించిన కర్మముల కనురూపములగు చిత్రరూపములుగా మాఱుచుండును. అంతియ కాని దాని నట్లు మార్చువాఁడు లేఁడు. ఇంతియ కాక యౌషధవిశేష సంబంధమువలన నాప్యాయనము లగునవియు విషాదిసంపూరితము లగునవియు నగు నన్నాదులు నియమితకాలమందు సుఖమును దుఃఖమును గలిగింప హేతువులగుచున్నట్లు జీవుఁ డొనరించిన పుణ్యపాపముల సంబంధముచేఁ బ్రకృతియు దేశకాలవ్యవస్థలచేఁ దదనుగుణమగు రూపములుగాఁ బరిణమించుచున్నదని తెలియుచున్నది. కావునఁ బ్రకృతిపురుషులకంటె వ్యతిరిక్తుఁ డగు నీశ్వరుండు మఱియొకఁడు లేఁ''డని చెప్పుచున్నారు. కాని యది విశ్వసింపఁదగినది కాదు. ఓయీ! యాగాదులందుఁ బూజనీయుఁడును తత్త్వలము నిచ్చువాఁడును నొక యీశ్వరుఁ డున్నాఁడు. అట్టి యీశ్వరుఁడు లేనిచో నీలోకమందును బరలోకములందును విచిత్రతరములగు భోగభూములును నాభూముల ననుభవించు విచిత్రశరీరులగు భోక్తలు నుండుట యసంభవము. ఈశ్వరుఁ డుండుటచేతనే యది సంభవించుచున్నది. ఓయీ! మీరు ప్రకృతియే జీవకర్మానుగుణముగా విచిత్రరూపముల నొందుచున్నదని చెప్పుచున్నారు. అది యుచితము కాదు. సర్వజ్ఞుఁ డగు నీశ్వరునిచే నధిష్ఠితము కాకుండఁ బ్రకృతి కట్టి విచిత్రరూపముల నొందు సామర్థ్యము లేదు. ఒకవేళ సర్వజ్ఞుఁ డగు నీశ్వరునిచేఁ బ్రేరితము కాక ప్రకృతియే తనంత తాను విచిత్రరూపములు

యాసంభవమనియు, కావున నీశ్వరపదార్థ మున్నదనిఁ బెక్కు రంగీకరించినారు. అట్టియాస్తికులలో మనువును నుత్తానపాదుఁడును,

---

గాఁ బరిణమింపఁగలిగినచో నది ప్రళయకాలమందు నట్టివిచిత్రరూపముల నేల పొందియుండరాదు? మఱియుఁ బ్రకృతి కట్టిరూపముల నొందుట యెల్లప్పుడును స్వభావమే యై యుండవలయును గాని యొకమా రట్టిస్వభావముండుటయు మఱొకప్పుడు లేకపోవుటయుఁ గలుగదు. అగ్నిహోత్రమున కుష్ణత్వము స్వాభావిక మయినప్పు డగ్ని యాగుణమును విడిచి యుండుటను జూచుచున్నామా? అట్లే ప్రకృతికి విచిత్రపరిణామము స్వాభావికమే యయిన యెడలఁ బ్రళయమందు లేకపోనేల? కావునఁ బ్రకృతి కట్టిసామర్థ్యము లేదనియు సర్వజ్ఞుఁ డగునీశ్వరుండే యాప్రకృతి నధిష్ఠించి యిట్టివిచిత్రరూపములుగా మార్చుచున్నాఁడనియు నందువలన నీశ్వరు నంగీకరింపక తీఱదనియు చెప్పవలసియున్నది. ఈశ్వరుని నంగీకరించినచో నాఁడు సత్యసంకల్పుఁడు కాన నతనికట్టిసంకల్పమున్నప్పుడు మానుటయు నుపపన్నమగుచున్నది. ఓయీ కేవలము ప్రకృతి కట్టిశక్తి లేకపోయెను, జీవసంబంధమున దాని కట్టిశక్తి లభించినదని చెప్పరాదా యని యన్నచో నది యుక్తముగాదు. జీవుఁడు తానొనర్చినరూపకర్మముల కనుగుణముగాఁ బ్రకృతిని మార్చుచున్నచో స్వేచ్ఛచేఁ దన కనర్థమెవ్వఁడును తెచ్చికొన నిష్టపడఁడు కాన పశుపాదపాది శరీరముల నొందక యెల్లప్పుడు మంచిరూపములగా మార్చుచుండును గాని కర్మానుగుణముగా మార్పఁడు. దీనివలనఁ బాపానుభవ మెవ్వరికిని కలుగనే కలుగదు. కావున జీవాతిరిక్తుఁ డగునీశ్వరుఁ డున్నాఁడని యంగీకరింపవలెను. అట్లయినచో "శ్రు॥ ఇష్టాపూర్తం బహుధాజాతం జాయమానం" "యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదంతతం । స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః" అనఁగా నెవనివలన భూతములకు ప్రవృత్తి గలుగుచున్నదో యెవనివలన నీసమస్తము కలుగుచున్నదో యాయీశ్వరుని స్వవర్ణాశ్రమోచితములగుకర్మములచేఁ బూజించి మానవుఁడు సిద్ధినిపొందుచున్నాఁడని యర్థము.

ధ్రువుఁడును, బ్రియవ్రతుఁడును. నాపితామహుఁ డయినయంగ రాజును. బ్రహ్మయు, రుద్రుఁడును, ప్రహ్లాదుఁడును, బలియును, ని

---

శ్లో॥ తానహంద్విషతః క్రూరాంత్సంసారేషు నరాధమాన్, క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవయోనిషు॥ అనఁగా వెనుకఁ జెప్పఁబడిన నీచులనందఱిని సంసారమందును, నందులో నీచయోనులందును, బడునట్లు చేసెదనని చెప్పఁబడి యుండుటచేఁ బరమపురుషుండును సమస్తకామములను బొందినవాఁడును, సర్వజ్ఞుండును, సత్యసంకల్పుండును నగు పరమాత్మ, తనమాహాత్మ్యమునకుఁ దగిన లీలలందుఁ బ్రవృత్తుఁడై "ఈకర్మములు మంచివి. ఇవి చెడ్డవి" అని కర్మములను రెండువిధములుగా విభాగించి యాకర్మములను బురస్కరించికొని యాయాకర్మముల కుచితములగు దేహేంద్రియాదికమును వాని నియమించుటకుఁ దగినశక్తిని సకలజీవులకును సామాన్యముగా నిచ్చి తనశాసనములను దెలియఁజేయు వేదమును దెలిపి తదుపసంహారమునిమిత్తము జీవాంతరాత్మగాఁ బ్రవేశించి, నియమించుచు, నందులోఁ బుణ్యకర్మము లాచరించుచుఁ దన యాజ్ఞను మన్నించి వర్తించువారిని దెలిసికొని ధర్మార్థ కామమోక్షములచే వర్ధించుచుండును. తనశాసనము నతిక్రమించి వర్తించువారిని విరుద్ధఫలభాక్కులనుగాఁ జేయుచు వర్తించుచుండును. ఇట్టివిచిత్రకర్మములు సంభవించుట యీశ్వరు నంగీకరించినచో నే సరిపడును. సత్యంజ్ఞాన మనంతమిత్యాది శ్రుతులచేఁ గర్మాంగభూతమగు జీవాత్మతత్త్వము నే తెలుపఁబడుచున్నవని చెప్ప వలనుపడదు. కర్తయైన బద్ధజీవుఁడయినను ముక్తజీవుఁడయినను మిణుగురుఁబురుగువంటివాఁ డనియును, నవిద్య మొదలగు హేయగుణములుఁ గల వాఁడనియునుఁ జెప్పఁదగినవాఁడు. అట్టి బద్ధముక్తజీవులకుఁ గేవలము పరమాత్మయందు మాత్రమే యుండఁదగిన సకలదోషరహితత్వము, జ్ఞానానందత్వము మొదలగు ననంతకల్యాణగుణములు కలిగియుండుటయు, జగదాదులనుసృజించుటయు, సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము మొదలగునవియు సంభవింపవు. అట్టి గుణములు పరమాత్మయందే యున్నట్టు శ్రుతులు చెప్పుచున్నవి. శ్రు॥ అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసస్సత్యకామ స్సత్యసంకల్పః॥

ట్టివారే మఱికొందఱును, నగ్రేసరులని చెప్పవచ్చును. వీరందఱును నానాజీవుల కర్మములకనుగుణముగా ఫలము నిచ్చువాఁడీశ్వరుఁడేయని నిర్ణయించియున్నారు. మఱియు ధర్మార్థకామములనెడి త్రివర్గము జీవులొనరించుధర్మాదులకు ఫలమగుస్వర్గాదిలోకములును, మోక్షసుఖమును,నొక్కఁడగుపరమాత్మచేత నేయొసఁగఁబడు చున్నకారణమున, ధర్మస్వరూప మెట్టిదియో, తద్విధానమెద్దియో, యందులకు సాధములేవియో, యట్లొనరించుటకు ఫలమేదియో యెఱుఁగక దుఃఖభాజనులై యున్న నేనుఁదు మొదలగువారుతక్క తక్కినవారందఱు నీశ్వరుఁ డున్నాఁడనియె భావించియున్నారు. అచేతనములగు కర్మములకు నపవర్గాములనొసంగునంతటిశక్తి లేదు కావున సుకర్మదుష్కర్మద్వారకముగా జీవులకుఁ దత్ఫలంబుల నొసంగువాఁడీశ్వరుఁడేకాని మఱొకఁడు కాఁడు. ఆయీశ్వరుని పదకమలధ్యానము సకలానర్థములను దొలంగింపక మానదు. ఆధ్యాత్మికాదిక మగుతాపత్రయముచే నాతురులైనవారలకు నాపరమేశ్వరుని పాదములసేవ దినదినమును వర్ధిలుచు ననేకజన్మములయందు సంపాదిత మగుచిత్తమాలిన్యమును గంగాజలము మలినమునువలెనే తొలంగించుచున్నది.మనోమలము తొలఁగుటవలనఁ బెద్దలాభంబు గలదు. ఇట్లు మనోమలినమును దొలఁగించికొన్నమానవుఁడు వైరా

---

తదైక్షత బహుస్యాం ప్రజాయేయ. తత్తేజోఽసృజత. యస్సర్వజ్ఞ స్సర్వవిత్, యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' ఇత్యాదులన్నియు సిద్ధవస్తుపరములే కాని జీవపరములు కావు. కావునఁ బ్రకృతిపురుషులకంటె వ్యతిరిక్తుఁడగుపరమాత్మ యున్నాఁడనియు నతఁడట్టిగుణములకలవాఁడని యు తెలుఁగునది.

గ్యసంపన్నుఁడై, ప్రకృతికంటె వేఱయినయాత్మస్వరూపమును దెలిసికొని యాజ్ఞానవైరాగ్యంబులచేఁ గలిగినబలము గలవాఁడై భగవంతునిపాదమూలమందు నివసించుచు, విజాతీయవస్తువులందుఁ బ్రత్యయము విడిచి యతనియందే తనచిత్తమును నిలిపి జన్మమును, ముదుసలితనముమరణాదులను గలిగించుసంసారమును బొందఁడు. కావున "ఓసభ్యులారా! మీమీవర్ణాశ్రమముల కనుగుణము లగుకృత్యములచేతను, శమదమతపశ్శౌచాదులచేతను, ధ్యానముచేతను స్తోత్రములచేతను, బరిచర్యాదులచేతను, నిష్కపటులయి వర్తించుచుఁ గోరినదానికంటె నధికమగుఫల మొసగూర్చునని నిశ్చయించి సమస్తకామములనుఁ బూర్తిచేయుపాదపద్మము లు గల పరమపురుషుని మీరు భజించుచుండుఁడు. మఱియుఁ బరమాత్మ హేయగుణములులేనివాఁడు. అనంతకల్యాణగుణములు గలవాఁడు. స్వరూపముచేతనే విజ్ఞానసాంద్రుఁడయి వఱలుచుండువాఁడు. ఆపరమేశ్వరుఁడే వేఱువేఱయిన వ్రీహ్యాజ్యాదు లగుద్రవ్యములును నీలశ్వేతాదు లగుగుణములను, నాలంభనాదు లగుక్రియలును, మంత్రములును, మొదలగువానిచే యాగస్వరూపుఁడయి యాగఫలాదులగు స్వర్గాదిలోకములును, వాని కాధారభూతులగు నగ్నీంద్రాదిరూపశరీరములును, వారలను జెప్పెడి యగ్నీంద్రాదిశబ్దములును దానే యగుచున్నాఁడు. ఓసభ్యులారా! వేయేల? వ్రీహ్యాజ్యాదు లగుయాగద్రవ్యాదిరూపముగాను, యాగాదులకు ఫలము లగుస్వర్గాదిలోకములుగాను, నింద్రాదులం దంతర్యామియై యాగఫలమిచ్చువాఁడుగాను, నున్నవాఁడు భగవంతుఁ డొక్కఁడేయని తెలిసికొనుఁడు. ఇట్లు దేవేంద్రాదుల నారాధించి

నవారు గూడఁ దదంతరాత్మ యగుపరమేశ్వరునినే పూజించిన వారగుటచే నందఱు నొక్కదేవతనే యారాధించునట్లు తెల్లమగుచున్నది. మఱియుఁ బరమేశ్వరుఁడు ప్రకృతిచేతను, బ్రకృతిగుణము లగుసత్త్వాదులచేతను, సంస్కారములచేతను, బుణ్యాపాపరూపము లగుకర్మములచేతను, నారబ్ధమగుశరీరమునందు జీవాత్మద్వారకముగా శబ్దాద్యనుభవరూప మగుజ్ఞానమును, బొంది కర్మఫలములగు స్వర్గాదిలోకములుగాఁ గూడ నూహింపఁబడుచున్నాఁడు కావునఁ గర్మములను, నాకర్మములచే నారాధింపఁ దగినవాఁడును, నందులకు ఫలమును, దత్ఫల మనుభవించువాఁడును నీశ్వరుఁడే కాని మఱొక్కఁడు లేఁడు. ఓయీ! శరీరసంబంధము కలిగినచోఁ బరమేశ్వరునికి శరీరగతదోషములు చెందక మానునా ? యని శంకింపరాదు. దారువులం దగ్నిహోత్రము వెలయుచుండు. ఆదారువు స్థూలముగా నున్నప్పుడగ్నియు స్థూలముగా నున్నట్లును, నదియే దీర్ఘమయి యున్నప్పుడు దీర్ఘముగాను, వక్రముగా నున్నప్పుడు వక్రముగాను గానవచ్చుచున్నను, వాస్తవముగా నగ్నికి దారుగతము లగు వక్రత్వదీర్ఘత్వాదు లెంతమాత్రమును జెందవు. అట్లే పరమేశ్వరుఁడు జీవద్వారకముగా శరీరసంబంధము కలవాఁడయి యున్నను శరీరగతము లగుదోషము లతనికిఁ జెందవు. కావున నా దేశమందు నివసించినమీ రందఱును దృఢసంకల్పులై మీమీవర్ణాశ్రమములకుఁ దగినధర్మములచేత నింద్రాదుల కంతరాత్మయును, హితోపదేశముచేసి భక్తులను బాగుచేయువాఁడును, దన్నాశ్రయించువారిపాపములను బాపువాఁడును నగు పరమేశ్వరుని నిరంతరమును సేవించుచుండవలయును. అట్లు

పరమేశ్వరుని భజించినవారలే నాయనుగ్రహమునకుఁ బాత్రులగుచున్నారు. ఓజనులారా! పరమేశ్వరుఁడే దైవముకాని వేఱొకఁడు లేఁడని విశ్వసించి, తితిక్షచేతను కృచ్ఛ్రచాంద్రాయణాది తపములచేతను, బ్రహ్మోపాసనముచేతను, నతిథిపూజలచేతను, శమదమాదులచేతను, బ్రాహ్మణకుటుంబములు స్వయముగానే ప్రకాశించుచుండును. కాన వానికెప్పుడు నేరాజును నపరాధము చేయరాదు. బ్రాహ్మణరాజకులము లన్యోన్యానురాగముతోనే యుండవలయును. బ్రాహ్మణులందు గొప్పసామర్థ్యము కలదు. బ్రాహ్మణుల పాదాభివందన మొనర్చి హరి యెప్పుడును దన్ను విడిచియుండనిలక్ష్మిని, కీర్తినిఁ బొందియున్నాఁడు. మఱియు బ్రాహ్మణుల సేవించినవారిని జూచి హరి సంతసించుచుండును. ఆహా! బ్రాహ్మణసేవాపరాయణు లయినమన్వాదులకును దేవుఁడు. ఆతఁడు మొట్టమొదటివాఁడు. అతఁడు స్వయంప్రకాశుఁడు. అతఁడండఱియందు నంతరాత్మయై యుండును. అతఁడు బ్రాహ్మణారాధనముచేఁ దప్పక తుష్టి చెందును. ఒకరిని బూజించిన మఱొకరు సంతుష్టిఁ జెందుట యెట్లని తలంపరాదు. పరమాత్మ సర్వాంతరాత్మ కావున బ్రాహ్మణారాధన మతనికిని జెందును. అందువలన మీ రందఱును సర్వవిధములచేతను బ్రహ్మకులము నారాధింపవలయును. మఱియు బ్రాహ్మణకులములను సేవించుటచేఁ బురుషునిమనస్సు శీఘ్రముగా నుపాయాంతర మక్కఱ లేకయే శాంతమును జెందును. అట్లు శాంతమగు మనస్సు గలవారికేమికొఱంత గలదు? వారి కసాధ్యమగువస్తు వేది కలదు? మఱియు విప్రు లింద్రాది దేవతలకు ముఖమయి యుందురు. వారు పరబ్రహ్మయావేశావతారము లని చెప్పవచ్చును.

అందువలన బ్రాహ్మణారాధనమువలనఁ బరమాత్మ సంతసించును. ఇంతియకాక యగ్నిహోత్రుఁడు కూడ నింద్రాదులకు ముఖమే అయినను బ్రాహ్మణులు పరమేశ్వరునకుఁ బ్రియతములని యెఱింగి శ్రద్ధచే బ్రాహ్మణముఖమందు హుతము చేసినహవిస్సును బరమేశ్వరుఁ డెంతసంతసముతో భుజించునో యగ్నియందు హోమము చేసినద్రవ్యము నంతసంతసముతో భుజింపఁడు. అందులకుఁ గారణము బ్రాహ్మణులు కేవలము జ్ఞాననిష్ఠు లగుటయే. జ్ఞానవంతులు నాకుఁ బ్రియతములని భగవంతుఁడే స్వయముగాఁ జెప్పియుండెను. జ్ఞాననిష్ఠులగు బ్రాహ్మణులు తనకుఁ బ్రియతములు కావున బ్రాహ్మణముఖమం దుంచినద్రవ్యమును స్వముఖమం దుంచినట్లె యెంచి ప్రియముతోఁ దినుచుండును. ఓ సభ్యులారా! జ్ఞాననిష్ఠ మగుటచేతనే యగ్నికంటె బ్రాహ్మణులు త్కృష్టులు. మఱికొన్నివిశేషములు కలవు. ఆబ్రహ్మనకులము రాగద్వేషాదిదోషములు లేనిది. అది యనాది యైనది. అది పరమాత్మస్వరూప మనియే చెప్పవచ్చును. బ్రహ్మసాక్షాత్కారమునిమిత్తమును, తాదృశబ్రహ్మజ్ఞానమునిమిత్తమును, ఉపాసనచేతను, నుపాసనోపయుక్తము లగు జ్ఞానయోగకర్మయోగములచేతను, బవిత్రాచారములచేతను, వాఙ్నియమముచేతను, ధ్యానముచేతను, ధారణచేతను, వేదాధ్యయనాదులచేతను గూడి యుండును. ఆవేదమును సామాన్య మయినది కాదు. అది పరమాత్మస్వరూపాదికమును సులభముగా నద్దమందుఁ జూపినట్లు చూపును. ఓయార్యులారా! అట్టిబ్రాహ్మణుల పాదపద్మపరాగరేణువును నా కిరీటముమీఁద నెల్లప్పుడును దాల్చుచుందును. అట్లు చేసినవానిపాపములు త్వరగానే

నాశనమందును. అట్టివానిని సకలకల్యాణగుణములు నాశ్ర యించును. శీల మనుధనము కలిగి, కృతజ్ఞుఁడై జ్ఞానవృద్ధుల నాశ్రయించి యున్నకల్యాణగుణవంతుని సంపదలు స్వయముగానే వరించును. కావున బ్రాహ్మణకులమును, గోకులమును భక్తజనులును బరమేశ్వరుఁడును నాకుఁ బ్రసన్నులగుదురు కాక "అని యిట్లు పలుకుచున్న పృథురాజును గాంచి పితృదేవతలును, దేవతలును, బ్రాహ్మణులును, సాధువులును సంతుష్టహృదయు లై "బాగు బా"గని యిట్లు నుతించిరి. "ఓరాజా ! తండ్రి కుమారునిచేఁ బరలోకములను సంపాదించుకొను నన్న జనశ్రుతి సత్యమయినది. పుంసంజ్ఞక మగునరకమునుండి రక్షించువాఁడు గాదా పుత్త్రుఁ డనఁబడును. నిన్నుఁ బుత్త్రునిగాఁ బడసిన హేతువుచేఁ బాపాత్ముఁడై బ్రాహ్మణశాపహతుఁ డయిన వేనుఁడు నరకమును దరించెను. ఓరాజా ! హిరణ్యకశిపుఁ డనువాఁడొకఁ డుండెను. వాఁడు భగవంతుని నిందించి నరకకూపమునఁ బడ సిద్ధముగా నుండియుఁ, గుమారుఁ డయినప్రహ్లాదునిప్రభావముచే నరకము నతిక్రమించెను. అట్లె నీవలన నీతండ్రియును నుత్తమగతిఁ జెందెను. ఓరాజా ! సమస్తజనులకును నీయందు దృఢమయినభక్తి గలదు. కావున నీవు భూవలయంబును బరిపాలించుచుఁ బెక్కు వత్సరంబులు జీవింపుము. ఓపవిత్రకీర్తీ ! ఉత్తమశ్లోకుఁడును. బ్రాహ్మణులకుఁ గూడ దేవుఁడును నగుపరమేశ్వరునిగుణములను వివరించి చెప్పితివి. ఇట్టి నీచేతను మేము సనాథుల మయి నిన్ను సేవిష్ణువుగాఁ దలంచుచున్నాము. ఓభూమీశ్వరా ! దయాళులగు మహాత్ములకుఁ బ్రజలయం దనురాగము కలుగుట స్వాభావికగుణము. కావున నీవు మమ్ముఁ బ్రేమించు

ట యత్యద్భుత మయినది కాదు. మఱియు దైవ మనువేఱు నామముతో వ్యవహరింపఁబడుచున్నకర్మములచే సంసారకూపమునఁ బడియున్నజ్ఞానమును గూడఁ గోల్పోవుచుంటిమి. ఇట్లుండ నీవు మా కిపుడు హితోపదేశము చేసి నరకమునుండి తప్పించి రక్షించితివి. బ్రాహ్మణులం దధిష్ఠించి, క్షత్త్రియులను క్షత్త్రకులము నధిష్ఠించి విప్రకులమును బోషించుచు, నారెంటి నధిష్ఠించి యీప్రపంచమును బోషించుచుఁ గేవలశుద్ధసత్త్వము కలిగియున్న పరమపురుషునియవతార మగు నీకు నమస్కారములు" అనిరి. ఇది యిరువదియవయధ్యాయము.

---

## పృథురాజునొద్దకు సనకాదు లరుదెంచుట.

ఓవిదురా! విపులపరాక్రముఁ డగు పృథురాజును జనులం నుతించుచుండఁగా సూర్యునివంటి తేజస్సు గలిగిననలువురు మును లచ్చటి కేతెంచిరి. ఇట్లు స్వతేజస్సుచే లోకములను బాపరహితములనుఁగా నొనర్చుచు నాకాశమునుండి దిగివచ్చుచున్న సనకాదిమునులను, జనులును బృథురాజును నచ్చెరువడి చూచిరి. అంతటఁ బృథురాజు వారిదర్శనమువలన నెగిరిపోవుచున్న ప్రాణములను మగుడరప్పించు కొనుటకై సభాసదులతోను సేవకులతోను శబ్దాదిగుణములనుగూర్చి లేచెడుక్షేత్రజ్ఞునిచందంబున లేచి నిలువఁబడెను. ఇట్లు లేచి గౌరవమునకు వశుఁడయి వినయముచే శిరస్సు వంచి, యర్ఘ్యపాద్యాదులచేఁ దత్కాలమందే యథావిధిగాఁ బూజించెను. పూజించి వారినిర్మలపాదోదకమును శిరంబునఁ దాల్చి శీలవంతు లగువారిప్రవర్తనమును గౌరవించునట్లు చేసెను. అనంతరము పృథురాజు వేదికయందున్న

యగ్నిహోత్రములవలెఁ బ్రకాశించుచు బంగారు గద్దియలపై నుపవేశించి యున్నసనకాదులం గాంచి శ్రద్ధావినయములతో ని ట్లనియె. 'ఓమునిపుంగవులారా! నేఁ బూర్వజన్మమున నెంతటిపు ణ్య మాచరించితినో కదా! లేనిచో యోగీశ్వరుల కయినను గా నరానిమీదర్శనము నాకు సులభముగా లభించునా? మీవం టిమహాత్ములును, మంగళప్రదుఁ డయినవిష్ణువును నేపురుషునికిఁ బ్రసన్ను లగుదురో యతనికిఁ బరలోకమందు దుర్లభ మగున దేది కలదు?ఏదియును లేదు. మఱియును సర్వజ్ఞుఁ డగుపరమా త్మను లోకహేతువు లగుబ్రహ్మాదులు చూడఁజాల నట్లే లోక మం దంతటను వర్తించు చున్నమిమ్మును జనులు చూడఁజా లరు. గృహస్థులు భాగ్యహీనులయినను సాధువులయినచో ధ న్యులే యగుదురు. ఆసాధువులగృహములు పూజనీయములు. మఱియు మీవంటివారి కందఱకును స్వీకరింపఁ దగినవి. జలము లు,భూములు, గృహాధిపతియుఁ, దక్కినభృత్యాదులును, బూజ నీయులే. లోకములో సమస్తసంపదలచేతను నిండియుండి నను, మానవులగృహములకు భగవంతుఁడు కాని భగవ ద్భక్తులు గాని,రానిచో నవి యన్నియుఁ బాములతో నిండిన చందనవృక్షములతో సమానములు. ఓమునులారా! మీరు కుశలముగా వచ్చితిరా? మీరు బాలురయియుండియే ముము క్షువు లయితిరి.మీరింద్రియంబుల జయించి వర్తించుచున్నమహా త్ములరు.మఱియు మీరు గొప్పవ్రతముల నాచరించుచున్నారు. మీ రాచరించినవ్రతముల నితరముముక్షువు లెంతయోకాల మునకుఁగాని నిర్వర్తింపలేరు. ఓమహాత్ములారా! శబ్దాదులగు విషయములకు లోనై స్వకీయము లగుకర్మవిశేషములచే సంసా

రకూపమందుఁ బడుచున్న మావంటివారికిఁ గుశల మెట్లు కలుగును? అభ్యాగతుల మగుమాకుశలము నేల యడుగలేదు. అని శంకింపరాదు. బ్రహ్మానందానుభవపరు లయినమీవిషయమయి కుశలప్రశ్నమడుగ నవసరము లేదు. మీవంటిమహాత్ముల కొకప్పుడయినను దుఃఖములు సంప్రాప్తించు టెట్లు? మీయెడలఁ గుశలాకుశలరూపములు నగుమనోవృత్తు లెప్పుడును సంభవింపవు. కాన మిమ్ముకుశలమును గూర్చి యడుగకపోయినను నది యొకతప్పు కాదు. ఓమహానీయులారా! నేను మీయందు నమ్మక ముంచి తాపత్రయాతురుల మగుమాకు స్నేహితు లగుమిమ్మును నొక విషయము నడుగుచున్నాను. సంసారమందు వర్తించువానికి సులభముగాను శీఘ్రముగాను మోక్ష మెట్లు లభించు? మీరు దయయుంచి యిందుకుఁ బ్రత్యుత్తర మొసంగుఁడు. ఇంతియ కాక జ్ఞానవంతులకు నిరతిశయప్రేమవిషయుఁడును, జీవులకు జ్ఞానాదుల నొసంగి సత్తావంతులఁగాఁ జేయువాఁడును, జ్ఞానిరూపమున వర్తించువాఁడును, భగవంతుఁడు తనభక్తులననుగ్రహించునిమిత్తము భూమియందుఁ జరించుచుండు.' అనవుఁడు, శోభనమును, న్యాయ్యమును, గంభీరార్థము కలదియు నల్పమైనదియుఁ జెవులకింపయినదియు నగుపృథురాజువాక్యమును విని చిఱునవ్వు నవ్వుచు సనత్కుమారుండిట్లనియె. 'ఓమహారాజా! నీవు సర్వభూతములహితమును గోరుచున్నవాఁడవు. మఱియుఁ దత్త్వజ్ఞానము గలవాఁడవు. నీవు విద్వాంసుఁడవయినను, లోకమునిమిత్తమడిగితివి కాన నీప్రశ్నము మిక్కిలియుక్తమయినది. లోకములోఁ దమకుఁ బ్రయోజనము కాకపోయినను లోకహిత మగుదానిఁ గోరుట సాధులస్వభావము కదా? సరాగులకును విరా

గులకును దమకుఁ దమకు నిష్టము లగుభోగములను మోక్ష
మును గలుగుటకు మొదటిసాధనము సజ్జనసహవాసమేసుమీ ?
మఱియు సాధువులు సంభాషించుచుఁ జేసినస్వర్గమోక్షసాధన
ప్రశ్నము జగమునందఱకును సుఖము గలిగించుచున్నది. ఓరాజా!
శ్రీహరిపాదారవిందములగుణములను వినుటయందు నీ కెక్కువ
ప్రీతి కలదు. అవ్యభిచరిత మగుహరికథాశ్రవణప్రీతి మనోమల
మును, బుణ్యాపుణ్యరూప మగుకర్మమును క్షీణింపఁ జేయును.
ఓమహారాజా! సత్త్వాదిగుణములు లేక స్వరూపకల్యాణగుణ
ములచేతనే మహత్త్వమును వహించి బ్రహ్మమునందు దృఢ
మయినప్రీతిఁ గలుగుటయు, నాత్మవ్యతిరిక్తము లగుదేహాదులం
దు నిరపేక్ష గలిగియుంటయు నివియే మోక్షసాధనములఁ
గూర్చి చెప్పుశాస్త్రములందు మానవులకు ముఖ్యసాధనము లని
చెప్పఁబడి యున్నవి. మఱియు భగవద్భక్తుల కనుకూలముగా ని
త్యమునుబ్రవర్తించుటచేతనుఁ బిమ్మట భగవంతునిపుణ్యకథలను
వినుటచేతను, నర్థపరాయణులతోడను బ్రసంగించుటయందుఁ
దలంపు లేకపోవుటచేతను, ధనాభిలాషులకును గాముకులకును
సమ్మతము లగునర్థకామములను నపేక్షింప కుండుటచేతను, ద
త్త్వమునకు హిత మయినపురుషార్థమును దెలిసికొనుటచేతను,
గురు వుపదేశించినయాధ్యాత్మికయోగమును మననముచేయుట
చేతను, దాదృశ మగునాధ్యాత్మికయోగము నాచరింపఁగలిగెడి
త్వరచేతను, భగవదారాధనరూపములు నిత్యనైమిత్తికములు
నగుపంచమహాయాగాదుల నాచరించుటచేతను, పరమాత్మత
త్త్వమును దెలిసికొనుటచేతను, జాత్యాశ్రయాదులు కారణ
ముగాఁ గలుగునన్నాదు లనుభవించుటచే నాత్మయందుఁ గలుగు

సంతోషముచేతను, కేవలము భగవంతునిగుణము లనెడియమృతపానమువలనఁ గలుగుసంతోషముచేతను, భూతములందు సాధుభావము గలిగియుండుటచేతను, భగవద్విషయక మగుస్మరణముచేతను, భోజనానంతరమందు హరిచరిత్రామృతము ననుభవించుటచేఁ గలుగుసుఖముచేతను, బాహ్యేంద్రియముల నియమించుటచేతను నంతరింద్రియముల నియమించుటచేతను శౌచాచారములచేతను, సాధ్యసాధనాదులను నిందింపకుండుట చేతను, దేహధారణాదుల కుపయుక్తములు కానిచేష్టాదులను విడుచుటచేతను, శీతోష్ణాదు లగుద్వంద్వములను సహించియుంటచేతను, భక్తులచెవుల కలంకారభూతము లగుహరిగుణముల నుచ్చరించుటచే నతిశయించినభక్తిచేతను, నాత్మపదార్థము కానిదేహాదులం దప్రీతియును, సత్వాదిగుణరహితుఁ డగుబ్రహ్మమునందుఁ బ్రీతియును, శీఘ్రముగానే కలుగును. గురువునను గ్రహంబును బొందినపురుషునకుఁ బరబ్రహ్మమందుఁ గలదృఢభక్తి వైరాగ్యయుత మగుజ్ఞానవేగముచేఁ బలరహిత మైపంచభూతాత్మక మయినశరీరమును, నగ్ని తనకుఁ గారణ మయినయరణిని దహించువిధమున దహించును. ఇట్లు శరీరమును దహింపఁ జేసికొన్నవాఁడు దేహాదిగుణము లగురాగాదుల నన్నిటిని విడిచి, బహిర్భూతమగుశరీరమును, నంతర్భూతము లగురాగద్వేషాది గుణములను గనుఁగొనఁజాలఁడు. ఇంతియ కాక దేహము నశించినతోడనే స్వప్నదశయందువలెనే జీవపరమాత్మలకు వ్యవధానము కల్పించుశరీరంబును, దజ్జనితము లగురాగద్వేషాదులును దప్పక నశించును. ఓరాజా! దేహమును నింద్రియాదులును, దేహేంద్రియాదులకంటె నన్యము లగు భోగస్థానాదులును, వాసనయును

పేరు గలయుపాధి నశించినతోడనే యవి యన్నియును నశించును గావునఁ గంటికిఁ గానరావు. సమస్తమైనజడపదార్థము గానవచ్చునప్పుడే తనకునుఁ బరమాత్మకును గలుగుభేదమును జూచుచున్నాఁడు. కాని ముక్తియందుఁ దనకు భగవంతునియాకారముతో సమానమగు నాకారము వచ్చుటచేఁ దనకును బరమాత్మకును భేదమును జూడఁజాలఁడు. ఎల్లప్పుడును శబ్దాదివిషయముల నాలోచించుపురుషునిమనస్సు, విషయములచే నాకర్షింపఁబడి, పురుషార్థములను, దత్సాధనములను విభాగించి నిశ్చయించెడిబుద్ధిసంబంధి యగుజ్ఞానమును, నదీప్రవాహము తీరస్థము లగుకుశాదులను హరించునట్లు హరించును. ఇట్లు విషయచింతనాదులచే వ్యవసాయము నశింపఁగానే కాలయోగములకు సంధాయక మయి, కాలాంతరములందుపాసింపఁదగినదానిని దెలియఁజాలుచిత్తము, భ్రష్ట మగుచున్నది. ఇట్లుపాసనము నశింపఁగానే తనకును బరమాత్మకును గలయాథార్థ్యమును దెలుపుజ్ఞానము నశించును. పండితు లాజ్ఞాననాశనమునే యాత్మతిరోధాన మని చెప్పుదురు. స్వస్వరూపతిరోధానమువలన స్వస్వరూపమును విడిచి యాత్మ శబ్దాదివిషయములను బ్రేమించుటకంటె మఱియొకయనర్థము లేదు. శబ్దాదివిషయములయు, శ్రోత్రాదీంద్రియములయుఁ జింతనము మానవులసమస్తపురుషార్థములను హరించును. మఱియు నాశబ్దాదులచింతనముచేతనే పురుషునిచిత్తము శాస్త్రజన్య మగుజ్ఞానమునుండియు నుపాసనాత్మక మగుజ్ఞానమునుండియు భ్రష్ట మయి స్థావరత్వముఁ బొందుచున్నది. అనర్థదాయక మగునజ్ఞానమును దరింపఁదలంచినవారొకానొకప్పుడును, ధర్మార్థకామమోక్షములకు వి

గులవిరోధియైన శబ్దాదివిషయసంగమును జేయరాదు. ఆనాల్గు పురుషార్థములలోను మోక్షరూపపురుషార్థము నిత్యమైనది. కావున నదియె యందఱకును పేక్షింపఁదగినది. తక్కినమూఁడును ననిత్యములుగాననంతగాఁ గోరఁదగినవి కావు. ఉత్కృష్టాపకృష్టరూపము లగుసర్వపదార్థములును సత్త్వాదిగుణములవైషమ్యముచే సృజింపఁబడినవి కానఁ బ్రళయమందుండఁ జాలవు. కాలరూపుఁడగు పరమాత్మచే విధ్వంసితము లగుటవలన వానికి క్షేమము కలుగదు. కావున నోమానవేంద్రా ! నీవు దేహేంద్రియప్రాణమనస్సులచే నావృతము లయినస్థావరజంగమములం దంతరాత్మయై ప్రకాశించువాఁడును, స్వయంప్రకాశుఁడును, స్వరూపగుణములచే వ్యాపకుఁడు నగుపరమేశ్వరునిఁ దెలిసికొని తచ్ఛరీరము నే ననని యెంచికొనుము. పరమేశ్వరుఁడు జీవశరీరకుఁ డయినచో జీవగతదోషము లతనికిఁ జెందవా యని తలంపరాదు. క్షేత్రజ్ఞరూపుడగుపరమాత్మయందుఁ గార్యకారణరూపమున నున్నయీ దేవమనుష్యాదిజాత మంతయుఁ బూలదండయందు సర్పభ్రాంతివలెనే కలుగుచున్నది. అంతియ కాని జీవగతదోషము లతనికిఁ గలుగవు. మఱియు నతఁడు నిత్యముక్తుఁడు. అతఁడు స్వయముగాఁ బ్రకాశించువాఁడు. అతనికి స్వాభావికముగాఁ బ్రకృతిసంబంధము లేకపోయినను దనచే సృష్టములగుకర్మములచే మిశ్రితము లగువాసనలు గలవాఁడని తెలియుము. అయిన నవినరసింహాద్యవతారంబులఁ దాల్చినప్పుడు శ్వేతత్వాదులు విగ్రహమూలకముగా వచ్చుచున్నట్లె క్షేత్రజ్ఞరూపుఁ డయినపరమాత్మకుఁ గర్తృసంబంధాదులు జీవాత్మమూలకముగానే కలుగుచున్నవి. కాని స్వతస్సిద్ధమై కలుగలేదు. ఓమహీతలాధిపా ! సమస్తమును భగవ

దాత్మక మైనదే యని భావించి యింద్రియగణమును వశము కావించుకొని యెవనిపాదపంకజభక్తిచే సజ్జనులు సమస్తకర్మ వాసనలను విడుచుచున్నారో యాపరమాత్మయే ప్రాపకుఁడని నమ్మి నీవు సర్వదా భజింపుము. ఓరాజా! ఈసంసారసముద్రము మిగుల భయంకర మైనది. అరిషడ్వర్గ మనెడినక్రములతోఁ గూడియున్నది. అట్టిసంసారసముద్రమును నీశ్వరుఁ డనునావ లేకుండ దాఁటు దుస్తరము. కావున నీవు సేవనీయ మగుపర మేశ్వరునిపాదపద్మములను నావగాఁ జేసికొని, దుఃఖాత్మకము ను దరింపఁ దరము కానిదియు నగుసంసారసముద్రమును దరింపుము" అనియిట్లు బ్రహ్మకుమారుఁడగుసనత్కుమారుఁడు తత్త్వము నుపదేశింపఁగా నాలించి సంతసించి పృథురాజతనినుతించి యిట్లనియె. "ఓ మునిపుంగవులారా! తాపత్రయపీడితు లగు వారియందు దయాళుఁ డయినశ్రీహరి నన్నుఁ బూర్వ మనుగ్రహించెను. ఆయనుగ్రహమును నాకుఁ జెందునట్లు చేయుటకే మీ రిచ్చటికి నేతెంచినారు.దయావంతు లైనమీరు నాకోరికను బూర్ణముగా నెఱవేర్చినారు.నా దేహము మొదలుగాగలయీసమస్తమును మీవంటిసజ్జనులయనుగ్రహమువలనఁ గలిగినదే. మీ యనుగ్రహమువలనఁ బొందినది మీ కీయ నర్హము కాదు. కావున మీరు నాకు బ్రహ్మోపదేశము చేసినందులకై గురుదక్షిణ యేమి యొసంగుదునా యని యోజించుచున్నాను. కావున నాప్రాణములను, ధనములను, సకలసాధనములు గలమందిరములను, రాజ్యమును, భూమిని, రత్నాగారములను మీకు గురుదక్షిణగా నొసంగుచున్నాను. దయతో స్వీకరింపుడు.వాని నెట్లు పరిపాలించుటో మాకుఁ దెలియనప్పుడు వాని నిచ్చుటవలన

లాభ మేమని ప్రశ్నింపరాదు. సేనానాయకత్వమునకును, రాజ్యమునకును, దండనాధికారిత్వమునకును, నట్లే సకలలోకాధిపత్యమునకును వేదశాస్త్రములు తెలిసినవాఁడే యర్హుఁడుకాని తదితరుఁ డర్హుఁడు కాఁడు. బ్రాహ్మణుఁడు స్వకీయ మగునన్నమునే తినుచున్నాఁడు; తనవస్త్రమునే తాను గట్టుచున్నాఁడు. క్షత్రియాదులకు స్వయముగా నిచ్చుచున్నాఁడు. బ్రాహ్మణానుగ్రహమువలనఁ బొందినయన్నవస్త్రాదులనే క్షత్రియాదిజాతులవా రుపయోగించుకొను చున్నారు. ఓమునులారా! ఆత్మవిచారమువిషయమై నిశ్చయముగా వేదమును ననుసరించినమీరు తరింపరానిసంసారసముద్రమును దరించుటకుఁ దగినయుపాయమును మా కుపదేశించినారు. అధికదయావంతు లయినమీవంటివారు నిత్యమును నార్తులను రక్షించుటచేతనే సంతోషింతురు గాక. అంతియ కాని సంసారతరణోపాయమును దెలిపినమీవంటివారికి నమస్కారము చేఁ దప్ప ఎవఁడు ప్రత్యుపకారము చేయఁగలఁడు?" అని పలికి పృథురాజు సనకాదులను బూజింపఁగా నాత్మయోగమనుష్ఠానానుష్ఠాపనములచేరక్షించుచున్న సనకాదులు పృథురాజుశీలమును గొనియాడుచు నచ్చటివా రందఱును జూచుచుండఁగనే యాకాశము నధిష్ఠించిరి. అంతటఁ బృథుమహీపతి సనకాదులయుపదేశబలముచే నాత్మయోగమునఁ బరమాత్మోపాసనమందు నియతుఁడై తనకోర్కె లన్నియును సమకూరెనని తలంచెను. మఱియుఁ బరమాత్మోపాసనమున కంగములైనవర్ణాశ్రమోచితకర్మములను దేశానుగుణముగాను గాలానుగుణముగాను యథాశక్తిగాను బరమేశ్వరప్రీతిగా నొనర్చెను. ఇంతియ కాక యతఁడు తా నొనర్చుకర్మములఫలము నం

తను బ్రహ్మాధీనముగాఁ జేసి సంగమును బాసి సకలకర్మములందు
ను గర్తృత్వాభిమాని యైనప్రత్యగాత్మ ప్రకృతికంటె వేఱైన
దని తెలిసికొనియే కర్మాచరణము చేసెను. ఓవిదురా! ఆపృథు
రాజు భోగస్థానము లగుగృహములందుఁ జరించుచున్నవాఁ
డయినను, సార్వభౌమసంపదలతోఁ గూడియున్నను, దేహాత్మ
భ్రమను విడిచి కావుననే శబ్దాదివిషయంబుల కధీనుండు కాక
పంకాదులందుఁ గాంతిచేఁ గానవచ్చుచున్నను దత్సంగదోషము
ను బొందనిసూర్యునివలెఁ బ్రవర్తించుచుండెను. ఇట్లు పృథురా
జు భక్తియోగముచే సమస్తకర్మములను నాచరించుచు నర్చి
యనుభార్యయం దాత్మతుల్యులయిన యైదుగురుపుత్త్రులను
గాంచెను. వారు విజితాశ్వుఁ డనియు, ధన్వకేశుఁ డనియు, (లేక
ధూమ్రకేశుఁడు) హర్యక్షుఁ డనియు, ద్రవిణుఁ డనియు, వృకుఁ
డనియు, నామములచేఁ బిలువఁబడిరి. మఱియుఁ బృథురా
జింద్రాదిదేవతలందుఁ గలయసాధారణగుణముల ధరించుచున్న
వాఁడై పరమాత్మచే సృజింపఁబడినసృష్టి నుచితకాలములందు
రక్షించుచు మనోవాక్కాయకర్మములచేతను, సౌమ్యగుణముల
చేతను, బ్రజలనందఱను రంజింపఁజేయుచు, లోకరంజనము
చేసి రాజనామమును ధరించినచంద్రునివలెఁ బ్రజారంజనమును
చేసి యథార్థరాజశబ్దమును వహించెను. సూర్యుఁడు తనకిరణ
ములచే జలమును గ్రహించి వర్షరూపమున మఱల నిచ్చునట్లు
వలెనే యతఁడు ప్రజలవలన ధనమును దీసికొని మగుడఁ బ్రజలకు
నొసంగుచుండెను. అతఁడు ప్రతాపముచే నగ్నివలెనే శత్రువుల
కు దుస్సహుఁడై యుండెను. అతఁడు దేవేంద్రునివలెనే జయిం
పఁదరము కానివాఁడు. అతఁ డపరాధుల క్షమించుటలో భూ

మికిఁ దుల్యుఁ డగుచుఁ బ్రజలకోర్కులఁ దీర్చుటలోఁ గామధేను
వున కెనవచ్చుచు, మేఘునివలె యథేష్టముగా వస్తువులనువర్షించి
ప్రజలకుఁ దృప్తి గలిగించెను. ఇంతియ కాక యమ్మహాత్ముఁడు
సముద్రునివలె దుస్తరుండై, మేరువువలె నిశ్చలుండై, ప్రజా
శిక్షయందు యమధర్మరాజును బోలుచు, నైశ్వర్యమునకు
రత్నాకరుఁడయిన హిమవంతునిఁ బోలుచు,మంత్రగోపనమందు
వరుణునిఁ బురుడించుచు,ధనరక్షణమందుఁ గుబేరుని కీడగుచు,
సర్వగామి యగుటలో వాయువునకు సరి వచ్చుచు, బలముచే
తను దేజంబుచేతను దేహకాంతిచేతను దుస్సహత్వముచే
తను రుద్రునకు సాటి యగుచు, సౌందర్యమునఁ గందర్పునిఁ
గ్రిందుసేయుచు, స్వేచ్ఛావృత్తియందు సింహముతో నుపమ
నొందుచు, వాత్సల్యగుణమందు స్వాయంభువమనువు బోలు
చు, సామర్థ్యమందు బ్రహ్మను ధిక్కరించుచు, వేదవాదమందు
బృహస్పతిని దిరస్కరించుచు, స్వాతంత్ర్యమందు హరిని విడం
బించుచు వెలయుచుండెను. మఱియుఁ బృథురాజు గోవులందు
ను, గురువులందును, బ్రాహ్మణులందును, విష్ణుభక్తులందును,
మిగుల భక్తికలవాఁడై లజ్జచేతను, వినయముచేతను, సచ్ఛీల
ముచేతను,నిరుపమానుఁ డయి పరోపకారముచే సుప్రసిద్ధుఁడై
ముల్లోకములందు నివసించుపురుషులచే గానము చేయఁబడు
సత్కీర్తిచే సకలస్త్రీలకర్ణబిలములందును శ్రీరామచంద్రుని
వలెఁ బ్రవేశించెను. ఇది యిరువదియొకటవ యధ్యాయము.

---

పృథువు భార్యతోఁ దపోవనంబున కేఁగుట.

ఓవిదురా! పృథురాజొకప్పుడు తన్ను వృద్ధునిగా నెంచికొని స్వర్గాదిఫలము లల్పకాలస్థాయు లనుకొని తనదేశమం దున్నవారి నందఱను నాదరించి వర్ధించి స్థావరజంగమములకుఁ దగువిధమున జీవనము నిచ్చి, సత్పురుషులయందు ధర్మమును జూపుచుఁ బ్రజాపాలనరూప మగునీశ్వరాజ్ఞను నిర్వర్తించి, తన వియోగమును సహింపలేక రోదనము చేయుచున్నట్లు గాన వచ్చుకుమారికవలె నున్నభూమిని గుమారులందుఁ బొందుపఱిచి, తనయెడఁబాటునకుఁ బ్రజలందఱు విమనస్కు లగుచుండ, భార్యాసమేతుఁ డయి, వేఱుసాయము లేనివాఁడయి తపోవనమును బ్రవేశించి శమదమాదినియమముల నవలంబించి, వానప్రస్థు లాచరించెడియుగ్రతపంబులు జేయ దొరఁకొని పూర్వము భూమండలమును జయించుటకుఁబోలెనే యిప్పుడును దృఢప్రయత్నుఁడై యుండెను. మఱియు నతఁడు కృతనియముఁడై యొక్కప్పుడు కందమూలములను ఫలములను భక్షించుచు, నొకప్పుడుపండుటాకులం దినుచుఁ గొన్ని పక్షములందుఁ గేవల ముదకమునే త్రావుచు; మఱికొన్ని పక్షములందు వాయువును మాత్రము భక్షించుచుండెను. అతఁడు గ్రీష్మమందుఁ బంచాగ్నిమధ్యమం దుండియు, వర్షఋతువందు వర్షములో నిలిచియు శిశిరఋతువందుఁ గంఠదఘ్నజలంబులో నివసించియు, కటిక భూమియందుఁ బండుకొనుచు, నిరంతరమును మౌని యై ఘోరతపం బాచరించుచుండెను. అమ్మహాత్ముఁ, డట్లు శీతోష్ణాదిద్వంద్వంబులనోర్చి మౌనమవలంబించి యింద్రియముల నిగ్రహించి యూర్ధ్వరేతస్కుఁడై, వాయువును బంధించి, యిట్టితపంబు

నాచరించుచుఁ బరమపురుషుఁ డయినకృష్ణుని నారాధించుచుం
డెను. ఇట్లు పృథువు క్రమక్రమముగా సంపాదించినతపంబుచేఁ
గర్మములను నశింపఁ జేసికొని ప్రాణాయామములచే మనంబును
విమలంబుగాఁ జేసికొని యింద్రియవర్గమును వశము గావించు
కొని, తను స్థబంధనములను దొలంగించుకొని సనత్కుమారుఁ
డుపదేశించినయాధ్యాత్మికయోగముచేఁ బరమపురుషుని భజిం
చెను. ప్రవృత్తికర్మముల నవలంబించి శ్రద్ధచే యజ్ఞము చేయు
చున్నసాధు వగుపృథువునకుఁ బరబ్రహ్మమునం దవ్యభిచారిణి
యగుభక్తి కలిగెను. మఱియు భగవంతునిపరిచర్య నిర్మ
లాంతఃకరణుఁ డైనపృథురాజునకు నాపరమాత్మను సంస్మరిం
చుకొనుటవలనఁ గలిగినపూర్వోక్త మగుభక్తికిఁ బూర్ణత్వమును
గలిగించె. అందువలనఁ బరజ్ఞానమును వైరాగ్యమును గలిగినవి.
ఆతీవ్రజ్ఞానము నిశ్చయింపఁదరముగానిప్రకృతితత్త్వమును ఛేదిం
పఁదగినసామర్థ్యము గలది. అట్టిజ్ఞానముచే నతఁడు ప్రకృతితత్త్వ
సంబంధమును వదలుచుకొనె. ఇంతియ కాక దేహాత్మబుద్ధిని
విడిచి యాత్మస్వరూపయాథాత్మ్యమును దెలిసికొని కావున నే
నిర్వ్యాపారుఁ డయి జ్ఞానముచేఁ బ్రకృతితత్త్వమును ఛేదించి
యితఁడు భగవత్కథలందుఁ బరమప్రీతి కలవాఁడు కాన యో
గమార్గములందుఁ బ్రమాదము లేనివాఁ డయి ప్రవర్తించెను.
ఇట్లు పృథుమహీపతి యాత్మకుఁ బరమాత్మతో స్వతస్సిద్ధ
మగు నపృథక్సిద్ధసంబంధము ననుసంధానముచేసి యష్టగుణా
విర్భావమును బొంది ప్రారబ్ధావసానము దఱియఁగానే నిజ
కళేబరమును విడిచిపుచ్చెను. ఓయీ! యాతఁ డెట్లు కళేబర
మును త్యజించి బ్రహ్మభావమును బొందెనో వివరించెదను. విను

ము. అతఁడు మడమచే గుదస్థానమును నిరోధించి మూలాధారమునుండి వాయువును మెల్లగా మీఁదుగా నాభిని బొందించుచు, నచ్చటినుండి క్రమముగా హృదయమును, వక్షఃస్థలమును, కంఠమును, శిరస్సును, బొందించెను. తరువాత బ్రహ్మరంధ్రమునం దావాయువును సంధించుచు, నణిమాదులగు నష్టైశ్వర్యంబులందును స్పృహ లేనివాఁ డయ్యె, వాయువును మహావాయువునందును, దేహమును బృథివియందును, దేహస్థమగు జలమును, దోయమందును, నింద్రియాధిష్ఠానవివరములు గగనమందును, గారణము నతిక్రమింపకుండను సంకరము లేకుండను, ననుసంధానము చేసెను. ఓయీ! దేహస్థము లగు భూతాంశములను మహాభూతములతో ననుసంధానమును జేప్పితిని. ఇఁకఁ బృథివ్యాదితత్త్వముల కుత్పత్తిక్రమమునుబట్టి లయానుసంధానమును వచించెదను వినుము. పృథివీభాగమును, మహాభూత మయినజలమునందును, నాజలమును దేజస్సునందును, నా తేజమును వాయువునందును, నావాయువు నాకాశమందును ననుసంధానముచేసెను. తరువాత నింద్రియములందు మనంబును, నాయింద్రియాదులను శబ్దాదితన్మాత్రములందును, వానిని గారణమైనభూతాదులందును, లయమును బొందించి యాత్మను మహత్తత్త్వమునం దనుసంధానముచేసెను. పిమ్మట నామహత్తత్త్వమును సత్త్వాదిగుణములస్థితికి మూల మయిన యవ్యక్తమునందు సంధించెను. అనంతరము జీవుఁ డయినపృథురాజు ప్రకృతిసంబంధము నిట్లు వదలించికొని జ్ఞానవైరాగ్యబలముచే భుక్తావశిష్టమైనపుణ్యపాపకర్మములను విడిచి యష్టగు

ణావిర్భావము కలవాఁడయి యొప్పెను. పిమ్మట పృథురాజుభార్యయును సుకుమారవంతురాలును, నగునర్చి కాలితోఁ భూమిని స్పృశింపనంతటిమహాభోగవంతురా లయినను, భర్తతోఁ గాలినడకనే దుర్గమవనంబులకేఁగి పాతివ్రత్యమందు మిగుల నిష్ఠ గలదయి యనవరతమును భర్తకుఁ బరిచర్యను సేయుచు మునులవలెనే కందమూలాదులను దినుచు నందువలన మిగులఁ గృశీభూతాంగి యై తనపతికరస్పర్శాదులచే సుఖ మనుభవించుచు దుఃఖ మన్న నెట్టిదో యెఱుంగకపోయెను. అంత నర్చి తనకును భూదేవికిని నధిపతి యైనపృథురాజు బుద్ధీంద్రియప్రాణాదులను విడుచుటఁజూచి కొంచెము విలపించి తన్ను నాపద్వారావమునుండుఁ జితి నిర్మింప నిశ్చయించెను. ఇట్లు నిశ్చయించి తత్కాలకృత్య

## పృథురాజుభార్య యర్చి యగ్నిప్రవేశ మగుట

ముల నెఱవేర్చి యచ్చటినదిలోఁ దానములాడి యుదారకీర్తిఁడగుభర్తకు జలతర్పణంబు లొసంగి యాకాశమం దున్న దేవతలకు నమస్కరించి భర్తపాదకమలములను సంస్మరించుచు నా చితికి మున్మూఁడు ప్రదక్షిణము చేసి యగ్నిని బ్రవేశించెను. ఇట్లర్చిదేవి వీరశ్రేష్ఠుఁడగుపృథురాజు ననుసరింపఁగా దేవతాస్త్రీలామెపాతివ్రత్యమునకు సంతసించి దేవతలతోఁ గూడ నామెను స్తోత్రము చేయఁ దొడంగిరి. మఱియు నాసమయమున నామందరపర్వతసానువందుఁ బుష్పవర్షములు గురిసెను. దేవదుందుభులు మ్రోయ నారంభించెను. అప్పుడు దేవత లొండొరులతో నిట్లు సంభాషింపఁ దొడంగిరి. "అహాహా! ఇది యేమి వింత! యజ్ఞపతి యైననారాయణునిశ్రీమహాలక్ష్మివలెనే రాజాజయినపృథురాజును సర్వవిధములచేతను సేవించుచున్న యీయామె

యొంటియు ధన్యురాలు ఈమె పతివ్రతా శ్రేష్ఠురాలు కావునఁ జూచుచున్న మనల నతిక్రమించి దురూహమయిన పాతివ్రత్యాది కర్మములచేఁ దనభర్తను దప్పక యనుసరించి యూర్ధ్వలోకములకుఁ బోఁగలదు నిష్కామధర్మముల నవలంబించినవారగుచుం చలాయుర్దాయము కలవారయినను భగవత్పదమును సాధించుచున్నారు. ఇట్లుండఁగా వారు తెక్కైన దేవపదముల సాధింతురని చెప్ప సందియ మేమి కలదు? మోక్షమును సాధింపఁ గలిగినమనుష్యజన్మమును నతికష్టముచేఁ బొందియు, మోక్షమును నపేక్షింపక విషయసుఖము లనుభవించువాఁడు దైవముచే వంచితుఁ డయినవాఁడని చెప్పవచ్చునుగదా! ఎంతకష్టము! ఎంత కష్టము!" అని దేవతాస్త్రీలు నుతించుచుండఁగా నచ్చిద్దేవి జ్ఞానవంతులలో శ్రేష్ఠుఁడగు పృథురాజుఁ బొందినద్దై నారాయణునకాశ్రయభూత మగు వైకుంఠమునే పొందెను ఓవిదురా! *భగవంతులలో నుత్తముఁ డయి మహాప్రభావసంపన్నుఁ డయి యుదారచరిత్రుఁ డయి, యున్న పృథురాజుచరిత్రమును సాంతముగా వక్కాణించితిని. మహాపుణ్యసాధన మయిన యీ పృథురాజుచరిత్రమును సమాహితచిత్తుఁడై శ్రద్ధచేఁ జదివినను జదివించినను, నమ్మహాత్ముఁడు పృథురాజు పొందిన యుత్తమలోకమునే పొందును. బ్రాహ్మణుఁ డీచరిత్రమును విన్నచో బ్రహ్మ

---

* ఇందులకు మూలమున "భగవత్తమః" అని యున్నది. ఇట భగవంతుఁ డనఁగాఁ బరమేశ్వరుఁ డని యర్థము కాదు. శ్లో॥ ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానా మాగతిం గతిం। వేత్తి విద్యా మవిద్యాంచ సవాచ్యో భగవానితి. "ఉత్పత్తిలయములను, భూతములరాకపోకలను, విద్యను, నవిద్యను, ఎఱింగినవాఁడే భగవంతుఁ డని చెప్పఁబడును."

ర్చస్సు గలవాఁ డగును. క్షత్త్రియుఁ డీచరిత్రమును బఠించిన
జగతీపతి యగును. వైశ్యుఁడు విన్నచో వైశ్యోత్తముఁ డగును.
శూద్రుఁడు విన్నచోఁ దనజాతివారిలో నుత్తముఁ డగును.
స్త్రీయైనను, బురుషుఁడైనను, నాదరయుక్త మగు మానసం
బులో నీచరిత్రమును ముమ్మాఱు విని, సంతానము లేనివాఁడు
సంతానమును బొందును. నిర్ధనుఁడు ధనమును బొందుచున్నాఁడు.
మఱియుఁ గీర్తిలేనివాఁడు కీర్తిమంతుఁడును, మూర్ఖుఁడు విద్వాం
సుఁడు నగుచున్నాఁడు. ఈచరిత్రము శుభప్రద మయినది. ఇది
ధనమును, యశంబును, నాయువును, స్వర్గమును, గలిదోషము
లఁ బాపికొనఁగినశక్తిని నొసంగును. ఫలాభిలాషులు ధర్మార్థకా
మమోక్షములను దప్పక సాధించునీచరిత్రమును శ్రద్ధచే విని
తీఱవలయును. ఈచరిత్రమును విని యుద్ధయాత్రకు బయలు
వెడలినచో నట్టిరాజునకు మిగిలినరాజులు పృథురాజునకు బలులు
తెచ్చి సమర్పించినట్లు సమర్పింతురు. మఱియుఁ బురుషుఁ డన్య
సంగములను విడిచి భగవంతునియందు భక్తి గలిగి యద్భుత
పరాక్రమవంతులకుఁ బ్రియతమమును బరమేశ్వరుని మాహా
త్మ్యమును దెలుపునట్టియుఁ బవిత్రమును నగుపృథురాజుచరి
త్రమును వినవలయును; వినిపింపవలయును: పఠింపవలయును.
అట్లు చేసిన నమ్మహాత్ముఁడు, పరమేశ్వరునందు స్థిరబుద్ధి గలవాఁ
డై పృథురాజు పొందినలోకమును పొందును. ఈచరిత్ర
మును మానవుఁ డత్యాదరముచేఁ బ్రతిదినమును వినుచుఁ జదు
వుచు నున్నచో, నితరఫలములను విడిచి సంసారసముద్రమును
దాఁటింప, నావలనంటిపాదపద్మములు గలభగవంతునియందు
స్థిరబుద్ధిని పొందుచున్నాఁడు. ఇదియిరువదిరెండవయధ్యాయము.

ఓవిదురా! పృథురాజకుమారుఁడయినవిజితాశ్వుఁడు చక్రవర్తియై విపులకీర్తిగలవాఁడయ్యెను. మఱియు నతఁడు సోదరులందుఁ బ్రేమ గలవాఁడయి వారలకు దిక్కులఁ బాలింప నాజ్ఞ యొసఁగెను. అందు హర్యక్షునకుఁ బూర్వదిక్కును ధూమ్రకేశునకు దక్షిణమును, వృకునకుఁ బశ్చిమదిక్కును, ద్రవిణునకు నుత్తరదిక్కును, బంచియిచ్చెను. పృథురాజునశ్వమేధమందు హయమును దాఁచి దేవేంద్రునివలన నంతర్ధానగతిని బొంది యంతర్ధానుఁ డనునామాంతరము గలవిజితాశ్వుఁడు శిఖండిని యనుభార్యయందు యోగ్యులగుముగ్గురుపుత్త్రులను బడసెను. వారు వసిష్ఠునిశాపమువలన మనుష్యులందుఁ బుట్టఁదగినగార్హపత్యము, ఆహవనీయము, దక్షిణము ననునగ్నులేకావున వారు మరల నగ్నిత్వమునే పొందిరి. హయాపహారియైనయింద్రుఁడు తనకంటఁ బడినను జంప నిష్టపడనియుదారగుణుండయి నవిజితాశ్వుఁడు నభస్వతి యనుమఱియొకభార్యయందు హవిర్ధానుఁడనుపుత్త్రునిఁబడసెను. ఆహవిర్ధానుఁడు పన్నులనురాఁబట్టుట, ప్రజాదండనము మొదలగుదారుణకృత్యములు గలరాజవృత్తి నవలంబింపఁ దలంపు లేక దీర్ఘసత్త్రము నాచరింప నారంభించెను. అంద తఁడు ప్రకృతివిలక్షణ మగునాత్మస్వరూపమునెఱింగి భక్తులక్లేశములను హరించుచున్న పరమాత్మను బూజించుచు నిరంతరాయ మగుదీర్ఘసమాధిచే భగవల్లోకము నధివసించెను. ఓవిదురా! ఆహవిర్ధానునకు హవిర్ధానియనుభార్యయందు బర్హిషదుఁడు మొదలగు నార్వురుపుత్త్రులు గలిగిరి. వారిలో బర్హిషదుఁడు ప్రజాపాలనమందు నిపుణుఁడయి, క్రియాకలాపమందును యోగములందును బరమనిష్ఠ గలవాఁడాయెను.

మఱియు నతఁడు భూవలయమునంతను యజ్ఞవాటముగాఁ గావించి యొకచో యాగము చేసి మఱుఁడ నాసమీపభూమి యందే యాగము లొనర్చుచు నిట్లు ప్రాచీనాగ్రము లగుదర్భలచే భూమండలమును గప్పెను. కావుననే యతనికిఁ బ్రాచీనబర్హి యనునామము గలిగెను. ఆప్రాచీనబర్హి సముద్రునికుమారికయును, బాలయు, సుందరాంగయు, సకలాలంకారశోభితయు వివాహమునకు యోగ్యురాలు నగుశతద్రుతిని వీక్షించి యగ్నియాజ్యధారనువలెఁ గోరికొనెను. నూపురధ్వనులను జేయుచు మెలంగుచున్నయాశతద్రుతినిఁ గాంచి విబుధులు, రాక్షసులు, గంధర్వులు, మునులు, సిద్ధులు, మానవులు, పన్నగులు, మిక్కిలి మోహమును జెందిరి. ప్రాచీనబర్హియాశతద్రుతియందు, సమానము లగువ్రతాచారములు గలిగి ధర్మపారగు లయినప్రచేతనులనుపుత్రులను బదుగురఁ బడసెను. వారు తండ్రిచేఁ బ్రజాసర్గమందుఁ బ్రేరితు లయి తపం బొనర్చుటకై వనంబునకుఁబోయి మార్గమధ్యంబునఁ గనవచ్చినశంకరునివలన నుపదేశ మందిన పరమాత్మతత్త్వమును ధ్యానించుచు, జపించుచు, సమాహితచిత్తులై పదివేలవత్సరంబులు భగవంతునిఁ దపంబున నారాధించిరి. అనిన విని విదురుండు మైత్రేయుం గాంచి "మునీంద్రా! శంకరునకునుఁ బ్రచేతసులకును, మార్గమందు సమావేశ మెట్లు కలిగెను ? శంకరుఁడు వారలకుఁ బ్రసన్నుఁడై యేమి యుపదేశించెను ? దానిని నాకు వచింపుము. ఓమునీంద్రా! దేహధారులకు సంసారమందు శివునితో స్నేహము గలుగుట దుర్లభము. మును లయిననుఁ దమ కిష్టుఁడయినశివుని ధ్యానించి రేకాని యతినిసంగతిని బొందలేకపోయిరి. ఉత్పత్త్యాది జ్ఞానము గలశంకరుం

డాత్మారాముఁడగుటచే లోకంబునఁ దనకుఁ బ్రయోజనంబు లేకపోయినను దీనుల ననుగ్రహించుటకై స్త్రీసమేతుఁడై, భయంకరమూర్తియై చరించుచుండును." అనవుఁడు మైత్రేయుం డిట్లనియె. 'ఓవిదురా! ప్రచేతసులు తండ్రియైన ప్రాచీనబర్హివాక్యము శిరంబున నుంచి మిగుల గౌరవించి సృష్టినిమిత్తము తపం బొనరింప నెంచి పడమటిదిశ కేఁగిరి. వా రట్లు చని చని సముద్రసమీపమున నొకసరోవరంబును బొడగాంచిరి. అది

### ప్రచేతసులు తపోవనంబున కేఁగుట

మిక్కిలి విస్తీర్ణమయి జ్ఞానవంతునిమానసంబుచందంబున నిర్మలంబు లగుజలంబులు గలిగి మత్స్యసంకులంబయి విలసిల్లుచుండెను. దానియందు, నీలోత్పలములును, నెఱ్ఱగలువలును, బద్మములును, గల్హారములును, సామాన్యపుఁగలువలును వెలయుచుండె. మఱియు నందు హంసములు సారసపక్షులు చక్రవాకములు కారండవంబులు విహరించుచు మధురంబుగా ధ్వనులు చేయుచుండె. తత్తీరంబున నున్నవృక్షంబులు పుష్పితలతాసంశ్లిష్టంబు లయి మదించినతుమ్మెదల మధురస్వరంబులకుఁ బులకితగాత్రంబు లయినట్లు కనుపట్టుచుండెను. మఱియు నట నాయువు పద్మకోశంబులం దున్న పరాగంబును నలుదిక్కులను వ్యాపింపఁజేయుచుండెను. అట రాజపుత్త్రులు మృదంగాదిధ్వనులతో సహితముగాఁ బలువిధములుగా దేవతలు పాడుచున్న గానంబును విని మిక్కిలి విస్మయముఁ జెందిరి. ఆసమయమునందే సహచరసమేతుఁడై యాసరస్సువలన బయలువెడలి గంధర్వకిన్నరకింపురుషాదులచే నుతింపఁబడుచు, దేవతలలోనుత్తముఁడయి, తప్తకాంచనసదృశమగు దేహము గలిగి, నల్లనికంఠముతో నొ

ష్టాచుఁ బ్రసన్నవదనుం డయి, నేత్రత్రయముచేఁ బ్రకాశించుచు, నున్నశంకరునిఁ గాంచి యధికకౌతూహలంబునఁ బ్రణమిల్లిరి. అంత భక్తవత్సలుఁడును, భక్తులయార్తిని హరించువాఁడు నగు శంకరుండు ధర్మజ్ఞులును, సచ్చరిత్రకలవారును, దనకు నతులయినవారును, నగు ప్రచేతసులను గాంచి సంతసించి యిట్లనియె.

—●●◆ శంకరుఁడు ప్రచేతసులకు హిత ముపదేశించుట. ◆●●—

"ఓయీ! మీరు ప్రాచీనబర్హికుమారులరు. మీతలంపు నాకెఱుకయే యున్నది. మిమ్ము ననుగ్రహించుటకే మీ కిపుడు దర్శనమొసంగితిని. ఓరాజపుత్రులారా! త్రిగుణాత్మకమగుమాయకంటెను జీవునికంటెను బరుఁడయి, జ్ఞానాదిషడ్గుణములు గలిగి యున్న వాసుదేవుఁడు నాకు మిక్కిలి ప్రియుఁడు. పురుషుఁడు స్వకులాచారధర్మముల నాచరించుచు నూఱుజన్మంబులుకడపినచో బ్రహ్మలోకమును బొందును. అటుపై నాలోకమును బొందును. పిమ్మట మాయాయధికారానంతరమునందు నేనును, బ్రహ్మేంద్రాదులును బోవుచుండఁగా నే నాపురుషుఁడును నేత్రగోచరము కానివైకుంఠమును బొందును. కాని మీరు భగవద్భక్తులయియుండుటచే నట్లనే నాకు భగవంతునివలెఁ బ్రియుండ్రో మీరు నట్లయగుదురు. భాగవతులకు భగవద్భక్తులను మించి నప్రియు లుండరు. ఓయీ! జపింపఁదగినపరతత్త్వమును మీ కుపదేశించెదను. ఆతత్త్వము సాంకర్యరహితమయి, ప్రకృతిపురుషులకంటె విలక్షణము. కావున నే, పవిత్రమై, మంగళమై, ధర్మార్థకామమోక్షములను సాధించునదయి, ముక్తిసాధనమయి యుండును" అని కృపాయుక్తుఁడయి శంకరుండు నారాయణుఁడే ప్రాప్యుఁడనియుఁ, బ్రాపకుఁడనియు, భావించి

బద్ధాంజలు లయి యున్న రాజపుత్రుల కుపదేశించుటకు ముం
దుగా సర్వాంతరాత్మ యగుభగవంతున కిట్లు నమస్కరించెను.
జ్ఞానవంతులను రక్షించునోపరమేశ్వరా ! నీసర్వోత్కృష్ట మాత్మ
విదులసుఖమునిమిత్తమగుఁగాక. సర్వదానిన్ను నుపాసించుచున్న
నాకు బ్రహ్మానుభవసుఖము కలుగుఁగాతి. సిద్ధరూపుఁడ వయిననీచే
సంపాదిత మయినయాసౌఖ్యమును నాకును నిఖిలప్రపంచమున
కు నొసంగుచున్ననీకు నమస్కారము. దేవా! నీవు లోకాత్మకం
మగుపద్మము నాభియందుఁ గలవాఁడవు. నీవు భూతసూక్ష్మేంద్రి
యస్వరూపుఁడవు. నీవు సమస్తలోకములకు నధికరణము వయి
వాను దేవుండ వని పిలువఁబడు చున్నావు. నీ వశనాపిపాసాదిషు
డూర్ములు లేనివాఁడవు. కావున నే నీవు నిర్వికారుఁడ వయి
యుందువు. నీవు నిత్యమును సంకోచము నొందనిజ్ఞానము కల
వాఁడవు. అట్టినీకు నమస్కారము. ఓపరమపురుషా! నీవు సమ
స్తప్రపంచమును నీయందు లీనముఁగావించుకొని సంకర్షణుఁడ
వనఁబడు చున్నాఁడవు. మఱియు నీవు ముఖాగ్నిచే లోకదాహ
మొనరించు చున్నావు. నీవు నామరూపముల విభాగింపఁ దగ
నంతసూక్ష్మము లయినచిదచిత్తులతోఁ గూడియుందువు. అయిన
ను నాశరహితుఁడవు. మఱియు నీవు ధర్మార్థకామాదిపురుషా
ర్థములను సాధించునుపాయములఁ దెలుపువేదము నుపదేశించి
సమస్తమును బోధించుచున్నవాఁడవు. నీవు దురాత్ముల ఖండిం
చుటకును, సజ్జనుల రక్షించుటకును, నవతరించినరామకృష్ణాద్య
వతారముల విభవమునకు మూల మయినప్రద్యుమ్న వ్యూహ
మవు. నీవు సర్వదేశములందును, సర్వకాలములందును, సమ
స్తమందు నొక్కమాఱుగాఁ బ్రవేశించి యనుశాసించువాఁడవు.

అట్టినీపాదములకు వందనములు. ఓపరమేశ్వరా ! నీవు మనఇం ద్రియస్వరూపుఁడవు. నీ వనిరుద్ధవ్యూహమవు నీవు నీయందును నీయాశ్రితులందును బుణ్యాపుణ్యరూప మగుకర్మములను తే కొంచెఁ దజేమి పరమహంస వనియు నపహతపాప్ముఁడ వనియుఁ బరఁగుచున్నావు. నీ వంతర్బహిర్భాగములందుఁ బూర్ణుండవయి యున్నావు. నీవు శోకాదిదుర్గుణములు లేనివాఁడవు.అట్టినీకునమ స్కారంబులు. ఓపరమాత్మా! నీవు స్వర్గమునకును. మోక్షము నకును సాధనమవు. నీవు సర్వదా యోగీశ్వరులచిత్తమందుఁ బ్రకాశించుచున్నావు. నీ వగ్నిస్వరూపుఁడవు. నీవు చాతుర్హోత్ర మునకు సాధ్యుఁడవు. నీవు యాగస్వరూపుఁడవు. వే యేల? య జ్ఞస్వరూపుఁడవును, యాగారాధ్యుఁడవును యజ్ఞఫలప్రదుఁడవు ను నై యున్నావు. అట్టినీకు నమస్కారములు. ఓ దేవా ! నీవు దేవపితృదేవతలకు నన్నస్వరూపుఁడ వయి యొప్పుచున్నావు. నీవు వేదముల కధిపతివి. నీవు యాగమునకు ఫలమవు.నీవు జీవు లకు శబ్దస్పర్శాదివిషయసుఖముల నిచ్చువాఁడవు. నీవాహ్లాదకలుల వణాది రసస్వరూపుఁడవు. అట్టినీ కభివందనములు. ఓయీశ్వ రా! నీవు సకలసత్త్వస్వరూపుఁడవు. నీవు పృథివీస్వరూపుఁడ వును,తద్గత మగుగంధమవు నై యున్నావు. నీవే బలమవు. నీవే యోజస్సవు?నీవేతై ౧లోక్యపాలకుఁడవు. అట్టినీకు నమస్కారము లు. ఓ దేవా ! నీవు శబ్దమే గుణముగాఁగలయాకాశమవు. నీవు వాయుతద్గుణస్వరూపుఁడవు.నీవుతిలలందు తైలమువలె జగముల యంతర్బహిర్భాగంబులందు వ్యాపించి యున్నావు. నీవు యజ్ఞ దానాదిరూపము లగుపుణ్యములే యాకారముగాఁ గలవాఁడవు. నీవు లోకస్వరూపుఁడవు. నీవు జ్ఞానప్రచురుండ వయి యొప్పుచు

న్నావు. అట్టినీకు నమస్కారములు. ఓయీశా! నీవు నివృత్తికర్మములేని స్వరూపముగాఁ గలవాఁడవు. నీవు ప్రవృత్తికర్మస్వరూపుఁడవును, తదారాధ్యుఁడవును, తత్ఫలప్రదాతవునై యున్నావు నీవు ఫలాపేక్ష లేకుండ నారాధించినవారికి ఫలరూపుఁడ వయి యుందువు. మఱియు నీవు దుఃఖప్రదయగుమృత్యుదేవత వగుచు యుందువు. అట్టినీకు నమస్కారములు. ఓపరమేశ్వరా! నీవుధర్మాదులకు ఫలప్రదాయకుండవు నీవుసర్వజ్ఞుండవు నీవు స్వరూపముచేతను గుణములచేతను సర్వోత్కృష్టుండవు. నీ వొకవ్యక్తుఁడవు బ్రహ్మహితము కానిజ్ఞానము కలవాఁడవు. నీవు కృష్ణాఖ్యమగుసిద్ధధర్మమే రూపముగాఁ గలవాఁడవు అట్టినీకు నమస్కారములు. ఓయీశ్వరా! నీవు పురాణపురుషుఁడవు. నీవు కపిలావతారముఁ దాలిచి సాంఖ్యేశ్వరుఁడవని ప్రసిద్ధి [illegible]. నీవుపుష్టిరూపశక్తిచేతను, బాలనరూపశక్తిచేతను, [illegible]రూపశక్తిచేతను కూడి [illegible]వాఁడవు. నీవు [illegible] [illegible]రుఁడవయి ప్రకాశించుచున్నావు. నీ [illegible] [illegible]త్త్వమవయి విలసిల్లుచున్నవాఁడవు. నీవు మనస్సే రూపముగాఁ గలవాఁడవు. నీవు [illegible]పదరూపముచుఁ [illegible]పొందుచున్నాఁడవు. అట్టినీకు నమస్కారంబులు. ఓపరమాత్మా! భక్తు

## భగవంతునిరూపవర్ణనము.

లచే నారాధింపఁబడుచుం గంటికిఁ గానరాక [illegible]నట్టి నీస్వరూపమును మాకుఁ గనఁబఱుపుము. నీరూపము భక్తులకుఁ బ్రియమగునది. అది యింద్రియముల [illegible] [illegible] దెలియఁబడదు. అది మిగులఁ గోమలమయి [illegible]ఘము నుబోలుచుండును. అది సకలసౌందర్యములకు [illegible]. అనీ

దీర్ఘాకారములు సుందరము లయి జానువులపర్యంతము వ్రేలాడు చున్న నాలుగు బాహువులు గలది. అది సుకుమార మైసుందర మై యున్నముఖముచేతఁ నొప్పుచున్నది. అది తామరపువ్వులోని రేఁపలిదళములఁ బోలిన నేత్రములచేఁ బ్రకాశించుచున్నది. అది మిగుల సుందర మగు కనుబొమలతోను, నాసికతోను వెలయుచున్నది. అది సుందర మగు దంతములును గలిగి సొగసయిన చెక్కిళ్లతోను, ముఖముతోను రంగారుచుఁ గర్ణభూషణములతోనుఁ జెన్నారుచున్నది. అది ప్రేమచేఁ బ్రసన్నము లగు కడకంటిచూపులచే నలరుచుఁ గుంతలంబులచేఁ బ్రకాశించుచుఁ గ్రొత్తపద్మకింజల్కములవలెఁ బచ్చనిదుకూలములచే రాణించుచున్నది. అది నిర్మలము లగు మకరకుండలంబులచే మండిత మై, ప్రకాశించు చున్నకిరీటము, కడియములు, తారహారములు,అందెలు. మొలత్రాడు మొద లగునలంకారంబులు గలిగి, శంఖచక్రములచేతను, గదచేతను, పద్మముచేతను, వనమాలచేతను, నానావిధరత్నములచేతను, సొంపారుచున్నది. మఱియు నీయాకారము సింహస్కంధములవంటిస్కంధములందుఁ గుండలహారాదులకాంతులఁ గలిగి కౌస్తుభరత్నముచే నొప్పారుకంఠముచేతఁ గులుకుచు, శ్రీవత్సము గలదగుటచే, బంగారురేఖలచే వెలయు నికషపాషాణంబున కీడువచ్చువక్షఃస్థలంబుం గలదై ప్రకాశించుచున్నది. అది యుచ్ఛ్వాసనిశ్వాసవాయువులచేఁ జలించునుదరరేఖలు గలిగి, సుందరమై, యశ్వత్థపత్రమువలె సొంపుగులుకు నుదరముచే విరాజిలుచున్నది. అది సుడివలెనే లోఁతయి తనవలన నింతకుమున్ను నిర్గమించినప్రపంచమును మగుడ లోనికిఁ బ్రవేశింపఁజేయుదానివలెఁ బొలుపారునాభి కలది.ఆనీయాకార

ము శ్యామలవర్ణము గలపిఱుఁదులందుమిక్కిలిప్రకాశించుపచ్చపట్టువస్త్రము చేతను, దానిమీఁద వెలయుబంగారుమొలత్రాటిచేతను, శోభిలుచున్నది. అది సమ మయినయడుగులును, బిక్కలును, నూరువులును, నున్నతములు కానిజానువులును గలిగి నేత్రానంద మొనర్చుచున్నది. ఓమహానీయా! దళములవంటివ్రేళ్లును, గేసరములవంటినఖములును గలిగి శరత్కాలపద్మమున కీడువచ్చుచుఁ బాపములను దూలించుచు, భక్తుల భయమును బాపుచు నున్ననీపాదమును నాకుఁ జూపుము. నీ వజ్ఞానులకు గురువవై మార్గదర్శకుఁడ వై యుందువు. ఈవర్ణింపఁబడిననీరూపము, చిత్తశుద్ధిని గోరుచున్నమాకు ముఖ్యముగా సంస్మరింపఁదగినదే




కాని ప్రత్యక్షము కాదు. నీరూపధ్యానము స్వధర్మముల నాచరించుపురుషులకు మోక్షసాధన మగుభక్తియోగముగాఁ బరిణమించును. నీవు మానవుల కందఱకును దుర్లభుఁడ వయినను బరమభక్తి గలవారికి, సులభుఁడ వగుచున్నావు. మఱియు నీవుభక్తియోగ మవలంబించినవారికి దక్కుచున్నావు. నీవు కైవల్యముకంటెను గాంక్షణీయుఁడవు. ఓమహానుభావా! యుపాయాంతరములచే నారాధనీయుఁడవు. కానినిన్నును దుస్సాధమయి యవ్యభిచారిణి యగుభక్తిచే నారాధించి త్వత్పాదమూలమును గాక స్వర్గాదిసుఖముల నెవఁడయినను గోరుకొనునా? ఎవ్వఁడును గోరఁడు అందులకుఁ గారణము లేకపోలేదు. యముఁడు ప్రభావముచేతను, నుత్సాహముచేతను, భ్రూక్షేపములచేతను, విశ్వమును నాశనము చేయుచున్నను, నీపాదమూలమును శరణుఁజొచ్చినవారి నేమియుఁ జేయఁజాలఁడు. మఱియు నీభక్తులతోఁ జేసిన

స్నేహమునకు. స్వర్గము సరి రాదు. మోక్షమును తులఁదూఁగ
దు. ఇట్లుండ భక్తసహవాసమునకు నాశీర్వచనవిషయములగు
పశుపుత్త్రాదులు సమానులగుదురా? ఓపాపహంతా! భక్తసహ
వాసము నిరతిశయగుణవత్తరమైనది. కావున నీయశంబుచేతను,
గంగోదకముచేతను క్రమముగా నంతర్బహిర్భాగంబులందలి
మలమును దొలఁగించుకొని భూతదయ కలిగి, సత్వగుణప్రధాన
మగుచిత్తముంగల్గి నొప్పుచు, సత్ప్రవర్త్తనచే వాసికెక్కినసత్పు
రుషసహవాసము మాకు లభించుఁగాక. అది నీయనుగ్రహము
లేక కలుగదు. కావున దయయుంచి యొసఁగుము. ఓమహనీయా!
భక్తియోగముచే ననుగృహీతమయి, సత్వగుణము గలిగి పరి
శుద్ధమగుపురుషునిచిత్తము, శబ్దాదివిషయములం దెప్పుడును
సక్తము కాదు. తమోరూపమయినగుహయం దెప్పుడును లీన
ము కాదు. అప్పుడు ముని నీస్వరూపమును సుఖముగాఁ దెలిసి
కొనుచున్నాఁడు. దేనియందుఁ జిదచిదాత్మకమయినప్రపంచ
మంతయు వ్యక్తమగుచున్నదో, యేనీస్వరూపము సమస్తప్ర
పంచమునందును బ్రకాశించుచున్నదో, యాపరబ్రహ్మతత్త్వము
*వెలుతురువలెను నాకాశమువలెను సకలమందును వ్యాపించి
యున్నది. ఓపరమేశ్వరా! నీమాయ సమస్తజీవులను దనవశము

*ఇటఁ బరమాత్మకు జ్యోతిరాకాశములతో సామ్యము చెప్పుటచే నా
కాశము ఘటాదులందు వేఱువేఱయి కానవచ్చుచున్నను, దద్గతదోషముల
నెట్లు చెందదో, జలమందుఁ బ్రతిఫలించినసూర్యునకు జలగతములగు చలనాది
దోషము లెట్లు పొందవో, యట్లే చిదచిదాత్మకమయిన సకలమందు వ్యా
పించి యున్నపరమాత్మకుఁ జిదచిద్గతములగుదోషము లేవియుఁ జెందవని
తెలియవచ్చుచున్నది.

గావించుకొని సంసారమునఁ ద్రోచి పెక్కు లనర్థంబులఁ గలిగిం
చును. ఆమాయవలన నే జీవునికిఁ నాత్మస్వరూపునికంటెఁ భిన్నుఁ
డనెడిబుద్ధి తాను స్వతంత్రుఁ డనెడిభ్రాంతియు లనే కలుగుచున్నది.
అది బహువిధరూపములుగాఁ బరిణమించుస్వభావముకలది. అట్టి
మాయచేత నీవు ప్రపంచమును సృజించుచు రక్షించుచు మఱ
డ సంహరించుచు నీవిట్టియనల్పకార్యము లొనర్చుచున్నను నిర్వి
కారుండ వయి స్వతంత్రుండ వయి యున్న నిన్ను శరణు పొందు
చున్నాము. ప్రకృతివివిక్త మగునాత్మయొ క్క మోక్షమునకు
మహాత్ములు శ్రద్ధానసముపేతులై ఫలాపేక్ష లేనిస్వవర్ణాశ్రమోం
చితధర్మములచేత, నీస్వరూపమును జెలియ నపేక్షించు యజ్ఞా
కృతదివ్యమంగళశరీరుండ వగుని న్నారాధించుచుఁ గర్మయోగ
ప్రకాశక మగువేదమందును నాత్మతత్త్వజ్ఞానమును దెలుపు
సాంఖ్యమందును గుశలు లగుచున్నారు. ఓజగదీశ్వరా!
సృష్టికిఁ బూర్వమందు నీవు చిదచిదాత్మశక్తులను నీయందిమిడ్చి
కొని, కావున నే యసహాయుండ వయి యొక్కరుండవై వెలయు
చుంటివి. అప్పుడు నీకు లీలలు కల్పించుటయే ప్రయోజనముగాఁ
గలుగునదియు నిన్ను విడిచి వేఱుగానుండఁజాలనిదియునగునీమా
యవలన రజోగుణము సత్త్వగుణము, తమోగుణము విభాగింపఁబ
డినవి. అందురజోగుణాదులవలన మహత్తత్త్వము, దానివలనఁ
ద్రివిధాహంకారము, తరువాతఁ గ్రమముగా నాకాశము, దాని
వలన వాయువు, దానివలన నగ్ని, దానివలన జలమును. పృథ్వి
యుఁ గలిగినవి. పంచీకృత మగునాకాశాదిభూతములవలన నం
డోత్పత్తియు, దానివలన బ్రహ్మాదిదేవతలును, వారివలన మరీ
చ్యాదులును, వారివలన మానవులును దిర్యక్కులును గలిగి

నవి. ఓదేవదేవా! నీశక్తి యగు ప్రకృతిచే సృజింపఁబడినవారు దేవత లనియు మానవు లనియుఁ దిర్యక్కు లనియు, స్థావరము లనియు నాలుగువిధములుగాఁ బరిగణింపఁబడుచున్నారు నీవాచతుర్విధ మగుశరీరములందును నాత్మాంశక మగుజీవునిమూలమునఁ బ్రవేశించియున్నావు. ఇట్లు జీవాంతరాత్మవై ప్రవేశించిన నిన్నును బురుషునిఁగాఁ దెలిసికొనుచున్నారు. నీవే జీవుని కంతరాత్మవై ప్రవేశించితివో, యాజీవుఁ డింద్రియములచే సంపాదిత మగుశబ్దాదిభోగ్యజాతమును, దెనెటీఁగలు చేర్చిన తేనెనువలెనే యనుభవించుచున్నాఁడు. పిమ్మట దురూహ మగుతత్త్వము గలిగి కాలశరీరుఁడ వగునీవు మహావేగము గలవాఁడవై, భూతములచేతనే భూతములను బీడించుచు, దుస్సహవేగము గలిగిన మహావాయువు మేఘపంక్తులనువలె సకలభూతములను సంహరించుచున్నావు ఇంతియకాక యాలోచనములచే మిక్కిలి మత్తులై, శబ్దాదివిషయములందు సక్తులై, యిష్టపదార్థములు సంప్రాప్తమైనను, పేరాసతో వర్తించుచున్న వారలను నీ వప్రమత్తుఁడవై క్షుధార్త మగుసర్ప మెలుకలను బట్టి బలాత్కారముగా మ్రింగినట్లు మ్రింగుదువు. ఓజగదీశ్వరా! నీయనాదరణముచే జ్ఞానమును గోలుపోయినవాఁ డయినను మానవుఁడు నిజాదృష్టమువలనఁ బండితుఁ డయినచో వాఁడెప్పు డయిన నీ పాదమూలమును విడువ నెంచునా? ఇంతియు కాక చతుర్దశమనువు లెవ్వానికి దినపరిమాణమును గలిగించుచున్నారో యా బ్రహ్మ సైతము నిశ్శంకచే నిన్నారాధించుచున్నాఁడు. మాకుఁ బెద్ద యగుబ్రహ్మయే నిన్నుఁ బూజించునప్పుడు మాసంగతి చెప్పనేల? ఓపరమాత్మా! సమస్తప్రపంచమును భవదాత్మకుఁ డయిన

రుద్రునిభయమువలన నశించును. ఈతత్త్వమును దెలిసికొనియున్న
వారికి భయము లేకుండఁ జేయువాఁడవయి దీపించుచున్నా
వు' అని యిట్లు శంకరుండు పరబ్రహ్మమును నుతించి ప్రచేతసుల
కుపదేశించి యిట్లనియె. ఓనృపనందనులారా! మీరు నావాక్య
ములందు విశ్వాసముంచి యీభగవత్ స్తుతిని జపించుఁడు. ఈజప
ముచే మీకు భద్రము కలిగెడిని. మీరు స్వవర్ణోచితధర్మములను
సర్వదా నాచరించుచు, పరమాత్మయందుఁ జిత్తంబులం
జేర్చి మాటిమాటికిని నుతించుచు, సర్వభూతములందును వెల
యుచు నంతరాత్మగా నున్నపరమాత్మను బూజింపుఁడు. ఓ
రాజకుమారులారా! యీస్తోత్రమును జపించుచు, మనస్సున
నిలిపికొని, చిత్తమును నిశ్చలముగాఁ గావించుకొని, మౌనవ్రత
మాచరించుచు, నాదరయుక్తులయి మీ రభ్యాసము చేయు
చుండుఁడు. ఇప్పుడు మీ కుపదేశించినతత్త్వమును మునీశ్వరు
ల కధిపతియును, ప్రజాభివృద్ధిఁ జేయఁ దలంచినవాఁడు నగు బ్ర
హ్మ ప్రజాసృష్టి చేయనెంచినభృగ్వాదుల మగు మాకు బూ
ర్వమున నుపదేశించెను. ప్రజాసృష్టియందు మే మందఱమును
బ్రేరితుల మయి, యీస్తోత్రముచే నజ్ఞానమును దొలఁగిం
చుకొని, సకలప్రజలను సృజించితిమి. పురుషుఁ డెవఁడైనను,
సమాహితచిత్తుఁడై వాసుదేవుఁడే ప్రాప్యుఁ డనియును, ప్రా
పకుఁ డనియును, నాధారుఁ డనియును, నమ్మికొని నిత్య
మీస్తోత్రమును జపించుచు వేగముగాఁ దన కిష్టమగు శ్రే
యస్సును బొందును. సమస్తశ్రేయస్సులలోను భగవదా
త్మక మగుజ్ఞానమే ముఖ్యశ్రేయస్సని చెప్పఁబడినది. ఆశ్రే
యస్సుచేతనే జ్ఞానవంతులగుమహాత్ములు పెక్కండ్రుపాయాంత

రములచే దుస్తరమగు దుఃఖసాగరమగు సంసారమును దరించుచున్నారు. ఓరాజపుత్త్రులారా! నేను జేసినయీస్తోత్రమును శ్రద్ధాసంయుతులై పఠించినపురుషుం డుపాయాంతరములచే నారాధింపఁబడని హరి నారాధించి హరివిషయభక్తినిఁ బొందుచున్నాఁడు. మఱియు నీస్తోత్రముచే సంతసింపఁ జేసి సర్వపురుషార్థములకుఁ బ్రభు వయిన పరమపురుషునివలన నిష్టశ్రేయస్సులను సత్వరముగానే చెందును. ఈ స్తోత్రమును బ్రాతఃకాలమందు లేచి ప్రాంజలియై వినినవాఁడును, వినిపించినవాఁడును, సకల బంధనములను ద్రెంచును. కావున రాజనందనులారా! నే నిప్పుడు చెప్పినపరమాత్మస్తోత్రమును సమాహితచిత్తులై మీరు జపము చేయుచుఁ దపం బొనరింపుఁడు. అంతమందుఁ బరమాత్మవలన మీయభీష్టములను బొందుఁడు. ఇది యిరువది మూఁడవ యధ్యాయము.

---

ఇవ్విధంబునఁ బ్రచేతసుల కుపదేశించి వారి లిచ్చుపూజలు కైకొని వారలు చూచుచుండఁగా నచ్చటనే శంకరుండంతర్ధానము చెందెను. అనంతరమందుఁ బ్రచేతసు లందఱును రుద్రుఁ డుపదేశించిన స్తోత్రమును జపము చేయుచుఁ బదివేలవత్సరంబులు జలంబుల నిలిచి తపం బొనరించిరి. అటఁ బ్రాచీనబర్హి కర్మములం దాసక్తుఁడై యుండుటను జూచి యాత్మవిదుఁ డయిన నారదుండు కృపాళుం డయి యతని కిట్లు జ్ఞానోపదేశమును జేసెను. "ఓరాజా! నీ వాచరించుచున్న యజ్ఞాదికర్మములచే నీ వేమి శ్రేయస్సు నభిలషించుచున్నావు? ఒకచో నీవు దుఃఖనివృత్తిని, సుఖప్రాప్తిని గోరుకొనుచున్నచో యాగాదికర్మములచే

నుభయమును సాధ్యము కాదు.'' అని పలికిన నారదునివచనము విని ప్రాచీనబర్హి యిట్లనియె. ''ఓమహాత్మా! నేను కర్మకలాపముచే నాకర్షింపఁబడి యుత్కృష్ట మయిన శ్రేయస్సేదియో యెఱుంగకున్నాను. కావున నీమహాసనమునకు నిర్మలత్వము కలిగించెడియుఁ, గర్మరూపబంధనములను వదల్చునదియు నగుజ్ఞానమును నాకుపదేశింపుము. ఓ మహామునీ! విడువఁ దగని ప్రవృత్తిధర్మములు గల సంసారములందు సంచరించుచు, సమస్త

నారదుఁడు ప్రాచీనబర్హికి జ్ఞానోపదేశము సేయుట.

ము నాదే యని తలపోయుచుం బుత్రాదులందుఁ బురుషార్థబుద్ధి నుంచి కావుననే మూఢుఁడ నై నే నుత్కృష్టశ్రేయస్సును దెలియఁజాలనైతిని.'' నావుడు నారదుం డిట్లనియె. 'ఓరాజేంద్రా! యాగకర్మములందు నిర్దయాత్ముఁడ వయిననీవు వేలకొలదిపశువులను జంపితివి. చూడుము. నీచేఁ జంపఁబడిన పశువు లన్నియును నీవొనరించినపీడను స్మరించుకొనుచు నీ మరణకాలమును నిరీక్షించుచుండును. నీవు చచ్చినప్పు డాపశువులు మహాక్రోధమును వహించి తమవాఁడికొమ్ములతోఁ గ్రుమ్మి నిన్నుఁ జీల్చును. 'ఓయీ! యాగాదులందు మారితము లయినపశువులకు స్వర్గము వచ్చునని వేదాదులందుఁ జెప్పఁబడినది. అట్లుండ నాపశువులు స్వర్గాదిసుఖము గలిగించినందులకు సంతసించునే కాని కోపము వహించునా?' అందువేని ఓరాజా! నిరతిశయమగు పురుషార్థ

పురంజనోపాఖ్యానము

ము దెలుపునొక యితిహాసమును జెప్పెదను. పురాతనమైనయా పురంజనచరిత్రమును నావధానచిత్తుండవై వినుము. * ఓ

* ఇట నారదుఁడు ప్రాచీనబర్హికిఁ దత్త్వోపదేశ మన్యాపదేశముగాఁ

రాజా! పూర్వకాలమునఁ బురంజనుఁ డను రాజొకండు కలఁ డు. అతఁడు పెక్కు పురంబుల నిర్మించి పురంజనుఁ డని విఖ్యాతి గాంచెను. అతఁ డుదారకీర్తి కలవాఁడు. అతనికిఁ బరులచేఁ దెలియఁబడని చేష్టలుగల మిత్త్రుఁడు గలండు. అతనిపే రవిజ్ఞాతుఁ

---

జేయుచున్నాఁడు. అంతియు కాని ప్రత్యక్షముగాఁ జేయలేదు. ప్రత్యక్షము గా నేల చేయరాదు? సాక్షాదుపదేశము చేసిన వైరాగ్యోదయము కాకపో వునా? అందు వేని సమాధానము చెప్పెదను. వినుము. దేహాదే యాత్మ యనెడి యభిమానము చేతను, స్వతంత్రాభిమానము చేతను భ్రమింపఁబడి తత్త్వ మనఁగ నెట్టిదియో, యేది మేలో, యేది పురుషార్థమో, తెలియక విషయసుఖములే పరమ పురుషార్థము లని తలంచుచు, నున్నవానికిఁ దత్త్వోపదేశము చేయుచున్నను జక్కఁగా మనస్సున కెక్కదు. కావున జననము, మరణము, జాగ్రత్స్వప్న సుషుప్త్యాద్యవస్థలును గలసంసారమును వర్ణించి యందుఁ గలదోషములను వివరించి చెప్పి, సంసారమంత హేయ మయినది వేఱొకటి లే దనుబుద్ధి బు ట్టించి, తత్త్వోపదేశమును జేసినచో నది లెస్సగా మనస్సునకుఁ బట్టునని నిశ్చ యించి, జీవుని నొకరాజుగాను, శరీర మొకపురముగాను, బరమాత్మ స్నేహితు నిగాను, బుద్ధిని భార్యగాను నిరూపించి నారదుఁడు పురంజనోపాఖ్యానమును జెప్ప నారంభించెను. జీవుఁడు శరీరములను జన్మింపఁజేసి పురంజనుఁ డను పేరు వహించుచున్నాఁడు. జీవుఁడు విస్తృత మైనకీర్తి కలవాఁడు. ఇందులకుఁ బ్ర మాణము. "అపహతపాప్మా విజరోవిమృత్యు ర్విశోకో విజిఘత్సోపిపాసస్సత్య కామ సత్యసంకల్పో నిర్వాణమయః" యనియు. "అచ్ఛేద్యోయ మదా హ్యోయ మక్లేద్యోశోష్య ఏవచ।నిత్యస్సర్వగతస్థాణు రచలోయంసనాతనః" యని యుఁ గలవు. వీనిచే జీవుఁ డనంతకల్యాణగుణములుగలిగి కీర్తిమంతుఁ డగు చున్నాఁడు. జీవునకుఁ బరులచే నవిజ్ఞాతుఁ డగుపరమాత్మ యనే మిత్త్రుఁడు. జీ వునకుఁ బరమాత్మ మిత్రుఁ డయినట్లె "మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతిశ్చ నారాయణః" యని శ్రుతులందుఁ జెప్పఁబడుచున్నది. తన

డు. ఆపురంజనుఁడు నివాసస్థానమును వెదకుచు భూమండలము నందుఁ గలపురములకుఁ బోయి యచ్చటచ్చటఁ గొంత కాలము వసించుచు సమస్తభూమండలమందును సంచరించెను. కాని తన కనుకూలమగు పురమును గానక దుఃఖితమనస్కుఁ డాయెను. *ఈపురంజనుఁడు సకలభోగ్యపదార్థములను గోరుకొనుచు, నానాభోగ్యవస్తువులు లభింపఁ జేసికొనుటకుఁ బ్రయత్నించి, మహీమండలమందుఁ గల సకలపురంబులు మంచివి కావని భావించెను. †ఇట్లు తిరుగుచు నతఁడు హిమాలయమునకు దక్షిణసానువునందు నవద్వారములతోఁ గూడియున్న యొకపురంబును గాంచెను. ఆపురము ప్రాకారములచేతను, సుద్యానవనములచేతను,

---

కు హితుఁడును గలిగిన పరమాత్మయాజ్ఞ నుల్లంఘించి సంసారజీవుఁడు తనపేరైనను నెఱుంగఁజాలఁడు. అట్టుండ రూపముసంగతి వేఱ చెప్ప నేల? మఱియు జీవునకు మిత్రుఁడగు నపరమాత్మ విజ్ఞాతచేష్టితుఁడు. జగత్ప్రసిద్ధములగు జగద్వ్యాపారము మొదలగు చేష్టలు గలవాఁడు. ఇట్లే ముందుముందు క్రమముగా మూలమున వర్ణింపఁబడు పురంజనునితో సమముగా జీవునకు సమన్వయించుకొనవలెను.

*జీవపక్షమున = జీవుఁడు విస్తృతమగుకీర్తి కలవాఁడు. ఆతఁడు సంసారమందుఁ బడి తనపేరును గూడ మఱచుచున్నాఁడు. అతనికి జగత్ప్రసిద్ధము లగు జగద్వ్యాపారములు గలపరమాత్మ హితుఁడు. ఆజీవుఁడు తన కనుకూలమయినభోగాయతనశరీరమును వెదకుచు, దేవాదిస్థావరాంతమువఱకుఁ గలశరీరములందుఁ బ్రవేశించుచుఁ బ్రకృతిమండలమం దంతటను సంచరించెను. కాని తన కనురూపమగు దేవమనుష్యాదిశరీరమును బొందలేక మిగుల దుఃఖంబు నొందెను.

†మఱియు జీవుఁడు శబ్దాదివిషయములను గోరికొనుచు, నట్టి శబ్దాదివిషయము లనుభవింపఁ దగినశరీరమునిమిత్తము పరిభ్రమించుచుఁ దాఁ జూచిన వన్నియు మంచివి కావని తలంచెను

బురుజుల చేతను, గవాక్షముల చేతను, బహిర్ద్వారముల చేతను గూడి యున్నది. మఱియు నది వివిధము లగు గృహముల చేతను గనకమయములును, రజతమయములును, నయోమయములు నగు శృంగముల చేతను, వెలయుచున్నది. ఆపురము నీలములు స్ఫటికములు, గరుడపచ్చలు, ముత్యములు, మరకతములు, పద్మరాగములు, మొదలగు రత్నములచే స్థగితములగు మేడలచే రాణించుచుం గాంతికి భోగవతీపురమును బోలుచుండెను. *మఱియు నది సభామందిరముల చేతను, జతుష్పథముల చేతను, రాజమా

* జీవుం డిట్లు సంచరించుచు, నొకప్పుడు కర్మము లాచరించి తత్ఫలమందం దగిన క్షేత్రము లగు నంధత్వపంగుత్వాదు లగు దోషములు లేని మనుష్య శరీరమను పురమును జూచెను. అది నేత్రశ్రోత్రాదులగు తొమ్మిది ద్వారములు కలది. అది ప్రాకారములవంటి చర్మాదుల చేతనుం గూడినది. దానికి రోమపంక్తియే యుపవనము. భుజము లనునట్టాలకములు గలది. దానికి రక్తమే పరిఖవలెం దనర్చుచున్నది. నవరంధ్రము లనుగవాక్షములు కలవు. రాజసాదిభావములు శృంగములవలెం దనర్చుచున్నవి. మూలాధారాదు లగుచక్రములు గృహములవలె నున్నవి. హృద్గతము లగు నాడులే నీలశ్వేతాదు లగుచక్రములు. శరీరము సర్పాకారము లగు నాడులు గలదగుటచే భోగవతీపురమును బోలుచున్నది. మఱియు నట జీవుని కాశ్రయభూత మగుటచే హృదయము సభామందిరమువలెను జతుష్పథమువలెను బరమాత్మకుం గ్రీడాస్థాన మగుటచేతం గ్రీడాయతనమువలెను, జక్షురాదీంద్రియస్థానములు బురుజులవలెను, జీవుండు రాజు రాజమార్గమునం బోయి విశ్రమస్థానమును జేరునట్లు సుషుమ్నానాడీమార్గమునం బోయి మోక్షము నొందునుగాన సుషుమ్నానాడి రాజమార్గవలెను, సుషుప్తియందు జీవునకు విశ్రమస్థాన మగుపురీతత్తు విశ్రాంతిస్థానమువలెను, నాధారాదిచక్రములం దున్నకర్ణికలు పగడపుటరుగులవలెను, నఱిచేతులు నఱికాళును బతాకములవలెను ప్రకాశించుచుండెను.

ర్గములచేతను, క్రీడాదిస్థానములచేతను, సంగడి వీథులచేతను, విశ్రమస్థానములచేతను, ఒక్కెములచేతను, బగడంపువేదికల చేతను సంయుతమయి యలరారుచుండెను.*ఆపురంబునకు వెలుపలిభాగమం దొకయుపవనంబు గలదు. ఆయుపవనము సుర సాలాదివృక్షములచేతను, లతలచేతనుఁ బరివేష్టితమై యున్నది. మఱియు నందు ధ్వనిచేయుజలవిహంగంబులును, దుమ్మెదబంతు లకోలాహములును గలసరోవరంబుచేఁ బ్రకాశించుచుండె. పుష్ప వనమునందు హిమజలబిందువులను గనుచుపరాగమును ధరించి పుష్పవర్షములను గురియుచుఁ బ్రసరించుచున్న మందమారుత ములుగలవు. అందుఁజలించుచిగుళ్ళుగలిగినసుందరతరుబృందము లును, బర్హసంపదలును గలవు. ఆవనమునందున్న వన్యమృగ ములు ఘాతుకత్వబుద్ధిని విడిచియున్న వగుటచే నెట్టిబాధయు లేకుండెను. అటఁ గోకిలాలాపములచేఁ బాంథులు తామే పిలువఁ బడుచున్నట్లు తలంతురు. †ఆవనమం దొక స్త్రీరత్నము విహరించు చుండెను. ఆమె పదుగురుభటులతో నభిముఖముగ వచ్చుచుండె

* విషయవర్గము బాహ్యోద్యానవనమువలెను, మఱియు శబ్దము పక్షికో లాహలమువలెను, గంధము కుసుమములవలెను, స్పర్శగుణము మందమారుత మువాడ్కని, రూపము ప్రవాళములవలెను నొప్పుచున్నవి. శ్వశురస్యాలకా దిబాంధవులు వన్యమృగములరీతిని, నివృత్తిమార్గ మవలంబించినవాఁడు పాం థునివలెను, వెలయుచుండెను.

† అట జీవుఁడు బుద్ధిని బొడగాంచెను. బుద్ధి నూఱులకొలంది గలవృత్తుల కధిపతులైనజ్ఞానకర్మేంద్రియంబులతోఁ గూడికొని యభిముఖముగా వచ్చుచు న్నది ఆమె ఐదయినవృత్తులుగలప్రాణములచే రక్షింపఁబడుచున్నది. బుద్ధికి చేతనసంబంధము గలయపుడు ప్రౌఢురాలు కాని స్త్రీవలెనే యుండు ను గాన నాబుద్ధికి ప్రౌఢత్వము లేదు.

ను. ఆమెభృత్యులలోనొకొక్కఁడు నూఱుగురు స్త్రీల కధిపతియై యుండెను. ఆకన్యారత్నము శిరఃపంచకము చే నొప్పుసర్పముచే రక్షింపఁబడుచు, సప్రౌఢయై కామరూపిణియై భర్తను వెదకుచుండెను. ఆమె చక్కని నాసికతోను, సుందరములగుదంతములతోను, నిర్దంపుటద్దములఁ బోలినచెక్కులతోను వెలయుచుండెను. ఆమెయాననము మిక్కిలిసుందరమైయుండెను. ఆమెకర్ణములందున్నకుండలముల కాంతులచేగండస్థలములు ప్రకాశించుచుండెను. ఆమె సుందరమగువేణితోను, నందములైన పిఱుందులతోను, బంగారు మొలత్రాటితోను, పాదములందు మధురంబుగ ధ్వనిచేయు నూపురంబులతోను, విలసిల్లుచు దేవకాంతను బురుడించుచుండెను. *యౌవనారంభముచే వృత్తములై సంశ్లిష్టములయి యున్న స్తనంబులు గలిగి లజ్జాతిశయముచే మేలిముసుంగు వైచికొనుచు, గంధగజమువలె మందగమనము కలదై, మందహాసము

---

* అది గంధాదిరసజ్ఞాన విశేషములచేఁ గామరూపిణి యగుచున్నది. అది యోగ్యమైన గంధాత్మక మయినఘ్రాణేంద్రియవృత్తి కలది. అది దంతవ్యాపారజన్యవృత్తి కలది. మఱియు నది యానవాద్యనయవజన్యవృత్తి కలది. అది కుండలాలంకృత మగుకర్ణములందలి శ్రోత్రేంద్రియవృత్తి కలది. అది స్తనితంబాదివ్యాపారములవలనఁ గలిగినహర్షవృత్తులు కలది. మఱియు మనస్సుతోఁ గూడినపదియింద్రియములు భటులవలెను, శతసంఖ్యాకము లగు నింద్రియవృత్తులు స్త్రీలవలెను, పంచప్రాణంబులు శీర్షపంచకముతో నొప్పుసర్పరాజువలెను నొప్పుచున్నవి. బుద్ధియుఁ బ్రాణాయత్తమైనప్రవృత్తి కలది కావునఁ బ్రాణము బుద్ధికంటె ముందుగా నడుచుసర్పరాజునుబోలుట సమంజసముగా నున్నది. బుద్ధి ననుసరించి యింద్రియవృత్తు లన్నియుఁ బోవును గాన ననుసరించుభటులతోఁ బోలుట యుక్తముగా నున్నది. కావున జీవుఁడు బుద్ధిని జూచి మోహించెను.

చేతను, సిగ్గుచేతను మోమొక కొంత్తియందము నగుచు చుండఁ బ్రేమాతిశయముచే మీఁదుగాఁ జలించుచున్న కనుబొమలనువిండ్లచేఁ గటాక్షవీక్షణము లను బాణములను బ్రయోగించుచున్న యీసుందరినిఁ గాంచి పురంజనుం డిట్లనియె. *ఓపద్మాక్షి! నీ వెవ తెవు? నీ వేజాతిదానవు? నీ వెవనికుమారికవు? ఎందుండి వచ్చుచున్నదానవు? ఈపురసమీపమందు నీ కేమిపని గలదు? నీవృత్తాంతమును నాకుఁ దెలియఁజేయుము. నిన్ననుసరించి వచ్చునీపదునొకరు మహాభటులును నెవ్వారలు? సుందరము యినకనుబొమలు గలయోస్త్రీరత్నమా? ఈస్త్రీ లెవ్వారలు? నీకు ముందుగఁ బోవుచున్నయీసర్పరా జెవఁడు? ఓసుందరీ! ఎవనిపాదపద్మములు సేవించుటవలన సమస్తవాంఛలును నెఱవేఱునో, యట్టిపురుషునిఁ బతిఁగాఁ బడయుటకయి మునివలె విజనమగువనమందు సంచరించుచున్నదానవు. నీవు వరాహమూర్తిని వెదకు భూదేవివా? లేక శంకరుని వెదకు భవానీదేవివా? బ్రహ్మ నన్వేషించు సరస్వతివా? లేక విష్ణుమూర్తిని వెదకు లక్ష్మీదేవివా? నీవు లక్ష్మీదేవి వయినచో నీచేతియందుఁ బద్మకోశము కానరాలేదు. ఎచ్చటఁ బడిపోయినది. ఓసుందరాంగీ! ఆలోచింప నీరమాదిదేవతలు భూమిని స్పృశింపరు. కాన భూమిని స్పృశించునీవు రమాదిదేవతలలో నొకర్తుకవును గావు అద్భుతచర్యలు గలిగి వీరశ్రేష్ఠుండనైననాతో విష్ణువుతో వైకుంఠము నలంకరించిన లక్ష్మీవలె నీపురము నలంకరించుటకు వచ్చినట్లు తోఁచుచున్నది.

---

* సుందరీ! నాతోఁ గూడ నీశరీరమును బ్రవేశించి సకలసుఖముల ననుభవించుటకు వచ్చిన ట్లున్నది. నన్నుఁ గోరుకలు మిగులఁ బీడించుచున్నవి. కాన నాయూపస్తువులను జేర్చి నా కానందము కలిగింపుము.

నీకటాక్షవీక్షణములచేఁ గలఁగినచిత్తము గలవన్నును, సిగ్గుచేతనుఁ బ్రేమముచేతను, మందహాసముచేతను, విలాసవంతము లగు నీకనుబొమలచేతను బ్రేరితుఁ డగుమన్మథుఁడు మిగుల బాధించుచున్నాఁడు. కావున నన్నుఁ గరుణింపుము. ఓసారసాక్షీ!

**పురంజనుండు బుద్ధితో సంభాషించుట.**

సుందర మగుకనుబొమలు గలిగి, మంచికనీనికలతో నొప్పుచు, సోగ లైనపల్లని నెఱికురులచే నావృతమై, మృదువు లగువాక్కులు గలిగి చిఱునవ్వుతో వెలయుచు, సిగ్గుచే నభిముఖమునకు రానొల్లనినీవదనమును నాకుఁ జూపుము" అని యిట్లు లింద్రియంబులకు వశుఁడై తన్ను యాచించుచున్న పురంజనునిఁ గాంచి మోహించి యతని మోహింపఁజేయుచు, నను మోదించి కామె యిట్లనియె. *ఓరాజా! నిన్నును నన్నును సృజించి మన కిట్టినామములను గులమును గల్పించినపురుషుఁడె వఁడో మే మెఱుఁగము. ఓరాజేంద్రా! ప్రస్తుతమున నీపురియం దున్ననిన్ను నీపురియందుఁ బ్రవేశించిపరిపాలించువానిఁగాఁ దలం

---

* అని బుద్ధి జీవున కిట్లనియె. ఓరాజా! ఈశరీరము నెవ్వడు సృజించెనో యెఱుఁగను. ఈపదునొకరు మనంబుతోఁ గూడినయింద్రియములు. మనస్సు మొదలగునింద్రియములు నిద్రించినప్పుడు ప్రాణము జాగ్రత్తతో శరీరమును గాచుచుండును. ఓజీవా! నీవు దైవసంకల్పమువలన నీమానవశరీరమును బొందితివి. ఇందు నూఱుసంవత్సరంబులు నివసించి యింద్రియంబులిచ్చుసుఖంబు లనుభవింపుము. ఓజీవా! కామివయి యిష్టార్థములను విడువక, శబ్దాదికామములను గోరుచు, నున్ననీకంటెఁ బరు నెవ్వని నే వరింతును? అని పలికె జీవుఁడును బుద్ధియుఁ బరస్పరము సమయము చేసికొని మనుష్యశరీరమునఁ బ్రవేశించి విషయసుఖముల ననుభవించుచుండిరి.

చుచున్నాను. మన కిరువురకును నివాసస్థల మగు నీపురమును ని
ర్మించి మనయిరువురకంటె విలక్షణుఁడయిన పురుషుని నేమెఱుం
గము. ఈపదునొకరగు మహాభటులును, నీస్త్రీలును నాకు
స్నేహితులు. మఱియు భృత్యులు, నేను నిద్రించుసమయమున
నీసర్పరాజు పురమునుఁ బాలించుచు మేల్కొనియుండును. నీవు
దైవవశమువలన నీపురంబును బొందితివి. నీకు శుభములు కలు
గుఁగాక. ఓశత్రుహంతా! శబ్దాదివిషయసుఖములను నీవు పొం
దుదువు. నేను నా స్నేహితులతోఁ గూడ నీకు గ్రామ్యసుఖము
లను సంపాదింతును. ఓరాజా! నేను సంపాదించి యిచ్చుచున్న
సుఖముల ననుభవించుచు నూఱువత్సరముల కాలమీపురంబున
నుండుము. ఓరాజేంద్రా! నిన్ను రమింపఁజేయక విరక్తుఁడై,
నిషిద్ధములు కానిసుఖముల నైన నపేక్షింపక, కాలాంతరమందు
లభించు స్వర్గాదిఫలముల నెఱుఁగక, మృత్యువునకు భయపడుచు
నున్న మఱొక్కని గమింపఁజేయుదునా? ఈప్రవృత్తిమార్గమం
దు, యాగాదిరూపధర్మము, అర్థకామములు, పుత్త్రసుఖము,
మోక్షము, కీర్తియు, నిర్బాధము లగుపుణ్యలోకములును గలు
గును. మఱియు గృహస్థాశ్రమము, పితృదేవతలకును, మునుల
కును, మానవులకును, భూతములకును, నాత్మకును, క్షేమము గలి
గించుశరణ మని చెప్పుదురు. ఓవీరవరా! మహాప్రసిద్ధిని బొంది,
త్యాగశీలుఁడ వయి, నేత్రానందకరుఁడ వయి, సురూపవంతుఁడ
వయిననీవంటిభర్తను నిరుపమానురాలయిన యెవ్వతె వరింపకుం
డును? నీవు కరుణాతిశయముచేతను, మందహాసపూర్వక మగు
క్రొఁగంటిచూపులచేతను, సమస్తదీనజనులబాధను బోలంగించు
చు వర్తించుచున్నవాఁడవు. సర్పరాజులవంటి నీబాహువులం

దే స్త్రీమానసము సక్తము కాదు?'' అని వారిరువురును, బరస్పరము సంభాషించుకొని, యొక ప్రతిజ్ఞ చేసికొని, 'ఓప్రాచీనబర్హీ! యాపురమును బ్రవేశించి నూఱువత్సరంబులదాఁక సర్వసుఖముల ననుభవించుచుండిరి. అప్పుడు పురంజనుండు, చక్కఁగా నుతింపఁబడుచు, స్త్రీలచేఁ బరివేష్టింపఁబడి యందందుఁగ్రీడించుచు గ్రీష్మర్తువునం దొక్కనాఁడు క్రీడాజనిత మగుశ్రమంబును దొలఁగించుకొనుటకొఱకు సరస్సును బ్రవేశించెను. ఓరాజా! వారున్న పురంబు నభివర్ణింతు వినుము. *ఆపురమున నేడుద్వారములు మీఁదిభాగమున నమర్పఁబడినవి. రెండుద్వారములు క్రిందిభాగమున నమర్పఁబడినవి. ఆరెండుద్వారంబులు నాపురాధిపతి ప్రత్యేకముగా దేశములనుజూర్చి పోవుట కుంపఁబడినవి. మీఁదుగా నుంచఁబడిన యేడుద్వారములలో నైదుద్వారములు తూర్పుదిక్కున నున్నవి. ఒక ద్వారము దక్షిణముగాను, మఱొక్కటి యుత్తరముగాను నున్నవి. క్రిందుగా నుంచఁబడిన ద్వారములు పడమరదిక్కుగా నున్నవి. ఆద్వారములనామములను దెలిపెదను వినుము. తూర్పున నుండుద్వారములో రెండు ఖద్యోత మనియు నావిర్ముఖి యనియుఁ బేరులు గలవి. అవి యొక్కచోటనె నిర్మింపఁబడినవి. ద్యుమత్సఖుఁ డయినరాజాద్వా

* జీవపక్షమున, తూర్పున నొక్కచో నిర్మింపఁబడిన ద్వారము లనఁగా నేత్రములు. అం దెడమనేత్రము మిణుగురుపురుగువలెను, స్వల్పప్రకాశము కలది. కుడికన్ను విస్తార మగుప్రకాశము కలది. జీవుఁడు చక్షురింద్రియముల కధిష్ఠానదేవత యగుసూర్యునితోఁగలసి ప్రకాశించుచుఁబదార్థములు జూచుచున్నాఁడు. అట్లె తూర్పున మఱొక్కచో నిర్మితము లయినమఱిరెండుద్వారము లనఁగా నాసికారంధ్రములు. జీవుఁ డానాసిక కధిష్ఠానదేవత యగువాయువుతో నాద్వారములనుండి వెడలి గంధమును గ్రహించుచున్నాఁడు.

రములలోనుండి విభ్రాజిత మను దేశంబున కరుగుచున్నాఁడు. తూర్పున మఱొక్కచో నిర్మితము లయిన రెండుద్వారములు నళిని యనియు, నాళని యనియుఁ బిలువఁబడుచున్నవి. రాజ! యవధూత యనుమిత్రునితోఁ గూడ సౌరభ మను దేశమును జూడ నేఁగును. *తూర్పున నున్నయైదవద్వారము ముఖ్య మను పేరు గలది. పురంజనుఁడు రసజ్ఞుఁ డనుమిత్రునితో నాద్వారమునుండి వెడలి బహూదన దేశమునకుఁ బోవును. విపణుఁ డనుమఱియొక స్నేహితునిఁ గూడి పణ మను పేరుగల దేశమునకుఁ బోవును. ఓరాజా! †దక్షిణదిక్కునం దున్నద్వారము పితృహూ వను పేరు గలది.

---

* జీవపక్షమున, తూర్పున నున్నవాకిలో నైదవది యగుముఖ్యద్వారమనఁగా ముఖము. జీవుఁడు నాలుకసహాయముచే సమస్తరసములను గ్రహించుచున్నాఁడు. మఱియు వాగింద్రియసహాయముచే సమస్తములగు నాహారములను జక్కఁబెట్టుకొనుచు నున్నాఁడు.

† దక్షిణమున నున్నపితృహూ వనుద్వార మనఁగా, దక్షిణకర్ణము. ఆకర్ణము పితృలోకాదుల సాధించుప్రవృత్తిశాస్త్రములను విన(దగి యుండుటచేఁ బితృహూ వని పిలువఁబడుచున్నది. ఎట్టివారికిని మొదటఁ ద్రివర్గము సాధించుకొని పిమ్మట మోక్షమునకుఁ బ్రయత్నించుట యుచితము గావునందులకుఁ దగినప్రవృత్తిశాస్త్రములను వినఁదగియుండుటచే దానికిఁ బ్రాథమ్యము కలిగినది. జీవుఁడు శ్రోత్రేంద్రియంబుతోఁ గూడ శబ్దమును గ్రహించుచున్నాఁడు. ఉత్తరమున నున్నదేవహూ వనుద్వార మనఁగా నెడమచెవి, బ్రహ్మఫలప్రాప్తిని గలిగించునివృత్తిధర్మములను జెప్పుశాస్త్రములను వినఁదగినదగుటచే వామకర్ణము దేవహూ వనునామమును వహించినది. జీవుఁ డాకర్ణమువలన శ్రోత్రేంద్రియముసాయమున సకలశబ్దములను గ్రహించుచున్నాఁడు. ఇట దక్షిణపాంచాల మనఁగాఁ బ్రవృత్తివిషయకశాస్త్రము లనియు, నుత్తరపాంచాల మనఁగా నివృత్తివిషయక మయినశాస్త్రములనియు నెఱుంగునది.

పురంజనుఁడు శ్రుతిధరుఁ డను మిత్రునితోఁ గూడి యాపితృహూ వను ద్వారమునుండి వెడలి దక్షిణపాంచాలములను జూడఁబోవును. అట్లె యుత్తరమున నున్న దేవహూ వను ద్వారమునుండి వెడలి యుత్తరపాంచాలంబునకుఁ బోవును. *మఱియుఁ బురికిఁ బశ్చాద్భాగంబున "ఆసురి" యను ద్వారము కలదు. పురంజనుఁడు దుర్మదుఁ డనుమిత్రునితోఁ గూడి గ్రామ్యక మను దేశమును గూడ నేఁగును. పురికిఁ బశ్చాద్భాగమున నున్న నిరృతి యను ద్వారమునుండి పురంజనుఁడు లుబ్ధకుఁ డను మిత్రునితోఁ గూడి వెడలి వైశస మను దేశమునకుఁ బోవును. †ఈపురద్వార

---

*పురపశ్చాద్భాగమున నున్న "ఆసురి" యను ద్వారమనఁగా శిశ్నము. జీవుఁడు దుర్మదమను నుపస్థేంద్రియముతోఁ గ్రామ్యజనకర్మ మగు మైథునాదులను జేయుచున్నాడు. మఱియుఁ బశ్చాద్ద్వారములలో నిరృతిద్వారమనఁగా గుదస్థానము. జీవుఁడు పాయ్వింద్రియంబుతోఁ గూడి నారక మయిన దుఃఖము ననుభవించును.

† పురద్వారము లయిన "అంధము' లను ద్వారము లనఁగా, పాదములును చేతులును. జీవుఁడు వానివలన నడుచుచు, సకలకర్మముల నాచరించుచున్నాడు. ఇటఁ బాణిపాదము లంధము లని చెప్పఁబడెనవి. అనఁగా నజ్ఞము లనుట. ఇట "నిర్వాక్పేశస్కరౌ" అని పాదపాణులకు విశేషణముగలదు. అనఁగా నిర్వాక్=రంధ్రములేని, పేశస్కర పేశస్కర మను పురుగు. దానివలెనె నిశ్ఛిద్రము లగుటచేఁ దెలివి లేని వగుచున్నవని యర్థము. ఆపురుగు తనయాహారమునుండి నిర్గమించినద్రవ్యమువలన గూఁటినల్లి ద్వారములేకుండ జేసికొని యాహారాదులు లేక నశించును. దానివలెనే కాలుసేతులు ఛిద్రములు లేక పోవుటచే నజ్ఞములని భావము. పురంజనుఁడు విషూచీనునితో నంతఃపురము ప్రవేశించు టనఁగా జీవుఁడు మనస్సుతో హృదయమునుఁ బ్రవేశించుట. అట జీవుఁడు బుద్ధిచేతను, నింద్రియవృత్తులచేతను గలుగుచున్న మోహాసంతోషాదులను జెందుచున్నాడు.

ములలో "అంధము" లను రెండు ద్వారములు కలవు, నరాధిపతి యగు పురంజనుం డా ద్వారంబులనుండియే నడుచుచున్నాఁడు. సకలకర్మముల నాచరించుచున్నాఁడు. *తరువాత బురంజనుండు విషూచీనుఁ డను మిత్రునితో సంతెనపురంబు ప్రవేశించును. అనంతరము పురంజనుఁడు దారసుతాదులవలనఁ గలుఁగు మోహమును, ప్రసాదమును, సంతసమును బొందుచుండును. ఇట్లు పురంజనుం డజ్ఞుండై, కావుననే కామములం దాసక్తుండై దైవవంచితుండై, బుద్ధి యను భార్య కోరినపనినే చేయుచుండెను. పురంజనుఁ డిట్లు భార్యావశుఁడయి యామె పానము చేయుచున్నఁ దానును పానము చేసి మదవివశుఁ డగుచు, నామె తిన్నప్పుడు తినుచు, నామె చరించినప్పుడు చరించుచు, నామె పాడునప్పుడు పాడుచు, నేడ్చినప్పుడేడ్చుచు నవ్వినప్పుడు నవ్వుచు, మాటలాడినప్పుడు, మాటలాడుచు, విచారము చెందినప్పుడు విచారించుచుఁ, బరువెత్తినప్పుడు పరువెత్తి, నిలిచినప్పుడు నిలిచి, శయనించినప్పుడు శయనించి, సర్వదా యనుసరించుచుండును. ఒకప్పుడు భార్య యేడ్చుచుండ దీనునివలె నేడ్చును. హర్షమును జెందినప్పుడు హర్షించుచుఁ, దాఁకినప్పుడు తాఁకుచు నుండెను. ఇట్లు పురంజనుండు భార్యచే మోహితుండై యవివేకియై మాయావంచితుఁడై, క్రీడామృగమువలెనే పరవశుఁ డయి వర్తించుచుండెను. ఇది యిరువదినాల్గవ యధ్యాయము.

---

* మఱియు జీవుఁడు బుద్ధికి వశుఁడై బుద్ధీంద్రియములు శబ్దాదివిషయములం దాసక్తము లయినఁ దాను నాసక్తుఁ డగుచు వర్తించుచుండెను.

*ఓ మహారాజా! పురంజనుఁ డొకప్పుడు రథము నెక్కి పంచప్రస్థ మనువనమున కేఁగెను. †ఆరథ మయిదుగుఱ్ఱములతోఁ గూడిన దగుటచే శీఘ్రగమనము గలది. దానికి రెండుచక్రములును, రెండుదండికలును, దృఢ మయినయొకయిరుసును, మూఁడుధ్వజములును గలవు. మఱియు దాని కైదుబంధనసూత్రములు కలవు. ఆరథ మొకరజ్జువుచేతను, సారథిచేతను, రథికుఁడు కూర్చుండఁ దగినస్థలముచేతను, రెండుయుగబంధనస్థానములచేతను, నైదాయుధములచేతను, నేడుచర్మాదు లగునావరణములచేతను, నైదువిధము లగుగమనములచేతను, నొప్పుచుండెను. ‡కనకమయాభరణములతోఁ గూడినయిట్టిరథము నెక్కి స్వర్ణ

---

* జీవపర మయినయర్థము. ఓరాజా! సుషుప్త్యనంతరమం దొకనాఁడు జీవుఁ డనురాజు, కర్తృత్వము భోక్తృత్వము మొదలగునభినివేశ మనెడివిల్లు గలవాఁ డయి, శరీర మనురథము నెక్కి, పంచప్రస్థమునకుఁ బోయెను.

† ఆశరీర మనురథమునకుఁ బంచేంద్రియము లను నైదుగుఱ్ఱములు గలవు. అది శీఘ్రగమనముగలది. దానికి నహంకారమమకారము లను రెండుదండికలును, పుణ్యపాపము లను రెండుచక్రములును, ప్రధాన మనెడియొకయిరుసును, సత్త్వరజస్తమోగుణము లనెడిమూఁడుధ్వజములును, పంచప్రాణము లనెడిబంధనములును గలవు. ఆరథమునకు, మనస్సనెడి త్రాడును, బుద్ధి యనెడిసారథియు, హృదయ మనెడియుపవేశస్థానమును, శోకమోహము లనెడియుగబంధనస్థానములును, కర్మేంద్రియము లనెడిపంచవిధగమనములును, సప్తధాతువు లనెడిచర్మాద్యావరణములును, రజోగుణప్రవృత్తి యనెడికవచమును, ననంతవాసన లనెడియక్షయతూణీరములును గలవు.

‡ అట్టిదాని నెక్కి యేకాదశేంద్రియము లనెడిసేనానాయకులు వెంబడింప శబ్దాదివిషయములు గలభోగస్థానమున కేఁగెను. జీవుఁ డిట్లుభోగస్థానము చేరి దేహపరవశుఁ డయి విడువఁదగనిబుద్ధిని విడిచి శబ్దాదివిషయాసక్తుఁడై

మఱియు బంగరుకవచమును దొడిగి, యక్షయతూణీరములఁ దాల్చి, పదునొకరు సేనానాయకులు గొల్చుచుండఁ బంచప్రస్థవనమునుఁ బ్రవేశించెను. ఆపురంజనుఁ డావనమును బ్రవేశించి గర్వించినవాఁడై ధనుర్బాణములను ధరించి, మృగములను వేఁటాడుటయం దాసక్తుఁడై యున్నవాఁడు గావున విడువఁ దగనిదయినను దనభార్యను విడిచి, తామసవృత్తి నవలంబించి, కోపపరీతమనస్కుఁడై యందందు సంచరించుచు, వాఁడిబాణములఁ బ్రయోగించి మృగసంహార మొనర్పఁ దొడఁగెను. * ఓప్రాచీన

### పురంజనుఁడు వేఁటాడుట.

బర్హిర్నృపాలా! మృగములను జంపి శ్రాద్ధాదికర్మములు సంప్రాప్త మగునప్పుడు వానిలో మాంసము తప్పక పెట్టవలయు ననియె విహిత మయినచో రాజమాత్రము వనమునఁ బ్రవేశించి పవిత్రము లయినమృగములను మాత్రమే వానిలోఁ గావలసి యున్నవానినే చంపవలయును. అంతియ కాని విచ్చలవిడి మృగములను జంపరాదు. ఇది శాస్త్రనిర్ణీత

---

తామసవృత్తి నవలంబించి కామాదులకు విరోధు లగువారియందుఁ గోపము వహించి కర్మములచేఁ బొందింపఁబడు శబ్దాదివిషయములనాత్మాధీనములు గావించికొనెను.

* జీవుఁడు భోగస్థానమును బొందినను దనకు నియతములగుభోగములను బొందినప్పుడే జీవుఁ డజ్ఞానాదులకు లొంగఁడు అంతియ కాక స్వేచ్ఛగా భోగములనుభవింపఁ గోరుకొన్నచోఁ గర్మపరుఁడై యందువలన సంసారమునం బడి దేహాత్మవివేకమును మఱచి నరకమును బొందును. మఱియు జీవుఁ డీట్లు వాసనాప్రాప్తములగు పుణ్యపాపకర్మముల ననుభవించుటచే శిథిలము లయినయవయవములు గలవాఁ డగును. ఆవిషయానుభవము సర్వభూతదయ లయినజ్ఞానులకు మనంబుచే స్మరింపనైనను సహ్యము కాకుండెను.

మయిన కార్యము. ఇట్లుండఁ బురంజనుఁ డవలంబించినది తామ
సప్రవృత్తి యని యనఁ దీఱునా? అట్టిశాస్త్రవిషయములను దె
లిసికొనిసమయానుగుణముగా హింసాకృత్యమునాచరించినచో
రాజు నియతకర్మములందలిజ్ఞానము కలవాఁ డగుటచేఁ బాప
ములను బొందఁడు. ఓరాజేంద్రా! ఇట్లాచరింపక నియతకర్మ
మని విచ్చలవిడి మృగములను జంపినచో వాఁ డహంకారమమ
కారములను బొంది కర్మముల కధీనుఁ డగుచున్నాఁడు. అట్లు
కర్మబద్ధుఁ డగుటచే సంసారమునఁ జిక్కుఁబడి జ్ఞానము లేక నరక
మును బొందును.* ఇంతటను పురంజనుఁ డిట్లు వేట లాడుచుండ
విచిత్రము లగు ఱెక్కలు గలబాణములచేఁ దెగినయవయవము
లు గలిగినమృగములనాశనము దయాళువులకు మిగుల దుస్సహ
మయి చూపట్టెను. మఱియు నతఁడు చెవులపిల్లులు, వరాహ
ములు, కారుదున్నలు, గవయమృగములు, రురుమృగములు,
ఏఁదుఁబందులు, మొదలగువానిఁ జూచుచు, నవి పవిత్రము ల
యినను, గాకపోయినను, నవి విహితము లయినను గాకపోయి
నను, గంటికిఁ గానవచ్చువాని నెల్లఁ జంపుచు, వేఁటవలన మిగుల

* జీవుఁ డిట్లు విహారించుచు విహితమును నవిహితమును నైనవిషయముల ననుభవించి శ్రమచెందెను. ఓరాజా! రాజసబుద్ధికిఁ గార్యమయిన జాగ్రదవస్థను, తామసబుద్ధికిఁ గార్యమయినస్వప్నావస్థను దెలిపితిని. ఇంక "ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యేభయాభయే, బంధంమోక్షంచయావేత్తి బుద్ధిస్సాపార్థసాత్వికీ" అనెడిసాత్వికబుద్ధినిగూర్చి చెప్పెదను మఱియు సాత్వికబుద్ధిసంసారియైన జీవునకులభించుట దుర్లభము. అదిలభింపనప్పుడుపరితాపము గలుగును. తద్బుద్ధినిగూర్చియుందత్సాధనములనుగూర్చియుఁ జెప్పెదను. జీవునొకరాజుగాను, బుద్ధిని బట్టమహిషినిగాను, నింద్రియవృత్తులను నంతఃపుర స్త్రీలనుగాను గ్రహింపుము.

డస్సినవాఁడాయెను. *అంత పురంజనుఁడు క్షుధచేతను దప్పిచేతను బీడితుఁడయి, వేఁటనుండి మఱలి పురముఁ బ్రవేశించి స్నానము గావించుకొని యుచితాహారములను గొని శ్రమను దొలఁగించుకొని యుండెను. అనంతరము పురంజనుఁడు సామంతభూపాలురు చేయుమన్ననలు గొని చక్కఁగ నలంకరించుకొని యగురుధూపమును వేసికొని శరీరమునకుఁ జందన మలఁదికొని పూలదండలు ధరించి, ధూపలేపాదులచే సంతోషము కలిగి, తృప్తుఁడై కావుననే మన్మథచంచలితహృదయుఁడై తనభార్యయందుఁ దలంపు గలిగి, యంతఃపురంబునకుఁ బోయి తనపట్టమహిషిని గానకపోయె.† ఓరాజా! పురంజనుఁడంత విచారపరీతుఁడై, యంతఃపుర స్త్రీల కిట్లనియె. "ఓసుందరులారా! రాణితోఁగూడ

---

* జీవుఁడట్లు క్షుధచేతను దప్పిచేతను దపుఁడై స్వప్నవిషయానుభవమనెడివేఁటనుండి మగిడి దేహగతమయినహృదయస్థానమును బొంది కొంత యాయాసమును దొలఁగించుకొనుచుండును. అనంతరము జీవుఁడు కామపరవశుఁడయినరాజు గృహమందవర్తించుచున్నభార్యను జూడలేక వివశుఁడైనట్లు దేహాంతర్వర్తి యైనబుద్ధిని జూడలేక విచారము నొందెను.

† బుద్ధిమూలకములగునింద్రియవృత్తులనుగాంచివానిలో దేనివలనసాత్త్వికబుద్ధి యుదయించునో యని చింతించెను. మఱియు వివేకము లేనివర్తించుటకంటె దేహత్యాగమే మంచి దని తలంచెను. జీవుఁడు విరహావివశుఁడయినపురుషుని (ప్రౌఢ యైనస్త్రీ) తదనుకూలము లయినహితోపదేశాదులను జేసి శోకమును దఱిమి సుఖమును గలిగించునట్లువివేకాత్మికయగుబుద్ధియుఁగూడమాటిమాటికిని హితోపదేశమునుజేసి జ్ఞానము గలిగించి దుఃఖసముద్రమునుండి తొలంగించును. అట్టిది యెచ్చటికేఁగిన దని తలపోసెను. జీవుండిట్లు బుద్ధిని పొందవలె నని యెంచియింద్రియవృత్తులన్ని యు బుద్ధిమూలకము లగుటచే నింద్రియవృత్తిచేతనుబుద్ధి తనకులభింపక భర్తచేఁదిరస్కృతయగుభార్యవలె నేవిముఖి యై యున్నదని నిశ్చయించి నాబుద్ధి యింతకాలమునకు విపరీత యై

మీ కందఱకును బూర్వమువలెఁ గుశలము కలదు కదా ? గృహము లన్నియు శోభాహీనము లయి, పూర్వమువలెనే సంతోషదాయకము లై యుండ వేమి? చక్రాశ్వాదులు లేనిరథమునందువలె, తల్లిగాని, పతివ్రత యైన భార్యకాని, లేనిగృహమునందు దీనునివలె నివసింప నెవఁ డిష్టపడును ? నా ప్రియురాలగుబుద్ధి యెచ్చట నున్నది? ఆమె దుఃఖసముద్రములో మునిఁగిననన్నును మాటిమాటికిని నుద్ధరించుచుండెడిది. ఆమె మిగుల వివేకము కలది.” అని యడిగినపురంజనునకు నంతఃపురస్త్రీ లి ట్లనిరి. “ఓనరనాయకా ! నీ ప్రియురాలినిశ్చయ మేమో మే మెఱుంగము. ఆమెకుఁ గలిగినవ్యసనకారణమును మే మెఱుంగము. శత్రుహంతా ! ఆమె యాస్తరణరహిత మగుభూమియందు శయనించి యున్నది. చూడుము” నాపుడు వారివాక్యము విని పురంజనుండు పోయి భూమిపైఁబడియున్నభార్యను జూచి తత్సంపర్కముచే జ్ఞానమంతయుఁ జంచలము కాఁగా మిక్కిలిదుఃఖమును బొందెను. అనంతర మతఁడు పరితాపము నొందుహృదయముతో మృదువచనములు పలికి భార్య నూఱడించుచుండెను. కాని యామె ప్రణయకలహమునకుఁ గారణ మెఱుంగకపోయెను. సాంత్వనకుశలుఁ డయినపురంజనుఁ డామె ననునయించుచుఁ బాదములను బట్టుకొని తొడలపైఁ గూర్చుండఁబెట్టుకొని లాలన చేయుచు ని ట్లనియె. *ఓసుందరీ ! కొందఱు ప్రభువు లపరాధము

---

యున్నదికదా యని విచారము నొందెను. ఇట్లు చేసి బుద్ధిదెవాయుత్త మగుటచే, బుద్ధిని పొందుటకుఁ దగినసాధనములను వెదకియును గాంచలేక పోయెను.

* ఇదిమొదలు బుద్ధినివిడిచి వర్తింపనని ప్రతిజ్ఞఁ జేయుచు, స్వవశీకృతయగుబు

చేసినభృత్యులను గనికరించి తనవార లని యెంచి యపరాధ మునకుఁ దగునట్టులు దండన చేయరు. అట్లు శిక్షింపఁబడనిభృత్యులు మందభాగ్యు లని చెప్పవచ్చును. మఱియుఁ బ్రభువులు తనయపరాధమునకుఁ దగినశిక్ష విధించుట తనకు హిత మై యుండఁగా నది తెలిసికొనక రాజదండనమునుండి తప్పించుకొను వాఁడు పట్టిబుద్ధిహీనుఁడు. అపరాధి యైనవాఁడు రాజు తన్ను దండింపకున్నను బలాత్కారము చేసి యతనిచే దండింపఁబడవలయును. కావున నీవు రాణివి. నేను భృత్యుఁడను. నే నపరాధము చేసితిని. ఆ నాయపరాధమును నీవు క్షమించినను నేనంగీకరింపను. నీవు విముఖురాలవు కాక నన్ను దండింపుము. ఓ దేవీ! ఓవీరపత్నీ! సుందర మగునకనుబొమలు కలదానా! మాకు రాణి వయిననీ వట్లు దండించి యనురాగముచేతను, లజ్జచేతను, మంథరమై సొగ సయినమందహాసము గలిగి, నల్లనిముంగురు

---

వేశాత్మక యగుబుద్ధిననుసంధానము చేసెకొనెను. మఱియు రాజ్ఞి వలెనే నన్ను రక్షింప సమకట్టియున్నబుద్ధి యింతకాలమును దనకుఁ గలుగకుండుటయేమంచిదని తలంచెను. ఏమన,బుద్ధికలుగకపోవుటచేఁ దల్లఢిక్కై పాటుపడుచుఁబరితాపము నొందుచు నామెను మిక్కిలి యనురాగముతోఁ జూచుచుండును. అందుచే నపరాధమైనభృత్యునియందు రాజు దయలేకుండుట భృత్యుని కెంత హితమో యపరాధియయిన తనకు బుద్ధియనుగ్రహముకలుగకుండుట యంతమంచిదని తలంచె నిరతిశయసుఖము కలిగించుబుద్ధి గల్గిన సుఖి నాదు ననియెంచెను. మఱియు జీవుఁడు ప్రారంభదశయందున్నబుద్ధి నిర్మలముగానుండక పోవుటచేత,దానిని బ్రియుఁడు తిరస్కరించుటచే దుఃఖించుచులలనవలె నున్నదనిభావించితాను నహంమమాభిమానమును విడిచిబుద్ధిని గొంచెముప్రసన్నముఁ గావించుకొని యిఁకమీఁద బుద్ధియు క్షుఁడనై యే కార్యముల నెఱవేర్పఁగొందు నని నిశ్చయించెను.

లచే నలంకృత మై, యున్నతనాసికచే నొప్పుచు, మృదువచన ము లాడుచు నున్న నీముఖమును నాకుఁ జూపుము. ఓవీరపత్నీ! నీ కపరాధము కావించినపురుషుఁడు బ్రాహ్మణుఁడు కాని భగవద్భక్తుఁడు కాని కానిచోఁ దప్పక హాని నందింతును. నీప్రియుండ నగు నేను జీవించి యుండఁగా ముల్లోకములయంతర్భాగమందును బహిర్భాగమందును భయము లేకుండ వర్తించుపురుషుఁ డుండునట్లు నేఁ దలంపను ఓసుందరి! నీమొగ మిదివఱ కెప్పుడును దిలకరహిత మై యుండ లేదు. ఇప్పుడు నీమొగము మలిన మై, హార్దరహిత మై, కోపావేశముచే భయంకర మై, కావున నే ప్రకాశింపక, ప్రేమరహిత మై, యున్నట్లు తోఁచుచున్నది. మఱియు నీ స్తనములు శోకబాష్పములచేఁ దడిసి కాంతి దక్కి యున్నవి. అట్లె బింబసమ మగు నీయధరము రాగశూన్య మై కానవచ్చుచున్నది. ఇట్లుండుటకుఁ గారణ మేమి? నీయనుమతి లేక వేఁటకుఁ బోయితిని. ఆనాయపరాధము సహించి ప్రసన్నురాలవు కమ్ము. మదనపీడితుఁడ నై ధైర్యము పోఁగొట్టుకొని నీకు వశంగతుఁడ నైన నన్ను దయఁజూచి రక్షింపుము. నీసేవ చేసెదను. నీయనుమతి చొప్పున నే వర్తింతును. ఇరువదియాఱవయధ్యాయము.

---

*అని యిట్లు ప్రార్థించుచున్నభర్తను గాంచి పురంజనునిభార్య

---

* జీవుని లోకరాజ్యము గాను బుద్ధిని బట్టమహిషిని గాను నేర్పఱచి భార్యను విడిచి వేఁటకుఁ బోవుట చేనామె ప్రణయకోపమును వహించుటయును భర్తచే నోదార్పఁబడి శాంతిఁ బొందినట్లును జీవుఁడు బుద్ధిని విడిచి రాజసకర్మములం బ్రవేశించుటయు నదియుచే బుద్ధి గానరానందున మిగుల విచారించి యొకయింద్రియవృత్తిచే మగుడ సాత్త్వికబుద్ధినిబొంది దానిని దన కభిముఖిని

మెల్లగాఁ దనవిలాసములచేఁ దనవశము గావించుకొని, యతని సంతసింపఁ జేయుచుఁ దానును సంతసించెను. అంతఁ బురంజనుండు మంగళస్నాతుఁడై, శుభ్రవస్త్రమును దాల్చి, మంగళము లయిన చందనకుంకుమాదులను ధరించి, తనివి దీర భుజించి తన సమీపమునకు వచ్చిన ప్రియురాలిని గాంచి మిక్కిలి సంతసించెను. *అనంతర మతఁడు ప్రియురాలిచేఁ గౌఁగిలింపఁబడి తానును బ్రియురాలికంఠమును దృఢముగఁ గౌఁగిలించుకొని యేకాంతమందు దన్యోన్యము రహస్యవాక్యములచే వివేక మాకర్షింపఁబడఁగాఁ బ్రమదాసహితుఁడయి యిది రాత్రి యనియు, నిది పవలనియుఁ గాలవేగము తెలిసికొనలేకపోయెను. మఱియు నతఁడు మూల్య మయినతల్పమందు శయనించి ప్రియురాలిభుజమును తలగడగాఁ గొని విషయసుఖముల ననుభవించుచు, నజ్ఞానతిర

---

గాను బ్రసన్నురాలనుగాను జేసికొనెనని వెనుకటియధ్యాయమున వర్ణింపఁబడియె. ఇప్పుడు మహారాజు పట్టమహిషితోఁ గూడి క్రీడించునట్లు జీవుఁడు బుద్ధితోఁ గూడి విహరించుట నీయధ్యాయమున వర్ణింపఁబడును. జీవుఁడు, రుచిరాంబరాదులచే సుందరతర మయినపట్టమహిషిని దన కనుకూలనుగాఁ జేసికొన్నమహారాజువలెనే రాజసబుద్ధిని ననుకూలనుగాఁ జేసికొనెను.

*మఱియు రాజుభార్యను గౌఁగిలించుకొనునట్లు జీవుఁడుబుద్ధితోదృఢసంబంధము కలవాఁ డాయెను. రాజు గుహ్యాభాషణములచే నాకర్షింపంబడినట్లు జీవుఁడు శబ్దాదివిషయ చింతనములచే నాకర్షింపఁబడెను. రాజు భార్యనుగూడి మహాతల్పమందు శయనించినట్లు జీవుఁడు బుద్ధిని గూడి హృదయస్థానమున శయనించెను. రాజు భార్యబాహువు తలగడగాఁ జేసికొని శయనించిపారవశ్యముఁ జెందినట్లు జీవుఁడు బుద్ధిపారవశ్యమును చెందును. రాజుతనభార్యవలనఁగలిగినసుఖములే పురుషార్థము లని భావించునట్లు జీవుఁడు బుద్ధివలనఁ గలిగినవిషయసుఖములే పురుషార్థము లని భావించుచుండెను.

స్మృతుఁడయి, తనభార్య పురుషార్థ మని భావించెను. కానితన స్వరూపమును గాని పరమాత్మస్వరూపమును గాని తెలిసికొ లేకపోయెను. ఓరాజా! ఆపురంజనుండు కామాదులచే మలిన మనస్సచిత్తము గలిగి భార్యతోఁ గ్రీడించునప్పు డతనియౌవన కాల మంతయు క్షణకాలమువలె నతిక్రమించెను. * ఇట్లతనికి నేఁబదివత్సరంబులు చనునప్పటి కతని కాభార్యయందుఁ బదు నొకొండువందలపుత్త్రులు కలిగిరి. మఱియు నాపురంజనుఁడు తలిదండ్రులకును సోదరులకును యశంబు గలిగించువారును, సత్ప్రవర్తనము చేతను నౌదార్యము చేతను, సద్గుణముల చేతను, భాసితలయినవారును నగునూటపదిమంది కుమారికలను బడసెను. అనంతర మాతఁడు పితృవంశవర్ధను లయినకుమారులకు హితాహితముల నుపదేశించుభార్యలను, కుమారికలకు విషయసుఖములు గలిగింపఁ జాలుభర్తలను గొనివచ్చి పెండ్లికావించెను. ఆపురంజనునిపుత్త్రులలో నొక్కొక్కని కొక్కొక్కనూఱుగురు కొమరులు గలిగిరి. †వారిచేత నాతనివంశము పాంచాలదేశమం

---

*"రాజు పుత్త్రిలనుబడసినట్లు జీవుఁడు బుద్ధివలన నింద్రియపరిణామరూపములను బొందెను ఆరాజు కూఁతులను పడసినట్లు జీవుఁ డింద్రియపరిణామానంతరమందుఁ గలుగుబుద్ధివృత్తులఁ బడసెను. రాజు తలిదండ్రులయందును సోదరులందును ప్రేమను గలకుమారికలను బడసినట్లు జీవబుద్ధులందును నింద్రియపరిణామములందును ప్రేమను గలవృత్తులను బడసెనని తెలియఁదగినది. రాజు పాంచాలదేశమందుఁ దనవంశము వర్ధిల్లునట్లు జీవుఁడు తనవంశము వర్ధిల్లుటకయి యింద్రియపరిణామములకును నింద్రియవృత్తులకును దగిన దాంపత్యము సమకూర్చ్చెను.

†రాజు పుత్త్రాదులతోఁ గూడి తనవంశమును వర్ధించినట్లు జీవుఁ డింద్రియపరిణామములతోను, బుద్ధివృత్తులతోను గూడి సంసారమును వర్ధింపఁజే

దుమిక్కిలి యభివృద్ధి చెందెను. ఆతనిపుత్త్రులు గృహకోశముల ననుసరించి జీవించుచుండఁగాఁ బురంజనుండు మమకారాసక్తుఁడై ప్రవర్తించుచు లోకమును శరీరమును మఱచి వర్తించుచుండెను. మఱియు నతఁడు నానావిధవిషయసుఖముల నభిలషించుచుఁ బశువులను జంపుటచే హింసాగర్భములై, కావుననే భయంకరము లయియున్నయాగములచేఁ బితృదేవతలను, దేవతలను, నీవలెనే యారాధించెను. ఇట్లతఁడు ఫలము నభిలషించి తత్సాధనము లగుకర్మములందుఁ బ్రసక్తుండై మఱియుఁ గుటుంబపోషణాకులం డాసక్తచిత్తుఁడై యుండఁ బురంజనునకుఁ బ్రియురాండ్రకు నప్రియ మయినజరాసమయము సంప్రాప్తమాయెను. ఓరాజా! అశుభమనసు గలిగి సంవత్సరరూపుఁడై ప్రఖ్యాతిని చెందినగంధర్వాధిపతిగలఁడు. ఆమహాబలునికిదనసాత్త్వికు లయినసేవకులు మున్నూటయఱువండ్రు గలరు. వారుపురోక్షము దాయుర్దాయరూప మయినధనము నపహరింతురు. ఆప్రచండవేగుఁడయినయాసంవత్సరుఁడనుగంధర్వపతికి, రాత్రిరూప లయినగంధర్వస్త్రీలును గలరు. వారు సకలసాధనములచే నిర్మితమగుపురము నపహరింతురు. *కావునఁ జండవేగుఁడయినగంధ

యును. పురంజనునిపుత్త్రులు గృహకోశాదులననుసరించియుండఁగాఁ దాను మమకారాసక్తుఁడై సర్వము మఱచియున్నట్లుశరీరము, నహంకారమమకారములును, నింద్రియప్రాణాదులును, ననుసరించియుండఁగా దాను మమకారముతో స్వస్వరూపమును బరమాత్మస్వరూపమును మఱచియుండెను. రాజు సుఖాపేక్షచే యాగాదుల నాచరించినట్లు జీవుఁడు శబ్దాదివిషయముల నపేక్షించి యింద్రియవ్యాపారములనారంభించును. రాజు యాగాదులచే దేవతలను సంతృప్తులఁజేసినట్లుజీవుఁ డింద్రియాధిష్ఠానదేవతలసంతృప్తిగోలుపును.

* శత్రువులు పురంజనునిపురమును నిర్బంధించినవిధమున కాలముజీవునికిఁ

ర్వపతియను చరులువచ్చి పురంజనునిపురము నపహరించునప్పుడు ప్రజాగరుఁ డనువాఁడు వారి నాటంకపఱిచెను *ప్రజాగరుఁ డను పురంజనుని పురాధ్యక్షుండొక్కరుఁడే యిరువదియేడుశరంబుల వింట సంధించి నూఱువత్సరంబులు గంధర్వులతోఁ బోరాటము సలిపెను ఇట్లు ప్రజాగరుఁడు పలువురతోఁ బోరాడుటచేఁ దన

### ప్రజాగరుఁడు గంధర్వులతోఁ బోరాడుట.

సామర్థ్య మంతయు నశింప నతఁడు పురజనులతోను బాంధవులతోను గూడికొని పురరక్షణ చేయుట దుర్లభ మగునేమో యని మిగులఁ జింతింప నారంభించె. కాని పురంజనుం డం దుండినను జాగరూకుండు గాక పాంచాల దేశములందుఁ దన సేవకులచే సంపాదితము లగు నమధురపదార్థము లనుభవించుచు స్త్రీలోలుఁ

---

బురమునంటి దగుశరీరము నిర్బంధించును. పురాధ్యక్షుఁడు మేల్కని శత్రువుల నివారించినట్లు సర్వకాలములందు మేల్కనియుండు ప్రాణము కాలవికారమును నివారించుచుండును.

*పురాధ్యక్షుఁడు సప్తవింశతిబాణములచే శత్రువులనిరోధించినట్లు ప్రాణము, పృథివి, నీరు, తేజస్సు, వాయువు, గగనము, గంధము, రసము, రూపము, స్పర్శము, శబ్దము, త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము, పాణి, పాదము, పాయువు, ఉపస్థ, వాక్కు, అపానము, వ్యానము, ఉదానము, సమానము, మనస్సు, బుద్ధి, అహంకారము, అనునిరువదియేడుబాణములను ప్రయోగించి నివారించెను. పురాధ్యక్షుఁడు సామర్థ్య మున్నంతకాలము శత్రువులతోఁ బోరాడినట్లు ప్రాణము ప్రారబ్ధావసానము గలుగునంతవఱకు కాలముతో యుద్ధము చేసె ననుట. పురాధ్యక్షుఁడు తనబలము నశించినపిమ్మట పురము నెవరు రక్షింతురని చింతించునట్లు ప్రాణము స్వసామర్థ్యము నశించినతోడనే శరీరము నెట్లు ప్రాణవంతముగాఁ జేయుదునని విచారము నొందు ననుట. పురంజనుఁడు స్వసేవకులు దెచ్చియిచ్చినపదార్థములు దిని స్త్రీవశుఁడయి తనపుర

డయి, యాశత్రుభయము నెఱుంగలేకపోయెను. *ఓప్రాచీనబర్హి నరేంద్రా! కాలమునకు జర యనునొకపుత్త్రిక కలదు. ఆమె ద్రిమ్మరుచుండును. ఆజరను వరించుటకు నే పురుషుఁడును నిష్టపడలేదు. సౌందర్యరహితురా లయినయాజరా కన్యక లోకమునఁ గురూపిణి యని ప్రఖ్యాతిఁ గాంచి యట్లయి నను యయాతిపుత్త్రుఁ డయినపూరురాజుచే వరింపఁబడి మిగుల సంతుష్టురాలయి, యారాజర్షికి సింహాసనము వచ్చునట్లు చేసినది. మఱియు నాజరాజన్యక యొకప్పుడు భూలోకమున సంచరించుచు బ్రహ్మలోకమునుండి భూమి కవతరించుచు నన్నుఁ గాంచి నైష్ఠికుఁడనని తెలిసికొనియుఁ గామమోహితయై నన్ను వరించె. ఓరాజా! నే నాకన్యను వరింపక ప్రతిషేధించితిని. అందువలన నామె మిగులఁ గ్రుద్ధురాలయి "ఓమునీంద్రా! నీవు నాకోరికను నిరాకరించితివి కావున నీకమీఁద నీ వొకస్థానమందుఁ జిరకాల

---

రము శత్రుసమాక్రాంతమైనదనియుఁ దనకు భయము ప్రాప్తమయిన దనియుఁ దెలియలేనిచందమున జీవుఁ డింద్రియములు పొందించుశబ్దాదిసుఖముల ననుభవించుచు బుద్ధికి వశీకృతుఁ డయి కాలము శరీరము నావరించినదనియుఁ దనకు మృత్యుభయము సంప్రాప్తమయిన దనియు నెఱుంగకపోవు ననుట.

* ఇట నారదుఁడు జరావస్థను నొకకన్యకఁగా నిరూపించి యాకన్యక భర్తకై తిరుగుచు నొకప్పుడు పూరుని వరించి రాజ్య మిప్పించెననియు, దన్నుఁ జూచి వరించినను దా నిష్టపడలేదనియు, నైష్ఠికులను ముదుసలితన మేమియుఁ జేయలే దనియుఁ జెప్పెను. మఱియు నీ జరాకన్యాచరిత్రముచే ముదుసలితనము వచ్చినతోడనే యాధివ్యాధులు సంభవించు ననియు వెను వెంటనే మరణము వచ్చుననియుఁ దెలుపుచున్నాఁడు. అట్టిజరాకన్యక పురంజనుని వరించిన దని చెప్పఁబోవుచున్నాఁడు.

ముండక తిరుగుచుందువుగాక" యని నాకు దురంతమయిన శాప
ము నొసంగెను. పిమ్మట నాకన్యక నాయుపదేశమును విని మ
నోవ్యధలకు, వ్యాధులకుఁ బ్రభునయినభయుఁ డను వానిని సమీ
పించి, "ఓవీరా! నీవు సమస్తాధివ్యాధులకును బ్రభువవు. నీయం
దుంచినభూతములసంకల్ప మెప్పుడునునశింపదు అట్టిఘనుఁడ వగు
నిన్నుఁ బ్రియునిఁగా వరించుచున్నాను. మఱియు లోకమునుండి
యు, వేదమునుండియు నీయఁదగినదై కాని ప్రతిగ్రహింపఁదగినదై
కాని యున్నవస్తువును యాచించువారి కీయనివాఁడును దాను
వరింపనివాఁడును, వ్యర్థాభిమాను లయి వర్తించువారి నిరు
పురనుగుఱించి యజ్ఞులై సత్పురుషులు మిక్కిలి దుఃఖింతు
రు. కావున నీవు నన్ను స్వీకరింతువని వచ్చినదానను. ప్రతి
గ్రహింపఁదగిననన్ను విడనాడుట యెంతమాత్రమును దగ
దు. నిన్ను విడనాడుట నాకును నెంతమాత్రమును ద
గదు. ఓమహానీయా! నిన్ను భజించుచున్న నామీఁద దయ
యుంచుము. ఆర్తులను దయఁజూచుటకంటె నధికధర్మము పు
రుషుఁ డాచరింపవలసినది కలదా?" అని యిట్లు కాలకన్యక ప
లికినవాక్యములు విని భయుఁడు ప్రాణులకు మరణమును జేయఁ
దలంచినవాఁడయి చిఱునవ్వు నవ్వుచు నిట్లనియె. ఓసుందరీ!
నేను జిత్తమును నిలుకడఁ జేసికొని యనేకవిధముల విచారించి
నీకు లోకరూపభర్తను నిశ్చయించితిని. లోకము నిన్ను గురూ
పిణిగాను దుష్టురాలినిగాను దలంపక నీవు యాచింతివేని తప్పక
నిన్ను వరించును. నాకాధివ్యాధిప్రభృతు లగువెక్కురుసైనికులు
గలరు. వారితోఁ గూడి నీవు పోయి లోకములు వశంబుగావిం
చుకొని స్వేచ్ఛగాఁ గ్రీడింపుము. మఱియు నాకు వైష్ణవజ్వరుఁ

డను నొకసోదరుఁడు కలఁడు. ఇతఁడు నిన్ను లోకభర్తతో సమకూర్చును. ఇంతియ కాక నీవు నాకు సోదరివి. నీతోడను, నా సోదరునితోడను, గూడి మహాసేనాసమేతుండనై యొరులకుఁ దెలియఁబడకుండ నే నేలోకమందుఁ జరింతును. ఇది యిరువదియేరవయధ్యాయము.

---

* ఓ రాజేంద్రా! భయనాముఁ డిట్లు పలికి మరణకారులయినసైనికులును, ప్రజ్వారకాలకన్యకలును దన్ను వెంబడించి వచ్చుచుండ నీభూతలమందు సంచరించుచుండెను. ఇట్లు సంచరిం

---

*వెనుకటియధ్యాయమున నారదుండు భయనాముఁడు మృత్యుకారులగు నాధివ్యాధిముఖసైనికులతోఁగూడ భూతలమందుఁ జరించునట్లు చెప్పి యిప్పుడు పురంజనునిపురమును ముట్టడించిరని చెప్పువ్యాజమున జీవునకుఁ బురమువంటిదగు శరీరమును గాలము గ్రసించినట్లు చెప్పుచున్నాఁడు. శత్రురాజు తనసైనికులతో వచ్చి సకలవస్తుసంపూర్ణమయినపురంబును జుట్టుముట్టినట్లు, భయనాముఁడు ప్రజ్వారకాలకన్యకాసైనికులతో వచ్చి శబ్దాదివిషయభోగములతో నిండి జీర్ణప్రాణముచే రక్షింపఁబడుచు నుండినజీవునిపురమగుశరీరము నావరించెను. అప్పుడు జరాకన్యక శరీరము శిథిలము గావించెను. పురము శిథిలమైనప్పుడు శత్రువులు ద్వారములనుండి పురంబును విచ్చలవిడిగాఁ జొచ్చునట్లు భయనామునిభటులగు నాధివ్యాధులు నేత్రాదిద్వారములనుండి లోపలఁ బ్రవేశించి మిగులఁ బీడింపనారంభించినవి. తనపురము శత్రువశీకృత మగునప్పుడు చింతించెడిరాజువలె నీ జీవుఁడు జరాదిగ్రస్తమయినతనశరీరమునుగూర్చి మిగులఁ జింతించెను. రాజు మమాభిమానము గలిగి కుటుంబమును రక్షింపఁ బూనినట్లు శరీరాభిమానియగు జీవుండు బుద్ధీంద్రియాదిరూపమయినకుటుంబమును రక్షింపఁ బాటుపడును. భార్యాశ్లిష్టుఁడయినరాజు వివేకముఁ దొలఁగించుకొని శత్రుహత మగునైశ్వర్యమును నిలుపుకొలేనట్లు జీవుఁడు విషయాసక్తుఁడై బుద్ధి యనుభార్యతోఁ

చుచు భయనాముఁడు మహాపన్నగముచే రక్షింపఁబడుచు సమస్తసంపదలచే నొప్పుచు నున్నపురంజనపురంబును బలాత్కారముగా నరికట్టెను. తనసంబంధము కలిగినంతమాత్రముననే యెట్టిపురుషుల నైన నిస్సారులనుగాఁ జేయఁజాలునాజరాకన్యక పురంజనునిపురమును బలాత్కారముగా గ్రహించెను. ఇట్లు కాలకన్యకచే గ్రహింపఁబడిశిథిలమైనయాపురమును సైనికులుద్వారములనుండి ప్రవేశించి మిక్కిలి బాధించుచుండిరి. ఇట్లు శత్రుసైనికులచే నిరంతరమును బీడింపఁబడుచుండు "నీపురము నాది" యనునభిమానముతో నున్న పురంజనుఁడు తనకుటుంబమువిషయమయి మిక్కిలి తొట్రుపాటుపడుచు బహువిధము లయినతాపముల నొందసాగెను. మఱియు భార్యచేఁ గౌఁగిలింపఁబడి యున్న పురంజనుఁడు కేవలము చిత్తమును భోగములందుఁ జొనిపి కావుననే దీనుఁడై వివేకమును గోల్పోయి, భోగములను నశింపఁజేసికొని శత్రువులు బలాత్కారముగా హరించుచుండ దానికేమియుఁ బ్రతిక్రియ చేయఁజాలకపోయెను. *అప్పుడు పురంజ

గూడ సర్వమును మఱచి వివేకహీనుఁడయి యాధివ్యాధులచేఁ బొలఁగింపఁబడు చున్నశక్తిని నిలుపుకోలేకపోయెను.

* అప్పుడు జీవుఁడు తనశరీరము శిథిల మగుటయును, ప్రాణములు తిరస్కారభావముతో వర్తించుటయును, నింద్రియపరిణామరూపములును, బుణ్యపాపరూపకర్మములును, వాని ననుసరించు నింద్రియములును, నింద్రియాధిష్ఠానదేవతలును, దనపై ననురాగమును విడిచినబుద్ధియుఁ దనకు స్వాధీనులయి వర్తింపకుండుటయు, శరీరము జరాకన్యకచే గ్రహింపఁబడి యుండుటయు, విఘ్నాదులచే విషయములన్నియు నశించుటయుఁ, జూచి, మిగుల విచారించుచు, శరీరాదులను శిథిలత్వావస్థనుండి తప్పింపఁ దగినయుపాయ మాలోచింపలేకపోయెను. అంతటఁ దనసోదరుఁ డయినభయనా

నుఁడు తనపురము శత్రువులచే శిథిల మగుటయుఁ బుత్త్రపౌత్త్రాదులు ప్రతికూలురయి, తన్నుఁ దిరస్కరించుటయును, భృత్యామంత్రులు పురరక్షణమందు విముఖు లయియుండుటయును, దనభార్య స్నేహమును విడిచి వర్తించుచుండుటయును దానును

---

మునకు హితము చేయనెంచి జీవునిశరీరమును నధిష్ఠించి వైష్ణవజ్వరముమిగులఁ దపింపఁజేయును. శత్రువులు పురంజనునిపురమునుదహించినట్లు వైష్ణవజ్వరము ప్రవేశించి శరీరమును దహించెను. పురంజనుండు శత్రుదగ్ధ మయిన పురమందుండి స్వపుత్త్రికశత్రామాత్యవర్గంబుతోఁ దాపము చెందినట్లు వైష్ణవజ్వరపీడిత మయినశరీరమందు జీవుఁడు బుద్ధితోడను, నింద్రియములతోడనునింద్రియపరిణామములతోను, మిగులఁ దాపమును జెందును. కాలగ్రస్త మై శత్రుదగ్ధ మైనపురంబులోఁబడపురాధ్యక్షుఁడు దహింపఁబడినట్లు వైష్ణవజ్వరము చే శరీరముసంతప్తమయినతోడనే సర్వకాలములందుజాగరూకతతో వర్తించు ప్రాణము సంతప్తమగును. శత్రుదగ్ధపురమునుండి భయపడి పురంజనుండు వెడలిపోయినట్లు జీవుఁడు వైష్ణవజ్వరసంతప్త మయినశరీరమం దుండఁజాలక దానిని విడిచిపోవనిశ్చయించును. సామర్థ్యము లేనిపురంజనుఁడు శత్రువులచే నిరోధింపఁబడి రోదనము చేసినట్లు జీవుఁ డాధివ్యాధు లైనరోగములు, మార్గమును నిరోధింపఁగాఁ, బైకిఁ బోఁజాలక లోపల ఘుర్ఘురధ్వని చేయుచుండును. అంతట పురంజనుఁడు సర్వకాలములందును దన్ననుసరించుభార్యను విడిచియుండలేనట్లు జీవుఁడు సర్వకాలసర్వావస్థలందును దనకుఁ దోడ్పడు బుద్ధిని విడిచిపోవ నిష్టపడకుండెను. మఱియు జీవుఁడుపరలోకమున కేఁగునపుడు బుద్ధీంద్రియాదులు కలిసిపోవుటను తెలియఁదగినది. ఇందులకుఁ బ్రమాణము, శ్లో॥ మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థానికర్షతి। శరీరంయదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః। గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్॥ అనుటచే జీవునితో బుద్ధ్యాదులును గలిసిపోవుట స్పష్టమగుచున్నది.

ముదుసలివాఁ డగుటయును, దనదేశము శత్రువులచే దూషిత మయియుండుటయును గాంచి యపారచింతను బొంది తనయపా యమును దొలఁగించుకొనఁ జాలు ప్రతిక్రియ నాలోచింప లేక పోయెను. అట్లయ్యును బురంజనుండు కాలకన్యకచే నిస్సారము లయినను గామముల ననుభవింపఁ దలపోయుచు, దీనఁ డై యూర్ధ్వలోకములను సాధింప నేమియుఁ బాటుపడక పుత్త్రాదు లందు స్నేహమును విడచి భార్యాదులను లాలనచేయుచు, గంధర్వులచేతను, మ్లేచ్ఛులచేతను ధ్వంసముచేయఁబడి, కాల కన్యకచే మర్దింపఁబడినపురమును విడువఁదలంచి యుం డెను. ఆసమయమున శత్రురాజుసోదరుఁ డయిన ప్రజ్వారుఁడు లేచి పురంజనపురిని నధిష్ఠించి, తనసోదరునకుఁ బ్రియము చేయ నెంచి యాపురంబునంతను దగ్ధము గావించెను. ఇట్లు ప్రజ్వా రుఁడు పురమును దహించుచుండి భార్యలతోను, సేవకులతోను, మంత్రులతోను, బుత్త్రాదులతోను, మిక్కిలి సంతాపమును జెందెను. ఇట్లు కాలకన్య గ్రసించుటచేతను, యవనులు కోట బురుజుల నాక్రమించుకొనుటచేతను, బ్రజ్వారుఁడు పురంబును దాహము చేయుటచేతను, బురపాలకుఁ డయిన ప్రజాగరుఁడు పురముతోఁ దగ్ధుఁ డయ్యెను. అంత పురంజనుండు మిగులదుఃఖ ము కలవాఁ డై భయకంపముల నొందుచు, నాపురంబున నుండ సమర్థుండు గాక యగ్నివేష్టిత మయినవృక్షకోటరమునుండి బయలు వెడలిన పన్నగంబుచందంబున నాపురంబును విడిచిపోవ నిశ్చయించెను. ఓరాజా! పురంజనుఁడు గంధర్వులచే శిథిలా వయవుఁ డై తనసామర్థ్యమును గోల్పోయినప్పుడు శత్రువులచే నిరోధింపఁబడినవాఁ డగుటచే మిగుల రోదనము చేయఁదొడఁగె.

అనంతరము పురంజనుండు దుహితలను, బుత్త్రపౌత్త్రులను, గోడండ్రను, ధనభృత్త్యులను, ననుభవింపఁగా మిగిలినగృహాది వస్తుజాతమును స్మరించుకొనుచు, నహంకారమమకారములతో వర్తించుచు భార్యయందు సక్తమయిన మనస్సు గలవాఁడై భార్యావియోగమునకుఁ దాళఁజాలక భార్యతోఁ గూడి పోదునా? లేక భార్యను విడిచిపోదునా? యని యిట్లు చింతింపనారం

—:పురంజనుఁడు పరలోకమున కేఁగుచు భార్యాదుల నుగూర్చి చింతించుట:—

భించెను అకటా! నేను బరలోకమున కేఁగినచో నీమె బాలకులను గుఱించి యెట్లు దుఃఖించుచు నేరీతి వర్తింపఁగలదు? అయ్యారే! ఈసుందరి కెంత పాతివ్రత్యము కలదు! నేను భుజింపకుండ నొకనాఁడైన నామె భుజించి యెఱుఁగదు. నాయం దత్యంత ప్రేమముగలదయి నేను స్నానము చేయనిచో స్నానము చేయదు. నేనొక వేళఁ గ్రుద్ధుండనై యున్నయెడఁ జూచి మిగుల భయపడుచుండును. నేను నిందించుచున్నను మౌనమవలంబించియే యుండును గాని నోరెత్తి మాఱాడలేదు. నేనవివేకినై యున్నపుడామె నాకు హితబోధ చేయుచుండును. ఇట్లు నన్నన్నివిధములచేతను ననువర్తించు కాంతామణి, నేను బరమున కేఁగినప్పుడు దుఃఖపీడితయై గృహస్థధర్మముల నెందుల కవలంబించును? ఆమె పుత్త్రవతియైనను నాయెడఁబాటు నోర్వలేక తప్పక మృతి నొందును. నేను నశించినపిమ్మట నాకుమారికలును కొమరులును, నిరాధారులయి మహాసముద్రములోఁ బగిలిన నావయందున్న పురుషులవలె నెట్లు వర్తింపఁగలరు?' ఇట్లు పురంజనుఁడు శోకానర్హుఁ డయినను దీనబుద్ధితో శోకము నందుచుండఁగా నతనినిఁ బురంబునుండి వెడల్ప నెంచి భయనాముఁ

డగుమృత్యువు వచ్చెను. అనంతరము భయనాముఁడు తనసహా
చరులతోఁ గూడి యతనిని బశువునువలెను బంధించి స్వస్థా
నమును గూర్చి కొనిపోవుచుండ నతనిభృత్యామాత్యవర్గము
మిక్కిలి దుఃఖమొందుచు యవనులచేఁ బీడితులయ్యు ననుసరించి
పోవుచుండిరి. ఇట్లు యవనులచే నరికట్టఁబడి యతఁడు దేహము
నుండి, దగ్ధమగుచున్న చెట్టుతొఱ్ఱను విడిచి పర్వెత్తుభుజంగము
వలెఁ బోయినప్పుడు, తదనుబంధు లయినభార్యాపుత్రాదు లంద
ఱును నశించిరి. పురంబుగూడ నాశనంబు చెందినది. బలవంతుఁ
డయినయవనుఁడు బలాత్కారముగా నప్పురము నుండి తప్పించి
కొని పోవుచున్నప్పుడు పురంజనుఁడు వివేకమును విడుచుటచేఁ దా
నపరాధి యైనను దనయందుఁ బ్రేమ చూపుపరమమిత్రుని
స్మరించుకొనలేక పోయెను. ఓరాజా! ఈపురంజనుఁడు పూర్వము
తాను దయలేక యాగములం జంపినపశువులు తమ కతఁడు
చేసిన ద్రోహమును దలంచుకొని మిగులఁ గోప మూని గొడ్డం
డ్లతో సమము లయినశృంగములతోఁ బొడిచి ఛేదించెను. *వి
మ్మట నతఁడు హద్దు లేనిచీఁకటి గలనరకమునందు నివసించి తెలివి
లేక వెక్కుడు దుఃఖ మనుభవించి, స్త్రీసంపర్కముచేఁ జిత్త

---

* నారదుఁడిట్లు పురంజనుఁడు రజస్తమఃప్రచుర మయినబుద్ధికివశుఁడగు
టయు దేహమందును, దేహానుబంధులందును, నహంకారమమకారములుగలిగి
యుండుటయు జరామరణాదు లనుభవించుటయుఁ జెప్పి దేహావసానమందుఁ
దనభార్యను స్మరించుకొనుచుఁ బ్రాణమువిడిచినవాఁడు కానస్త్రీజన్మ మొందు
టయు, నందులో స్వకీయపుణ్యవిశేషమువలనఁ బవిత్రకులమందుఁ బుట్టుట
యును, మహాభాగవతోత్తముఁ డయినభర్తను బొంది తత్సేవచేసి భగవంతుని
ప్రసాదంబును సంపాదించుకొనుటయును జెప్పుచున్నాఁడు.

ము కలంకము నొందుచు నంతకాలముఁ దనభార్యను సంస్మరించుకొనుచు మృతినొందినవాఁడు కానఁ దరువాతిజన్మమున రాజసింహుఁ డయినవిదర్భునిగృహంబున స్త్రీయై జన్మించెను.

**పురంజనుఁడు స్త్రీయై జన్మించుట**

ఇట్లు జన్మించినకన్యక తండ్రిగృహమున వర్ధిల్లుచుఁ బరమభాగవతునిఁ దక్క వేఱొక్కని వరింప నని యామె శపథము చేసెను. ఆకాలమున మలయపర్వత ప్రాంతదేశమందు సుప్రసిద్ధుఁ డయిన మలయధ్వజుఁ డనురాజు గలఁడు అతఁడు జ్ఞానముచే బ్రహ్మస్థానమును వశముగావించుకొనెను. అతఁడు నిశ్చయాత్మిక యగుబుద్ధిగలవాఁడు. అతఁ డింద్రియజయరూప మగుయుద్ధమందు నింద్రియములను జయించెను. అతఁడా వైదర్భిని బెండ్లియాడెను. ఇట్లు పెండ్లియాడి యామెయందుఁ [1] గాటుకపిట్టలవంటి నేత్రములు గలయొకకుమారికను బడసెను. [2] ఆమెకుఁ దరువాత నేడుగురుకుమారులను ద్రవిడభూమిని బాలింపఁదగినవారిని గనెను. ఓరాజా ! ఆయేడుగురుపుత్త్రులలో నొక్కొకనికిఁ బెక్కురు పుత్త్రు లుద్భవించిరి. వారిసంప్రదాయభేదములు గలవారిచేత నే

---

1. ఇందులకు మూలము "అసితేక్షణం" అనఁగా నల్లని నేత్రములు గలదని యొకయర్థము. అసిత=కృష్ణునియందు. ఈక్షణం=చూపుగలది, అని రెండవయర్థము. ఇట్లు చెప్పుటచే మలయధ్వజునకును, వైదర్భికిని కృష్ణసేవారూప మగురుచి యుద్భవించె నని తెలియఁదగినది.

2. వైదర్భీమలయధ్వజులకు నాకొమార్తెతరువాత నేడుగురుపుత్త్రిలు గలిగిరి అని చెప్పుటచేఁ గృష్ణసేవారుచి యుదయించినతోడనే, శ్రవణము, కీర్తనము, విష్ణుధ్యానము, పాదసేవనము, పూజనము, వందనము, దాస్యము అనునవి గలిగిన వని తెలియఁదగినది.

మన్వంతర కాలమును, దదనంతరమును భూమి యనుభవింపఁబడుచున్నది. మఱియు మలయధ్వజునికుమారికను దృఢవ్రతురాలని తెలిసికొని *యగస్త్యుఁ డనువాఁడు పెండ్లియాడియామెయందు దృఢవ్రతుఁడును, బుద్ధిమంతుఁడును నిధ్మవాహుఁ డను పేరు గలవాఁడు నగుకుమారునిఁ గనెను. అనంతరము మలయధ్వజుఁడు తనభూమండలమును గుమారులకుఁ బంచి యిచ్చి కృష్ణునారాధింపఁ దలంపు గలిగి కులాచలమునకుఁ బోయెను. సంసారమును రోసి పోవుచున్న భర్తను గాంచి వైదర్భి, భగవత్సేవాహర్ష రూప మగుజ్ఞానము గలదయి సుఖముల నిచ్చుగృహములను, సౌఖ్యములను విడిచి, వెన్నెల చంద్రుని ననుసరించునట్లు భర్తను ననుసరించి పోయెను. ఆకులపర్వతమందుఁ జంద్రవస యను పేరు గలసుప్రసిద్ధనదియొడ్డున నాశ్రమము గావించుకొని మలయధ్వజుఁడు దదీయపుణ్యజలములను స్నానపానముల కుపయోగించి, బహిర్భాగమందును, నంతర్భాగమందును గలమలమును దొలఁగించుకొనుచుఁ, గందమూలములచేతను, ఫలములచేతను, బుష్పములచేతను, తృణములచేతను, జలములచేతను,

మలయధ్వజుఁడు తపం బాచరించుట

దేహపోషణమును జేయుచుఁ దపం బొనరించుచుండెను. ఇట్లు మలయధ్వజుఁడు సమదృష్టిగలవాఁ డయి శీతోష్ణములు, వాతవర్షములు, క్షుత్పిపాసలు, ప్రియాప్రియములు, సుఖదుఃఖం

---

* ఈచెప్పుటచే నగస్త్యుఁ డనుముముక్షువు కృష్ణసేవారుచి యనుకన్యకను బెండ్లాడి శ్రవణోపయుక్తము లయినశమదమాదిరూపములుగలిగి యుపదేశించినయర్థమును మననము చేయువాఁడును, నగుబ్రహ్మోపదేశాత్మకుఁడగు మునిని గాంచె నని తెలియఁదగినది.

బులు మొదలగు ద్వంద్వములను, కర్మయోగము చేతను జ్ఞాన యోగము చేతను, బుణ్యాపుణ్యరూప మగుకర్మమును దొలంగించుకొని, యమనియమాదులచే నింద్రియములను, బ్రాణమును, నంతఃకరణమును జయించి, తన్నుఁ బరమాత్మస్వరూపముగలవానిఁగ ననుసంధానము చేసి వాసుదేవునందు ననురాగరూప మగుభక్తిని నిలిపి నిశ్చలుఁడై శరీరాదులను మఱచి, స్తంభాకృతిని వహించి నూఱుదివ్యవత్సరంబులు తపం బాచరించెను. మఱియు నాతఁడు సాక్షాద్ద్రష్ట యగుపరమాత్మను జీవాత్మయందు వ్యాపకత్వధర్మవైలక్షణ్యము చేఁ గాంచి దేహవృత్తాంతమును విద్వాంసుఁడు స్వప్నవృత్తాంతమునుబలె నసత్య మని యెంచి యందుండి మఱలి కేవలపరమాత్మానుసంధానము చేసికొని లోకగురువయినహరిచేత నుపదేశింపఁబడి యన్నివిధముల చేతను బ్రకాశించుచు నున్నస్వపరయాథాత్మ్యజ్ఞాన మనుదీపము చే ధారకుఁ డయినపరబ్రహ్మమునందు జీవాత్మను, జీవాత్మయందుఁ బరబ్రహ్మమును సాక్షాత్కారము చేసికొనుచుఁ బిమ్మట నుపాసనాత్మక జ్ఞానమును విడిచి విరమించెను. అనంతరము, వైదర్భి భగవదారాధనరూప మగునుత్కృష్ట ధర్మమందు నిష్ఠ గలిగినభర్తను బ్రేమించి పరిచర్య చేయుచుఁ బాతివ్రత్యము చే నతిశయించి, సకలభోగములరోసి నారచీరలను ధరించి,యుపవాసాదివ్రతములచే మిగులఁ గృశించి,శిరోజములను జటలుగాఁగట్టికొని తపంబున నించుమించుగా భర్తకెనవచ్చుచు, నంగారమై యున్న యగ్నియొద్ద వెలయునిర్ధూమజ్వాలవలెఁ బ్రకాశించెను. మఱియు వైదర్భి తనభర్త యట్లు మృతినొందినను మానసమును గట్టిచేసికొని భర్తవృత్తాంతమును దెలిసికొనక పూర్వము

వలెఁ బతిపాదములకుఁ బరిచర్య చేయుచు భర్తృపాదకమలము లందు వెట్ట లభింపకపోవుటచే మృతినొందెనని నిశ్చయించి తన మందనుండి వేఱయిన యూఁడులేడివలెనే, మిక్కిలి దుఃఖంబును

వైదర్భి సహగమనము చేయుట.

గాంచెను. మఱియు నావైదర్భి తనప్రియుఁడు నశించుటచే దీను రాలయినతిన్నుఁగూర్చి మిగుల విచారించుచు వింతురాలై కన్నీటిచే స్తనములను దడుపుచు నారణ్యప్రదేశమందు గొంతెత్తి భర్తనుగూర్చి యిట్లు లేడ్వనారంభించెను. 'ఓరాజేంద్రా! లెమ్ము. లెమ్ము. సముద్రముచేఁ జుట్టఁబడిన యీభూమిని జోరులనుం డియు, దుష్టరాజులనుండియుఁ బరిపాలింపుము ' అని యిట్లామె విజన మగునడవిలో భర్తపాదములపైఁ బడి విలపించుచుఁ గన్నీటిని విడుచుచుఁ, గట్టెలచే నొకచితి నేర్పఱిచి యాచితియందు భర్తకళేబరము నుంచి దహనముచేయుచుఁ దాను సహగమనంబు చేయఁదలంచి యుండఁగా సనాతనుఁడయినయీశ్వరుండు బ్రాహ్మణవేషమును ధరించి యచ్చటికే తెంచి మధురము లగు సామవాక్యములచే నామెను లాలించుచు నిట్లనియె. [1]సుం దరీ! నీ వేజాతిదానవు? నీ వెవరికి సంబంధించినదానవు? [2]అతఁ డేజాతివాఁడు? అతనికై యేల దుఃఖించెదవు? [3]నీవు స్వస్వరూ

1 నిరుపాధికసఖుఁ డయినపరమాత్మ భాగవతుఁ డయిన మలయధ్వజుని స్నేహము చేసి యుండుటచే మిక్కిలి సంతసించి యిట్లనుచున్నాఁడు.

2 అతనికి నీకు నేమియు సంబంధము లేకుండ నెందుల కిట్లేడ్చెదవు? స్వస్వరూపము నే తెలియనిదానవు. న న్నెట్లు ఎఱుఁగుదువు?

3 నీవు కర్త్రాంతర మెట్లన! బ్రాహ్మణవేషధారియై పరమాత్మ యిట్లనుచు న్నాఁడు. ఓయీ! నీవు సృష్ట్యాదియందు నీతునాదికర్మముల కనుగుణమయిన

పము మఱచితివి. సృష్ట్యాదియందు నీవు వికారమునొంది నీస్నే హితు నెట్లు తెలిసికొనఁగలవు? ఓయీ! నను నీవు తెలిసికొనఁ జాలకున్నావు. కావున నీవు నీస్నేహితుని మఱచినవాఁడ వగు చున్నావు. నాకొక స్నేహితుఁ డుండెనని స్మరించుచున్నావా? నీకు హితుండ నైన నన్ను విడిచి నీచము లయిన భోగముల నను

---

నాసంకల్పముచేఁ బరమాత్మ స్వాపహృతమును స్వస్వరూపమును మఱచి దేవ మనుష్యాదివికారము నొందితివి. నీస్నేహితుఁడ నైననన్ను స్మరింపుము. నీ కంతరాత్ముఁడ నైయున్న నన్ను విడిచి గ్రామ్యసుఖములనపేక్షించి దేవమను ష్యాది శరీరమును గోరుకొనుచు నన్నెడఁబాసితివి. అందుచే నీస్వపరయా థాత్మ్యజ్ఞానము నశించినది. నీవును నేనును శరీర మనుగృహములో వర్తించు నట్టిస్నేహితులము. అచ్చట మనమిరువురమును (అనఁగా జీవాత్మపరమాత్మ లనుట) వికారరహితుల మయి యుంటిమి. అట్లు శరీర మనుగృహమునందు హృదయస్థానమందు మనము పెక్కువత్సరంబులు గడపితిమి. ఇట్లుండనీస్నే హితుఁడను (అనఁగా నీ కంతరాత్మనై యుండి నీకు హితము నొనగూర్చువాఁ డను) నగునన్ను విడిచి శబ్దాదివిషయములం దాసక్తి కలిగి ప్రకృతిమండల ము నొంది యందులోనివాసస్థానమును గూర్చి వెదకుచుఁ బ్రకృతి సృజించిన యొక్క స్థానమును(అనఁగా శరీరము ననుట)జూచితివి. ఆశరీర మనుపురము పంచేంద్రియములకు విషయము లగువస్తువు లనుతోఁటలతోను, నేత్రములుకర్ణ ములునాసికారంధ్రములు మొదలగురంధ్రములనుతొమ్మిదిద్వారములతోను, ప్రాణ!మనుపురాధ్యక్షునితోడను, పృథివ్యప్తేజంబులను ప్రాకారములతోను, మనస్సుతోఁ గూడినయింద్రియపంచక మనెడివస్తుసమర్పకస్థలంబుతోను,బం చభూతము లనునంగళ్లతోను, శక్తి యనెడి యధిపతితోను గూడియుండెను. అట్టిశరీరమును బొంది బుద్ధితోఁ గూడికొని సకలవిషయసుఖము లనుభవించు చుఁ గావున స్వాత్మజ్ఞానమును బరమాత్మజ్ఞానమును మఱచియా బుద్ధిసంబంధము చే స్త్రీసంబంధము గలిగించుకొని తత్సంబంధముచే నీ స్త్రీజన్మమును బొందితివి.

భవింప నెంచి భోగస్థానమును గోరికొనుచు నన్ను నెడఁబాసితివి. అందుచే నీస్వపరయాథాత్మ్యజ్ఞానము నశించినది. ఓయార్యా! నీవును నేనును గలిసి పూర్వమందు మానససరోవరమున హంసలమై యుండి పెక్కుసంవత్సరముల కాలమును గడపితిమి. ఇట్లుండ నీవు గ్రామ్యసుఖములందు వేడుకపడి నీస్నేహితుఁడ నైన నన్ను విడిచి యీభూమినిఁ బొంది తగినవాసస్థలమును వెదకుచు స్త్రీనిర్మిత మయినయొకపురమునుఁజూచితివి. ఆపురమునకు నైదుద్యానవనములు కలవు. దానికిఁ దొమ్మిదిద్వారములు గలవు. దాని కొకపాలకుఁడు గలఁడు. దానికి మూఁడు ప్రాకారములు గలవు. ఆరు దిక్కున వస్తుదాయకము లగుస్థలము, నైదంగడివీధులు ను, నైదుగురుమంత్రులును గలరు. దాని కీస్త్రీ యధిపురాలుగా నుండెను. ఆయుపవనము లైదు నయిదింద్రియంబులను నానందపటుపంజరాలును. ఆనవద్వారములును బ్రజలరాకపోకలకుఁ దగియున్నవి ఆమూఁడుప్రాకారములును గ్రమముగా నగ్నిమయములును జలమయములును, బృథివీమయములును నై యున్నవి. పైని జెప్పినయాఆస్థలంబులందును నింద్రియములు గోరువస్తువులు సంప్రాప్త మగుచుండును. అచ్చటియంగళ్లు క్రియాశక్తితోఁ గూడి యుండును. అట్టిపురమును బ్రవేశించి బుద్ధి యను నాయకురాలి కధీనుండ వయి, నిన్నును నన్నును గూడ మఱచితివి. అచ్చట నీవు బుద్ధి యను పేరు గలయాస్త్రీని భార్యనుగా వరించి విషయ సుఖముల ననుభవించుచు నందువలన స్వపరయాథాత్మ్యజ్ఞానమును దొలఁగించుకొని యాస్త్రీసంబంధముచేఁ బాపీయ మయినయీస్త్రీజన్మమును బొందితివి. * కావున నీవు విద

* ఈచెప్పుటచే స్త్రీపురుషాదిజన్మములు దేహమువలనఁ గలుగుచున్నవి కాని

ర్భరాజకుమారికవు కావు. నీ కీమలయధ్వజుఁడు స్నేహితుఁడు కాఁడు. మఱియు నీవు బుద్ధి యనునామాంతరము గలపురంజనికి భర్తవు కావు నీవు పూర్వజన్మమునఁ బురుషుఁడ వని వ్యవహారింపఁబడుటకును, నీజన్మమందు స్త్రీయని వ్యవహారింపఁబడుటకును గారణము భగవన్మాయతప్ప వేఱుకారణము లేదు. నీవును నేనును మానససమం దుండుహంసలము. అప్పటిస్వరూపమును జెప్పెదను వినుము. మన మిరువురమును దేహనిశరీరము గలవారము. మన మిరువురము శరీరాత్మలవలె వర్తించువారము. అంతియ కాని నీవు వెఱవాఁడవు కావు. ఆలోచింప మనయిరువుర మన్యోన్య మెడఁబాటు చెందుటకుఁ గారణము పండితు లెవ్వరుఁ

---

యాత్మకు స్వయముగా లేవనియు దేహసంబంధముచేత నే విదర్భరాజసుతవై నట్లును నంతకుఁ బూర్వము పురంజనికి భర్తవైనట్లును దెలియవచ్చుచున్నది కాని యాదేహసంబంధము లేనిచో నీ కిట్లుగానరాదనియు, నీ కట్లు తోఁపఁ జేయునది నామాయయే కాని వేఱు కాదనియును, మనమిరువురము (అనఁగా జీవాత్మపరమాత్మ పలనుట) దోషాదిరహితుల మయి నీవు నాకుశరీరముగాను నేను నీకు శరీరిగాను వర్తించుచుంటిమి కాని వేఱువిధముగా వర్తింపలేదనియును మన మొకరినొకరు విడిచి వర్తించుచుండు మని పండితు లెవ్వరును భావింప రనియు, జీవాత్మకుఁ బరమహితుఁ డయి వర్తించుపరమాత్మ జీవాత్మకు హితోపదేశముచేయుచుండె ననియు నెఱుంగునది. మఱియుఁ బురుషుఁ డద్దము మొదలగు పెద్దవస్తువులందును జలబిందు లగుచిన్నవస్తువులందును దన్నుఁ బెద్దవానిఁగాను జిన్నవానిఁగాను జూచి, యారెండు ప్రతిబింబములకును నుపాధిభేదమువలన భేదము గలుగునట్లుగానే స్థూలసూక్ష్మశరీరములం దుండుటచే నాయుపాధిభేదమువలన మనము నానావిధములుగా నున్నట్లు గానవచ్చుచున్నాముగాన వాస్తవమున మనమిరువురమును శరీరాత్మలుగా నున్నామనియుఁ బరమాత్మ బోధింపఁగా జీవుండు తెలివి దెచ్చుకొని వర్తించెను.

జూడరు. * ఓయీ! పురుషుఁడు తన్ను నొప్పయుపాధి యగు నద్దమందుఁ బెద్దవానిఁగాను స్వల్పోపాధియైనయితరుల నేత్రాదు

* ఇందులకు మూలము "యథాపురుష ఆత్మానమేనమాదర్శచక్షుషోః। ద్విధాభూతమవేక్షేత తథైవాంతర మాపయోః॥ అనఁగా బ్రాహ్మణత్వాది జాతులును, దీర్ఘత్వాదిగుణములును, మొదలగు తన్ను విడిచియుండనొల్లని విశేషణములుగల పురుషుఁడను పేరుగలిగి తత్తద్విశేషణములుగలిగినదగు నొక్క వస్తువు అద్దము మొదలగు మహోపాధులందు స్థూలాకారముతోను, నేత్రము లు మొదలగు చిన్నయుపాధులందు సూక్ష్మాకారముతోనుగాన నచ్చుచుండును. అట్లె శరీరత్వధర్మము గలిగిన జీవుఁడే శరీరముగాఁ గలిగి శరీరత్వధర్మము తానొప్పని యీశ్వరాత్మకమగు వస్తువొక్కటియేయైనను స్థూలసూక్ష్మశరీరములందుం డుటచే నుపాధిసంబంధమువలన నానాభూతమైనట్లు గానవచ్చుచున్నదని యర్థము. ఈశ్లోకమున "పురుష మవేక్షతే" అనుటవలన, ఈయర్థముస్పష్ట మగుచున్నది. ఎట్లనఁ — పురుషుండు బ్రాహ్మణత్వాదు లగుజాతివిశేషణము లును దీర్ఘత్వాదిగుణవిశేషణములును గలిగియుండును. బ్రాహ్మణత్వధర్మమున కును, బ్రాహ్మణవ్యక్తికిని, దీర్ఘత్వగుణమునకును, అది కలవ్యక్తికిని, గాంతికిని, గాంతి గలవ్యక్తికిని భేదమున్నట్లుగానే, శరీరమునకును శరీరము గలయాత్మకును భేదము కలదు. కావున భగవంతునికి శరీరభూత మగు జీవునకును, జీవుఁడు శరీరముగాఁ గలిగినయీశ్వరునకును భేదము గలదని గ్రహింపవలయును. మఱి యు బింబప్రతిబింబములకు గలిగినట్లు జీవేశ్వరులకుఁ గలిగినయౌపాధికభేద ము స్వాభావికము కాదని గ్రహింపరాదు. "ఆదర్శచక్షుషోః" అని యుపా ధులను జేర్కొనుటచే వానియందుఁ గానవచ్చు ప్రతిబింబములకు బింబముతో (అనఁగాఁ బ్రతిబింబితవస్తువుతో) భేదము లేకపోయినను నా ప్రతిబింబములకు పాధిమూలమగు భేదము లేకపోలేదు. ఆలోచింపఁగా నద్దములోని ప్రతిబింబ ముకంటె నేత్రములోఁ బ్రతిఫలించిన ప్రతిబింబము భిన్నమయినది కాబట్టి మ ఱియు బింబప్రతిబింబముల కభేద మని యంగీకరించినవారు సైతము ప్రతిబింబ ములకు భేద మంగీకరింపక తీఱదు. ప్రతిబింబములకు భేద మంగీకరింపనిచో

లందుఁ జిన్నివానిఁగాను జూచుచుండుట గలదు. వృద్ధిహ్రాసము
లచే నాయాయుపాధులందుఁ గానవచ్చు ప్రతిబింబములకు భేద

నుపాధివశమున భేదము గలిగి వర్తించు ప్రతిబింబములందు భేదప్రతీతి లేక పో
వలసివచ్చును. ఇంతియ కాక ప్రతిబింబములకు భేదము లేదని సాధించుటకుఁ
దగిన హేతువులును గానరావు. ప్రతిబింబము లేకాకారముగా నుండును
గాన యభేద మంగీకరింపరాదా? యనరాదు. ప్రతిబింబములకు బింబావస్థ
గలుగుటచే వానిలోఁ బరస్పరము భేదము గలదు. ప్రతిబింబముల కట్టి భేదము
గలుగుచున్నది! కావుననే పిండత్వము ఘటత్వము, కపాలత్వము మొదలగునవ
స్థలకుఁ బరస్పర భేదము తెలియవచ్చుచున్నది. అంతియ కాని, మృద్ద్రవ్యావస్థను
బట్టియ భేదమును గ్రహింపరాదు. ఈ చెప్పుటవలన ప్రతిబింబములలోఁ బరస్పరము
భేదమున్నను బింబప్రతిబింబముల కభేదము కానవచ్చుచున్నది. అట్లెయుపా
ధిభేదముచే జీవులకుఁ బరస్పరము భేదము గలుగుచున్నది. జీవేశ్వరుల కభేద
మే కానవచ్చుచున్నది. ఇట్లుండ జీవేశ్వరులకు భేదమున్నదని యంగీకరించుట
యెట్లు? అని శంకింపరాదు ఈశ్లోకమున బింబప్రతిబింబములను మాత్రమే దృ
ష్టాంతముగాఁ జేకొనవలెను గాని బింబప్రతిబింబములకు నౌపాధికభేద మున్న
దని చేకొనరాదు. ఎప్పుడును బింబప్రతిబింబములను దృష్టాంతముగాఁ దీసికొ
నక బింబప్రతిబింబములందుండు సమానధర్మము నే దృష్టాంతముగాఁ జేకొనవ
లెను. అంతియు కాని బింబప్రతిబింబములకువలెనే జీవేశ్వరుల కభేద మంగీ
కరింపరాదు. మామతమునకు విరుద్ధములు కాని ధర్మములచేత నే దృష్టాంతము
సరిపోవుచుండఁగా బింబప్రతిబింబములనే దృష్టాంతముగా నేల చేకొనవల
యును? ఈశ్లోకముచే జీవబ్రహ్మల కభేద మంగీకరించుట యీప్రకరణ
మునకు విరుద్ధముగా నుండును. తన్నుఁగూర్చియు, బ్రహ్మమునుగూర్చియు నే
విధమైనజ్ఞానము లేక పోవుటచేత దేహమే యాత్మ యని భ్రాంతియు,
నాత్మస్వతంత్రుఁడను భ్రాంతియుఁ గలపురుషునికి నాభ్రమలను నివారించు
నిమిత్త ముపదేశించుచున్న యీప్రకరణమందు, జీవపరమేశ్వరు లన్యోన్యము
సఖులైనట్లు చెప్పఁబడుచున్నది. సఖిత్వధర్మము ఎప్పుడును పదార్థద్వయమం

మున్నదని తలపోయవచ్చును. అట్టి శరీరాత్మభావముచే నియతము లయినవిశేషణములు (అనఁగా శరీరత్వశరీరిత్వములు) గల మన మిరువుర మొక్కటియైనను స్థూలసూక్ష్మశరీరములందుఁ బ్రవేశించుటచే నుపాధిభేదమువలన నానాభూతులమైనట్లుగాన వచ్చుచున్నాము. నీవు శరీరమవు. నేను శరీరిని. ఇదియే మనయిరువురికిం గలభేదము' అని యిట్లు తనమిత్రుఁ డగుహంసచే బోధితుఁ డయి పురంజనుండు పూర్వజ్ఞానమును మఱలఁ బొందెను. ఓప్రాచీనబర్హీ ! ఈయుపాఖ్యానము నీకుఁ బూర్తిగా వినిపించితిని. ఇది యధ్యాత్మసంబంధము గలది. ఆత్మతత్త్వము నీయుపాఖ్యానమూలమునఁ దెలిపితిని. విశ్వాకారుఁ డయినభగవంతుఁ డన్యాపదేశమున జెప్పిన మిగుల సంతసించు నని యట్లు చెప్పితిని.

ఇది యిరువదియేడవ యధ్యాయము.

---

డుండును. గాని యొక్కపదార్థమం దుండునది కాదు. స్త్రీత్వపురుషత్వాది ధర్మములవలె నీసఖిత్వ ముపాధి వలనఁ గలుగుచున్నదని యుపదేశింపఁబడుచున్నదని చెప్పరాదు. సఖిత్వ మౌపాధిక మన్నచో, నాసఖిత్వముతోఁ గూడ నుపదేశించిన హంసత్వాదులుగూడ నౌపాధికము లని యంగీకరింపవలసియున్నది. మఱియు "మాయా హ్యేషా మయా సృష్టా" అనుట నీశ్వరుఁడు సంసారనివర్తకుఁ డని కాక సంసారము కలిగించువాఁ డనియె తెలియవచ్చుచున్నది. సర్వజ్ఞుఁ డగునీశ్వరుండు వెఱ్ఱివానివలె ననర్థరూప మగుసంసారమును దనయందారోపింపఁజూచుకొనునా? కావున సఖిత్వ స్త్రీపురుషత్వాదులవలె నౌపాధికము కాకపోవుటచేతను, సఖిత్వ మెప్పుడును రెండు పదార్థములం దుండవలసిన దగుటచేతను, జీవేశ్వరులను సఖులఁగా నిరూపించు నీప్రకరణమందు జీవేశ్వరుల కభేదము చెప్పుట యుక్తముగాదు. కావున పైశ్లోకముచే సమాన ధర్మములనే దృష్టాంతముగాఁ జేకొనవలయును.

అని పలికిన నారదునిపలుకులు విని ప్రాచీనబర్హి మిక్కిలి సంతసించి 'ఓనారదమునీంద్రా! తత్త్వజ్ఞానవంతుఁడ వయిననీవాక్యములు ప్రత్యక్షముగా స్పష్టముగా నర్థమును దెలుపలేదు. దేహమే యాత్మ యని తలంచుకొను చున్నమావంటివా రట్టి గూఢవాక్యములను దెలిసికొనఁజాలరు. కేవలజ్ఞానవంతులు తెలిసికొనఁ దగినయాత్మతత్త్వమును బుణ్యపుణ్యాదిరూపకర్మములచే స్వపరయాథాత్మ్యజ్ఞానము లేనిమే మెట్లు తెలిసికోఁగలము? కావున వెనుకటియుపాఖ్యానమును వివరించి చెప్పు' మనవుడు

నారదుఁడు ప్రాచీనబర్హికి హితోపదేశముఁ జేయుట.

నారదుం డిట్లనియె. ఓరాజేంద్రా! నీకుఁ బురంజనోపాఖ్యానము నిదివఱకుఁ జెప్పియున్నాను. పురంజనుఁ డనఁగాఁ బురుషుఁ డని (అనఁగా జీవాత్మ యని) తెలిసికొనుము. ఆతనికిఁ బురంజననామము గలుగుటకు హేతువును వినుము. పుర మనఁగా శరీరము. జీవాత్మ మనస్సుతోఁగూడ నందుఁ బ్రవేశించి తత్పురసంబంధము గలిగియుండును గానఁ బురంజనుఁ డనునామము గల్గినది. ఆశరీర మొకటిగాని రెండుగాని మూఁడుగాని నాల్గుగాని పెక్కుగాని పాదములు గలిగియుండును. ఒకప్పు డది పాదములేకయే యుండవచ్చును. హరిషష్ణ్వాదినామములచేతను జగత్సృష్ట్యాదవ్యాపారములచేతను, సత్యజ్ఞానాదిగుణములచేతను, సామాన్యముగా జనులకుఁ దెలియరాని పరమేశ్వరుఁ డాపురంజనునకు సఖుండు గలఁడు. ఆసఖుఁ డొరులచేఁ దెలియఁబడఁడు. కావున "అవిజ్ఞాతుఁ"డనునామము గలిదనది. ఆశరీరమునకుఁ దొమ్మిదిద్వారములు కలవు. పురుషుఁడు జ్ఞానకర్మేంద్రియములకు విషయము లగుపదార్థములను బూర్ణముగా ననుభవింపఁ దలంచి

నప్పుడు నవద్వారములును రెండు కాళ్లును రెండుచేతులును గలి గినమానవశరీరమును ఎంచి దని తలపోయును. రాజా పురం జనునకుఁ బ్రమద యనెడిభార్య గలదని చెప్పియుంటిని. ఆపురం జనునిభార్య యనఁగా బుద్ధి యని గ్రహింపుము. ఆబుద్ధి యహంకార మమకారములు పుట్టించి యెక్కువమదమును గలిగించును గాన ప్రమదయని చెప్పఁబడినది. ఆబుద్ధిని బురస్కరించు కొని జీవుఁడు చక్షురాదీంద్రియములచే శబ్దాదిగుణముల ననుభవించును. పురంజనునకుఁ బదునొకండ్రు స్నేహితులు గల రని చెప్పితిని. ఆస్నేహితులు మనస్సుతోఁ గూడినయింద్రియదశక మని గ్రహింపుము. వారిలో నొక్కొక్కరు నూర్గురుస్త్రీల కధిపతులై యున్నారని చెప్పితిని. ఈనూర్గురేసిస్త్రీలను నింద్రియవృత్తు లని తెలియుము. ఆపురముఁ బరిపాలించునట్టిరా జనఁగా శరీరమును రక్షించుచున్నప్రాణ మని తెలియుము. ఆ ప్రాణమయిదువృత్తులు కలది కావున నైదుతలలు గలపాముతో సాటి దెచ్చితిని. ప్రమదయుఁ బదునొకండ్రు మహాభటులు వచ్చుచున్నట్లు చెప్పితిని వారిని బుద్ధితోఁ గూడి సర్తించుమనస్సుతోడి వయినయింద్రియంబు లని తెలియుము. పదియింద్రియంబులు పదుగురుమహాభటు లనియు మనస్సు పదునొకండవమహాభటుం డనియు నెఱుంగుము. పురంజనుఁడు పాంచాలములను బాలించు ననఁగా జీవుఁడు పంచేంద్రియవిషయపదార్థముల ననుభవించు నని తెలియుము. పురమునకుఁ దొమ్మిదిద్వారము లనఁగా శరీరమునకు నేత్రములును, నాసికారంధ్రములును, కర్ణబిలములును ముఖము శిశ్నము గుదము నాఁబడు తొమ్మిదిరంధ్రములు గలవని యెఱుంగుము. చక్షురాదీంద్రియరంధ్రములం

దున్నయింద్రియములతోఁ గూడ నాత్మ వైకి వెడలుచుండును. ఆద్వారంబు లెచ్చటెచ్చట నున్నవో వెనుక వర్ణించితిని. అందు నేత్రరంధ్రములును నాసికారంధ్రమును నోరును నీయైదును శరీరమునకు ముందుభాగమునందుఁ గానవచ్చుచుండును. పురంబునకు దక్షిణద్వార మనఁగా గుడికర్ణము. ఉత్తరద్వార మనఁగా నుత్తరకర్ణము. అధోభాగమునందు రెండుద్వారంబు లని చెప్పితిని. అవి గుదశిశ్నము లని యెఱుంగుము. ఒక్కచోట నిర్మింపఁబడినఖద్యోతావిర్ముఖీద్వారము లనఁగా బురోభాగమునం దున్న నేత్రములు. జీవుఁడు వానివలన రూపమును జూచుచుండును. నలినీనాళిను లను రెండుద్వారములు పురోభాగమందు నిర్మింపఁబడినవి. అవి నాసికారంధ్రములు. జీవుఁడు నాసికారంధ్రములం దున్నఘ్రాణేంద్రియముచేతఁ బరిమళమును గైకొనుచుండును. పురోభాగమం దున్నయైదవద్వారము నోరు. జీవుఁడం దున్నరసజ్ఞ మగురసనేంద్రియముతో సమస్తరసములను గ్రహించుచుండును. ఆపురమునకుఁ బితృహూ వనియు దేవహూ వనియు రెండు ద్వారములు కలవని చెప్పితిని. పితృహూ వనఁగా దక్షిణకర్ణము. దేవహూ వనఁగా నెడమచెవి. జీవుఁడు వానివలన శబ్దాదికమును వినుచుండును. చండవేగుఁ డగుగంధర్వపతినిఁగూర్చి చెప్పితిని. జీవుని కాయుష్కాలపరిమాణమును దెలియఁజేయు సంవత్సర మని తెలియుము. అది చక్రమువలెనే త్వరగాఁ దిరుగుచుఁబురుషాయువును గొలుచుచుండును. గాన చండవేగ మని పలుకఁబడుచున్నది. ఆచండవేగునకు గంధర్వులును గంధర్వస్త్రీలును గల రని చెప్పితిని. చండవేగము గలసంవత్సరరూపకాలమునకు మూఁడువందలయఱువది పవళ్లును, నన్నియరాత్రులును

గలవు. గంధర్వులు పరోక్షముగా మానవులయాయువును హ రించునట్లు నివియు నాయువును హరించుటచే గంధర్వు లని చె ప్పఁబడినవి. కాలకన్యక లోకమున సంచరించుచున్నదని చెప్పి తిని. ఆకాలకన్యక యనఁగా జరావస్థ యని యెఱుంగుము. పురు షాయువును హరించుకాలమున కది మిగులఁ బ్రీతిని బుట్టించు ను గాన నది కాలమునకుఁ గన్యకగాఁ జెప్పఁబడినది. లోక మె వ్వరును దానినిఁబరిగ్రహింప కున్న యవసరంబున సకలరోగముల కును రా జయినమృత్యువు లోకక్షయముఁ జేయుటకుఁ జేరఁదీ సెను. యవనేశ్వరుఁడు పురంజనునిపురమును ముట్టడించె నని చెప్పితిని. ఆయవనేశ్వరుఁ డనఁగా మృత్యు వని తెలియుము. ఆతనిసైనికు లగుయవను లనఁగా నాధివ్యాధు లయినరోగము లని గ్రహింపుము. ఆరోగములు మిగులదుఃఖముఁ గలిగించును. గాన శత్రువులని చెప్పితిని. సుఖదుఃఖములు, రాగద్వేషములు, భయము, అభిమానము, ప్రమాదము మొదలగున వన్నియు నత నిసైనికు లని యె తెలియుము. ప్రజ్వారునిఁగూర్చి చెప్పితిని. ప్ర జ్వారుఁ డనఁగా వివిధములగురోగము లని గ్రహింపుము. ఓ రాజేంద్రా! దక్షిణపాంచాలము లనియు నుత్తరపాంచాలము లనియుఁ జెప్పితిని. త్రివర్గమును సాధించుటను దెలిపెడిప్రవృత్తి శాస్త్రము దక్షిణపాంచాల మనియుఁ ద్రివర్గఫలము నిత్యము కాదని తెలిపి యనంతస్థిరఫల మగుబ్రహ్మోపాసనమును గూర్చి యుఁ దత్స్వరూపగుణములను గూర్చియుఁ దెలిపెడినివృత్తిశాస్త్ర ము త్తరపాంచాల మని యెఱుంగుము. మఱియుఁ బ్రవృత్తిశాస్త్ర ములందుఁ జెప్పఁబడినకర్మములచే దాక్షిణాత్యు లగుపితృదేవత లను నారాధించి వారిసన్నిధిని బొందవచ్చును గాన యట్టిపితృ

ప్రాప్తిసాధనములను దెలుపునది గనుక నీశాస్త్రము దక్షిణపాంచాల మని చెప్పఁబడినది. నివృత్తిశాస్త్రోక్తము లగుకర్మముల నాచరించి బహ్మప్రాప్తిని గలిగించును గాన నివృత్తిశాస్త్రము త్తరపాంచాల మనియుఁ జెప్పఁబడెది. జీవుఁడు శ్రోత్రేంద్రియ మువలన వానినిఁ దెలిసికొనుచున్నాఁడు. ఆసుర యనెడిపశ్చాద్ద్వారమనఁగా శిశ్నము. దానివలన జీవుఁడు మైథునాదికర్మములనుఁ జేయుచుండును. దుర్మద మను నుటియొకద్వార మనఁగా గుదస్థానము. దానివలనఁ బురంజనుఁడు వైశస మను దేశమునకు వెడలు ననఁగా జీవుఁ డాగుదస్థానమునుండి నరకదుఃఖముల ననుభవింపఁ బోవునని తెలియుము. పురంజనుఁ డంధు లగుపౌరులవలనఁ గొన్నికార్యములు నెఱవేర్చుకొను నని చెప్పితిని. అంధు లగుపౌరు లనఁగాఁ బాదములును, బాణులును. అవి జ్ఞానహీనము లయినవి గాన నంధు లని చెప్పఁబడినవి. జీవుఁ డాపాదముల వలన నడుచుచు జేతులవలనఁ గార్యములు చేయుచున్నాఁడు. పురంజనుఁ డంతఃపురమును బొందె ననఁగా జీవుఁడు హృదయమును బొందె ననుట. రా జంతఃపురమును జెంది మోహమును ప్రసాదమును హర్షమును బొందునట్లు జీవుఁడు హృదయమును బొంది మోహాదులను జెందుచుండును. ఎప్పుడెప్పుడు స్వప్నావసయందు బుద్ధివికారమును బొందునో, జాగ్రదవస్థయం దెప్పుడెప్పు డింద్రియములు పరిణామమును జెందునో, యప్పుడప్పుడు బుద్ధిసంబంధిగుణములను స్వీకరించి జీవుఁడు తాను వాస్తవముగా నుపద్రష్ట యైనను, బుద్ధిసంబంధు లగుదర్శనశ్రవణాదులను బొందుచుండును. ఓరాజా! దేహము నొకరథమునుగా వర్ణిం

చితిని. దానివివరణమును వినుము. *దేహము రథమువంటిది. ఇంద్రియములు గుఱ్ఱములు. రథగమనము సంవత్సరవేగతుల్య మయినది. పుణ్యపాపకర్మములు చక్రములు. సత్వరజస్తమోగుణములు ధ్వజములు. పంచప్రాణములు బంధనస్థానములు. మనస్సు పగ్గములు. బుద్ధి సూతుఁడు. హృదయము రథికుఁడు కూర్చుండుస్థలము. శోకమోహాదు లగుద్వంద్వములు కాఁడి బంధించెడిచోట్లు. ఇంద్రియార్థములు బాణములు. సప్తధాతువులును రథమునకుఁ గప్పెడి చర్మాద్యావరణములవంటివి. ఎండమావులవలెనే సుఖాభాసము లయినబాహ్యవిషయములనుగూర్చి పర్విడునేకాదశేంద్రియములును సేనలు. జీవుఁ డారథమును నెక్కి సంచరించుచు నాధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధిభౌతికము, నాఁబడుతాపములకును, బహువిధదుఃఖములకునుఁ జిక్కి శరీరమున్నంతకాలము నజ్ఞానముచే నావృతుఁడై యుండును. మఱియు నింద్రియాదులధర్మములను నాత్మయందారోపించి నేను సుఖిని, నేను దుఃఖిని, నే నంధుఁడను, నేఁ జెవిటివాఁడను, నని

* ఇట్లు మానవదేహమును రథముగా నిరూపించుట యెందులకనఁగా రథ మొకస్థలమునుండి మఱియొకస్థలమునకుఁ జేర్చునట్లు మనుష్యశరీరము వైష్ణవపదప్రాప్తిని గలిగింప సాధన మయినది. ఈయంశమును గఠవల్లిలోఁ జెప్పఁబడినది. 'ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ। బుద్ధింతు సారథిం విద్ధిమనఃప్రగ్రహమేవచ। ఇంద్రియాణి హయానాహు ర్విషయాంస్తేషు గోచరాన్। ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహు ర్మనీషిణః। యస్త్వవిజ్ఞానవాన్భవత్యమనస్కస్సదాఽశుచిః। నసతత్పదమాప్నోతి యస్మాద్భూయో నజాయతే। విజ్ఞానసారథి ర్యస్తు మనఃప్రగ్రహవా న్నరః। సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదం। కావున నిట్టిరథము నధిరోహించి వేఁటకు వెడలినరాజువలెనె జీవుఁడు దురితకార్యములకయి ప్రయత్నించుచుండును.

యనుకొనుచు సుఖలేశములనిమిత్తము పాటుపడుచు, నహంకారమమకారములచే దేహాంతరప్రాప్తికిఁ దగినకర్మముల నాచరించుచు శరీరమందు వసించి యుండును. జీవునకే సంసార మెట్లు కలుగుచున్నదని యందువేని వినుము. హితోపదేశమును జేయువాఁడునుఁ బ్రకృతిపురుషవిలక్షణుఁడును నగుపరమాత్మను మఱచి జీవాత్మ స్వయముగా నాత్మానుభవపరుఁ డయినను బ్రకృతిగుణము లగుశబ్దాదులం దాసక్తుఁ డగునప్పుడే యతనికి సంసారము గలుగుచున్నది. మఱియు జీవుండు శబ్దాదులందు భోగ్యతాబుద్ధి గలిగి, కావుననే విషయములకుఁ జిక్కి యభిలషితపదార్థములను సంపాదించుకొనునిమిత్తము సాత్వికములును, దామసములును, రాజసములును, నగుకర్మములను జేయుచున్నాఁడు. తా నొనరించినకర్మముల ననుసరించియే మగుడ జన్మాంతరములను బొందుచున్నాఁడు. జీవుఁడు సాత్వికకర్మములనాచరించి కాంతిబహుళ మయినదేహమును బొందును. రాజసకర్మముల నాచరించి దుఃఖసంపాదకము లయినదేహములను బొందును. తామసకర్మముల నాచరించి యజ్ఞానశోకములను గలిగించుదేహములను బొందును. మఱియు నవివేకియైన జీవుఁడు తా నొనరించుకర్మములకుఁ దగునట్లుగా నొకప్పుడు మనుష్యజన్మమును, నొకప్పుడు దేవజన్మమును, నొకప్పుడు పశుపక్ష్యాదిజన్మమును, అందులో నొకప్పుడు స్త్రీత్వమును నొకప్పుడు పురుషత్వమును, నొకప్పుడు నపుంసకత్వమును బొందును. ఓరాజా! యాఁకలిగొని దీనమయినకుక్క యేవిధంబుగాఁ బ్రతిగృహంబునకుఁ దిరిగితిరిగి స్వకర్మాయత్త మయినయన్నమును గాని తాడనమును గాని పొందునో, యట్లే జీవుఁడు కామములందుఁ గోర్కి కల

వాఁడయి తా నొనర్చినకర్మములకుఁ దగునట్లుగా నూర్ధ్వలోకములందును, నధోలోకములందును, నీలోకములందునుఁ దిరుగుచు స్వకర్మాయత్త మయినప్రియమునుగాని యప్రియమునుగాని పొందుచుండును. ఆధ్యాత్మికాదితాపములను త్రివిధదుఃఖములం దొక దానికి మఱియొకదానిచే నాశనము గలిగినచో బాగుగ నుండును. కాని యీతాపత్రయనాశనముభగవదుపాసనముచే నగుంగాని వేఱొకయుపాయముచేఁ గానేరదు. ఇంతియకాకయీదుఃఖములకు బ్రతిక్రియచేసినను దుఃఖముగానే తోఁచును. పురుషుఁడు తలతో బరువు మోయుచుఁ దనతలకు విశ్రాంతి కలుగునిమిత్తము భారమును బుజముపై నిలుపును. ఆకాలమందుఁ దలకు నాభారము బాధ గలిగింపకపోయినను బుజమునకుఁ గలిగింకపోలేదు. అట్లె తాపత్రయమున కొకవేళఁ బ్రతీకారము చేసినను నవి స్వల్పవిశ్రాంతికరములు గాని పూర్తిగా నశింపఁజేయలేవు. ఆలోచింప నాదుఃఖప్రతిక్రియలును దుఃఖరూపములనియే చెప్పవచ్చును. కావునఁ గేవలము కర్మరూప మగుప్రతీకారము దుఃఖములను మొదలంటు నశింపఁజేయవు. ముఖ్యముగాజ్ఞానరూపము లయినకర్మములయినను దుఃఖహేతువులయిన కర్మములను బూర్తిగా నివర్తింపఁజేయలేవు. ఓ పాపరహితా! స్వప్నమందుఁ గలిగిన స్వశిరశ్ఛేదాదికరూపభయము జాగరణముచే నశించినను నజ్ఞానము నశింపకపోవుటచే మగుడ నట్టి స్వప్నము కలుగవచ్చును. అట్లె యీరెండుకర్మములును బ్రతీకారము లయిన నందులకు మూల మగునవిద్య నశింపకపోవుటచే మగుడఁ గలుగుచుండు. ఆత్మయందు దేవత్వమనుష్యత్వాద్యాకారములు లేకపోయినను, స్వప్నమందు లింగశరీరమూల

మున సంచరించుమనస్సువలన సుఖదుఃఖాదులు సంభవించుచు న్నట్లు దేహాత్మభ్రాంతిమూలమయినసంసార మాత్మకు సంభవించుచునే యుండును. ఓరాజా! పురుషార్థభూతుం డయినయాత్మకు దుఃఖపరంపరారూప మగుసంసారము మనస్సువలనం గలుగుచున్నది. మనస్సువలన నాత్మకుం దాదృశదుఃఖజనక మగుసంసారము గలుగకుండునట్లు మనస్సును నిర్బంధింపవలె నన్నచో భగవద్భక్తి కావలసి యుండును. చక్కనిరీతిచే వాసుదేవునియందుఁజూపఁబడుభక్తి వైరాగ్యమును దత్త్వజ్ఞానమును గలిగించును. ఆభక్తి యెట్లు గలుగునని యందువేని నిత్యమును శ్రద్ధ వహించి విష్ణుకథలను వినువానికిని, బఠించువానికిని భగవద్విషయక మయినభక్తియోగము జనించును. మఱియు నోరాజేంద్రా! నిర్మలచిత్తులైనసజ్జనులు భక్తియుక్తులై వాసుదేవునికథలను వినుటయం దతికుతూహలము వహించి యుందురు. అట్టివారిసహవాసము చేసి వర్తించుచుండిన సంతతమును హరికథాశ్రవణము సంభవించును. ఓమహనీయా! సజ్జను లున్న ప్రదేశమును జేరి, యామహాత్ములు చెప్పుచున్నభగవత్కథలను సుధాప్రవాహములు ప్రవహించుచుండఁగా జాలునన్నబుద్ధిని విడిచి, యెవరు సావధానులై కర్ణపుటములతోం ద్రుప్తి దీఱం ద్రావుదురో, వారిని స్వభావసిద్ధముగా దేహమువలనం గలుగు క్షుత్పిపాసాదులు చుట్టుముట్టి బాధింపనేరవు. ఇట్లుండఁగా మానవులు దేహప్రయుక్తము లయినక్షుత్పిపాసాదులచేఁ బీడితులయి హరికథాశ్రవణమం దాసక్తినిఁ జెందరు. కావున ముందుగా భాగవతులసహవాసము చేయవలెను. అందువలన హరికథాశ్రవణమునుఁ బిమ్మట భగవదుపాసనమునుఁ దరువాత వైరా

గ్యము ననంతరమున భగవంతునిసాక్షాత్కారరూప మగుజ్ఞాన
మును, నందువలన భక్తియు నందువలన ముక్తియుఁ గలుగును.
ఓరాజా! బ్రహ్మయు, భగవంతుఁ డగునీశ్వరుఁడును, మనువును,
బ్రజాపతు లయినదక్షాదులును, నియమము గలిగి వర్తించు
సనకాదులును, మరీచియు, నత్రియు, నంగిరసుఁడును, బులస్త్య
డును, బులహుఁడును, గ్రతువును, భృగువును, వసిష్ఠుఁడును
నేనును, బ్రహ్మవాదులము. బృహస్పతి, వ్యాసుఁడు మొదలగు
వారు తపస్సు, విద్య, సమాధి, మొదలగునుపాయములచే నుపా
సించుచున్నను, బరమేశ్వరు నిప్పటికిని జూడఁజాలకున్నారు. ఇట్టి
మహనీయులే పరమేశ్వరునిఁ జూడఁజాలనప్పుడు,అనంతములయి
దురధిగమములయి వేదమందు క్తము లయినకర్మముల నాచ
రించుచుఁ బశుపుత్రాదు లగునిహలోక ఫలములను గోరుకొను
చు, నింద్రాదిదేవతలను భజించుసామాన్యు లాతనిఁ గనుఁగొ
నలే రని వేఱ చెప్పవలయునా ? ఎప్పుడు మానవుఁడు చేసిన
సుకృతకర్మములకు భగవంతుఁడు సంతసించి యొవనిని రక్షింపఁ
దలంచునో, యాపురుషుఁడు దేహపోషణాదుల కుపయుక్తము
లగుకర్మములందును వేదపూర్వభాగమందుఁ జెప్పఁబడిన యా
గాదికర్మములందును మనస్సు దూర్చక భగవంతునియందుఁ
జొప్పించును. ఓరాజా ! భగవదనుగ్రహమే ముక్తికిఁ గారణ
మగుటచే నీ వజ్ఞానమువలన స్వర్గాదిఫలములను గలిగించుకర్మ
ములందుఁ బురుషార్థసాధనమతి నుంపకుము. అ వెప్పుడును
బురుషార్థములు కావు. అవి కేవలమును స్వల్పఫలదాయకము
లును, నధికాయాసము గలిగించునవియు నై యున్నవి. రజస్త
మోగుణబుద్ధు లయినకొందఱు జనార్దను నారాధనరూప మగు

వేదపూర్వభాగమును గేవలకర్మతాత్పర్యకముగాఁజెప్పుచున్నారు. వేదతాత్పర్యమును దెలియనివారు స్వస్వరూపమునైనను దెలిసికోలేనియజ్ఞాను లని నష్టుము. కావున నీ విఁకఁ గర్మముల నాచరింపక తూర్పునకుఁ గొన లుండునట్లు దర్భలను భూమిపైఁ బఱచి, బహుపశువులను జంపుటవలన నేనే గొప్పయజ్వ నను నభిమానము గలిగి కావున నే ధూర్తుండవై పరమపురుషార్థమైన మోక్షమును సాధించుకర్మము దెలిసికొనఁజాల కుంటివి. ఓరాజా! ఏకర్మము భగవంతునికి సంతసము గలిగించునో, యది యేప్రశస్తమైనది. తక్కినది నింద్యమైనది. ఏవిజ్ఞానమువలన మనస్సు హరియందుఁ జేరునో యదియే మిక్కిలి ప్రశస్తమైనది.ఆశ్రీహరి నిఖిలదోషములను దొలఁగించువాఁడు. సమస్తకల్యాణగుణములుగలవాఁడు. జగమున కుపాదానకారణము. మఱియునతఁడు సకలజంతువులకును నంతరాత్మయైయుండును. ఆవిష్ణుపాదమూలమును జేరినవారికి క్షేమము గలుగును. అట్టివారికి భగవంతుఁడుప్రియతముఁడై యుండు. అట్టివారికి నణుమాత్రమును భయము గలుగదు. కావునశ్రీహరిపాదమూలమునును జేరఁబ్రయత్నింపుము. నేను నీ కిప్పుడు తత్త్వమును హితమును దెలిపితిని. ఈతత్త్వహితములను దెలిసినవాఁడే విద్వాంసుఁడు. ఆవిద్వాంసుఁడే గురువు. అతఁడే హరి. ఓపురుషవరా! నీ వడిగినప్రశ్నమున కుత్తర మొసంగియుంటిని. ఇంకువిషయమై నా చెప్పినరహస్యమును జక్కఁగా వినుము. ఓరాజా! స్వల్పముగాఁ బుష్పవనములందు స్త్రీమృగముతోఁ గూడి వర్తించుచు దానియందు మిగులనాసక్తి గలిగి తుమ్మెదఝుంకారములను వినుచుఁ దన ప్రాణములను హరింప నున్నవృకములను గుఱుతింపక యుం

డఁగా వెనుకనుండి వ్యాధునిచేఁ గొట్టుపడినమృగమునువలె నిన్నుఁ జూచుకొనుము. ఇందలియర్థమును స్పష్టముగాఁ జెప్పెదను విను. రాజా ! గృహస్థాశ్రమము పుష్పసమానధర్మములు గలస్త్రీలకు శరణమైనది. ఆయాశ్రమమందు పుష్పమకరందలేశమువలెనే స్వల్పమయినకామసుఖమును గలదు. ఆ స్వల్పసుఖము నుపస్థేంద్రియముచే ననుభవించుమిథునకర్మమందాసక్తి గలిగి, తుమ్మెదలఝుంకారములవంటి స్త్రీలమృదులాలాపములను వినుచు, నెదుట వృకములవలెనే భీకరములయి ప్రాణము లపహరించునహోరాత్రములను లెక్కింపక గృహమందుఁ జరించుచుండఁగా వెనుకనుండి వ్యాధునివంటియముఁడు వచ్చి మృత్యుపాశముచే గ్రహింపఁగా నప్పుడు నీవు వ్యాధునిచేఁ గొట్టుపడినమృగముగా నిన్ను నీవు తలంచుకొందువు. నే నిప్పుడు చెప్పినయర్థమును గ్రహించి నీహృదయకుహరమందు మనస్సు నిర్బంధింపుము. యాగాదికర్మములందు రుచి కలిగించునర్థవాదాత్మకము లయినవేదములనుండి మనంబును మరలింపుము. ఈగృహస్థాశ్రమమును విడువుము. అందతికాముకుల చరిత్రములు వినవచ్చుచుండుటచేనవి మిగులఁ జేటుగలిగించునవి. కాన వాని విడుచుట మంచిది. జీవుని సర్వవిధములచేతనురక్షించుభగవంతుని శరణువేఁడుము.'' అనియుపదేశించిననారదునిఁ గాంచి ప్రాచీనబర్హి యిట్లనియె. "ఓమునీంద్రా ! జ్ఞానాదిసంపన్నుఁడవయిననీవు చెప్పినవాక్యములు వినఁదగినవి. వానిని జక్కఁగా వింటిని. వానిని జక్కఁగా విమర్శించితిని. నీవుపదేశించినయీరహస్యమును నాకుఁ గర్మములఁగూర్చి యుపదేశించునాయుపాధ్యాయు లెఱుఁగరు. ఎఱిఁగియున్నచో నేల చెప్పరు? అ

ధ్యాత్మతత్త్వమువిషయమయి నీవు చేసినబోధచే సంశయములు తొలంగినవి. ఒక్క సంశయ మున్నది. దానిని ఛేదింపనింద్రియ వృత్తులు చాలవు. మునీంద్రులునుం దెలియఁజాల రని తలఁచెద. ఆసంశయ మనుముడిని విప్పుము. 'పురుషుఁ డేదేహముచే నీలోకమునఁ బుణ్యాపుణ్యరూపము లగుకర్మములను జేయుచున్నాఁడో, యీ దేహము నీలోకములోనే విడిచి స్వకర్మముచే సంప్రాప్తమయినమఱియొక దేహమును బొంది కర్మముచే సంప్రాప్తము లయినసుఖదుఃఖములను మాటిమాటి కనుభవించును' అని భవాదృశు లయినవేదవాదులు చెప్పినట్లు పురాణాదులం దచ్చటచ్చట వింటిని. సుఖదుఃఖహేతువు లని బ్రహ్మవాదులచేఁ జెప్పఁబడుచున్నకర్మములు జనులచేఁ జేయఁబడుచు,నవి యుత్తరక్షణమందే యదృశ్య మగుచున్నవి. ప్రాక్తన దేహముచేఁ జేయఁబడిన కర్మముల కీదేహమం దెట్లు ప్రకాశము లేదో; యట్లె యీ దేహముచే నొనర్పఁబడినకర్మములకుత్తర దేహమునందుఁబ్రకాశము లేదు. ఇంతియ కాక పూర్వదేహముచేఁ జేయఁబడినకర్మములును, దన్నిమిత్త మగుసత్వాదిగుణములు గలమనస్సును, వానితోఁ గూడినశరీరమును నీజన్మమందు లభింపవు. కావునఁ గర్మగుణమనోదేహములు పూర్వమున లేవు. అవి యిప్పుడు సుఖాదులను గలిగింపఁజాలవు. మఱియునీ దేహముచేఁ జేయఁబడినకర్మములు మనోదేహములును నుత్తరజన్మమునందు సుఖదుఃఖాది హేతువులు కావు. సుఖదుఃఖాదులు నిర్నిమిత్తముగానే కలుగుచున్నట్టు తోఁచుచున్నవి. ఇందులకు నీయభిప్రాయంబును దెలుపుము" నావుడు నారదుం డిట్లనియె. 'ఓరాజా! ఉత్తరోత్తరజన్మ

## నారదుఁడు ప్రాచీనబర్హికిఁ బ్రత్యుత్తరంబు లిచ్చుట.

ములందు సుఖదుఃఖములు గలిగించుకర్మముల కాశ్రయభూత మైన దేహ మిచ్చటనే నశించుటచే నందువలన సుఖదుఃఖములు గలుగుట యసంభవ మనియు, శీఘ్రకాలములోనే నశించుకర్మ ముత్తరజన్మములందుఁ గలిగింపనేర దనియుఁ గులాలునిదండ చక్రాదివ్యాపారము లిప్పుడు నశింపఁగా నవి యుత్తరకాలమం దుదయించెడిఘటమునకు హేతువు లనుట యనుభవవిరుద్ధ మనియుఁ జెప్పితివి. కాని యది యుక్తము కాదు. ఏమనస్సుచేఁ బురుషుఁడు కర్మమును జేయుచున్నాఁడో, పుణ్యాపాపకర్మము లకు హేతుభూత మైనయామనస్సుచే స్వకర్మానుగుణ మయిన సుఖదుఃఖాదిఫలములను బరలోకమున ననుభవించుచున్నాఁడు. స్థూలశరీరము నశించినను గర్మములకుఁ గారణ మగుమనస్సుండుటచే నుత్తరజన్మములం దది జీవునకు సుఖదుఃఖంబులు గలిగించును. దానికి దృష్టాంతమును జెప్పెద వినుము. శరీరము నిద్రావస్థయందుఁ బండుకొనియుండఁగా జీవించియున్నను దానియం దభిమానమును విడిచి పురుషుఁడు మనస్సునందు దైవప్రాప్త మగుకర్మఫలమును పండుకొనియున్న దేహసదృశ మయిన మనుష్యదేహముచేతనుగాని, దేవాదిశరీరముచేతనుగాని,స్వప్నమం దనుభవించుచున్నాఁడు. స్థూలదేహ మొకచోటఁ బడియున్నను బురుషునికి సుఖదుఃఖాదు లెట్లు కలుగుచున్నవో, యట్లె మనస్సు పురుషు ననువర్తించివచ్చుటచే లోకాంతరమందు సుఖదుఃఖాదులనుగలిగింపవచ్చును.మఱియునీవుకర్మముచేసినయు త్తరక్షణమునందేనశించుచుండనది కాలాంతరమందు సంభవించు ఫలములకు హేతు వెట్లగునని యడిగితివి.అందులకు సమాధాన

మువినుము పురుషుఁడు దేహాత్మాభిమానము గలిగి యాకర్మములు నానిమిత్తమని పలుకుచు మనస్సుచేఁ జేసినకర్మ మేది కలదో, యది భగవంతునినిగ్రహానుగ్రహరూప మగుశక్తి కలదయి పునర్జన్మంబును గలిగించుచుండును. పూర్వజన్మమందలి కర్మము మనస్సు నిప్పు డున్నదనుటకుఁ బ్రమాణమును జెప్పెదను వినుము. జ్ఞానేంద్రియపంచకముచేతను, కర్మేంద్రియపంచకముచేతను మన స్సున్నదని నిశ్చయింపవచ్చును. ఎట్లనిన సర్వేంద్రియము లును నింద్రియములకు విషయము లయినపదార్థములు నున్న ప్పటికిని సర్వేంద్రియజ్ఞానములు నొక్కమాఱు కలుగకున్నవి. *అట్లగుటకు మనస్సంబంధ ముండుటయు లేకపోవుటయునే కారణమని గ్రహింపవలయును. అట్లె చిత్తవృత్తులచేఁ బూర్వదేహాశ్రిత మగుకర్మ మున్నట్లు చెప్పవచ్చును. ఏవస్తువున కేరూపమో యీజన్మమందుఁ బురుషుఁడు దానిని నొకప్పుడైనను జూడకపోయినను వినకపోయినను, నింద్రియములచేతఁగాని ప్రమాణాంతరములచేతనుగాని యనుభవింపకపోయినను, నొకానొకవస్తువు స్వప్నాదులందుఁ గానవచ్చుచున్నది. ఇంతియకాక యనుభూతముకానిది స్వప్నమునఁ గానరాదని పెద్దలు చెప్పుదురు. కావున మన స్సింతకుఁ బూర్వము పొందినజన్మములలో నెప్పుడో యనుభవించియుండు నని చెప్పవలసియున్నది. ఓరాజా ఈజన్మమం దనుభవింపనివస్తువు స్వప్నమందుఁ గాంచినచో నా

---

* ఇందులకు గౌతముఁడు" సూ॥ యుగపద్జ్ఞానానుత్పత్తిర్మనసో లింగం" అని చెప్పియున్నాఁడు. అనఁగా మనస్సునకు లక్షణమే మనఁగా సర్వేంద్రియములవలనను నొక్కమాఱుజ్ఞానము కలుగకపోవుటయే మనస్సున్నదనుటలోఁ బ్రమాణము.

పురుషుఁడు, తొలిబాముల౦ దావస్తువు ననుభవించియుండెనని నిశ్చయింపుము. అనుభూతము కానివస్తువు మనస్సునం జెప్పుడును స్ఫురింపదు. కావున మనస్సు మనుష్యుని వయినపూర్వరూపములను భవిష్యద్రూపములను వర్తమానరూపములను దోఁచించును. మఱియు నీజన్మమం దొకప్పుడయినను బురుషుఁడు చూడనిదియు, విననిదియు నగువస్తువు మనోరథగోచర మగుచుండును. "నానివాసదేశ మిట్టిది" "కాలమిటువంటిది" "నేనిట్లు చేయుదును" అని పురుషుఁ డొకప్పుడు నూహింపనియర్థవిశేషమునుగుఱించి కాలమువలనను, దేశమువలనను, క్రియవలలనను, నే యే ప్రకారముగా బుద్ధిస్థము లగునో యాయా ప్రకారముగా నూహింపవలయును. "ఓయీ ! పూర్వజన్మము, కర్మము, సిద్ధించుఁగాక, అందువలనఁ గలుగు లాభమేమి? అందు వేని వినుము. ఈజన్మమందు మనోరథవిషయములగుపదార్థము లన్నియుఁ బూర్వజన్మమందుఁ గ్రమానుసారముగా నింద్రియగోచరము లగుచుండును. మన స్సున్నప్పుడే యట్టిది కలుగుచుండును. మనస్సు లేనిచో సర్వేంద్రియసంబంధము గలిగియుండుటచే సర్వేంద్రియజ్ఞానము నొకపర్యాయమె కలుగవలెను. అట్లు కలుగకుండుటకే మనస్సంబంధ ముండినఁ గాని యింద్రియజ్ఞానము గలుగదని చెప్పఁబడినది.*పూర్వానుభూతము

---

* ఓయీ! ఈజన్మమందుఁగాని జన్మాంతరమందుఁగాని యనుభూతమయినదేకాని మనోవిషయము కాదని యంటివి. అట్లయినచో ముముక్షువునకు ముక్తానందము మనోరథవిషయము కావచ్చును. అట్లయినచో నది పూర్వమెప్పుడో యనుభూతమైయే యుండవచ్చును. ఇందులకంగీకరింతు వేని "నచ పునరావర్తతే" అను శ్రుతిప్రమాణమువలన వానికిఁ బునర్జన్మము సంభవింపగూడఁ

లయినపదార్థములు వాసనోన్మేషమువలన బుద్ధిస్థము లగుచుండును. అది లేనప్పుడు బుద్ధిస్థములు కావు. అందఱును మనస్సు గలవారలే యై యుందురు. కాన సర్వపదార్థములును వాసనానుసారముగా మనస్సునం దుండుటచే ననుభూతము కానివస్తువై నప్పుడును నెవ్వరికినిఁ గానరాదు. సత్వగుణము గలమనస్సు భగవంతుని భజింప దొరకొన్నచో నప్పు డజ్ఞానము, చంద్రోదయానంతరమందుఁ గానవచ్చు చీఁకటివలెఁ గానవచ్చును. వెన్నెలయుఁ జీఁకటియు మిళితమై యున్నట్లు జ్ఞానాజ్ఞానములు మిళితములై యుండును. భగవద్భజనప్రారంభమం దున్నవానికి బ్రహ్మస్వరూపానందాదులు పరోక్షముగానే మనోవిషయం బగుచుండును గాని ప్రత్యక్షముగాఁ గలుగ నేరవు. అట్లుండ సంసారులమాట వేఱ చెప్పనేల? జీవుఁడు శబ్దాదిగుణముల చేతను, సత్వాదిగుణముల చేతను, నావృతుఁడై, యెంత కాల ముండునో

---

దు. అందువేని సమాధానమునుఁ జెప్పెదను విను. ప్రకృతిపరిణామాత్మకము లగు దేహములచే ననుభవింపఁదగినవయి యున్నపుడే యనుభూతార్థము మనోరథవిషయము కాదని యభిప్రాయము. ముక్తానందము ప్రాకృతదేహముచే ననుభవింపఁదగినదికాదు. కాన దోషము లేదు. పోనిమ్ము. ముక్తానందము మనోరథవిషయ మగుఁగాక, అట్లయినను "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా" అనువాక్యమువలనఁ దెలియవచ్చు నిరతిశయానందమగుటచే ముక్తానందము పరోక్షముగా మనోరథవిషయమగును గాని ప్రత్యక్షముగాఁ గాదు. అనుభవము శబ్దజన్య మగు ప్రమాణమునకు విషయ మగుటచేఁ బరోక్షమే యగును. పరోక్ష మగుముక్తానందమే మనోరథవిషయ మగుచున్నది. కాన పూర్వానుభవముగూడ నట్టిదియే కల్పింపఁబడును. ముక్తానందము ప్రత్యక్షముగా ననుభవించునప్పుడే పునర్జన్మములందుఁ గాని పరోక్షముగా ననుభవించినప్పుడు పునర్జన్మము సంభవింపవచ్చును. కాన శ్రుతిసూత్రవిరోధములేదు.

యంత కాలమును, నతనికి స్వరూపమును గప్పిపుచ్చునహంమ మాభిమానములు నివర్తింపవు. మఱియు నిద్రయందును,మూర్ఛయందును, నతిశయితదుఃఖమందును, జ్వరాదులవలనఁ గలుగు మరణమునందును, జీవునకు మిక్కిలి జ్ఞానము సంకోచము నొందుటవలన"అహం"అనుజ్ఞానము స్ఫురింపదు. దేహము మఱచుటవలన దేహమం దహంబుద్ధి లేదు. ఓయీ! పైనిజెప్పిన యవస్థలయందు జ్ఞానకర్మేంద్రియంబులును మనస్సునుండఁగా జ్ఞాన మేల కలుగక పోవలె నందువేని వినుము. యౌవనవంతుని కేకాదశవిధము లగునింద్రియములనుండి జ్ఞానము గలిగినట్లు గర్భమందుఁగాని,యతిబాల్యమందుఁగాని, యున్నవానికిఁగలుగదు అమవసనాఁడు చంద్రుఁ డున్నను గళలు పుష్కలముగా లేక పోవుటవలనఁ గాంతి కలుగనివిధమున గర్భస్థునికిని బాలునికిని నాయాయింద్రియము లున్నను శక్తిసంపన్నములు కాని హేతువుచే జ్ఞానము గలుగదు. ఓయీ! గర్భాదులం దింద్రియములున్నను వ్యాపారములు కలుగవని చెప్పితివి. అట్టివ్యాపారము లేనిచో సంసారమే సంభవింపదని ప్రశ్నింపఁదగదు.శబ్దాదివిషయములను భూతములు కాకపోయినను, నావిషయములను ధ్యానమునకుఁ దగినసంస్కారము కలవానికిఁ గలయందుఁ గాంచినపదార్థములు మేల్కనియున్నపుడు లేకపోయినను స్వప్నజ్ఞానముచే సూచితము లగుసుఖదుఃఖాదులు నివర్తింపక కలుగుచున్నట్టుగానే సంసారముఁ గలుగును.కాని నివర్తింపదు. ఓరాజేంద్రా!నీవడిగిన ప్రశ్నములకు త్తరంబు నిచ్చితిని. దేహాత్మలయాకారమును వివరించెద వినుము. పంచభూతములును, బంచప్రాణములతోఁ గూడిన యేకాదశేంద్రియంబులును, సత్వాదిగుణములును గలి

గియున్నది దేహ మనఁబడుచున్నది. చేతనాయుక్తమై "అహం అహం" అను జ్ఞానము జీవుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. ఈ చెప్పఁబడినలింగశరీరమును గూడి పురుషుఁ డనేక దేహములను స్వీకరించుచున్నాఁడు; విడుచుచున్నాఁడు. ఆ దేహములను బొందునప్పుడును విడుచునప్పుడును ఈ లింగశరీరముచేతనే పురుషుఁడు హర్షమును, శోకమును, భయమును, సుఖదుఃఖములను, బొందుచున్నాఁడు. మఱియు జీవుఁడు, తానాశ్రయించినతృణమును విడిచి మఱియొకతృణమునకుఁ బోనిష్టపడక దానినే దృఢముగా కౌఁగిలించుకొన్న గొంగళిపురుగువలె మరణించుకాలమున శరీరమును విడువక గట్టిగాఁబట్టుకొని యుండును. తనకు దేహాంతరము లభించునంతవఱకును విడువడు. ఓరాజా ! ఇంద్రియములచేఁ బూర్వ మనుభూతము లగువిషయములను మనస్సనుధ్యానము సేయుచుఁ బురుషుఁడు కర్మములను మాటిమాటికి నాచరించుచున్నాఁడు. కావున భూతములకు జన్మంబులు కలిగించునది మనస్సే చుమీ ? కర్మము లనుసరించి వచ్చుటచే నహంకారమమకారరూప మగునవిద్యవలన నాత్మకు బంధముకలుగుచున్నది. ఆ బంధమును దొలఁగించుకొనుటకుత్రికరణశుద్ధిగా భగవంతుని సేవింపుము. భగవంతునివలననీవిశ్వమునకు సృష్టిస్థితిలయములు కలుగుచున్నవి. కానఁ జిదచిదాత్మక మగునీజగ మంతయు బ్రహ్మాత్మక మని భావించి భజింపుము. ఓవిదురా ! భగవద్భక్తులలో ముఖ్యుఁ డయిననారదుఁ డిట్లు ప్రాచీనబర్హికి జీవపరమాత్మస్వరూపమునుఁ దెలిపి యతని వీడుకొని బ్రహ్మలోకమున కేఁగెను. అంతఁ బ్రాచీనబర్హి ప్రజారక్షణాదికమందుఁ బుత్త్రుల నియోగించి తపంబుసేయుటకుఁ గపిలాశ్రమంబున కేఁగెను.

ఆప్రాచీనబర్హి కపిలాశ్రమమం దింద్రియములను వశముగా వించుకొని వివేకవంతుఁడై భగవంతునిపాదపద్మములను ధ్యానించుచు, భగవద్భక్తిచే భగవత్సాధర్మ్యమును జెందెను. దేవర్షియైననారదునిచే నుపదేశింపఁబడిన యాత్మతత్త్వమును వినువాఁడును, వినిపించువాఁడును, సంసారహేతు వయినమనస్సునుండి విముక్తుఁడగును. మఱియు వాసుదేవుని కీర్తితోఁ గూడినదయి కావుననే లోకమును బవిత్రముగాఁ జేయునదై, నారదునిముఖమువలన వెలువడినదై మనశ్శుద్ధిని గలిగించునదై సర్వోత్కృష్టఫలము నిచ్చునదై యున్నయీాతత్త్వమును జదువువాఁడు సంసారమునఁ బడనేరఁడు. ఓవిదురా! అత్యద్భుతమును, బరోక్షవాదమును గలిగినదియు నగునధ్యాత్మతత్త్వమును నీకుఁ జెప్పితిని. మఱియు జీవునికి గృహస్థాశ్రమము వలనఁ గలిగినసంసారమును జెప్పితిని. పరలోకమువిషయమై కలిగినసంశయమునుఁ దొలఁగించితిని'' ఇది యిరువదితొమ్మిదవ యధ్యాయము.

---

అని పల్కిన మైత్రేయునకు విదురుం డిట్లనియె. 'ఓమునీంద్రా! ప్రాచీనబర్హి కుమారులు రుద్రుఁ డుపదేశించిన స్తోత్రముచే హరిని సంతోషింపఁజేసి యేమిఫలమును జెందిరి? ఆలోచింప స్వేచ్ఛగా రుద్రుని దర్శించి యతనిచేత ననుగృహీతులై ప్రచేతసులు నిశ్చయముగా మోక్షమును బొందకపోరు. అంతకుఁ బూర్వము వారిలోకమునఁగాని పరలోకమునఁగాని యేమి ఫలమును బొందిరి?' అని యడిగినవిదురునకు మైత్రేయుం డిట్లనియె. 'ఓవిదురా! ప్రచేతసులు తండ్రియనుమతిని బొంది సము

ద్రజలమధ్యమునఁ దపం బొనరించి నిరంజనుఁ డయినపరమపురు షుని సంతసింపఁ జేసిరి. వారిట్లు పదివేలసంవత్సరములు తపంబు చేయుఁగా నంతమందుఁ బరమపురుషుఁడు వారితపఃక్లేశమును గాంతిచే నివారించుచు శుద్ధసత్త్వమయ మయినశరీరమును దాల్చి గరుడునిస్కంధమున మేరుశిఖరమున నున్ననల్లనిమే ఘమున కెనవచ్చుచుఁ, బచ్చని పట్టువస్త్రమును ధరించి, కౌస్తుభరత్నము గళమందుఁ బ్రకాశించుచుండఁగా దిక్కు లను బ్రకాశింపఁ జేయుచుఁ దళతళలాడు కనకమయభూషణం బులచేఁ గపోలవదనములు మెఱయ, శిరంబునఁ గిరీటము ధగ ధగలాడుచుండ, శంఖచక్రాదు లగు నెనిమిదియాయుధములను ధరించి తనయనుచరులతోను మునులతోను గూడికొని, సురేంద్రా దులచే సేవింపఁబడుచు, గరుడులచేతను గిన్నరులచేతను గీర్తింపఁ బడుచుఁ బ్రత్యక్ష మాయెను ఇట్లు పరమపురుషుండు ప్రత్యక్షము యి, బలిసినయెనిమిదిబాహువులమధ్యమందును నున్నలక్ష్మితో స్పర్థచేయుశోభ గలవనమాలతోఁ బరివృతుఁడై సదయుఁ డయి ప్రపన్ను లయినప్రచేతసులను గూర్చి మేఘనాదగంభీరము ల యిన భాషణంబుల నిట్లనియె. 'ఓరాజనందనులారా! మీకు భద్ర మగుఁగాక. మీరు స్నేహముచేఁ దుల్యధర్ము లయియు న్నారు. మీమిత్రభావముచే నేనంతుష్టుఁడ నైతిని. మీకుఁ గా వలసినవరమును వేఁడుఁడు. ఇచ్చెదను. సాయంప్రాతఃకాలములం దు శయ్యయందు మిమ్మును స్మరించువాఁడు తనసోదరులందుఁ దనయాత్మయందువలెనే ప్రీతి నుంచును. మఱియు భూతములను దయతోఁ జూచును. రుద్రుఁ డుపదేశించినస్తోత్రముచే సమాహి తచిత్తులై నన్ను స్తోత్రముచేయువారి కభీష్టవరములను మంచి

ప్రజను నొసంగెదను. మీ కిష్టవరముల నిచ్చెద నని వేఱ చెప్ప నేల? మీరందఱును సంతుష్టులై జనకాజ్ఞను దలఁదాల్చి యున్నారు. అందువలనఁ గమనీయ మయినమీకీర్తి లోకములందు వ్యాపించును. మీకు గుణప్రసిద్ధుఁ డగువిశ్రుతుఁ డనుకుమారుఁ డుదయించును. అతనిసంతానముచే ముల్లోకంబులును నిండును. పూర్వము కండుఁడు తపం బొసరింపఁగా విఘ్నము చేయుటకుఁ బ్రేరితురాలగుప్రమ్లోచతో భోగించెను. అంత నామె కొకకన్యక కలుగఁగా నామె స్వర్గమునకుఁ బోవుచు నాకన్యను వృక్షములందు విడువఁగా వృక్షము లాపిల్లను దమకుమారికగా భావించుకొనెను. ఆపిల్లది యొకప్పు డాఁకలిచే నేడ్చుచుండఁగా,వనస్పతుల కధిపతి యగుసోముఁడు వచ్చి యమృతమును స్రవించుచున్న తనచూపుడువ్రేలి నామెనోటిలో నుంచెను. ఆపిల్లది యమృతమును పానము చేయుటచేతను, నచ్చరగర్భంబునఁ బుట్టినదగుటచేతను,మిక్కిలిసౌందర్యవంతురాలయ్యెను. మీరు మీతండ్రిచేఁబుత్త్రులఁ గనుట కాజ్ఞప్తులయితిరి. కావున మీ రందులకయి యుత్సహించుచు భర్తనుగోరుచున్న యాకన్యను బెండ్లియాడుఁడు. ఆలస్యము చేయకుఁడు "మాకందఱికి నొక్కభార్యయగుట ధర్మవిరుద్ధ" మని తలంపకుఁడు. మీరందఱును బృథగ్భావము లేక యొక్కనివలెఁ జరించుచున్నారు. భేదబుద్ధి లేనియామె మిమ్ము భర్తలఁగాఁ గొని మీయందుఁ జిత్తముంచి భార్యయై పరిచర్య చేయును.మీధర్మశీలము చేతను నావాక్యము చేతను ధర్మవిరోధము సంభవింపదు. మీ రామెతోఁ గూడి యమితమైనయింద్రియశక్తి గలిగి వేయిదివ్యవత్సరంబులకాలంబును నీలోకసుఖముల ననుభవింపుఁడు. అనంతరము మీ రవ్యభిచారిణి

యగుభక్తి గలవారయి కామాదిదోషములను దహించి సంసారమును వదలి నాలోకమును బొందుదురు. భోగాసక్తుల మయిన మాకు నీభక్తి లంభించు టెట్లని సంశయింపకుఁడు. మీరుగృహస్థాశ్రమమం దున్నను ఫలాపేక్ష లేకుండఁగర్మము లాచరించుటచేతను, నాకథలను వినుచుఁ గాలమును బుచ్చువా రగుటచేతను, గృహస్థాశ్రమము మీకు బంధకము గానేరదు. మత్కథలను వినువారికి సంసారబంధ మేల యుండదన్నచోఁ జెప్పెదను వినుఁడు. సర్వజ్ఞుఁడ నగునేను మత్కథాశ్రవణము చేసినవారి హృదయము నూతనగృహమునువలెను బ్రవేశింతును. మఱియు నన్నుఁ బొందువారికి శోకమోహాదులు గలుగవు. అట్లు మత్కథాశ్రవణము చేయువారికి బ్రహ్మసాక్షాత్కారముతప్పక కలుగును. అని యిట్లు పలుకుచుఁ బురుషార్థముల కాధారుఁడయినజనార్దనునికి మ్రొక్కి బద్ధాంజలు లయి, ప్రచేతసులు శ్రీహరిసందర్శనమువలనఁ గామక్రోధాదులను విడిచి యిట్లు నుతించిరి. దేవా! ఆధ్యాత్మికాదితాపత్రయమును నశింపఁ జేయు

## ప్రచేతసులు నారాయణుని నుతించుట.

వాఁడవై, నుదారగుణములచేతనుఁ బవిత్రనామములచేతను, నిరూపింపఁబడునీకు వందనంబులు. వాఙ్మానసంబులకుఁ గనబడక సర్వేంద్రియములకును గోచరుండవు గాక యున్ననీకు నమస్కారములు. నీవు కర్మోపాధులు లేనివాఁడవు. ఊర్మిషట్కము లేనివాడవు. దేవా! స్వస్వరూపజ్ఞానము లేకపోయినను భగవత్ప్రసాదమువలన దేహాత్మజ్ఞానసంపన్ను లయినజీవులకు నీవు నిరతిశయప్రియుండవు. జగముయొక్క సృష్టిస్థితిలయములను జేయనెంచి స్వసంకల్పముచే లయోత్పత్తులనిమిత్తము శివబ్రహ్మస్వరూపుఁడ

వయి పాలనకొఱకు స్వేచ్ఛచే నప్రాకృతదివ్యమంగళవిగ్రహము దాల్చినవాఁడవు. అట్టినీకు నమస్కారములు.ఓపరమేశ్వరా! నీవు సంసారబంధమును హరించువాఁడవు.నీవు నిష్కల్మషమగుబుద్ధికి గోచర మగువాఁడవు.నీవుసర్వభూతములందును వసించువాఁడవు నీవు భక్తులకుఁ బ్రభువ వయి యానందము కలిగించువాఁడవు. అట్టినీకు వందనంబులు. ప్రపంచకమున కుత్పత్తిస్థాన మగుపద్మమును నాభియందుఁ దాల్చినవాఁడవు. పద్మములచేఁగూర్పఁబడి నమాలచేఁ బ్రకాశించువాఁడవు. నీవు కమలములవలె మృదులము లగుపాదములు కలవాఁడవు. పద్మములవంటినేత్రములు గల యోకృష్ణా! నీకు నమస్కారములు. ఓపరమేశ్వరా! నీవు పద్మకింజల్కములవలెఁ బచ్చనైనవస్త్రమును ధరించినవాఁడవు. నీవు సమస్తభూతములందును వసించినవాఁడవు. అట్టినీకు నమస్కారములు చేయుచున్నాము. ఓజగన్నాథా! తాపత్రయాతురుల మయినమాకు సమస్తదుఃఖంబులను నశింపఁజేయునీస్వరూపమును జూపితివి. ఇంతకంటె నితరమయినపెద్దదయ యేది కలదు. ఓక్షేమంకరా! "వీరు నావారు" అని బుద్ధిచే నుచితకాలమందు మమ్మును స్మరించుట యేది కలదో, యదియే దీనవత్సలులయినప్రభువులకుఁ బ్రథమకర్తవ్యము. ఓదేవా! భవదీయస్మరణముచే సమస్తపాపములును నశించుచున్నవి. ఓమహాత్మా! మాహృదయములం దంతరాత్మవై యున్ననీవు మాకోర్కులనేల తెలిసికొనఁజాలవు? మోక్షసాధనముల నుపదేశించు నీవు మాకుఁ బ్రసన్నుండ వగుటయే మా కిష్టవరం బని తలంచుచున్నాము. అయినను బ్రకృతిపురుషవిలక్షణుఁడ వయిననిన్ను నొకవరము నడుగుచున్నాము. ఓనాథా! నీవిభూతులకుఁ బారము

లేదు. కావుననే నీ వనంతుండ వని పిలువఁబడుచున్నావు. మం దారపుష్పముల మకరందము లభించుచుండఁగా నన్యమధురసము ను ద్రావనొల్లనితుమ్మెదవలె మేము నిరతిశయసుఖదాయక మ గునీచరణమూలమును బొంది యితర మగుదానిని గోర నిష్టపడ ము. అంతకంటెఁ గోరఁదగిన దేది కలదు? నీమాయచే మోహి తుల మై సంసారమందుఁ దిరుగుచున్నంతకాలమును భగవద్భక్తు లస్నేహము కలుగునట్లు చేయుము. ఇదియే మాకోరెడివరము. ఓయీ! రాజ్యభోగములను గోరక యీవర మేల కోరితి వని యం దు రేని వినుము. నీభక్తులస్నేహలేశముతో స్వర్గాదిసుఖము లయినను సరిపో వని తలంతుము. అట్లుండ మరణశీలము లగు రాజ్యభోగాదులతోఁ బని యేమి? భక్తులు పాతకములను దొ లంగించు నీకథలను దలఁచుచుఁ జెప్పుచుందురు. వానిని వినువా రికి భోజనేచ్ఛ యుండదు. భూతములందు వైర ముండదు. ఏ విధ మయినభయమును గలుగనేరదు. ఆసత్కథలందు ముక్త సంగులచే మాటిమాటికిని సన్న్యాసులకు నారాయణుఁడే గతి యని చెప్పఁబడును. మఱియు గంగాదినదులనుఁ బవిత్రము చేయఁ దలంచి కాలినడకను సంచరించు చున్న నీభక్తులసమాగమము సంసారభీతుఁ డగుపురుషున కెందులకు రుచింపదు? తాదృశభక్త సహవాసఫలము మా కనుభూత మైనది. సంసారమృత్యువును దొలఁగించువాఁడును, నీకుఁ బ్రియతముఁడును నగురుద్రునిక్షణ మాత్రసమాగమముచేతనే సంసారనివారకుఁడ వగునిన్ను శర ణుపొందఁగలిగితిమి. ఓదేవా! మేము సంతతము పరిచర్య చేయు టచే బ్రాహ్మణులు, వృద్ధులు, గురువులు, మాకుఁ బ్రసన్నులైరి. అట్టి వారికందఱకు మేమెల్లప్పుడును నమస్కరించుచుందుము.

మిత్రాదు లందఱును మే మసూయ లేక వర్తించుటచేఁ బ్రసన్నులయిరి. అన్నము లేనివారి కన్నదానాదులు చేయుటవలన వారునుఁ బ్రసన్నులయిరి. మఱియు మేము చాలఁగాలముజలమధ్యంబునఁ దపంబు గావించితిమి. ఈసమస్తమును బరమపురుషుఁడ వగునీసంతోషముకొఱకగుఁగాక. ఓపరమేశ్వరా! మనువు, బ్రహ్మ, జ్ఞానాదిసంపన్నుఁ డగునీశ్వరుఁడు, మఱియుఁ దక్కినమునులును, కర్మయోగజ్ఞానయోగములచేఁ జిత్తమును శుద్ధముగాఁ జేసికొని నీమహిమను బూర్తిగాఁ దెలియ లేకపోయినను స్వశక్తికొలఁదిని నుతించునట్లుగా నే మేమును మాశక్త్యనుసారముగా నుతించితిమి. సకలభూతములందును సమదృష్టి గలిగి పాపాదిరహితుఁడ వయి, పరమపురుషుఁడ వయి, శుద్ధసత్త్వమూర్తి వగునీకు నమస్కారములు.'' అని యిట్లు ప్రచేతసులు చేసినస్తోత్రమునకు సంతసించి పరమపురుషుండు వారు కోరినవరములనొసంగి,స్వసౌందర్యాదుల ననుభవించినవా రగుటచే నేత్రములు తృప్తి పొందకపోవుటంబట్టి ప్రచేతసు లాతనిగమనమున కిష్టపడకయున్నను మానక, స్వలోకమున కేఁగె. అంతటఁ బ్రచేతసులు సముద్రజలమును వెడలి ప్రాచీనబర్హి ముక్తుఁ డగుటచే గృహ్యాదులు లేక స్వర్గము నావరించునట్లు పెరిఁగినవృక్షములచే నావృత మగుభూమిని గాంచి మిగులఁ గోపము గలవా రైరి. ఇట్లు గోపించి వారు ప్రళయకాలమందు నాశనముచేయ వెడలిన యగ్నివాయువులవంటి యగ్నివాయువులను భూతలమందు వృక్షములు లేకుండఁ జేయుటకు స్వముఖములనుండి విడిచిరి. ప్రచేతసు లిట్లు చెట్లను భస్మముచేయుచుండఁగా బ్రహ్మ చూచి, వారిని సమీపించి యుక్తులచే వారికోపమును శమింపఁజేసెను.

ఇట్లు వారు శాంతినిఁ బొందియుండఁగా వృక్షాభిమానిదేవతలు మిగుల భయపడి బ్రహ్మయుపదేశమువలనఁ దమకన్యకను వారి కొసంగిరి. అంతటఁ బ్రచేతసులు మారిష యనునామము గల యాకన్యను బెండ్లాడి యామెయందు నీశ్వరతిరస్కారమువలన జన్మమునొందనున్న బ్రహ్మకుమారుని కుమారునిఁగాఁ బడసిరి. ఆబ్రహ్మకుమారుఁ డెవఁడని యందువేని వినుము. చాక్షుషమన్వంతరకాలమునఁ గాలముచే సమస్తముపసంహృతము కాఁగా దైవముచేఁ జోదితుఁ డయిప్రజలను సృజించినదక్షుఁడే యని యెఱుంగుము. ఆపిల్లవాఁడు స్వకీయకాంతులచే సకలతేజస్వుల తేజస్సులను నాచ్ఛాదించెను. పరతేజస్సుల నాచ్ఛాదింపఁ దగిన సామర్థ్యము కలవాఁ డగుటచే వానిని దక్షుఁడని పిలువసాగిరి. బ్రహ్మ యతనిఁ బ్రజలను సృజించుటకును, రక్షించుటకును నియమించెను. అంతట నాదక్షుఁడు మరీచ్యాదిప్రజాపతులను నావ్యాపారమందునియమించెను. ఇది యిరువదితొమ్మిదవయధ్యాయము.

---

ఓవిదురా! ప్రచేతసులు వేయిదివ్యవత్సరములకాలము గతించినపిమ్మటఁ బూర్వము వాసుదేవుండు పలికినవాక్యమును స్మరించుకొని భార్యాపోషణాదికమును గుమారున కప్పగించి గృహస్థాశ్రమమును విడిచిరి. వార లిల్లువిడిచి పూర్వము జాజలి యనుఋషి సిద్ధిపొందిన పశ్చిమసముద్రతీరంబును జేరి సర్వాత్మకుఁ డగుబ్రహ్మము నుపాసించిరి. మఱియు వారు ప్రాణవాయువును మనస్సును వాక్కును నియమించి చిరకాల మొకచోఁ గూర్చుండ సమర్థులయి మూలాధారము మొదలుగాఁ గలకాయమును ది

న్నగా నిగిడించి బ్రహ్మమందుఁ దమయాత్మను సమర్పించి యున్న సమయమున సురాసురులచే సన్నుతుఁ డగునారదుండు చూడ నేతెంచెను. అట్లు వచ్చుచున్న నారదునిఁగాంచి ప్రచేతసులు లేచి

—••◆ నారదుండు ప్రచేతసులయొద్దకు వచ్చుట. ◆••—

నమస్కరించి యతనిఁ గీర్తించి యథావిధిగాఁ బూజించిమెత్తని యాసనమునఁ గూర్చుండ నియమించి యిట్లనియె. 'ఓనారదా! నీకుఁ గుశలమా? దైవవశమువలన నిన్నుఁ జూడఁగంటిమి. సూర్యగమనము సమీహితము లగుసాధనములను జేయుచు లోకరక్షణము చేయుచున్నట్లు నీగమనము ముక్తిసాధనముల నుపదేశించి లోకరక్షణము చేయుచున్నది. ఓనారదా! గృహస్థాశ్రమమం దుండుటచేఁ బూర్వము రుద్రుఁడును వాను దేవుఁడును జెప్పినతత్త్వమును మఱచితిమి. శీఘ్రకాలములోనే యీసంసారసాగరమును దరింపఁ జేసెడి యాబ్రహ్మజ్ఞానముఁ బ్రకాశింపఁజేయుమా!' అని యిట్లు ప్రచేతసులచే నియమితుఁ డయి భగవ

—••◆ నారదుఁడు ప్రచేతసులకుఁ దత్త్వ ముపదేశించుట. ◆••—

దర్పితచిత్తుఁ డయిననారదుండు మననశీలు రయినప్రచేతసుల కిట్లనియె. 'ఓప్రచేతసులారా! మానవులజన్మము, ఆజన్మమందు చేయుకర్మములు, ఆయువు, మనస్సు, వాక్కులు, మొదలగు వానిచే నీశ్వరుఁ డారాధింపఁబడినప్పుడే జన్మకర్మాదులు సార్థకము లగుచున్నవి. ఆభగవంతుని సంతసింపఁ జేయలేనిచో, శుక్లజన్మము, ఉపనయన సంస్కారమువలనఁ గలిగినజన్మము, యాగదీక్షచేఁ గలిగినజన్మము, నాఁబడు నీమూఁడుజన్మములతో నేమి ప్రయోజనము? భగవంతుని సంతసింపఁ జేయలేని మానవుని దీర్ఘాయుర్దాయ మేల? వేదోక్తము లయినకర్మము లేల ? కుల

మేల? వాగ్విలాస మేల? చిత్తవృత్తులేల? శ్రేయస్సాధనము లగు నన్యవ్రతములేల? నిపుణమయినబుద్ధి యేల ? ప్రాణాయామాది యోగములేల? దేహాదివ్యతిరిక్త మగునాత్మజ్ఞాన మేల? ఇంద్రియపాటవ మేల? సన్న్యాసమేల? అధ్యయనమేల? హరి యందు అకును నిరతిశయప్రీతివిషయుండగుటచేతను, స్వాత్మపర్యంతము గలపురుషార్థమును నిచ్చువాఁ డగుటచేతను, నతఁడే సకలశ్రేయస్సులకు నవధి. ఓరాజనందనులారా! వృక్షమూలము దడిపినచో నానావిధములుగా నున్న శాఖోపశాఖలు తృప్తిపొందునట్లును, భోజనము చేయుటవలన సర్వేంద్రియములు తృప్తిచెందునట్లును, సకలదేవతలకు మూలమగు పరమేశ్వరు నారాధించితృప్తిపొందించిన సకలదేవతలనుదృప్తిపొందించినవారమే. వర్షాకాలమందు సూర్యునివలన జల ముద్భవించి మగుడ గ్రీష్మమందు సూర్యునిఁ బ్రవేశించుచున్నవి. స్థావరజంగమాదులు భూమియం దుద్భవించి భూమియందే లీన మగుచున్నవి. అట్లె సత్త్వాదిగుణపరిణామమువలనఁ గలుగుప్రపంచము కారణభూతుఁడగుహరివలనఁ గలిగి మగుడ నతనియందే లీనమగుచున్నది. సూర్యునికాంతివలెనే పరమాత్మకు వాసస్థాన మగునీజగంబుపరమాత్మకు శరీరతుల్యమైనది. సూర్యునికిని నతనికాంతికిని నెట్టిసంబంధ మున్నదో, పరమాత్మకును జగంబునకు నట్టిసంబంధ మున్నది. భగవంతునియీ జగచ్ఛరీరము సృష్టిదశయందు స్థూలముగాఁ బ్రకాశించును. సంహారదశయందు సూక్ష్మముగఁ బ్రకాశించును. ద్రవ్యము నిత్యము గావున దాని కెప్పుడును నాశనము లేదని తలపోయుఁడు. ఇంద్రియము జాగ్రదవస్థయందుఁ బనిచేసి దేవమనుష్యాది దేహాత్మభ్రమము లేని నిద్రావస్థయందు

నివృత్తవ్యాపారము లయినట్లు జగం బొకమాఱు వ్యాపారవంతమై యొకపరి నిర్వ్యాపారమై యుండును. ఓరాజులారా! ఆకాశమం దొకప్పుడు మేఘములు, చీఁకటి యొకప్పుడును, గాంతియొకప్పుడును, వర్తించుచు, నొక్కొక్కప్పు డట్లు చేయమానును. అట్లు ప్రవాహరూపము లగురజస్తమస్సత్త్వగుణరూపము లగుశక్తులు కార్యోపయోగు లయి పరబ్రహ్మమం దొకప్పుడు ప్రకాశించి యొకప్పుడు మానును. కావున స్థూలత్వసూక్ష్మత్వములయినను బరమాత్మ నాశ్రయించిన ప్రకృతిపురుషాత్మక ద్రవ్యము నిత్యమై పరమాత్మకు శరీరభూత మగుటచే, సకలదేహులకు నాత్మయై కాలశరీరకుఁ డయి, ప్రకృతిపురుషశరీరకుఁ డయి, స్వతేజస్సుచేఁ ద్రిగుణప్రవాహము నెండించుచు బ్రహ్మాదులకుఁ గూడఁ బ్రభు వయినయీశ్వరుని భజింపుఁడు. మఱియు నతఁడు సుఖదుఃఖాదివికల్పము లేనివాఁడు. అతఁడు సజాతీయ మయిన మఱియొకవస్తువు లేమిచే నిస్సముఁ డయి నిరవధికుఁడై యున్నాఁడు. అతఁడు దేవమనుష్యాదిభేదబుద్ధి నశించినతోడనే ప్రత్యక్షు మగువాఁడు. అతని కెప్పుడును జడస్వరూపము లేదు. అతఁ డెప్పుడును నిత్యానందుఁ డయి వఱలుచుండును. అతని కాద్యంతములు లేవు. కావున మీరు పూర్వోక్తజ్ఞానముచే నాపరమేశ్వరుని భజింపుఁడు. మఱియు సర్వభూతదయచేతను దైవవశము వలనఁ బ్రాప్తము లగునన్నాదులచేతను, అంతరింద్రియములను బాహ్యేంద్రియములను నిరోధించుటచేతను, నారాధించినచో భగవంతుఁడు తుష్టిఁ జెందును. సకలకామములను విడిచి యమల మగుచిత్తము గలిగి వర్తించువారిమనంబులందు సంతతము వర్ధిల్లుభక్తిచేత సమీపముగాఁ గొనిరాఁబడిన భగవంతుఁడు

తన్ను నాశ్రితులకు వశము గావించుచు వారిహృదయముల నుండి యెప్పుడును వెడలి చనఁడు. అధనులకును, నాత్మధనుల కును, భగవంతుఁడే ధనముగాఁగల వారికిని బ్రియుఁ డయినశ్రీ హరి విద్యాదులవలనఁ గలిగినగర్వముచే నంధులై భగవద్భక్తు లను దిరస్కరించెడుకుత్సితపురుషులపూజను గ్రహింపఁడు. భగ వంతుఁడు తన్ను ననుసరించి వచ్చులక్ష్మిని, నాలక్ష్మీకటాక్షలేశము ను గోరునింద్రాదులను విడిచి భక్తులందుఁ బ్రేమ గలిగి వారి ననుసరించి వర్తించు చుండును. భక్తులం దట్టివాత్సల్యముగలిగి పరిపూర్ణ మగుసకలకామములు గలవాఁడయి యున్నభగవం తుని భజింప రసజ్ఞుఁ డగుమనుజుఁడు మానునా?' అని యిట్లు నారదుండు ప్రచేతనులకాత్మతత్త్వము నుపదేశించి యన్యము లగుభగవత్కథలను జెప్పి బ్రహ్మలోకమున కేఁగెను. అంతఁ బ్ర చేతనులు నారదునిముఖమువలన గళితమై సకలదోషహార మై యున్నభగవత్కీర్తిని విని భగవంతునిచరణములను సేవించుచు వైకుంఠముం బొందిరి. ఓవిదురా ! నీ వడిగిననారదప్రచేతసుల సంవాదమును దెలిపితిని.' అని మైత్రేయుండు విదురునకుఁ జెప్పెనని చెప్పి శ్రీశుకుండు రాజున కిట్లనియె. 'ఓరాజా ! నీ వడిగినయుత్తానపాదునివంశమును బ్రియవ్రతునివంశమును వర్ణించితిని. దానినిఁ జక్కఁగవింటివి కదా! ఓయీ ! ప్రియవ్ర తుఁడు మొదట విరక్తుఁడై వనమున కేఁగి నారదునివలననధ్యా త్మతత్త్వమును బొంది,మగిడి వచ్చి భూమిని బాలించి, తనయై శ్వర్యమును విభజించి కుమారుల కిచ్చి భగవత్పదమును జెందె ను. ఓరాజా ! ఇట్లు మైత్రేయుండు వినిపింపఁగా భగవంతునిగు ణావాదమును, గాథలను విని విదురుండు వృద్ధిఁజెందిన స్నేహ

భావముచేఁ గన్నులనుండి బాష్పముల విడుచుచు, మైత్రేయుని చరణములకును భగవంతునిచరణములకును నమస్కరించి యిట్లనియె. "ఓమైత్రేయా! దయాళుఁడ వయిననీవలన నేను సంసారసాగరమును దాఁటితిని.సంసారమందువర్తించువారి కగమ్యుఁడయిననారాయణుండు దర్శితుఁ డయ్యెను." అని పలుకుచు విదురుండు జ్ఞానముచే నిండినమానసము గలవాఁడయితనజ్ఞాతులను జూచుతలంపుతో హస్తినాపురమున కేఁగెను. ఓపరీక్షిన్నరేంద్రా! భగవదర్పితచిత్తులైనవిదురమైత్రేయులు చెప్పుకొనిన స్వాయంభువమన్వాదులచరిత్రమును వినిన నాయుర్దాయమును, ధనమును, గీర్తినిఁ బొంది తుదకు ముక్తిని గాంచును.ఇదిముప్పదవ యధ్యాయము.

ఇది ఆంధ్రవచనభాగవతమునఁ జతుర్థస్కంధము.

శ్రీకృష్ణార్పణ మస్తు.





శుభమస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# శ్రీమదాంధ్రభాగవతము

## పంచమస్కంధము.

---

పరీక్షిన్నరేంద్రుండు శుకమహామునిం గాంచి "ఓమునిచంద్రమా! *ప్రియవ్రతుండు నారదునివలన నాత్మజ్ఞానము నొందియు మగుడ రాజ్యపాలనం బొనర్చె నని చెప్పితివి. ఆప్రియవ్రతుండు భగవద్ధర్మములం దాసక్తిగలవాఁడు. ప్రకృతికంటె వేఱయిన యాత్మేశ్వరుల తత్త్వమం దనుభవము కలవాఁడు. అట్టి

---

* పూర్వస్కంధమున రాజు శుకుని స్వాయంభువమనువుపంశమును జెప్పుమనియడుగఁగా నామునిఅతని వంశమును బ్రారంభించి యతనికూఁతుల వంశమును నతని పుత్రులయిన యుత్తానపాదుఁడు ప్రియవ్రతుఁడనువారిలోఁ బెద్దవాఁడయిన యుత్తానపాదునివంశమును జతుర్థస్కంధము కడపటివఱకుఁ జెప్పెను. రాజంతకుఁ దానువినఁగోరినది యంతయు నించుమించుగా విని యైనదను తలంపునఁ బ్రియవ్రతుని చరిత్రమును విశేషించి యడుగఁడయ్యెను. ఇట్లుండఁగా శుకుఁ డాస్కంధముకడపట 'యో నారదాదాత్మవిద్యామధిగమ్యపునరస్మహీం। భుక్త్వా' అని ప్రియవ్రతుఁడాత్మవిద్య నారదునివలననధిగమించియు మరల భోగము ననుభవించినాఁడని చెప్పఁగా నాత్మవిద్యనధిగమించినవానికి మరలవిషయభోగము ఘటించుట యెట్లని రాజడుగుచున్నాఁడని పూర్వోత్తరకథాసంగతిని యిటఁ దెలియునది.

వాఁడు దారపుత్రాదులచే నిండి దుఃఖాపాదక మైయున్నగృహస్థాశ్రమ మవలంబింప నెట్లంగీకరించెను? అందువలనఁ గర్మబంధమును, దానివలన జ్ఞానసంకోచమును గలుగక మానునా? కావున, ముముక్షువునకుఁ గర్మబంధంబును, నసంకుచితజ్ఞానము కలవానికి జ్ఞానసంకోచమును గలిగించు గృహాసక్తి† యాత్మారామున కెంతమాత్రంబును దగదు. ఓద్విజశ్రేష్ఠా! దేహమందును, దారపుత్రాదులందును, గేహమందును నభినివేశము విడిచి యాత్మారాము లయినభగవద్భక్తులకు మగుడ గృహస్థాశ్రమమునందభినివేశము గలుగుట తగ దని నిశ్చయముగాఁ జెప్పవచ్చును గదా! తాత్కాలికసుఖ మున్నది కావున నభినివేశముండరాదా యని సంశయింపఁ బనిలేదు. భగవత్పాదసేవ నిరతిశయానందంబును గల్గించును. తాపత్రయంబును నివారించును. తాదృశభజనానుభవముచే నిత్యసుఖ మనుభవించు మహాత్ములకు నల్పసుఖహేతు వయినసంసారమం దభినివేశము గలుగుట యనుచితము. పురాతనకర్మబంధవశమువలన గృహాసక్తి గలుగుఁగాక. అట్లయినను భగవద్భక్తియు, నందువలని ముక్తియు నేల కలు

† ఆత్మారాముఁ డనఁగా ఆత్మయే ఆరామముగా అనఁగా నారామమువలెఁ క్రీడాస్థానముగాఁ గలవాఁడని యర్థము ఆత్మస్వరూపమందే క్రీడించువాఁడనుట. ఆత్మస్వరూపమే రమించుటకు స్థానమగుట యెట్లన్ననో నది వికారయుక్తమై దుఃఖాదిమిశ్రమైనప్రకృతికంటె వేఱయినది. మఱిబ్రహ్మమునకుఁ దానుశరీరమగుటచే బ్రహ్మమే తనకు నాత్మగాఁ గలది. ఇట్లు ప్రకృతికంటె వేఱయి బ్రహ్మాత్మకమయిన యాత్మస్వరూపము అసంకుచితజ్ఞానాకారమును ఆనందైకతానమగుటచే దానియందే రతి గలవాఁడు తక్కినగృహాదులందు రతి నొందఁ డని భావము.

గఁ గూడదని శంకింపఁ దగదు. దారసుతాదు లగుననుబంధము లందు సక్తచిత్తుఁ డైనవానికిఁ బరమేశ్వరునియందు భక్తియు, నవిచ్ఛిన్న మైనముక్తియు, సంభవించుట యసంభవము. అట్టిది ప్రియవ్రతున కెట్లు సంభవించినదో యని గొప్పసంశయము బాధించుచున్నది" యని యడిగిన నరేంద్రునకు మునీంద్రుం

ప్రియవ్రతోపాఖ్యానము.

డిట్లనియె. "ఓ రాజా! సత్యము వచించితివి. కాని యం దొక్క విశేష మున్నది. స్వాయంభువాదుల ప్రార్థనముచేఁ బ్రియవ్రతుఁడు గృహస్థాశ్రమ మవలంబించెను గాని యతని కం దభినివేశము లేదు. జ్ఞానులకు గృహాదులం దభినివేశము గలుగదని చెప్పిన నీవచనము సముచిత మైనది. కాని యాత్మారాముఁడు గృహాసక్తుఁ డైనచో భక్తి నశించు నని చెప్పినది యుక్తము కాదు. దానికిఁ గారణము చెప్పెదను వినుము. బ్రహ్మాదులచే నుతింపఁబడు భగవంతుని పాదపద్మమునందలి మకరందమును దనివిదీఱఁ గ్రోలుటచే మదించినచిత్తము గలవా రంతరాయములచే నతికష్టమున నుపహతు లయ్యును బూర్వవాసనచే మోక్షమార్గభూత మగుభక్తిని విడువరు. కావున గృహాసక్తి గలిగినంతమాత్రమున భక్తి కుపసంహారము గలుగుననుట యయుక్తము. మఱియుఁ బ్రియవ్రతుఁడు సర్వోత్కృష్టము లగు భాగవతధర్మములం దాసక్తి గలిగి, నారదుని భజించుటచే హితపురుషార్థముల నొంది తత్త్వజ్ఞానముచే నొప్పుచు "జీవేశ్వరులతత్త్వమును దెలుపు జ్ఞానమం దాసక్తుఁడ నయ్యెద"నని సంకల్పించుకొని యవిచ్ఛిన్న మగుధ్యానముచే భగవంతుఁ డగువాసుదేవునియందే సమస్త కర్తృత్వాదులను, సకలక్రియావ్యాపారములను బొందుపఱ

చుచు, నీతిశాస్త్రజ్ఞుల సాయముచే భూపాలనము చేయు మని తండ్రి యగుస్వాయంభువమనువుచేఁ బ్రార్థితుఁడయ్యును రాజ్యపాలనముఁ జేకొన్నచోఁ దనకుఁ బ్రకృతిపరిణామరూపము లగు దేహాదులనుండియుఁ దత్ప్రయుక్తములగు రాగాదులనుండియు జ్ఞానసంకోచము కలుగక మానదని యెంతమాత్ర మందుల కంగీకరింపలేదు. జనకునిచేఁ బ్రార్థితుఁడయ్యుఁ బ్రియవ్రతుఁడు రాజ్యపాలనమును దిరస్కరించి యుండఁగా దేవతలలోఁ బ్రథముఁడును ధర్మభూత మగుజ్ఞానముచే సమస్తమును వ్యాపించి సమస్తలోకాభిప్రాయములను దెలిసికొనుచున్నవాఁడును, నగు బ్రహ్మ మూర్తిమంతము లైనవేదములవలె వెలయు మరీచ్యాదులచేఁ బరివృతుఁడై సత్యలోకమునుండి భూలోకమున కవతరిం

బ్రహ్మ మునిగణములతోఁ బ్రియవ్రతునిపాలి కేఁగుట.

చెను. కమలాసనుం డట్లు దిగుచున్నప్పుడు గగనతలమందుఁ జంద్రునివలె బ్రకాశించుచు, బ్రతిక్షణమును దేవేంద్రాదులవలనఁ బూజలు గైకొనుచు సంఘములుగా నున్నసిద్ధులచేతను, గంధర్వులచేతను, సాధ్యులచేతను, గిన్నరకింపురుషాదులచేతను, నుతింపఁబడుచు స్వీయకాంతులచే గంధమాదనపర్వతప్రాంతములను బ్రకాశింపఁజేయుచుఁ బ్రియవ్రతునిసమీపమునకు వచ్చెను. అంతటఁ బ్రియవ్రతునకుఁ దత్త్వోపదేశము చేయ వచ్చియున్న నారదుండు హంసవాహనారూఢుం డై మునిగణపరివృతుఁ డై వచ్చుచున్న చతుర్ముఖునిఁ జూచి స్వాయంభువ ప్రియవ్రతులతోఁ గూడ లేచి యెదురుసని పూజించి దోసిలిపట్టి నుతించెను. ఓరాజేంద్రా! ఆకమలాసనుఁడు నారదుఁ డొనరించినపూజకును, స్తోత్రమునకును,గుశలప్రశ్నమునకును మిగుల సంతసించి ప్రియవ్రతునిఁగని

కరపుఁజూపులతోఁ జూచుచు, నిట్లనియె. ఓప్రియవ్రతా! సత్యమగువచనమును దెలుపుచున్నాను. సావకాశచిత్తుండ వై వినుము. మేమును, నీవును, నీ నారదుండును, మరీచ్యాదులును, వెక్కేల? యందఱును భగవంతునిశాసనమును మన్నించి యొనరించుట విహితకృత్యము. అతనియనుమతి నుల్లంఘింపఁ దగదు-అట్లు చేసిన నతనియాగ్రహమునకుఁ బాత్రుల మగుదుము. కావున నీ విప్పు డతీంద్రియుఁడై యపరిచ్ఛిన్నుఁడై దేదీప్యమానుండై, యున్నభగవంతునిశాసనమును దిరస్కరించి తదీయాగ్రహంబునకుఁ బాత్రుండ వగుట తగదు. ఇంతియకాక తపంబుచేతఁగాని, శాస్త్రీయజ్ఞానముచేతఁగాని, యణిమాదియోగబలముచేతఁగాని విచారసమర్థ మయినబుద్ధిచేతఁగాని, ధనములచేతఁగాని యాగాదులచేతఁగాని, యంతకంటె నుత్తమమయినయేసాధనముచేతఁ గాని దేహధారి యాపరమేశ్వరునిశాసనమును మఱియొకవిధముగామార్చుటకై నను సమర్థుండు కాఁడు. ఓప్రియవ్రతా! సమస్తప్రాణిసమూహమును, నుత్తరోత్తరజన్మములందు జన్మనాశములకు నిమిత్తము లగుకర్మములను జేయుటకొఱకును, బ్రియవస్తువులు నశించుటవలనఁ గల్గుదుఃఖముకొఱకును, దేహాత్మభ్రమకొఱకును, స్వతంత్రాత్మభ్రమకొఱకును, భయముకొఱకును, సుఖదుఃఖంబులకొఱకును, బ్రాకృతనేత్రముల కగోచరుఁ డయినభగవంతునిసంకల్పాయత్త మైనదేహసంబంధమును ధరించుచున్నది. కావున నతని శాసనము మీఱ సామర్థ్య మెవ్వరికిని లేదు. ఓయీ! మానవుఁడు నాసికారంధ్రములం దమర్పఁబడిన బంధనరజ్జువుచే బలీవర్దాదులను సులభముగా వశము గావించుకొనుటఁ జూచుచున్నాము. అట్లె భగ

వంతుఁడు సత్త్వాదిగుణములు, సాత్త్వికాదిభేదముచే భిన్నము లయిన వర్ణాశ్రమోచితకర్మములు, నాఁబడు త్రాళ్లచే మనల నందఱను బంధించి వేదాత్మక మైనత్రాటియందుఁ గూర్చుచున్నాఁడు. కావుననే మన మతనికి స్వాధీనులమై సర్వదా పూజల నొనర్చుచున్నాము. ఓయీ! ఒకపురుషునిచే నడపింపఁబడుచు గ్రుడ్డివాం డ్రొకప్పుడు నీడను, వేఱొకప్పు డెండను బొందుచున్నారు. అట్లు సర్వేశ్వరుఁ డిచ్చుచున్న వర్ణాశ్రమోచితకర్మములను, దేవమనుష్యాది శరీరములను, గర్మానురూపము లగుసుఖదుఃఖంబులను, సమస్తమును మన మనుభవింపక తీఱదు. కావున మన మిష్టమునుగాని యనిష్టమునుగాని సాధించుకొన సమర్థులము కాము. ఓయీ! దేహాత్మాభిమానము గలవా రగుటచే సంసారులకుఁ బ్రవృత్తిధర్మములఁ జేయుట యుచితమే. కాని నే నాత్మవిద్య నభ్యసించి ముముక్షువు నై యుండఁ బ్రవృత్తిధర్మాచరణము తగునా? యని శంకింపకుము. ముముక్షువైనను నజ్ఞానదశయుండువలెనే జ్ఞానదశయందు సైతము ప్రారబ్ధం బగు కర్మ మనుభవించుచు, నట్లయ్యు దేహాత్మాభిమానరహితుఁడై ముక్తుఁ డగుపర్యంతమును దేహమును ధరింపవలెను. అజ్ఞానికిం బోలె జ్ఞానికిని దేహధారణకర్మానుభవము లున్నను వారికి గొప్ప భేదము గలదు. అందు జ్ఞాని ప్రారబ్ధకర్మ మనుభవించుటకు మాత్రమే దేహమును ధరించి కర్మానుభవము చేయుచుండును. గాని యజ్ఞానివలె దేహాంతరారంభముకొఱకు నిమిత్తములగు కర్మముల నాచరింపఁడు. కావున నీవు ముముక్షువవైనను బ్రారబ్ధానుభవముకొఱకు దేహమును ధరింపక తీఱదు. అట్లు ధరించినను వన్యములచే దేహధారణముఁ గావించుచు వనమందుండుటయుక్త

ము కానిసంసార హేతువయినగృహంబునందుండుటముముక్షువు
నకుఁ దగదని కొందఱు తలంతురు. కాని వనమం దున్నను జితేం
ద్రియుండు కాక దేహేంద్రియాదులకు వశుండయిన చో మనంబు
తోఁగూడి జ్ఞానేంద్రియపంచకము జ్ఞానమునకు విరోధము గల్గిం
చిసంసారమునఁ బడవేయును. జితేంద్రియుఁడై కావున నే యాత్మా
నుభవము కల్గి వర్తించుపురుషుఁడు గృహాశ్రమగతుఁ డయినను
సంసారభయము లేదు. కావున నింద్రియపరవశత్వమే సంసారభ
యహేతువు కాని మఱియొకటి లేదు. అట్టియింద్రియజయము
విజనమగు వనమందె సంపాదింపఁగలము. కాని యింద్రియాకర్ష
కము లయినవస్తువులతో నిండియుండు గృహంబునుండి సంపా
దింపలేమని సంశయింపఁబని లేదు. లోకమున రాజు దుర్గమునా
శ్రయించియే బలిష్ఠు లగుశత్రువులను జయించుచున్నాఁడు.
శత్రువులబలము తఱిఁగినపిమ్మట దుర్గమందుండి కాని దుర్గబహి
ర్దేశమందుండి కాని యథేష్టముగా సామాన్యులను జయించు
చున్నాఁడు. అట్లె విద్వాంసుఁడు ముందుగా గృహమందుండియే
బలిష్ఠము లగునింద్రియంబుల జయింప సమకట్టవలెను. ఆయింద్రి
యముల బలము తఱిఁగినప్పు డెచ్చటనుండి యైనఁ బూర్ణముగాఁ
జయింపవచ్చును. కావున రాజునకు శత్రువుల జయింప దుర్గ
మెంత సాయపడుచున్నదో ముముక్షువున కింద్రియాదుల జయిం
ప గృహ మంత తోడ్పడుచున్నది. ముముక్షువునకు గృహాశ్రమ
మొక నిర్బంధము కాదని యెఱుంగుము. ఓయీ! పరమేశ్వరుని
పాదారవిందరూప మైనదుర్గము నాశ్రయించి యింద్రియముల
జయింతును గాని యతిహేయము లగుగృహాదుల నాశ్రయించు
టఁ కంగీకరింప నని పల్కనఁ బల్కవచ్చును. అది సత్యమే. పద్మకోశ

మధ్యమం దుండినతుమ్మెదను వాతాదిబాధలవలె భగవంతుని పాదారవిందముల నాశ్రయించిన ని న్నింద్రియంబులు శాధింప లేవు. అయినను బరమపురుషుఁడు నిర్దేశించిన భోగముల నీలో కముం దనుభవింపుము. పిమ్మట సమస్తసంగములను విడిచి భగవద్భక్తిచే గుణాష్టక స్వభావమును బొందుము పరమపురుషుని యాజ్ఞ నతిక్రమించుట తగ" దని యిట్లు బ్రహ్మ పలుకఁగా విని భాగవతోత్తముఁ డగు ప్రియవ్రతుఁడు చతుర్ముఖునిశాసనము తనకు సుకరముగా నుండుటచేతను, దాని నతిక్రమించుటతన కనర్హ మగుటచేతను 'వల్లె'యని బహుమానపూర్వకముగా మన్నించెను. అనంతరము భగవంతుఁ డగుబ్రహ్మయు స్వాయంభువుండు యథావిధిగా నొసంగెడి పూజలను స్వీకరించి ప్రియవ్రతనారదులు సప్రేమముగాఁ జూచుచుండ వాక్కునకును, మనంబునకు గోచరము కాక చిరకాలస్థాయి యైనతనలోకమున కేఁగెను. అంత స్వాయంభువమనువు ప్రియవ్రతుని రాజ్యపాలకునిఁగాఁ జేయవలె నన్న మనోరథము బ్రహ్మదయవలన ఫలించినందుల కానందించి నారదమహర్షి యనుమతిని బడసి ప్రియవ్రతుని ధర్మమర్యాదలు చెడకుండ భూమండలమునుఁ బాలింప నాజ్ఞాపించి దుస్తరము లైనశబ్దాదివిషయము లనెడివిషయజలము గలతటాకమువలె ను న్నగృహామం దుండియు, నానాభోగంబులం దుండియు, మనంబును మరలించుకొనెను. ప్రియవ్రతుండు స్వేచ్ఛచే భగవదారాధనరూప మగుకర్మముల నొనర్చుచు, సకలజగంబుల బంధనంబుల నివర్తించుటచే నుత్కృష్ట మైనప్రభావము గల భగవంతునిపాదపద్మములను సర్వదా ధ్యానించుటచే, రాగద్వేషాదులను విడిచి, నిర్మలాంతఃకరణుఁ డై బ్రహ్మాదులయానతి ననుమతిం

చుటవలన వర్ధిల్లినగౌరవమునఁ దనరారుచు భూమండలమును బరిపాలించెను. అనంతరము ప్రియవ్రతుండు విశ్వకర్ముఁ డను ప్రజాపతి కుమారికను బర్హిష్మతిని వరించి, యామెయందు, సత్స్వభావము చేతను, శౌర్యాదిగుణములచేతను, వ్యాపారముచే తను, సౌందర్యముచేతను, బరులఁ దిరస్కరించుసామర్థ్యముచే తను, దనకు సమానులైనపుత్రులను బదుగురను బడసెను. కడపట "ఊర్జస్వతి" యనునొకకుమారికను గనెను. ఆపదు గురు పుత్రులును "ఆగ్నీధ్రుఁడు, ఇధ్మజిహ్వుఁడు, యజ్ఞబా హుఁడు, మహావీరుఁడు, హిరణ్యరేతుఁడు, అకృతిపృష్ఠుఁడు, సవ నుఁడు, మేధాతిథి, వీతిహోత్రుఁడు, కవి యనెడినామములచే నొప్పిరి. వారిలోఁ గవియు, మహావీరుండును, సవనుండును, జితేంద్రియులై చిన్నతనంబునుండియునాధ్యాత్మికవిద్యయందుఁ బరిశ్రమముచేసి నివృత్తధర్మపరాయణులై పరమహంసాశ్రమ మును భజించిరి. అనంతర మామువ్వురును, బరమహంసాశ్రమ మం దుండియే యింద్రియములను జయించి విజ్ఞానసంపన్నులై, సమస్తజీవరాసులకును నివాసభూతమైనశరీరముగలవాఁడును, సంసారభీతులను రక్షించుచున్నవాఁడును, నగువాసుదేవునిపాద పద్మములను సంతతము ధ్యానించుటవలన లభ్యమైనపరమభ క్తియోగముచే రాగద్వేషాదులను దొలఁగించుకొని నిర్మలచి త్తులై, సమస్తభూతముల కాత్మభూతుఁడై, జీవశరీరకుఁడై త మతమహృదయములందు సాక్షాత్కరించిన పరమపురుషునితో జగద్వ్యాపారముతక్కఁ దక్కినసమస్తధర్మములచేతను సామ్య మొందిరి. తక్కినయేడ్వురును జనకున కధీనులై యుండిరి. మఱియుఁ బ్రియవ్రతుఁడు మఱియొకభార్యయందు "ఉత్తముఁ

డు, తామసుఁడు, రైవతుఁడు" నాఁబడుమువ్వురుపుత్రులను బడసెను. ఆమువ్వురును మన్వంతరాధిపతులైరి. ఇట్లు పుత్రులందఱును దనవలెనే సద్గుణాకరులై యుండఁగాఁ బ్రియవ్రతుండు నిరర్గళమైనపురుషకారము గలబలముచేఁ బూర్ణములైనబాహువులచే భీకరచాపము నెక్కిడి యుద్ధములేకుండ ధనుష్టంకారముచేతనే ధర్మవిరోధు లగుశత్రువులను లోఁబఱుచుకొనుచుఁ, దనభార్యయగు బర్హిష్మతి హర్షముచేతను, నభ్యుత్థానాది లీలలచేతను, స్త్రీలకు సహజమైనశృంగారాదిభావములచేతను, సిగ్గుచే సంకుచితములయినకడకంటిచూపులచేతను, మందహాసముచేతను, మృదుతరములైనపరిహాసవాక్యములచేతను, నిరంతరమును దన్ను సుఖవంతునిఁగాఁ జేసి వివేకమును దొలంగించుచుండఁగాఁ దన్నుఁ దా నెఱుంగనివానివలె వర్తించుచుఁ బదునొకండుకోట్లవత్సరంబులు భూమిని బాలించెను. భగవంతుఁడైనసూర్యుఁడు మేరుపర్వతమునకుఁ బ్రదక్షిణము సేయుచు భూమండలములో సాఁబాలు ప్రకాశింపఁజేయుచుఁ దక్కినసాఁబాలును ఛాయచే నాచ్ఛాదించుచున్నాఁడు. కావుననే రాత్రి యనియు, బవలనియు విభాగము గల్గుచున్నది. సూర్యునిచేఁ బ్రకాశితముకాని భాగముగూడఁ బ్రకాశితముగునట్లు చేసెదననిసంకల్పించుకొని ప్రియవ్రతుఁడు భగవదుపాసనముచేఁ బురుషప్రభావమును వరించుకొని సూర్యరథముతో సమానమై తేజోమయమైన రథము నధిష్టించి రెండవసూర్యునివలె నొప్పుచు, సూర్యుఁడు మేరువున కుత్తరమున నున్నప్పుడు తానుదక్షిణమున వెలయుచు, నతఁడు దక్షిణమున నున్నప్పుడు తానుత్తరమునఁ బ్రకాశించుచు నిట్లేడుపర్యాయములు సూర్యుని ననుసరించి మేరువునకుఁ

ప్రదక్షిణము చేసెను. ఓరాజా! ఆప్రియవ్రతునిరథనేమివలనఁ గల్గిన గర్తములే సప్తసముద్రంబు లయ్యె. ఆసప్తసముద్రముల చేతను భూమండల మేడుభాగములుగావిభజింపఁబడెను. ఆభాగములే క్రమముగా జంబూద్వీపమనియుఁ బ్లక్షద్వీపమనియు, శాల్మలిద్వీపమనియుఁ గుశద్వీపమనియుఁ గ్రౌంచద్వీపమనియు, శాకద్వీపమనియుఁ బుష్కరద్వీపమనియుఁ బిలువఁబడుచున్నవి. ఆద్వీపములు పూర్వపూర్వమునకంటెఁ దరువాతివి యథాసంఖ్యముగా రెండింతల పరిమాణముఁ గలిగి వర్తించుచున్నవి. ఆయేడు జలభాగములును గ్రమముగా క్షారోద మనియుఁ నిక్షురసోద మనియు, సురోద మనియు, ఘృతోద మనియు, క్షీరోద మనియు, దధిమండోద మనియు, శుద్ధోద మనియు, నామములు గల్గి వర్తించుచున్నవి. అవి సప్తద్వీపములకును బరిఖలై యొప్పుచున్నవి. అందు జంబూద్వీపము లక్షయోజనములపరిమాణము గలది. కాన తత్పరిఖాభూతమైనలవణసముద్రము కూడ లక్షయోజనములపరిమితి గలదై యున్నది. ప్లక్షద్వీపము రెండు యోజనములపరిమితి గలదగుటచే దానిఁజుట్టియున్న యిక్షుసముద్రంబును రెండులక్షలయోజనములపరిమాణము గలదై యున్నది. ఇట్లు ద్వీపపరిమాణమునుఁ బట్టి వానినిఁజుట్టి యున్నసముద్రములును బరిమాణవిశేషముచే నొప్పుచున్నవి. అందుఁ బ్రియవ్రతుండు జంబూద్వీపాదు లేడింటియందును దనకుమారు లగు నాగ్నీధ్రుని, నిధ్మజిహ్వుని, యజ్ఞబాహుని, హిరణ్యరేతుని, ఘృతపృష్ఠుని, మేధాతిథిని. వీతిహోత్రునిఁ గ్రమమున నభిషేకించి యధిపతులనుగా నొనర్చెను. ఆప్రియవ్రతుఁడు, తనకుమారిక నూర్జస్వతిని శుక్రునకు నొసంగ నతని కామెయందు దేవ

యూని యనుకన్యక యుదయించెను. ఓరాజా ! ప్రియవ్రతున కిట్టి ప్రభావములు గలుగుట యసంభవ మని తలంపకుము. ప్రియవ్రతుని కివియే కాక మఱికొన్ని ప్రభావములు గూడఁ గలవు. ముజ్జగముల నాక్రమింప సమర్థము లయినపరమపురుషునిపాదములను సేవించి, తదీయపరాగముచే షడూర్ములను నశింపఁజేసికొన్న మహానుభావులకు శక్తిలోపం బెట్లు గలుగును? లోకాక్రమణరూపవ్యాపారమున నసాధారణసామర్థ్యముగలభగవంతునిపాదారవిందముల సేవించినవాని కసాధారణసామర్థ్య మలవడుట కేమి కొఱంత? అంత్యకాలమున నొక్కమాఱు నారాయణస్మరణ చేసినవాఁడు తత్క్షణమందే దుస్తర మైనసంసారమును త్యజించి ముక్తుఁ డగుచున్నాఁడు. అట్టిండ నసాధారణసామర్థ్యము గల భగవంతునిపాదములు సేవించువాని కసాధారణసామర్థ్యమేల కలుగదు. ఇట్లపారము లైన బలపరాక్రమములు గల ప్రియవ్రతుఁ డొకప్పుడు నారదమహర్షి చరణపంకజములను సేవించుచు, దానివలనఁ దానవలంబించిన ప్రవృత్తిమార్గపుసంబంధముచేఁ దన్ను సుఖహీనునిఁగా భావించుకొని యిట్లు విచారింపఁ జొచ్చె. 'అక్కటా ! నేను మిక్కిలియనుచితకార్యము నాచరించితిని. మొదట నేను నివృత్తిధర్మపరుండ నయ్యు, నిప్పుడు దుర్జయము లైనయింద్రియములకు వశుండ నై తృణావృతకూపములవలె నున్న ప్రకృతిపరిణామరూపము లైన హేయసుఖములందు మునిఁగితిని. అకటకటా ! ఈవిషయానుభవము చాలును. నాభార్య యైన బర్హిష్మతికి నేను గ్రీడామృగము నై తిని. అయ్యయో ! ఎంతపని చేసితిని. తెలివి మాలిననన్నుఁ గాల్పనా? అని యిట్లుపరిపరివిధంబులఁ దన్ను నిందించుకొనెను. అనంతరము

నివృత్తిధర్మములచే భగవంతు నారాధించి తత్ప్రసాదమునుసంపాదించికొని దానివలన స్వస్వరూపమును ధ్యానించుచుఁ దాపత్రయరహితుఁ డగుటవలన మిక్కిలిసుఖ మనుభవించుచుఁ దన్ననుసరించుచున్నపుత్త్రులకు సప్తద్వీపపరిమితి గలభూమండలమును యథాక్రమముగా విభజించి యిచ్చి, సకలభోగంబులను సమకూర్చిన భార్యను శవమునుగా భావించుచు, గొప్పసంపదలను దృణప్రాయముగాఁ జూచి వేఱొకనియుపదేశము లేకుండఁగనే వైరాగ్యమును, నిర్వేదమునుం బొంది, హృదయమందు సర్వదా హరిలీలలను బరిశీలించుచున్న నారదునియుపదేశమార్గమును మగుడఁ బొంది గంధమాదనపర్వతమందు సిద్ధిని బొందెను. ఓరాజా! ఆప్రియవ్రతునిమహిమను దెలుపువచనంబులు కొన్ని గలవు. వివరించెద నాలింపుము. ప్రియవ్రతుఁడు తన యసామాన్యప్రభావముచే రాత్రిని సైతము పగటినిఁగాఁ జేసి రథనేమివలనఁ బడినగర్తములచే సప్తసముద్రములను నిర్మించెను. ఆమహానుభావుండు నదులచేతను, గిరులచేతను, వనములచేతను, సాంకర్యము గలుగకుండఁ బ్రతిద్వీపమందును భూమిని విభాగించి యెల్లలనేర్పఱిచెను.మఱియు నతఁడు విష్ణుభక్తులం దాదరముగలవాఁడై, ముల్లోకములందును సంభవించు సౌఖ్యమును, నణిమాదు లగుసిద్ధులను, మాహాత్మ్యమును, నరకసదృశమునుగాఁ గావించి విడిచిపుచ్చెను.ఈదృశము లగుమహాకార్యములను భగవంతుఁడు తక్క నెవఁడు చేయఁగలఁడు? ఇది ప్రథమాధ్యాయము.

---

ఇట్లు తనతండ్రి సిద్ధినొందినతరువాత నాగ్నీధ్రుఁడు తనజన కునిశాసనముచొప్పున వర్తించుచు ధర్మాచరణమం దాసక్తుఁడై జంబూద్వీపనివాసు లగుప్రజలనందఱను గన్నబిడ్డలవలెఁ గాంచుచు నాపదలు పొరయకుండ జాగరూకుఁడై రక్షించెను. అనంతర మాగ్నీధ్రుఁడు తనకున్నతిలోకములు గల్గించుసంతానమునభిలషించి దేవతాస్త్రీలకుఁగ్రీడాపర్వతమయిన సుందరమునందుఁ బూజాసాధనములనుసంపాదించికొని స్థిరచిత్తుఁడై తపంబుసేయ, బ్రహ్మయుతనియారాధనమున కానందించి తనసభయందుగానముచేయుచున్న పూర్వచిత్తియనునచ్చరను బిలిచి సంతానార్థ మాగ్నీధ్రునిచెంతకుఁ బుత్తెంచెను. ఆపూర్వచిత్తియు బ్రహ్మయనుమతిచొప్పున నాగ్నీధ్రునిసమీపమునకు వచ్చుచు నతని యాశ్రమారామమును బ్రవేశించెను. ఆయుద్యానవనము మిక్కిలి సుందరముగానుండెను. అందు తరునికరములు మిక్కిలి సాంద్రముగా నుండెను. ఆతరువులశాఖలందు సువర్ణకాంతి గలపూలలత లల్లికబిల్లికగాఁ బ్రాఁకి ప్రకాశించు చుండెను. వానియందు మయూరాదిస్థలపక్షులమిథునములు గూర్చుండి యతిమధురముగా ధ్వని లొనర్చుచుండెను. ఆధ్వనులను విని సమీపస్థమగు తటాకమం దున్న నీటికోళ్లు, కన్నెలేడిపిట్టలు, కొంగలు, రాజహంసలు మొదలగుపక్షులు మనోహరముగా నినాదములు చేయుచుండెను. ఆనాదములచే నాతటాకము ప్రతిధ్వనించుచు నిర్మలోదకమున కాకరమై యుండెను. పూర్వచిత్తి మెల్లమెల్లగా నాతటాకముచెంతకు వచ్చి సంచరించుచుండెను. అచ్చటనే తపంబొనరించు చున్నయాగ్నీధ్రుఁడు మిక్కిలి సుందరమైన గమనవిలాసములు గల యాపూర్వచిత్తి నడుచుచున్న

ప్పుడు గలుగు మధురములగు నూపురధ్వనుల నాకర్ణించి సమాధిచేత మూసినకన్నులను కొంచెము విప్పి వీక్షించెను. ఆసమయంబున

—•◆ ఆగ్నీధ్రుఁడు పూర్వచిత్తిని జూచి మోహించుట. ◆•—

నాసుందరి మధుకరివలెనే ప్రతిపుష్పము నాఘ్రాణించుచుండెను. ఆమె నరదేవప్రభృతులచిత్తంబునకును నయనంబులకును బరమాహ్లాదము గల్గించుసుందరగమనముల చేతను విహారముల చేతను, వినయముల చేతను, నవలోకనముల చేతను, మధురస్వరముల చేతను, సుందరావయవముల చేతనుఁ బ్రతివానికిని మదనవికారమును గల్గించుచుండెను. ఆలలన సుధారసస్రావము వోని మధురభాషణములను మందహాసపూర్వకముగాఁ బలుకుచుండ వెడలిననిశ్వాసవాయువు లందలిసుగంధములచేఁ దుమ్మెదలు మదాంధములై తన్ముఖపరోధించుటచే భయంబునఁ బర్విడుచుండ స్తనములును గేశపాశమును రశనయును గొంచెము చలించుచుఁ జూపఱకు మోహము త్పాదించుచుండె. ఇట్లు సుందరవిలాసములతో విహరించునాసుందరినిఁ జూచి యారాజకుమారుఁడు మదనవశుండై సంచలితహృదయుండై స్త్రీల నెఱుంగనివానివలె నామెంజూచి యిట్లనియె. *మునివరా! నీ వేజాతిని జెందియున్నావు? ఈశైలమం దేమియొనరింపఁదలంచుచున్నావు? నీవు భగవంతునిపరదేవతారూప మైనమాయ వగుట నిక్కంబు. నీవు భ్రూలతల నడి కెం డుపిండ్లను దాల్చియున్నావు. వానినిధరించుట నీస్నేహితుఁడనగు నాకార్యము నెఱవేర్చుటకా? లేక స్వీయకార్యము నెఱవేర్చుటకా? ఆవిండ్లచే నీకేమిప్రయో

* ఆరాజకుమారుఁడు పూర్వచిత్తి యనునచ్చరను నొకమహాముని గాఁ దలంచి 'మునివరా' ఇత్యాదిపదములచే సంబోధించుచున్నాఁడు.

జన మున్నది? ఆలోచింప నింద్రియాధీనులమై మృగతుల్యులమై చరించుమావంటివారిని జయింప నీచాపద్వయంబు నవలంబించి వర్తించుచుంటివా యేమి ? కమలసదృశము లైననీనేత్రములు బాణములవలె నొప్పుచున్నవి. అవి ఱెప్ప లనెడికంకపత్రములు గలవి. అవి విలాసములచే సుందరము లైనవి. అవి పుంఖములు లేక పోయినను మనోహరములై యున్నవి. వానికడకంటిచూపు లనెడియగ్రములు మిక్కిలి తీవ్రములై యున్నవి. నీ వీవనమందు సంచరించుచు, నాబాణముల నెవ్వరిపైఁ బ్రయోగింతువో తెలియలేకున్నాను. నీపరాక్రమము మావంటిమందబుద్ధుల క్షేమముకొఱకగుఁగాక యని ప్రార్థించుచున్నాను. నీశరీరపరిమళమందు లోలుభములై మధుకరములు సర్వదా నిన్ను వెంబడించుచు ఝుంకృతు లొనర్చుచు, సామగానము నేర్చుకొనుచున్న శిష్యులవలెఁ దనరారుచున్నవి. నీకు శిఖాభూషణము లగు తుమ్మెదగుంపులు నీకేశపాశమునుండి రాలుచున్న పుష్పసమూహములను ఋషిగణములు వేదశాఖలనుంబోలె నాశ్రయించి భజించుచున్నవి. ఓమునీశ్వరా! నీపాదపంజరము లందున్న నూపురము లనెడితిత్తిరిపక్షుల యవ్యక్తము లగుమధురనినాదములు విందుముగాక. * ఓమునిపుంగవా! నీనితంబబింబములందు కదంబకుసుముల వంటికాంతి యెట్లు లబ్ధమయ్యెను? ఆ † కాంతియందు వెలయు వలయాకారాగ్ని రేఖ యెట్లు లభించినది? నీ‡వల్కలము కాన

---

* ఆమె ధరించినవస్త్రమును జూచి యిట్లడుగుచున్నాఁడు.

† ఆమెమొలయందున్న మేఖలను జూచి కొంతవిని ద్రిప్పునప్పుడు గలుగు వలయాకారరేఖనుగా భావించుచున్నాఁడు.

‡ వల్కలమును గాంతినిగా భావించి వల్కలము లేదని భ్రమించెను.

రాదేమి? ఓవిప్రవర్యా! *సుందరము లైనసీశృంగంబులు మిక్కిలి మనోహరముగా నున్నవి. నీనడుము మిక్కిలి కృశించియున్నప్పటికిని నాశృంగద్వయమును వహించుచున్నది. అది మిక్కిలి కష్టమైనపని నానేత్రము లాశృంగములందు లగ్నంబులై మగిడి రాలే కున్నవి. నీశృంగములం దున్న యెఱ్ఱనిబురద మిక్కిలి పరిమళించుచు నాయాశ్రమము నెల్లను బరిమళింపఁజేయుచున్నది. ఓమిత్రవర్యా! నీలోకమును నా కొకపరి చూపుము. మీలోకములోనివా రందఱును మావంటివారి మానసమును హరించెడియిట్టియపూర్వశృంగములను వక్షముచే వహించియున్నారు కాఁబోలును! ముఖమందును, నీవలెనే, మధురాలాపములను, మనోహరవిలాసములను, నధరామృతమును వహించి యున్నారు కాఁబోలును! ఓ మిత్రమా! మీలోకమందు దేహపోషణమునకై యెట్టియాహారమును దిందురు? భక్షణాదికము కాక మీకు వేఱొక జీవనోపాయము గలదని తలంచెదను. అది యేదియో చెప్పుము. విష్ణువునకుంబోలె నీకర్ణములందు మకరకుండలములు ఉండుటచే నీవు విష్ణువునంశమ వని భావింతు. మఱియుఁ జంచలము లగుమీనములవంటి నేత్రములుండుటచేతను, హంసపంక్తివలెఁ దెల్లనిదంతపంక్తి గలదగుటచేతను, దుమ్మెద చాలువంటి కేశపాశము గలదగుటచేతను, నీవదనము కమలాకరమువలెఁ బొల్చుచున్నది. నీకరతలముచే నాహతమగుచున్న కందుకము దిక్కులందుఁ ద్రుళ్లిపడుచు నానేత్రములను జంచలములనుగాఁ జేయుచున్నవి. ఆసమయంబునఁ బ్రిదిలిన కేశపాశమును బంధింపవైతివి. ధూర్తుఁడైన

* స్తనములను, అందలికుంకుమును జూచి యనుచున్నాఁడు.

వాయువు లాలనుఁడై నీనీవీబంధంబును వదలించుచున్నను స్మ
రింపకుంటివి. ఓ తాపసోత్తమా! తాపసుల తపంబునకు విఘ్నము
గల్గించునీయీరూపము నేతపంబు చేసి సంపాదించితివి ? ఓమి
త్రమా ! నాతోఁగూడ నిచ్చటఁ దపంబొనరింపుము. విశ్వస్రష్ట
యైనయీబ్రహ్మ నాయందు దయగల్గి నిన్ను నానిమిత్తము పం
పెనని తలంచెదను. ఓవిప్రవర్యా ! నామనంబును జూపులును,
నీయందు లగ్నంబులై మగిడిరాలేకున్నవి. కావున దైవవశము
వలన సంప్రాప్తుండవైననిన్ను విడనాడఁజాలను. ఓచారుశృంగీ!
నీచిత్తమును మాయధీనము చేయవలసినది. నీస్నేహితులంద
ఱును నాకనుకూలురయి వర్తింతురుగాక." అని యిట్లాగ్నీధ్రుం
డాయువతిని జూచి మోహితచిత్తుఁడై స్త్రీలను స్వాధీనలను గాఁ
జేయఁ దగినంత నేర్పు విశదమగునట్లుగా నామె ననునయించుచు
ననుకూలను జేసికొనెను. ఆపూర్వచిత్తియు నాయాగ్నీధ్రుని
బుద్ధిని, రూపమును, సత్ప్రవర్తనమును, విద్యను వయస్సంప
దను, నౌదార్యమును జూచి తదాయత్తచిత్తయై యతనితోఁ
గూడి భూలోకస్వర్గములవలె నున్న నవఖండములందును లక్ష
సంవత్సరములకాలము సమస్తసుఖంబు లనుభవించెను. ఆయా
గ్నీధ్రుఁడామెతో సమస్తసుఖంబు లనుభవించుచు, నామె
యందు, నాభి, కింపురుషుఁడు, హరివర్షుఁడు, ఇలావృతుఁడు, రమ్య
కుఁడు, హిరణ్మయుఁడు, కురువు, భద్రాశ్వుఁడు, కేతుమాలుఁడు,
నాఁబడుపుత్రులఁ దొమ్మండ్రుగురం గనియె. అనంతర మాపూర్వ
చిత్తి యొక్కొకవత్సరంబున నొక్కొకకుమారునిఁ గని యాపు
త్రులఁ బతిగృహమునందు విడిచి మగుడబ్రహ్మను సేవింప సత్య
లోకమున కేఁగెను. నాభిమొదలగుకుమారులు పుట్టువుచేత నే దృ

ధాంగులై బలశాలులై, తమతమనామములతో వెలయుచుఁ దమజనకునిచే విభక్తములై యీఁబడినజంబూద్వీపవర్షములను బరిపాలించిరి. ఆయాగ్నీధ్రుఁడు భోగములందుఁ దనివి సనమిచే నాపూర్వచిత్తినే సంతతమును, ధ్యానించుచు, నామెసంగతినే కోరుచు వేదోక్తము లగుసాధనములచేఁ బెక్కుకర్మము లాచరించి పితృదేవతలకు మోదము గల్గించునాలోకమును జెందెను. అట్లు తండ్రియైనయాగ్నీధ్రుఁడు లోకాంతరగతుండైనతరువాత నాసోదరులు తొమ్మండ్రుగురును, మేరుకుమారికలైన, మేరుదేవినిఁ బ్రతిరూపను నుగ్రదంష్ట్రిని, లతను, రమ్యను, శ్యామను, నారిని, భద్రను, దేవవీతిని, గ్రమముగాఁ బెండ్లియాడిరి. ఇది రెండవయధ్యాయము.

---

పిమ్మట నాభి సంతానార్థియై సంతానము లేని మేరుదేవితోఁ గూడికొని సమాహితచిత్తుఁడై యాగారాధ్యుఁ డయినపరమపురుషుని యోగములచేఁ బూజించెను. అతఁ డట్లు శ్రద్ధాళువై నిర్మలాంతఃకరణముతో విష్ణువు నారాధించు చున్నసమయమున నాభగవంతుఁ డతనియం దతివత్సలుఁడై యగ్నిష్టోమమునకంగభూతము లగుప్రవర్గ్యము లనుపేరు కలయాగములు ప్రవర్తించుచుండఁగా, హోమద్రవ్యము, సమదేశము వసంతరూపమగు కాలము, మంత్రములు, ఋత్విక్కులు, దక్షిణ, యనుష్ఠానప్రకారము, నాఁబడునీయేడుపాయములచేతనైనను దుర్లభుఁడయ్యును దనభక్తుఁడై ననాభియభిప్రేతార్థము నెఱవేర్పఁబూర్ణముగా సంకల్పించుకొన్నవాఁ డగుటచే సుందరావయవములు గల్గి, మనోహరమై, మనంబునకును, నయనంబులకును నానం

దము గల్గించునదై కర్మాధీనము కాక యున్నతనదివ్యమంగళవి
గ్రహముతో, సాక్షాత్కరించెను. ఆపరమపురుషుఁడు ప్రకాశ

నారాయణుండు నాభికిఁ బ్రత్యక్ష మగుట.

బహుళుఁడై నాలుగుభుజములతో నొప్పారుచుండెను. అతనిశరీ
రము పచ్చనిపట్టువస్త్రముచే నావృతమై యుండెను. అతనియుర
మున శ్రీవత్స మనెడిలాంఛనము కౌస్తుభమణియు వెలయుచుం
డె. అతనికరతలంబులందు శంఖము, చక్రము, గద, పద్మము,
ప్రకాశించుచుండె. ఆమహనీయునియవయవములు నవరత్న
మయము లయిన కిరీటము మకరకుండలములు, కడియములు,
మొలత్రాడు. హారములు, బాహుపురులు; నూపురములు, మొ
దలగునలంకారములచే రంగారుచుండెను. అట్టిభగవంతునిఁ
జూచి నాభియు, ఋత్విక్కులును, సభ్యులును, వెన్నిధిఁగన్న పేద
వాండ్రచందంబున నానందించి యథావిధిగాఁ బూజించి, నమ
స్కరించి యవనతశిరస్కులై సమీపమున నిలువఁబడి యిట్లు
నుతించిరి. 'ఓపరమపురుషా! నీవు పూర్ణుఁడవైనను నీభృత్యుల
మగుమే మిచ్చినపూజలను స్వయముగానే స్వీకరింపఁదగుదువు.
మాయొనర్చుపూజలను గ్రహించినంతమాత్రముననఁబరిపూర్ణుఁ
డ వగునీ కొకకొఱంత కలుగదు. నీస్వరూపమును, స్వభావము
ననంతము లగుటచే మేము పూర్తిగా నుతింప నెట్లు సమర్థుల
మగుదుము? కావున మేము "ఓదేవదేవా! నీకు నమస్కార
ము" అనుటమాత్రమే చేయఁగలుగుదుము. అంతకు మించిన
శక్తి మాకు లేదు. ఓపరమేశ్వరా! సత్త్వాదిగుణముల వ్యతికర
మువలనఁగల్గిన శబ్దాదివిషయములం దత్యాసక్తి గలిగి, కావు
ననే కర్మపరవశుఁడై దేవమనుష్యాదినామములచేతను, రూప

ము చేతను నుపలక్షితుఁ డగుపురుషుఁ డెవండును బ్రకృతిపురుషు లకంటె విలక్షణుఁడ వయిననీస్వరూపస్వభావములను నిరూపింప సమర్థుండు కాఁడు. కావున నెట్టిమహనీయుఁడయినను, సమస్త జీవులపాపముల హరింపసమర్థము లయి శివతమములై, యున్న నీగుణగణములలో గుణలవమునుమాత్రమే వర్ణింపఁగలఁడని చెప్పక తీఱదు. నీవట్లు స్వరూపస్వభావములచే ననంతుఁడ వయ్యును, బరిపూర్ణుఁడ వయ్యును, నీసేవకులు గద్గదస్వరముతో నుతించి; భక్తియుక్తులై యిచ్చుచున్న నిర్మలజలమును, ద్రవ్యాదులను, నవపల్లవములనుఁ దులసీదళములను, దూర్వాంకురంబులను, సత్కారాదరముతోఁ గైకొని మిక్కిలిసంతోషించుచున్నావు గదా? అనేకవస్తుసంభారంబులు గల్గిన యీమాయొనరించుయాగమునకు నీసంతుష్టితక్క వేఱొక్కప్రయోజనంబు గానరాదు. ఓపరమేశ్వరా! నీవు సర్వకాలములందును స్వతస్సిద్ధముగానే కలుగుచున్న సమస్తపురుషార్థములే స్వరూపముగాఁగలవాఁడవు. అట్టినీవలనఁ బురుషార్థములను గోరుచు మేము చేసిన యీయారాధనము నీకనర్హమైనను నీకు సంతుష్టిఁ గల్గించి, తన్మూలమున మాకే యుపయోగించుచున్నది. ఓపరమపురుషా! నీ వపారకరుణారసమున నొప్పారుచు నారాధనసమయమందే యపహతపాప్మత్వరూప మగుమోక్షమును, మాయపేక్షితఫలంబును, గల్పించుచుఁ బరిపూర్ణుఁడవైనను నపరిపూర్ణునివలెఁగానవచ్చుచు మాయిచ్చుపూజల నందుకొనుచు, నుత్కృష్టపురుషార్థ మొసంగనిమావంటియజ్ఞులకు యథానుగుణముగాఁగనఁబడుచున్నావు. ఓపూజనీయా! నీ వీరాజర్షియభిమతముల నెఱవేర్ప నావిర్భవించినవాఁడ వయిన నీతనియాగమందు భగవంతుఁడ వయిన నీవు

నిజభక్తులమగు మావంటివారికి గోచరుఁడవగుట యావరముల కంటె గొప్పదని భావించెదము. ఓమహాత్మా! వైరాగ్యాతిశయ మనెడియగ్నిచే,సమస్తపాపములను దహించెడియాత్మారాములును, భగవదారాధనరూపధర్మము నాచరించెడిమునులును నిరంతరమును నీగుణగణములను బరిశీలించి తాదృశగుణముల నభినందించుటయే నిరతిశయ మగు పురుషార్థ మని భావించుచుండఁగా నీసందర్శన మట్టిపురుషార్థ మనుటకు సందియ మున్నదా? ఓయీశ్వరా ! చాంచల్యము వచ్చినప్పుడును, తుమ్మినప్పుడును, పతనకాలమందును, నాఫులింతయందును, మఱికొన్నిదురవస్థల యందును, జ్వరదశయందును, మరణకాలమందును, బరవశుల మగుమాకు సకలపాపనిరాసకములును, కల్యాణగుణద్యోతకములును, నగు నీనామములు నీపాదారవిందస్మరణమునకుఁ దోడుపడుఁగాక. ఓవరదా! దరిద్రుఁడు పొల్లుధాన్యమును గోరుచుఁ గుబేరుని యాచింపఁదలంచిన ట్లీరాజర్షి చంద్రుండు, సంతానమునుఁ బురుషార్థముగా నెంచుకొనుచు, స్వర్గసుఖమునుగాను, మోక్షసుఖమును గాని యిచ్చుటకుఁ దగిన సామర్థ్యము గలనిన్ను నీవంటిసంతానమును బ్రార్థింప నున్నాఁడు. లోకమం దిట్టియవివేకు లుందురా? ఈసంసారమందు మహాత్ముల సేవఁ జేయుపురుషుం డొక్కరుండు దక్కఁ దక్కినవాఁ డేవాఁడైనను, గర్వశ్యులకు లొంగనిదియు, సత్పథమును గప్పిపుచ్చునదియు, నగు మాయచేఁ దిరోహితుఁడై, విషపాతమువంటి విషయములందు సక్తమతియై యిట్టికోర్కుల నపేక్షింపక యుండఁగలఁడా! ఉదారవ్యాపారముల నొనర్చునో దేవదేవా!ఓసర్వాత్మా! అల్పప్రయోజనమును బురుషార్థముగా నెంచికొని యజ్ఞుల మగుమేము నిన్ను

స్వల్పకార్యమునిమిత్తమిచ్చుటికి రప్పించితిమి. లోకములో సర్వో త్కృష్టవరముల నొసంగెడి నిన్నీస్వల్పకార్యంబునకుఁ బిల్చుట నీ కవమానకరము కాకమానదు. అయినను నీవంటిపుత్రునిఁ గోరుచుండుటచే నది పెద్దయవమానకరము కాదు. కాన దయ యుంచి మాయపరాధంబును సహింపుము.'' అని యిట్లు స్తోత్ర ము చేయుచు ఋత్విక్కులు భగవంతునకు నమస్కరించిరి. నాభి యును బరమభక్తితో నమస్కరించెను. అప్పుడు భగవంతుఁడు దయార్ద్రహృదయుఁడై యిట్లనియె.' ఓఋషులారా! మీరితని నిమిత్తము నాతో సదృశుఁడగుకుమారు నొసంగఁ గోరికొంటిరి. ప్రకృతిపురుషులకు విలక్షణుండనై నాతోసమానవస్తువు గాని నాకంటె నధిక మగువస్తువు గాని లేదు. ఇట్లుండ నాతో సమా నుఁ డయినకుమారుని గోరినవరము మిక్కిలి దుర్లభమయినది. సత్యవాక్కు లయిసమీరట్టివర మడుగుట మిక్కిలియబ్బురము గొలుపుచున్నది. అయినను దపోవిద్యలచే దేదీప్యమాను లయిన బ్రాహ్మణులు నాముఖమే. నాకు ముఖమై వర్తించు బ్రాహ్మణుల వచన మెప్పుడును వ్యర్థము కాఁగూడదు. కావున నేనే నాయంశ ముచే నాభిభార్య యగుమేరుదేవియం దవతరించెదను. ఈవచ నము మేరుదేవి వినుచుండఁగాఁదత్పతి యగునాభితోను ఋత్వి క్కులతోను జెప్పి యంతర్ధానము చెందెను. ఓపరీక్షిద్రాజా! య జ్ఞమందు భగవంతుఁ డిట్లనుగ్రహించి నాభి కిచ్చిన వరంబును నెఱవేర్పఁ దలంచి, సత్వప్రధాన మగుతను వవలంబించి దిగంబ రులును, జ్ఞానవంతులును, బ్రహ్మచారులును నగువారికి సమస్త ధర్మంబులను జూపనెంచి మేరుదేవియందంశముచే నవతరించెను.

ఇది మూఁడవయధ్యాయము.

అట్లవతరించి యుత్పత్తిచేతనే భగవల్లక్షణంబులను విశదీకరించుచున్న యాప్రభావము సర్వసమత్వముచేతను, బాహ్యేంద్రియనిగ్రహముచేతను, వైరాగ్యముచేతను, సర్వభూతనియంతృత్వముచేతను, మహాసంపదలచేతను, బ్రతిదినము వర్ధిల్లుచుండఁగాఁ జూచి మంత్రులును, బ్రజలును, బ్రాహ్మణులును, నాబాలుని భూపాలనమందు నియమింపఁ దలంచుకొనిరి. అనంతరము నాభి తన కుదయించిన పుత్త్రునకు సత్త్వప్రధాన మగు దేహంబును, విపుల మగుగుణప్రఖ్యాతియు, నింద్రియబలంబును, దేహబలంబును, సంపదయు, కీర్తియును, శత్రుతిరస్కారసమర్థ మగువీర్యంబును, శౌర్యంబును లభించుటచే నతనికి ఋషభుఁ డనెడి నామధేయ మొసంగెను. ఆఋషభునిప్రభావముదురూహ్యమైనది. అతని రాజ్యముపైఁ గోపము వహించి దేవేంద్రుఁడు వర్షముఁగురియింపకుండఁగా నది చూచి భగవంతుఁ డగుఋషభ దేవుఁడు తనవిచిత్రశక్తిచేతను వర్షముఁగురియించి యింద్రునిగర్వపరిహారము గావించి తనరాజ్యమున కజనాభ మనునామము గల్గించెను. అధికప్రభావసంయుతుఁడును, స్వేచ్ఛచే మనుష్యాకారమును ధరించి, షాడ్గుణ్యపూర్ణుఁ డయ్యుఁ దనకుఁ గుమారుఁడై యానందము గొలుపువాఁడు నగునాబాలునిఁ జూచి నాభి తాదృశపుత్త్రునిఁ బడసినందుకమందానందము నొంది, దానివలన వివశుండై భగవన్మాయచేఁ దనపుత్త్రుఁ డనునమ్మకముతోఁ, మధురములును, గద్గదములును నగువాక్కులను బలికి కుమారుని లాలనచేయుచు, మిక్కిలిసుఖ మనుభవించెను. అనంతరము నాభి, పౌరులును, నమాత్యాదులును, దేశవాసులును దనకుమారు నధికానురాగముతోఁ జూచుచుంటఁ గని మిక్కిలి సంతసించి వర్ణాశ్రమమర్యాదలను

రక్షింప నియోగించి, రాజ్యాభిషేకము చేసి బ్రాహ్మణులతోడ లవై నాభాలకు నుంచి మేరుదేవీసహితుండై విశాల మగుబదరికా వనంబున కేఁగి పరులకు భయంకరము కాక యంతరాయము లను బొందక యుండుసమాధిచేతను, సాంగమగుభక్తియోగము చేతను, నరనారాయణస్వరూపుం డైనవాసుదేవు నారాధించి ప్రారబ్ధావసానమున గుణాష్టకరూప మగుముక్తినిఁ జెందెను. ఓపరీక్షిద్రాజా! ఆనాభినిఁగూర్చి కొందఱార్యు లిట్లు చెప్పుచు న్నారు. ఆనాభిపరిశుద్ధకర్మమునకు భగవంతుఁడు సంతసించి కుమారుం డై యుదయించెను. అట్టినాభిప్రసిద్ధకర్మముల నెవఁ డాచరింపఁగలఁడు? ఆనాభి నిజార్జితధనంబులచేఁ బూజితు లైన బ్రాహ్మణులమంత్రబలమునఁ దనయాగమందు భగవంతుని సా క్షాత్కరించుకొనఁగల్గె. అయారే! ఆనాభికంటె నన్యుం డగు బ్రహ్మణ్యుం డెవండుగలఁడు? అనంతరము ఋషభుండు తనభూ ఖండము స్వర్గాపవర్గముల సాధించుకర్మములకుఁ బాత్ర మైన దని తలంచుచు, లోకవిడంబనార్థము గురుకులవాసము చేసి వారియనుమతిఁ బొప్పున గృహాశ్రమధర్మములను శాసింపనూను కొని, విహితము లై, శ్రౌతస్మార్తరూపము లైనప్రవృత్తినిమిత్త కర్మములను, నివృత్తిలక్షణకర్మములను శ్రద్ధతో నాచరించుచు నింద్రుఁ డొసంగినజయంతి యనుకన్యకను బరిణయమాడి యా మెయందు నూర్వురఁ బుత్రులను బడసెను. ఆనూర్వురలోను జ్యేష్ఠపుత్రుఁ డగుభరతుండు గుణగణములచేఁ బ్రఖ్యాతి గాం చెను. ఆభరతునివలననే యీయజనాభమునకు భరతవర్షమను నామము కలిగినది. ఆనూర్వురలో నొక్కొక్క పుత్రదశకమున కొక్కొక్కఁడు ప్రధానుఁ డయ్యె. భరతుఁడు మొదటిదశకము

నకు బ్రధానుఁ డయ్యె. తక్కిన తొంబదితొమ్మిదిదశకములకుఁ గ్రమముగాఁ గుశావర్తుఁడు, ఇలావర్తుఁడు, బ్రహ్మావర్తుఁడు, ఆర్యావర్తుఁడు, మలయకేతువు, భద్రసేనుఁడు, ఇంద్రస్పృక్కు, విదర్భుఁడు, కీకటుఁడు, ననువారలు ప్రధానులు. ఆపుత్రశతకములోఁ గవియు, హరియు, నంతరిక్షుఁడును, బ్రబుద్ధుఁడును, బిప్పలాయనుఁడును, నావిర్హోత్రుఁడును, ద్రమిళుఁడును, జమసుఁడును, కరభాజనుఁడును ననుతొమ్మండ్రుగురును, భాగవతధర్మములను బ్రకటించెడిమహాభాగవతులైరి. అమహాత్ములచరిత్రము భగవన్మహిమచే వర్ధితమై, చిత్తశాంతికి హేతువై యున్నది. ఆదానిని ముందు వచ్చెడివసుదేవనారదసంవాదమునందుఁ దెలిపెదను. తక్కిన యెనుబదియొక్కరును, జనకాజ్ఞను మన్నించి గృహస్థాశ్రమ మవలంబించి సకలసంపదలతోఁ దులదూఁగుచు సాంగము లగువేదములను నధ్యయనంబు చేసి యాగముల నొనరించుచు సదాచారముచే బ్రాహ్మణులైరి. అనంతరము ఋషభుఁ డనుపేరు గలభగవంతుఁడు స్వతంత్రుఁడై, కర్మవశ్యుండు కాక కర్మవశమువలన సంభవించుసుఖదుఃఖాదిపరంపరను దొలంగించుకొని కేవలానందస్వరూపుఁడై యుండెను. తా నీశ్వరుఁ డయ్యునుఁ బ్రాకృతపురుషునివలెఁ గర్మము లాచరించుచు గాలవశమున నశించుచున్నధర్మముల నాచరణముచే మగుడ స్థాపించుచు నుండెను. అతఁడు సర్వభూతములందును సమత్వము గలిగి, రాగాదులచేఁ గలుషితచిత్తుండు కాక భూతమైత్రితో వర్ధిల్లుచుఁ బరదుఃఖంబులను సైఁపలేనంతజాలిగుండె గలవాఁడై, లోకమును గృహస్థాశ్రమమందు నియమించుచుండెను. శ్రేష్ఠుఁడైనయామహాత్ముని ననుసరించి సమస్తలోకులును

వర్తించిరి. మఱియు నాఋషభుఁడు సమస్తధర్మంబులును గల్గిన వేదరహస్యములను జక్కఁగా నెఱిఁగియున్నను, బ్రాహ్మణోత్తముల నడిగి వారు చూపుమార్గమున గుణముగా సామాద్యుపాయముల నవలంబించి ప్రజలను ధర్మయుక్తముగా శాసించుచుండెను. పుత్త్రవంతుఁడైనయాఋషభుఁడు వసంతకాలములందు సమభూములందు, సకలద్రవ్యములతో నొప్పునట్లు ఋత్విక్కులతోఁ గూడికొని యథావిధిగా నూఱుయాగముల నాచరించెను. భగవంతుఁడగుఋషభునిచేఁ బాలిత మగుభారతవర్షమందుఁ బ్రతిపురుషుఁడు రాజభక్తిని దక్క వేఱొక్కపురుషార్థమును బరులవలనఁ గోరికొనలేదు. ఆఋషభుఁడొకానొకప్పుడు భూమియందుఁ జరించుచు, బ్రహ్మావర్తమును బొంది బ్రహ్మసభయందుఁ బ్రజ లందఱును వినుచుండఁగా వినయముచేతను, స్నేహముచేతను,సుఖముచేతను వశీకృతులై సావకాశచిత్తులైయున్నకుమారుల కిట్లు బోధించెను. ఇది నాల్గవయధ్యాయము.

---

ఓపుత్త్రకులారా! మానవలోకమందు సమస్తదేహధారులలోను నీమనుష్యదేహము మిక్కిలి కష్టములచే సంపాదితములగుశబ్దాదికామముల ననుభవింపఁదగదు. తాదృశకామభోగములు పురీషాదులను భక్షించుసూకరాదులకుఁ గూడ ననుభవార్హము లగుచున్నవి. మానవదేహము కేవలము కామాదుల ననుభవించుటకే యైనచోఁ దక్కినపశ్వాదులదేహమునకునుదీనికిని నేమితారతమ్యము కలదు? కావున దేనివలన మునీశ్వరులు సంసారమును దరించుచున్నారో, దేనివలన నపార మగుబ్రహ్మ

సుఖము కలుగుచున్నదో, విష్ణుదేవతారాధనరూప మగునట్టి తపంబు సేయుట మానవుల కుచితము. బంధమునకు భోగమే హేతువు. తాదృశభోగమునకు స్త్రీలు మూలకారణములు. అట్లె మోక్షమునకు భగవదుపాసనము హేతువు. ఆయుపాసనమునకు మహాత్ములసేవ ప్రధానభూత మైనది. వారు లోకంబునం దెక్కురు గలరు. ఆమహాత్ములు సమస్తము బ్రహ్మాత్మక మైనదని తలంచెడివా రగుటచే సుఖదుఃఖంబులు ప్రాప్తించునప్పుడు వికారము నొందనిచిత్తములు గలవారు. వారు బాహ్యేంద్రియములను నంతఃకరణంబును జయించియున్నారు. వారు సమానబుద్ధిచే నొప్పుచు, సర్వభూతములందును హితమును గోరుచుం బరోపకారపరాయణు లై యున్నారు. వారు దారసుతాదులతోను, మిత్రులతోను, ధనములతోను నిండి దేహధారణవార్తయే ప్రధానముగాం జూచుకొనుజనుల కునికిపట్టై, ప్రేమయేప్రయోజన మని యూహించువారలకుం దా వై యున్నగృహములం దెంతమాత్రంబును ప్రీతియుక్తులై యుండరు. వారు లోకమందు దేహపోషణముకంటె నధికస్పృహ లేనివారు. అట్టి మహాత్ముల సేవ తప్పకుండ భగవదుపాసనాసక్తులం గావించి ముక్తిం గలిగించును. లోకమునం బామరుఁడు దేహమే యాత్మ యనుకొని తద్వశుండై దీనుఁడై, యింద్రియప్రీతికై యేకర్మమును జేయుచున్నాఁడో యని యుక్తమైనది కాదు. ఆకర్మములవలననే యనిత్య మగునీశరీరము గల్గినది. కావున నస్థిరశరీరములకుం గారణ మగునింద్రియప్రీతకర్మము లొనరించుట యుచితమా? ఓపుత్రకులారా! ప్రకృతివిలక్షణ మైనయాత్మతత్త్వము తెలియనంత

కాలము నాత్మస్వరూపమునకుఁ దిరోధానము కలుగుచుండును. అది కలిగినతోడనే యింద్రియప్రీతికొఱకుఁ గ్రియాకలాప మొన రింపఁబడును. అట్లు కర్మకలాప మొనరించుటవలన మనస్సు జ్ఞానాసక్తము కాక కేవలమును గర్మాసక్త మగును. కర్మాసక్త మగుమనంబు చేతనే జీవునకు మఱుఁడ శరీరసంబంధము కలుగుచున్నది. కర్మవాసనామూల మగునవిద్యతో నాత్మసంసృష్టినిఁ బొందుటచే మనంబు పురుషునిఁ గర్మాసక్తునిఁగాఁ జేయుచున్నది. కావున వాసుదేవుఁడ నగునాయందు భక్తి యుత్పన్నము కానంతకాలము పురుషుఁడు దేహసంబంధము గలవాఁ డగుచున్నాఁడు. స్వాత్మపరమాత్మయాథాత్మ్యమందు, జాగరూకుఁడై శబ్దాదివిషయములం దింద్రియప్రవృత్తి దేహసంబంధమువలనఁ గలుగుచున్నదికాని యాత్మకు స్వాభావికమైనదికాదని వివేచనచేయుచు నెప్పుడు తెలిసికొనఁడో, యప్పుడే పురుషుఁడు స్వాత్మపరమాత్మతత్త్వమును మఱచి, జ్ఞానవిహీనుఁడై మైథునసుఖమే ప్రాధాన్యముగఁ గలగృహస్థాశ్రమమును బొంది యందుఁ దాపములను బొందుచున్నాఁడు. కావున నానుతులారా! అనాదియైనకర్మవాసనవలన నహంకారమమకారరూప మగునవిద్యయు, దానివలన దేహసంబంధంబును, దానివలన మఱుఁడఁ గర్మవాసనయు, దానివలనఁ దాపములును, నట్లు తాపానుభవమువలనఁ గర్మవినాశ మైనప్పటికిని నాకర్మవాసన నివృత్తికాదు. కాన వెండియు నవిద్యాసంబంధమును, దానివలన దేహసంబంధమును, నందువలనఁ దాపానుభవమును నిట్లనర్థపరంపర చక్రమువలెఁ బరిభ్రమించుచుండును. ఈయవిద్యాదులకుఁ గారణ మైనకర్మవాసన యెట్లు సంభవించుచున్న దని యందువేని చెప్పెద వినుఁడు.

పురుషుఁడు స్త్రీతో మిథునభావము నొందియుండును. ఆమిథునీ భావమును బ్రత్యేకముగా నా స్త్రీపురుషులహృదయగ్రంథినిగాఁ జెప్పుదురు. ముడివలెనే మనోగత మగుకర్మవాసన యభేద్య మైనది. కావుననే వానికి హృదయగ్రంథి యను పేరు తగియున్న ది. ఏహృదయగ్రంథివలన గృహము, కళత్రము, పుత్త్రులు, మిత్రులు, ధనములు, మొదలగువిషయములచే జనులకు నహంకారమమకారరూప మగుగొప్పమోహ ముదయించుచున్నదో, యాహృదయగ్రంథినే కర్మవాసనకుఁ గారణ మని చెప్పుదురు. సుతులారా! దృఢమై కర్మానుసరణముగా సంబంధము గలహృదయగ్రంథి యెప్పుడు విడివడునో యప్పుడు జనుఁ డీసంసారము వలన ముక్తుండై పుణ్యాపాపములను దొలంగించుకొని పరమపురుషునిఁ బొందుచున్నాఁడు. ఆహృదయగ్రంథి శిథిల మగుటకు సాధనంబులఁ జెప్పెదను; వినుఁడు. అవిద్యాదిదోషములు లేక హితోపదేష్టనై యున్ననాయందలిభక్తియు, నాసేవయందలి యాసక్తియు, శబ్దాదులం దాశ వదలుటయు, శీతోష్ణాదులను సహించుటయు, నిహపరలోకములందు జంతువులకు సంభవించు దుఃఖంబులను దెలిసికొనుటయు, జ్ఞానేచ్ఛయుఁ, దపంబును, వృథాకాంతను విడుచుటయు, భగవదారాధనరూపము లగు వర్ణాశ్రమోచితకర్మంబులును, భగవత్కథయు, భగవద్భక్తుల స్నేహంబును, భగవద్గుణకీర్తనమును, నిర్వైరంబును, సర్వసమత్వంబును, నుపశమంబును, దేహగేహము లాత్మీయము లను బుద్ధిని వదలుటయుఁ, బ్రకృతివిలక్షణ మగునాత్మతత్త్వమం దనుభవము గలిగియుండుటయుఁ, బరిశుద్ధమగునాహారమును దినుచుండుటయుఁ, బ్రాణంబును నింద్రియంబులను మనంబును జ

యించుటయు, సదుపాయములందలి శ్రద్ధయు, బ్రహ్మచర్యంబును, జేయఁదగినవాని విసర్జింప కుండుటయు, మౌనంబును, సర్వము బ్రహ్మాత్మక మని తెలిసికొనుజ్ఞానంబును, శాస్త్రంబున నుద్దీపితం బగుయోగమును, నీచెప్పినవి సాధనంబులు. పురుషుఁడు ధైర్య ప్రయత్నములు గలిగి వెనుకఁ జెప్పఁబడినసాధనకలాపముచే హృదయగ్రంథిని విప్పుకొనఁగలఁడు. పైని వర్ణింపబడినసాధనకలాపముచే వర్ధిల్లినభగవద్భక్తిచేతనే హృదయగ్రంథి విడివడి దాని వలన దేహసంబంధము తొలంగవలయును గాని వేఱొకదాని వలనఁ గాదు. ఓనుతులారా! అవిద్యవలనఁ గలుగుచున్నకర్మవాసనారూప మైనహృదయగ్రంథిబంధమును, నే వెనుక నుపదేశించినప్రకారము చేయఁబడినయోగముచేఁ బూర్తిగాఁ దొలంగించుకొని యనంతర మాయోగమునుండి విరమింపవలెను. మఱియు నాపురుషుఁడు నాసారూప్యమును గోరుచు నాయనుగ్రహమునే పురుషార్థమునుగాఁ దలంచుచుఁ దండ్రి కుమారునివలెను, గురువు శిష్యులనువలెను, రాజు ప్రజలనువలెను, ప్రేమయుక్తుఁ డై యుక్తయోగము నెఱుంగనివారి నిక్రమముగా ననుశాసింపవలయును. అనాది యగుపుణ్యాపుణ్యరూపకర్మములచే మూఢు లగువారిని గర్మములందు నియోగింపవలయును. జనులు శ్రేయ స్సెట్టిదియో, తత్సాధనంబు లెట్టివియో తెలిసికొనలేక యతిశయించినకోర్కులు కలవారై సంతతమును శబ్దాదివిషయములనే కోరుచుందురు. కావున వారు శబ్దాదివిషయముల సుఖలేశములఁ గల్గించుకర్మములవలనఁ బరస్పరవైరము వహించి తన్మూలమునఁ బారము లేనిదుఃఖంబు నొందియు శ్రేయంబును దెలిసికొనఁజాలరు. ఓకుమారులారా! ఇట్లజ్ఞానసముద్రమున

మునింగి కర్మమార్గమున వర్తించుచు, శ్రేయస్సెట్టిదియో యెఱుంగక వర్తించుచున్నవానిఁజూచి శ్రేయస్సునుదత్సాధనములను దెలిసికొన్నవాఁడై, కావుననే హేయమెద్దియో యుపాదేయమెద్దియో చక్కఁగ నెఱింగినవాఁడై మిత్రుఁడై యున్నయేపురుషుఁడైనను మగుడ వానిఁ గర్మమార్గమందుఁ బ్రవర్తింపఁజేయునా? మంచివారు దారిఁ దప్పిపోవుచున్న గ్రుడ్డివానిని యథార్థమార్గమందుఁ బ్రవేశింపఁజేయఁజూచుచుందురు కాని చెడుమార్గమందుఁబ్రవేశపెట్టఁదలంతురా? మఱియు యోగోపదేశము చేసి సంసారబద్ధుఁడగువానిని సంసారమునుండి యెవఁడువిడిపింపఁడో వాఁడు సంసారబద్ధునికి హితముపదేశించువాఁడైనను గురువు కాఁడు. వాఁడు తనవాఁడునుఁ గాఁడు. వాఁడు తండ్రియును గాఁడు. అట్లు చేయునిది తల్లియును గాదు. అది దైవమును గాదు. వాఁడధిపతియును గాఁడు. ఈనాశరీరము సత్త్వగుణప్రచురమైనది. కావునఁ దక్కిన రజస్తమఃప్రచురములైనశరీరములవలెఁ గాక నాయీశరీర మూహింపఁ దరముకానిది. మఱియు సత్వగుణము నాహృదయ మని తెలియుంగుఁడు. అది ప్రవృత్తిధర్మములను బ్రకాశింపనీయక భాగవతధర్మములనుమాత్రమే ప్రకాశింపఁజేయుచుండును. తాదృశసత్వగుణప్రచుర మగుశరీరము గలవాఁడ నగుటచేతనే పెద్దలు నన్ను శ్రేష్ఠునిఁగాఁ జెప్పుచుందురు. ఓతనయులారా! సత్వగుణప్రచుర మగుశరీరము గలనావలనఁ బుట్టినవా రగుటచే మీారందఱును సత్వగుణప్రచుర మగుశరీరము గలవారలే! కావున మీాకు సోదరుఁడును, మీాకుఁ బూజనీయుఁడును నగునీభరతుని నిష్కపటభావముచే సేవింపుఁడు. "నీకుమారుల మగుటచే నిన్నే సేవింతుము. రా

జపుత్త్రులఁగు కాన ప్రజలఁ బరిపాలించెద" మని యందు రేని వినుఁడు. నన్ను సేవించుటయును బ్రజాపాలనంబును, భరతుని సేవించుటవలననే గతార్థము లగును. ఇంతియకాక భాగవతుల నుగూడ సేవించుచుండుఁడు. భగవద్భక్తులు లోకమునఁ గల యందఱికంటెను శ్రేష్ఠు లని చెప్పవచ్చును. లతాదిస్థావరముల కంటె జంగమముల శ్రేష్ఠములు. వానిలో జ్ఞానసహితములగు పశ్వాదులు కీటాదులకంటె నుత్తమములు. వానికంటె మనుష్యు లుత్తములు. వారికంటెను బ్రమథులు, వారికంటె గంధర్వులు, వారికంటె సిద్ధులును, వారికంటెఁ గిన్నరాదులును వారికంటె ననుకులును, వారికంటె నింద్రాదిదేవతలును, వారికంటె దక్షాదులును శ్రేష్ఠులు. వారికంటె రుద్రుఁడు శ్రేష్ఠుండు. అతనికంటె బ్రహ్మ శ్రేష్ఠుఁడు. అతనికంటె నేను శ్రేష్ఠుఁడను. నాకంటెను బ్రాహ్మణులు శ్రేష్ఠులు. అనిఋషభు డుంకుమారుల తోఁ జెప్పి యచ్చట నున్నవిపులం గాంచి "ఓబ్రాహ్మణులారా! లోకమున విప్రులతో సమమైనవారినిఁ జూడను. సమానులనే చూడలేనప్పు డధికులను జూచుట యెట్లు? బ్రాహ్మణముఖమందు శ్రద్ధతో వేల్వఁబడినయన్నాదులను స్వేచ్ఛచే భుజియించిన ట్లగ్నియందు వేల్వఁబడినదానిఁ దనజాలను. మఱియుఁ జిరంతనము లైనవేదములు నాశరీరము. వేదాఖ్య మైననాశరీర మీలోకమ్మున బ్రాహ్మణులచే ధరింపఁబడుచున్నది. ఆబ్రాహ్మణులందు నిరతిశయపవిత్ర మగుసత్వగుణము ప్రతిష్ఠింపఁబడినది. వారియందు నంతరింద్రియనిగ్రహంబును బాహ్యేంద్రియనిగ్రహంబును, సత్యభాషిత్వంబును, భూతానుగ్రహంబును, కృచ్ఛ్రాదితపంబును, శీతోష్ణాదులను సహింప గలశక్తియుఁ, బరమాత్మ

త్త్వానుభవంబును బ్రతిష్ఠితము లైనవి. బ్రహ్మాదిదేవతలనుండి కాని, స్వర్గంబునకును నపవర్గంబునకు నధిపతి నగునావలననుండి కాని, యెవ్వరు పొందదగినవస్తువు లేనివారో, యట్టిబ్రాహ్మణులు నాయం దత్యంతభక్తి గలిగియున్నారు. వారి కైహికపురుషార్థంబులతో నేమి పని? ఓ తనయులారా! చరాచరములతోఁ గూడినప్రపంచ మంతయును నాకు శరీర మగుటచేఁ బ్రకృతికిని, జీవునకును, బరమేశ్వరునకును, భేదమును గనుఁగొన్న మీరు ప్రతిక్షణంబును భూతముల సమాదరించుచుండవలెను. అదియే నాకు ముఖ్య మైనయారాధనము. మనంబును, వాక్కును, నేత్రంబులును, దక్కినయింద్రియంబులును జేయుపనులకు ముఖ్యఫలము నాయారాధనమే. నాయారాధనము చేయకుండ నేపురుషుఁ డైనను గాలపాశరూప మగుమోహమునుండి విముక్తుండు కానేరఁడు." ఓ రాజా! ఋషభుం డిట్లు లోకమును జక్కగా ననుశాసించుటకుఁ దగినజ్ఞానమును దనకుమారులకుఁ గలిగించి మహానుభావుఁ డై, సర్వభూతములందు సమమగు హృదయంబు గలవాఁడై, యింద్రియనిగ్రహసమర్థులై, నివృత్తిప్రవృత్తి ధర్మములనుండి మఱలి మహర్షులై యున్నవారికి భక్తిని, జ్ఞానంబును. వైరాగ్యంబును,నుపదేశించుచుఁ,దననూర్వురుకుమారులలో జ్యేష్ఠుఁడును, బరమభాగవతోత్తముండును, భక్తజనులందుఁ బ్రేమ గలవాఁడును, నగుభరతుని భూపరిపాలనమందు నియోగించి పట్టాభిషేకముఁ జేసి,వస్త్రాభరణాదులనుఁదక్కిన దేహానుబంధములను వదలి, దిగంబరుఁ డై విడి వ్రేలాడుచున్న కేశపాశము గలిగి, యాత్మయం దాహవనీయాదు లగునగ్నుల నారోపణము చేసికొని సన్న్యాస మవలంబించి బ్రహ్మావర్తము

నుండి కదలిపోయెను. మార్గమధ్యమందు జనులు తన్నుమాటలా డించుచున్నను బలుకక, జడునివలెను, గ్రుడ్డివానివగిదిని, జెవిటి

**ఋషభుండు సన్న్యసించి నడవులకేగుట**

వానివలెను, మూఁగవానివలెను బిశాచగ్రస్తునిచందంబునను, నున్మత్తునిరీతిని వర్తించుచు, నవధూతవేషమున నొప్పుచు, మౌనవ్రత మవలంబించి మాట్లాడుట విడిచిపుచ్చెను. మఱియు నాఋషభుండు పోవుచున్నప్పుడు ప్రతిమార్గమందును, నగరంబులును, గ్రామములును, నాకరములును, కృషీవలాదులు నివసించుపల్లెలును, గిరాతాదులపల్లెలును, ఋష్యవాటికలును, సేనానివాసస్థలంబులును, గోశాలలును, గొల్లపల్లెలును, యాత్రార్థ మరుగుచున్న జనసంఘంబులును, బర్వతంబులును, వనంబులును, మున్యాశ్రమంబులును, దాఁసించుచుండె. అయిన నతఁడు వానిం బడి పోవునప్పు డాతనివికృతవేషముం జూచి తుంటరిబాలకులు భయపఱుచుచున్నను, గొట్టుచున్నను, మీఁద మూత్రమును విడిచి యుమియుచున్నను, ఱాలు రువ్వుచున్నను, మలమును విసర్జించుచున్నను, ధూళిఁ జల్లుచున్నను, దుర్గంధవాయువులను వదలుచున్నను, నోటికి వచ్చినట్లెల్ల వదరుచున్నను, మనపుటేనుఁగును మూఁగుచున్న యీఁగలవలె సరకుగొనక పరిభ్రమించుచుండెను. ఇంతియ కాక యాతఁడు ప్రకృతిపరిణామరూప మై, దేహమే యాత్మ యనుభ్రాంతి గలవారి కాత్మతత్త్వ మనుటలో విషయ మగు శరీరమందు దదనుబంధులందును, స్వాత్మపరమాత్మతత్త్వమువలనఁ గల్గిన స్వస్వరూపజ్ఞానము గలవాఁ డగుటచే నహంకార మమకారంబులను విసర్జించి బ్రహ్మసాక్షాత్కారమువలన నంతటను సమబుద్ధి గలిగి,

యసహాయుఁడై క్రుమ్మరుచుండెను. ఓ పరీక్షిన్నరేంద్రా! ఆఋషభుని చేతులును, పాదములును, విశాల మగు వక్షఃస్థలంబును, దీర్ఘము లయిన బాహువులును, బలిసినభుజశిరస్సులును, గళంబును, వదనంబును, దక్కుఁ గలయవయవంబులును, మిక్కిలిసుకుమారములై, సౌష్ఠవము కలవై యుండెను. కావుననే యతఁడు స్వభావముచేతనే మిక్కిలి సుందరుండై యుండెను. అతనిముఖము సర్వకాలములందును స్వభావసిద్ధ మగు మందహాసముచే సుందరమై యుండెను. అతనికనీనికలు తాపహారకములై మనోహారములై యుండెను. అతని నేత్రము లరుణకాంతి కల్గి యభినవపద్మములను బురుడించుచుండె. అతనికపోలాదులు శోభాస్పదములై యుండెను. అతండు చిఱునవ్వు గలవదనచంద్రుని విలాసములచేఁ బురస్త్రీలకు డెందములందు మోహము నుదయింపఁజేయుచుండెను. అతని కేశకలాపము వక్రమై, పచ్చసిరంగు గలదై జటలు గట్టి జానువులఱకు వ్రేలాడుచుండెను. అవధూత వేషము గలదగుటచే మలిన మైనతనశరీరము చేత నాతఁడు చూపఱకుఁ బిశాచగ్రస్తునివలెఁ గానవచ్చుచుండెను. భగవంతుఁ డగునాఋషభుఁడు జనులు యోగమునకుఁ బ్రత్యూహవినోధులైనట్టును, వారికిఁ బ్రతీకార మొనర్చుట నింద్యకార్యమయినట్టును, దెలిసికొనినప్పుడు దేశాటనమును విడిచి యొక్క చో నుండియే ప్రారబ్ధము ననుభవింప నిశ్చయించికొని, శయనించియె తినుచుఁ గ్రోలుచు నములుచు మూత్రమును బురీషంబును విడుచుచు, నామూత్రపురీషములందె మునుఁగుటచేఁ దన్మిళిత మైనదేహము కలవాఁడై యుండెను. అట్లతని దేహము మూత్రపురీషములలోఁ బడియున్న దుర్వాసన కలదై దగ్గఱు

వారికి రోఁత పుట్టింపలేదు. యోగప్రభావమువలన నతనిపురీ షము మిక్కిలి పరిమళము కలదై దశయోజనంబులపర్యంతం బును వ్యాపించుచుండెను. ఇట్లతఁడు గోమృగాదులవృత్తి నవ లంబించి నడుచుచు, నిలుచుచు, నుపవిష్టుం డగుచు శయనిం చుచునే త్రాగుచుండెను. మూత్రపురీషాదులను విడుచుచుండె ను. యోగీశ్వరు లిట్లాచరింపవలయు నని లోకమునకుఁ దెలుపు నిమిత్తము నానావిధము లగుయోగవ్రతముల నాచరించుచు, మోక్షాధిపతియును, భగవంతుఁడును, నగు నాఋషభుండు, తెంపు లేనిపరమానందము ననుభవించుచు నబ్రహ్మాత్మక మగు స్వతంత్రవస్తుభేదము లేదనెడిజ్ఞానము కొంచెమైనను లేనివాఁ డగుటచేఁ దనయందును నిఖిలభూతంబులకును శరీరభూతుఁడగు వాసుదేవునియందును,రవంతైనను భేదంబు గానక యందువలన సమస్తార్థసిద్ధులను బొంది, కావుననే యాకాశగమనము, మనో జవము, దిరోధానము. పరకాయప్రవేశము, దూరస్థము లగు వస్తువుల గ్రహించుటయు, దూరస్థము లగుశబ్దములను వినుట యు, మొదలగు యోగసిద్ధిఫలములు గలవాఁడై వర్తించియు మనస్సంతుష్టినిఁ జెందలేదు. ఇది యైదవయధ్యాయము.



అని చెప్పు చున్నశుకయోగిపలుకులు విని రాజిట్లనియె. ఓమునీంద్రా! ఆత్మారాము లగుయోగులు యోగాగ్నిచే సమస్త కర్మబీజంబులను దొలంగించుకొందురు.కర్మబీజములు పూర్తిగ నశించుటచే వారొకవేళ యోగసిద్ధుల నవలంబించి వర్తించినను సంసారము లభింపదు. కర్మవాసనలు లేనప్పుడు కష్టము లనుభ

వించు టెట్లు? ఇట్లుండ నాఋషభుండు యోగసిద్ధిఫలము లగు నాకాశగమనాదులవలన నేల సంతుష్టినిఁ జెందలేదు? అందులకుఁ గారణము వచింపుము" నావుడు శుకయోగీంద్రుం డిట్లనియె. ఓరాజేంద్రా! నీ వడిగినప్రశ్నము యుక్తముగా నున్నది. లోకమునలోఁ గిరాతుఁడు మృగము తనకు వశ మగునంతపర్యంతమును, మృగమున కధీనుఁడైన ట్లుండి,వంచించి వానినిఁ జంపుచున్నాఁడు. అట్లె మనస్సును మొదట వశమైనట్లు గానవచ్చుచున్నను, జితమనస్కులైన నొకవేళ భోగాసక్తిచే మనంబునకుఁ బరవశులైనచో, నది వారిని స్వాధీనులనుగాఁ జేసికొని సంసారమును గల్గింపక మానదు. ఆహేతువుచే నాత్మారాము లతిచంచలం బగుమనంబు నెంతమాత్రమును నమ్మఁజాలరు. కావున ఋషభుండు యోగప్రభావమువలనఁ గలిగినసిద్ధులకు సంతసింపలేదు. ఈయర్థమునే కొందఱుమహాత్ములు "మనస్సును విశ్వసించి ప్రవర్తించినచోఁ జిరకాలముకష్టపడి సంపాదించుకొన్నజ్ఞానమయం బగుతపంబు నశించును. గావునఁ జంచలమనంబునం దెట్టిజితేంద్రియుఁడైనను,మనంబు వశమైన దనుబుద్ధి నుంచుకొనరాదు" అని నిర్వచించి యున్నారు. ఓరాజా! మనంబు నందు విశ్వాస ముంచినయోగి వెంటనే కామమునకు యోగమూల మగునైశ్వర్యమును బుద్ధిహీనతచే సమకూర్చుచుండును. అట్లు కామమున కవకాశము చిక్కిన వెంటనే కామము ననుసరించియే క్రోధాదిశత్రువు లుదయ మందును. కృతవిశ్వాసము గలయోగిమనం బాక్రోధాదులకుఁ గూడఁ దగిన యవకాశ మిచ్చి జారకాంత జారపతి కవకాశమిచ్చి, తన్ను విశ్వసించియున్నను భర్తను జంపినచందంబున నాయోగిని సంసారమందుఁ బడవైచి మృత

తుల్యునిఁ జేయును. కామము, క్రోధము, మదము, లోభము, శోకము, భయము మొదలగునవి యంతశ్శత్రువులు. వాని కవకాశ మీరాదు. యోగమూలము లగునైశ్వర్యముల ననుభవింపవలె నన్న యాసక్తివలననే కర్మబంధము సంభవించుచుండును. కర్మబంధంబును గల్గించునాయైశ్వర్యమును గామాదిమూలము గా నజ్ఞుఁడు స్వీకరింపవలెను, గాని పండితుఁ డెవండైన నంగీకరించునా? అందువలన ఋషభుం డాయోగైశ్వర్యము నంగీకరింపలేదు. సమస్తలోకంబులకును నలంకారభూతుఁ డగునాఋషభుండు విలక్షణములచే జడునివలెఁగానవచ్చుచు,నవధూతలక్షణములచేఁ దనయం దున్నభగవత్ప్రభావమును గప్పి పుచ్చుచు, యోగీశ్వరులకు దేహత్యాగక్రమమును నేర్పుచు, దనశరీరమును విసర్జింపఁ దలంపు గలవాఁడై, యజ్ఞానతిరోహితుఁ డగు ప్రత్యగాత్మను బరమాత్మకు శరీరభూత మయియున్నట్లు సాక్షాత్కరించుకొని ప్రారబ్ధము నశించుటచే దేహమును విడిచిపుచ్చెను. ఓరాజా! ఆఋషభుఁ డెచ్చట నేవిధంబున దేహమును విసర్జించెనో చెప్పెదను వినుము. ఆఋషభుఁ డిట్లు శరీరాభిమానమును విడచినను యోగమాయావాసనవలన దేహాభిమాన మున్నట్లు తోఁపింపఁజేయుచు,నీభూమండలంబున సంచార మొనరింపఁ దలంచికొని, యొకప్పుడు కొంకణము, వంకపటము, కుటకము,నాఁబడు దక్షిణకర్ణాటదేశమునకు స్వేచ్ఛచేఁ బోయి, కుటకాచలమునకు సమీపమునకున్న యుపవనములందు నివసించి నోటిలో నొకఱాయి యుంచుకొని, కేశకలాపము విడి జీరాడుచుండఁగా, దిగంబరుఁడై సంచరించుచుండ, సమీరకంపితము లగుబొంగు వెదుళ్లవలన నుదయించినదావాగ్ని యావనంబును ఋషభుని

దేహముతోఁ గూడ దహించెను. చతురాశ్రమాతీత మగు నాఋషభుని చరిత్రము విని కోరక వంకపటదేశముల కధిపతి యగునర్హతుఁ డను రాజు ఋషభుండాచరించినవ్రతములు శాస్త్రవిహితము లని తలంచుచు, వైదికధర్మముల నతిక్రమింప నిశ్చయించి, యన్నివిధములచేతను భయరహిత మగుస్వధర్మమును విసర్జించి తాను స్వయముగ ఋషభుఁ డాచరించిన యాచారములను నాచరించి లోకుల కుపదేశింపఁగలఁడు. 'అతని ప్రేరణముచే జనంబు లట్లు ప్రవర్తింతురా?' అనుసందేహము వలదు. కలియుగమునం దధర్మము వృద్ధిపొందును గాన జనంబులు నిజపాపకర్మమూలక మగునజ్ఞానముచే యుక్తములు కానిపాషండవ్రతముల నాచరింపక మానరు ఓరాజా! మునుమున్న నిక్కృష్టులైనమానవులు దైవమాయచే మోహితులైరి. ఆమీఁద నార్హతునిబోధమువలన మఱింత మోహితులై తమతమవర్ణాశ్రమముల కనుకూల మగుధర్మవిధివలనఁ బ్రాప్త మయిననియమమును, శౌచమును సంధ్యోపాసనాదులను, విడనాడి, దేవహేళనాదిరూపము లగుకుత్సితవ్రతములనాచరించుచు, నధర్మప్రచురమైనకలివలన సమస్తవివేకంబును నశించుటచే స్నానాదులనాచరింపక, యాచమనం బొనరింపక, శౌచవంతులై యుండక, క్షౌరాదికముఁ జేయింపక వేదములనుఁ బరమపురుషుని భక్తజనులను మిక్కిలి నిందించుచుఁ బ్రవర్తింతురు. వేదోక్తము కాకపోవుటచే నిర్మూలమైనయార్హతస్మృతిచే బోధితము లగు నుపధర్మములందు నమ్మకము గల్గి వర్తించుచున్నవారు తుదను నంధతమస మనునరకకూపమునకుఁ బోదురు. ఓయీ! భగవదవతార మగుఋషభుం డిట్లొనరింప వలసినయవసర మేమి?

లోకము నిట్లు మోహింపఁజేయుట తగునా?" యని యందువేని చెప్పెదను వినుము. ఓరాజా! రజఃప్రచురులైనవారికి యోగచర్యావిశేష మగు మోక్షమార్గమును బోధించుటకే యాయవతారము స్వీకరించెను. అందుచే నతఁ డట్లొనరించెను. ఆతని గుణప్రభావమును దెలుపుకొన్ని శ్లోకంబులు గలవు వానియర్థము నీకు వినిపించెదను; సావకాశచిత్తుండ వై వినుము. "అయారే! భూమి సప్తసముద్రములతోఁ గూడియున్నది. అది యేడుద్వీపములుగా విభక్త మైనది. ఆద్వీపము లన్నింటిలోను,జంబూద్వీప ముత్తమ మయినది. దానియందున్ననవవర్షములలోను, భారత వర్షము పుణ్యప్రద మైనది సంతత మందలిజనులు వానుదేవుని యవతార మగుఋషభుని మంగళదాయకము లగుయుక్తకర్మములను గానముచేయుచుండ నాభారతవర్ష మేల పుణ్యప్రదము కాదు? దేనియందుఁ బురాణపురుషుఁ డగునారాయణుఁడు ఋషభుం డవతరించెనో, యాప్రియవ్రతవంశము లోకమున విమల కీర్తిసంపన్న మై యొప్పుచున్నది. ఆఋషభుఁ డాదిపురుషుఁడే. అతఁడు మోక్షహేతుకము లగుధర్మముల నడపెను. అతఁడు యోగప్రభావజన్యము లగునాకాశగమనాదిశక్తులు తమంతఁ దామే సేవింపవచ్చుచున్నను, నవి యనిత్యములని తిరస్కరించె. అట్టి శక్తుల నత్యాదరముతో నపేక్షించుయోగు లాఋషభుని నియమమును మనంబుచేతనైన ననుసరింప సమర్థు లెట్లు లగుదురు?" అని యివ్విధంబున లోకులందఱును నాఋషభునిఁగొనియాడు చుండుదురు. ఓనరేంద్రా! సమస్తవేదములకును, లోకములకును, దేవతలకును, బ్రాహ్మణులకును, గోవులకును, గురువయినఋషభునిచరిత్రము పవిత్రమైనది. ఇది సమస్తదుశ్చరి

త్రంబులను నశింపఁజేయును. ఇది యుత్కృష్టమంగళములకుఁ బ్రధానస్థానము. క్రమముగా వర్ధిల్లెడుశ్రద్ధచే సంతతమేపురుషుఁ డీ చరితమును వినుచున్నాఁడో యెవండు దీనిని వినిపించుచు న్నాఁడో, యాయిరువురికిని భగవంతుఁ డగువాసుదేవునియం దవ్యభిచరితము కానిభక్తి యుద్భవించుచున్నది. ఆభక్తివలన సమస్తమును సాధింపఁబడుచున్నది.ఆభగవద్భక్తి పరమాత్మాను భవ మనెడిసుధారసమునకు నిలయ మైనది. విద్వాంసు లాభక్తి సుధాపయోనిధియందు సంసారతాపమువలనఁ దపింపఁబడిన యాత్మలను సంతతమును దడిపి యాతాపములఁ దొలంగించి కొని తజ్జనిత మగునిరతిశయానందము నంది, పరమపురుషార్థ రూప మగుమోక్షఫలమును సైతమును మిక్కిలి యాదరింపరు. వారు భక్తివలననే సమస్తపురుషార్థములను బొందుచున్నారు. ఓరాజా! తాదృశభక్తిని మించినవస్తువు వేఱొకటి లోకమందు లేదు సుమీ ? ఇట్లు భక్తివలన సర్వార్థములును లభించుచు న్నవి. కాని యాభక్తిమాత్రము సులభసాధ్యము గాదు. ఓ రాజా! నీతాత లగుపాండవులకును,యాదవులకును, శ్రీకృష్ణుఁడు దైవమై, ప్రియుఁడై, పాలకుఁడై, హితోపదేష్ట యై వర్తించు చుండెనుగదా? పెక్కేల? పాండవులకుఁ గింకరుఁడై దూత్యాది కార్యంబులు సైతమత్యాదరంబున నొనర్చెఁగదా! అట్లు శ్రీ కృష్ణుఁడు వశంవదుఁ డైనట్లు వర్తించినను, బాండవాదులకును నిత్యము సేవించుతక్కినవారికిని ముక్తియోగమునొసంగెనుగాని భక్తియోగము నొసంగలేదు. దీనివలన ముక్తికంటెను భక్తి యోగము దుర్లభ మైనట్లు స్పష్ట మగుచున్నదికదా ! సర్వకాల ములం దనుభూత మగుస్వస్వరూపము లభించుటచే నితరపురు

ష్ఠాగములం దాశ లేనివాఁడై పాపకర్మాచరణముచే శ్రేయస్సు నందు, బ్రవేశింపనిబుద్ధి గలదీనులను గనికరించి సంసారభయ నివర్తక మగుస్వరూపజ్ఞాన ముపదేశించినవాఁ డెవండో యట్టి ఋషభునకు నమస్కారములు. ఇది యాఱవయధ్యాయము.

---

" ఓరాజా ! పరమపవిత్ర మగుఋషభచరిత్రమును సాంత ముగాఁ జెప్పితిని. ఇఁక నతనిపుత్త్రుం డగుభరతునివృత్తాంత మును జెప్పెదను వినుము. ఆభరతుఁడు భాగవతోత్తముఁడు. భగవంతుఁ డగుఋషభునిచే నతఁ డవనీతలపరిపాలనార్థము ని యుక్తుఁ డై, జనకాజ్ఞను దలధరించి భూతలమును బాలించుచు విశ్వరూపునికుమారిక యగుపంచజనిని బెండ్లియాడెను. అనం

భరతోపాఖ్యానము.

తర మాభరతుఁ డామెయందు దామసాహంకారము శబ్దస్ప ర్శాదులనుంబోలె సర్వవిధంబులచేతను, దనకుఁ దుల్యు లయి సౌందర్యవంతు లైనయైదుగురఁ బుత్త్రులను బడసెను. వారు,సు మతి, రాష్ట్రభృతుఁడు,సుదర్శనుఁడు, ఆవరణుఁడు,ధూమ్రకేతు వనునామములు గలవారు. ఓరాజా! భరతుఁ డీవర్షమును బా లించుటచేత నే చుమీ దీనికి భారతవర్ష మనుపేరు లభించినది! సమస్తవిషయములను దెలిసినయాభరతుండు తాను దనధర్మము ననువర్తించుచుఁ బ్రజలను దత్తద్వర్ణోచితధర్మములందు నియో గించుచుఁ దండ్రివలెను, దాత యగునాభివలెను, బ్రజానురంజక ముగాఁ బుడమిఁ బరిపాలించెను. అనంతర మతఁడు దేవపూజా రూపము లగుయజ్ఞములను, దేవతలకు ద్రవ్యత్యాగరూపము

లగుక్రతువులను బెక్కింటి నొనర్చి పరమపురుషు నారాధించెను. మఱియు నతఁడు ప్రకృతు లనఁబడునాగ్నేయేష్టులను వికృతులు నాఁబడుసౌర్యేష్టులను, శ్రద్ధాళువై యొనరించి, భగవదనుగ్రహమును సంపాదించెను. ఆభరతుఁడు, లోపింపనియజ్ఞసాధనములును, క్రియాకలాపములును, గలిగి నానావిధములుగాఁ బ్రవృత్తము లగుయాగాదులందుఁ జాతుర్హోత్ర మనఁబడుకర్మకలాపము తత్తదనుగుణముగాఁ బ్రవర్తించునట్లు చేసి యాగాదిసాధ్య మగుఫలమును యజ్ఞపురుషుఁ డగుపరమపురుషునకు సమర్పించి, యా యామంత్రము లాయా దేవతలనామములచే నొప్పుచున్నను నవి యన్నియు నాయింద్రాదుల కంతరాత్మ యగు వాసుదేవునియందే పర్యవసన్నము లగుటచే నాయామంత్రములు వాసుదేవమంత్రములుగాను, భావించుచుఁ దన చాతుర్యముచే సమస్తకర్మవాసనలను దొలంగించుకొని, యధ్వర్యులు హోమద్రవ్యములఁ గొని యింద్రాదుల నుద్దేశించి వేల్చుచుండ నాయింద్రాదులను బరమపురుషుని యవయవములుగా ధ్యానించుచుండెను. ఇట్లు భరతుఁడు భగవదారాధనరూప మగు కర్మకలాపము నొనరించుచు, నందువలన నిర్మలాంతఃకరణుఁ డయ్యెను. అంత నాభరతునకు హృదయాంతర్వర్తి యగుజీవుఁడు శరీరముగాఁ గలవాఁడును, భగవంతుఁడును, సర్వమునకంతరాత్ముఁడై వెలయుచున్నవాఁడును, మహాపురుషాకారము గలవాఁడును, శ్రీవత్సము, కౌస్తుభము, వనమాల, శంఖము, చక్రము, మొదలగువానిచేఁ బ్రకాశితుండును, నగుపరబ్రహ్మమును దన నిర్మలహృదయమందుఁ బ్రకాశించుచుండ నతనియందు సునిశ్చలమై, దినదినాభివృద్ధి గలుగుభక్తి యుదయించెను. ఇట్లు భర

తుండు పదివేలసంవత్సరములపర్యంతమును సత్కర్మము లాచరించి, తాను రాజ్యభోగాదు లనుభవింపవలసినసమయ మతిక్రమించె నని నిశ్చయించి వంశపారంపర్యముగ లభించి తనచే ననుభూత మగుధనంబును బుత్త్రులకు యథాక్రమముగఁ బంచియిచ్చి, సకలసంపదలకును మూలభూత మగుతనమందిరంబును విడిచి పులహమహర్షి కాశ్రమ మగుసాలగ్రామక్షేత్రంబున కరిగెను. ఓరాజా! ఆపులహాశ్రమము మిక్కిలి పవిత్రమైనది. అందు నివసించి యున్నభక్తజనుల కిప్పుడును భగవంతుఁ డగువాసుదేవుండు స్వేచ్ఛారూపమును ధరించి ప్రత్యక్ష మగుచుండును. అందుఁ జక్రనది యనుతరంగిణి ప్రవహించి సమస్తప్రదేశములను బవిత్రీకరించుచున్నది. భరతుఁ డాయాశ్రమమును బొందియసహాయుఁ డై, వివిధము లగుకుసుమములచేతను, చిగుళ్లచేతను, దులసీదళములచేతను, జలముచేతను, కందమూలాదినైవేద్యములచేతను, భగవదారాధన మొనర్చుచు, విశుద్ధ మగునాహారమునుఁ గొనుచు, విషయాభిలాషనుండి మరలి, యింద్రియనిగ్రహము గలిగి, ప్రీతిరూప మగుభగవద్భక్తిని బొందెను. ఇట్లు క్రమంబుగా నభివర్ధిల్లిన పరమపురుషపరిచర్యచే నాభరతునకు నిరతిశయకీర్తి యగుభగవంతునియందు మిక్కిలి యనురాగ ముద్భవిల్లెను. ఆయనురాగాతిశయముచే నతనిహృదయము ద్రవింపఁజొచ్చెను. ఆనందాతిశయముచే నతనిదేహమందుఁబులకాంకురంబులుప్పతిల్లెను. ఉత్కంఠాతిశయమువలనఁ గల్గినయానందబాష్పములచే నేత్రంబులు నిరుద్ధంబు లయ్యె. ఇట్లు భరతుఁడు నిరతిశయప్రీతివిషయుఁ డగుభగవంతునియరుణము లగుచరణారవిందములనవరతమును ధ్యానించుటచేవర్ధిల్లినభక్తియో

గానంద మనెడి లోఁతగుహ్రదమం దతనిబుద్ధి నిమగ్నమై యుండు టచే నతఁడు తా నొనరించుచున్న భగవత్పూజను మనంబులో స్మరించుకొనలేదు. ఆభరతుఁ డట్లు భగవద్వ్రతములను జేయుచు లేడిచర్మమునే వస్త్రముగా ధరించి, ప్రతిదినంబును త్రికాలము లందును స్నానంబు లాడుటచే నార్ద్రములై, గోరోచనవర్ణమున నొప్పుకుటిలము లగు కేశకలాపముచేఁ బ్రకాశించుచు సూర్యుఁ డుదయించుచుఁ దానును లేచి సూర్యాంతరాత్మ యగుభగవం తునిఁ దెలుపు ఋక్కులనందుఁ జెప్పఁబడినట్లు ధ్యానము చేయుచు, "ఎవఁడు సంకల్పరూప మగుజ్ఞానముచేఁ జిదచిదాత్మక మగు ప్రపంచములు సృజించెనో, యెవఁడు స్వశరీరకుఁడై నజీవునిమూల మున నాప్రపంచమునందుఁ బ్రవేశించి, శబ్దాదివిషయములను గో రుచుఁ గర్మఫలంబుల ననుభవించుచున్న జీవునకు ద్రష్టయై యు న్నాఁడో, యెవఁడులోకప్రసవమునకుఁగారణభూతుఁడో, వాఁడా పరమేశ్వరసంబంధియును, బ్రకృతిమండలము నతిక్రమించినదియు నగు తేజోమయరూపమును బొందుచున్నాఁడు" అని యిట్లు పలి కెను. ఇది యేడవయధ్యాయము.

---

ఓ వసుంధరాధిపా! ఆభరతుఁ డొకనాఁడు చక్రనదియందుఁ స్నానంబు లాడి నిత్యనైమిత్తికకర్మము లాచరించి, ప్రణవములు జపించుచు నానదీతీరమున మూఁడునిమిషముల కాలము కూర్చుం డెను. ఆసమయంబున నొకయాఁడు లేడి దగ గొని యన్నదీజ లంబులఁ ద్రావఁ దలంచి తత్సమీపంబున కసహాయయై వచ్చి జలము త్రావుచుండఁగా నచ్చటికి మిక్కిలి దాపున భయంకర

మగుసింహనాదము వినవచ్చె. అంత నానినాదమును విని స్వభావముచేతనే భయశీలయై, చంచలదృష్టి గల యాయాఁడులేడి సింహముభయంకరధ్వని వినుటవలన నత్యంతవ్యాకులహృదయయై తొంటికంటెఁ జలించుచున్న నేత్రములు గలదయి దప్పితీర్చుకొనకయే, యానదిని దాఁటి పోవుచుండెను. ఆసమయంబున బూర్ణగర్భముతో నున్న యాలేడిగర్భము, స్వస్థానమునుండి కదలి ప్రవాహమునందుఁ బడెను. గర్భపాతముచేతను, నదీతరణముచేతను, భయముచేతను, బీడిత యగు నాలేడి పర్వాడి యొక కొండగుహను జేరి యాయాసమునఁ గ్రిందఁబడి మృతినొందెను. భరతుఁడట్లు ప్రవాహమునఁ బడి కొనిపోఁబడుచున్న యాలేడిపిల్లను జూచి తల్లి మృతినొందె ననియు, దండ్రి మొదలగు బంధువులచే విడువఁబడిన దనియు, దానియందు దయవహించి హస్తముచే దానిఁ బట్టికొని, తనయాశ్రమమును బొందించెను. అనంతర మాభరతుఁ డాలేడిపిల్లయందుఁ దన దనెడియభిమానముంచి ప్రతిదినమ్మును దాని కాహారాదులొసంగి పోషించుచు, వ్యాఘ్రాదులనుండి రక్షించుచు మేనిదురదను దొలంగించి సంతసింపఁ జేయుచు, చుంబనాదులచే దాని లాలించుచు, వర్తించుచుండె. ఇట్లతఁడు సంతతంబును దానిఁ బెంప నాసక్తుఁడై యుండుటం జేసి భగవత్పరిచర్యాదులును, దనశౌచాచారాదులును, నహింసాదులును. పెక్కేల? సమస్తధర్మములును బ్రతిదిన మొక్కొక్కటిచొప్పునఁ గొన్నిదినము లరుగునప్పటికి ధర్మములన్నియు నశించెను. ఆభరతుఁ డాలేడిపిల్లను జూచినప్పుడు, తనమనంబున "అక్కటా! పాపము. ఈలేడిపిల్ల కాలచక్రవేగమువలన జాతి నేలఁబడినదె. తనముందను విడిచిన దగుటచే మి

క్కలిదైన్యము పొందియున్నది. ఇది నన్ను శరణుఁ జొచ్చినది. ఇది, నన్నే తండ్రినిగాను, దల్లినిగాను,బంధువులనుగాను దలంచుకొనుచున్నది. ఇది తనసంఘమును నమ్మక నన్నునే నమ్ముచున్నది. ఇది నన్నే రక్షకునిఁగాఁ దలంచికొను చున్నది నాకంటె వేఱొకరక్షకుని నెఱుఁగదు. ఇట్లన్నివిధములచేతను నన్నే శరణ మని భావించుచున్నయీలేడిపిల్లను బోషించుటయును, రక్షించుటయును, సంతసింపఁజేయుటయును, లాలించుటయును, నా కవశ్యాచరణీయములు. ఇందువలన నాకార్యములు నశించుచున్న వని కోపము వహింపక దీనిఁ బోషించుట నాకు విహితము. ఇంతియ కాక శరణాగతులను దిరస్కరించుట పండితులకుఁ దగదు. మఱియు నది పాపజనకము కాక మానదు. లోకములోఁ బరోపకారశీలురును, శాంతస్వభావులును నగుపండితులు దీనులందు దయ యుంచి,శరణాగతరక్షణమువిషయమై యెంతగొప్ప లైనను స్వప్రయోజనంబులను విడువకమానరు'' అని యిట్లు తలంచుకొనుచు, దానియం దత్యాదరము కలవాఁడాయెను. అది మొదలు భరతుఁడు ప్రతిదినంబును, దానితో నొకచో నుపవేశించుచుండెను. దానితోఁగూడ విహరించుచుండెను; దానితోఁగూడఁ గందమూలాదులను దినుచుండెను. ఇట్లాభరతుఁడు లేడిపిల్లయం దధికస్నేహము కలవాఁడాయెను. ఓరాజా! భరతుఁడా లేడిపిల్లయం దధికస్నేహము గలవాఁడగుటచే,నొక్కొక్కప్పుడు తాను, దర్భలను, బుష్పములను, జలమును సంపాదించుకొనఁబోవలసినప్పుడు వృకాదులవలన నపాయము సంభవించునేమో యని శంకించుచు నామృగకిశోరముతోడనే వనమందుఁ బ్రతిమార్గమందును, దనవెనువెంటఁ ద్రిప్పుకొనుచుఁ బోవునప్పు

డా లేడిపిల్ల, సౌకుమార్యముచేఁగాని మూఢత్వముచేతఁగాని త నతో రాక వెనుకఁబడినచో, నాభరతుఁడు ముందున కరుగ సమర్థుఁడు కాకుండెను. అది యెప్పటికిని రానప్పుడు దానిఁ దన స్కంధమున నిడికొని యింటికి వచ్చుచుండెను. మఱియు నతఁ డత్యాదరమునఁ గూర్చున్నప్పుడు తొడపై నిడికొనియు, శయ నించినప్పుడు ఱొమ్మునందు శయనింపఁజేసికొనియు లాలనచేసి య ధికముదము నందెను. ఇంతియ కాక యాభరతుఁడు నిత్యనై మిత్తికాదిక్రియలు నెఱవేర్చుకొనునప్పుడు నెడనెడ లేచి యా మృగశిశుకమును జూచి మనంబున మిక్కిలి సంతసించి, దాని నుద్దేశించి "ఓమృగకిశోరమా! సర్వకాలములందును సర్వదేశ ములందును, నీకు శుభ మగుఁగాక" అని యాశీర్వచనము లి చ్చుచుండును. అట్టిసమయములం దామృగశిశువు కానరానిచో నతఁడు మిక్కిలి భయపడుచు, ధనము గోల్పోయినవానిచందం బున దీనుండై దుఃఖించుచు నా లేడిపిల్లయెడఁ గాటునలన డెంద దంబున నమందసంతాపము ననుభవించుచు నధిక మగుమోహ మును జెంది యిట్లు పరిదేవించుచుండును. "అకటకటా! పాప ము! ఈమృగశిశువు మిక్కిలి దయనీయమైనది. నేను వంచకుఁ డగుకిరాతునిరీతిని గఠినచేతస్కుఁడనై నిర్భాగ్యుఁడనై దుష్టుఁ డనై వర్తించితిని. నేను దానిరక్షణాదికము నాలోచింపకుండ నుండినకర్మారుండను. నాయం దధికవిశ్వాసము గలయామృగ శాబకము స్వబుద్ధిచేతనైనను, సజ్జనునిచందంబున మగుడ నా యాశ్రమంబునకు వచ్చునా? మృగశిశువు దైవముచే రక్షింపఁ బడుటచే వృకాదులవలన నపాయము లందక నాయాశ్రమసమీ పమునందు క్షేమముతో లేఁతపచ్చికను దినుచుండఁగాఁ జూడఁ

గలుగుదునా? అయ్యయ్యో! ఎంతకష్టము! వృకములు గాని యడవికుక్కలు గాని వరాహాదులు గాని వ్యాఘ్రాదిక్రూరజంతువులు గాని నామృగశిశువును భక్షించి యుండవుగదా? అకటా! సకలలోకక్షేమముకై యుదయించిన వేదస్వరూపుఁ డగుసూర్యభగవానుఁడ స్తమించుచున్నాఁడే? నాకు నిక్షేపమువంటియామృగశిశు విప్పటికిని రాలేదేమి? ఆమృగకిశోర మనెడిరాకుమారుఁడు నానావిధములును, మనోహరములును నైచూడఁదగిన మృగవినోదములచేతను, నుపచారములచేతను నాదుఃఖంబు తొలంగునట్లు సమీపమునకు వచ్చి నాకు సుఖము కల్గించునా? తన తోఁగూడఁ నే నాడుకొనుచున్నప్పుడు పరిహాసమునకై మిథ్యాసమాధి నవలంబించి కన్నులు నిమీలించి యుండఁగాఁ బ్రణయకోపమును వహించి యామృగశిశువు భయపడుచు జలబిందువలె మృదు వయినశృంగాగ్రముచే నన్ను మాటిమాటికి నిర్బాధకముగా రాయుచుండునే. అట్టిమృగశిశువు మగుడ నాకుఁ గన్పించునా? నేను హోమద్రవ్యాదులను దర్భలం దుంపఁగా నది వచ్చి చాపలమున నపవిత్రముగాఁ జేయుచుండునే. అప్పుడు నేను గోపింపఁగాఁ దా నాటలాడక చరణాదీంద్రియములను గదల్పక ఋషికుమారునివలె వర్తించుచుండునే. అట్టినాగారాబుమృగశిశు వేల రాలేదో?యనివిలపించుచుఁ బర్ణశాల వెలుపడి పైకి వచ్చి యామృగశాబకపాదన్యాసములచే నంకిత మగుభూతలంబును గాంచి యిట్లనుకొను. 'అయ్యారే! తపస్విని యగునీభూమి యెట్టితప మాచరించెనో కదా? ధనము గోల్పోయినవానికి ధనమార్గమును జూపుచున్నట్లుగా, సూక్ష్మములును, సుందరములును, మంగళప్రదములును, కఠినములును, నగునామృగశాబక

ముడెక్కలచేఁ జిహ్నిత మగునీభూమి, దానిజాడలను నాకు నివేదించుచు, నాకధికసంతస మొనగూర్చుచు, దానిపాదచిహ్నముల నలంకారములవలెఁ దాల్చుచు, *స్వర్గాపవర్గములఁ గోరుబ్రాహ్మణులకు యజ్ఞప్రదేశమును సమకూర్చుచున్నది. మృగపాదచిహ్నిత మగునీభూమి యెంతయుపకారము చేయుచున్నది!' అని యిట్లు భరతుండు వచించి, యుదయించినచంద్రునిఁ గాంచి, "ఓహో! తల్లి లేనిలేడిపిల్ల సింహాదిక్రూరజంతువులభయముచే నా యాశ్రమమును విడిచి పోవుచుండఁగా దీనవత్సలుఁ డయినచంద్రుఁడు దానిఁ జేరఁదీసి దయతో రక్షించుచున్నాఁడు కాఁబోలు!" నని వచించుచుండును. మఱియు నతఁడు చంద్రకాంతిస్పర్శ మనుభవించి "ఆమృగశాబకవియోగ మనెడిదావానలము ప్రబలి నాహృదయసరసిజము వాడించుచున్నను నెట్లో సహించి మృగశిశువును వెదకెడినా కధికాయాసము జనించుచుండఁగా నీచంద్రుఁడు, శీతలములును ననురాగవర్ధకములును, వదనసలిలమువంటిదగు తనసుధామయకిరణములచే దానిఁ దొలంగించి నా కుపకార మొనర్చుచున్నాఁడు" అని మాటిమాటికిఁ బలుకుచుండును. ఓరాజేంద్రా! ఆభరతుఁ డిట్లు పలువిధము లగుమనోరథములచే నాకులచిత్తుఁడై యామృగశాబక మనెడిప్రారబ్ధకర్మము విఘ్నము కల్గించుటచే, జ్ఞానయోగారంభమునుండియు, వర్ణాశ్రమోచితమగుకర్మయోగరూపతపంబునుండియు, భగవదారాధనరూపమగుభక్తియోగమునుండియుఁ బరిభ్రష్టుండయ్యెను.

---

* ఇందులకుఁ బ్రమాణము. 'శ్లో. యస్మిన్దేశే కృష్ణమృగ స్తిష్ఠన్ధర్మా నిబోధత.' అని చెప్పఁబడుటచేఁ గృష్ణమృగ మున్నభూమి మిక్కిలి పవిత్రమైన దనియు, యాగార్హ మయిన దనియుఁ దలంపవలయును.

ఓరాజేంద్రా! ప్రారబ్ధకర్మము భరతుని నెట్టిస్థితికిఁ దెచ్చినదో చూచితివా? అందులకుఁ బ్రారబ్ధమే కారణము. కానిచో భరతునికి జాత్యంతరమైన లేడిపిల్లయం దంతయాసక్తి గల్గునా? అతఁడు మొదట మోక్షమునకు విరోధు లని విడువఁ దరము కానికుమారులనే విడిచిపెట్టెను. ఇట్లు స్వగర్భవాసజాతు లగు వారిని విడువఁగల్గినను, నితరజాతి దగు మృగశాబకమును విడువ లేకపోయెను. ఇందులకుఁ బ్రారబ్ధము కాక మఱేది కారణమై యుండును? ఈ యంతరాయమువలన యోగారంభము పూర్ణముగా నశించినను దెలిసికోలేక, యామృగశిశుపోషణాదికము నవరత మొనర్చుచుఁ దన్ను మఱచిపోయి ప్రమత్తుఁడై యాభరతుఁడు వర్తించుచుండఁగాఁ, దీవ్రవేగము కలిగి దురతిక్రమమై మూషికబిలమును సర్పరాజముంబోలె మృత్యువు సమీపించివచ్చెను. ఆమరణసమయమునను నాభరతుండు తనపార్శ్వమందు వర్తించుచున్న మృగము నాత్మజునిఁగా భావించి తనపై నెడియభిమానముంచి దానియందే మనంబును సక్తముగావించి మృగముతోఁ గూడ దేహవిసర్జనముఁ జేసి పూర్వజన్మానుస్మృతి నశింపకపోవుటచేఁ బ్రాకృతజనునివలె మృగశరీరమును బొందెను * అంత్యకాలమందు మృగమును స్మరించుచు దేహమును విసర్జించుటచే మృగశరీరమునే పొందెను. ఓరాజా! అతఁడట్లు మృగత్వమును బొందినను బూర్వజన్మమం దొనర్చినభగవదారాధనప్రభావముచేఁ దనకు మృగత్వము వచ్చుటకు మృగాసక్తతయే కారణమని భావించి మనంబున మిక్కిలిపరితాప మొందసాగె. "అక్కటా!

---

* ఇందులకుఁ బ్రమాణము- శ్లో. యంయంవాపి స్మరన్భావం త్యజత్యంతే కళేబరం। తత్తదవేతి కౌంతేయ సదా తద్భావభావితః॥ అని భగవద్గీత.

జ్ఞానవంతులమార్గమునుండి నేనుఁ బరిభ్రష్టుండ నైతిని. ఎంత కష్టము! ఎంతకష్టము! ఆహా! నేనుఁ బూర్వము సమస్తసంగములను విడిచి విజన మగుపుణ్యారణ్యమే శరణ మని తలంచుకొని జితేంద్రియుండ నై భగవంతునికథలను వినుచు,నతని మననము చేయుచు, నుతించుచు, స్మరించుచుకొనుచు, నారాధించుచు, సర్వకాలములందును సమస్తభూతముల కంతరాత్మ యగువాసుదేవ భగవానునియందుఁ బొందుపఱిచి, ఏమనంబును విషయముల నుండి మఱలించితినో, యామనం బిప్పుడు మృగాసక్త మగుట చే యోగభ్రష్ట మైనది." అని యిట్లు భరతుండు మిక్కిలి పశ్చాత్తాపము నొంది, తనతల్లి యగుమృగిని విడిచి కాలంజర మనుపర్వతమునుండి శాంతిప్రధాను లగుమునులకుఁ బ్రియమై భగవత్ప్రాప్తికి స్థానమై సాలగ్రామ మనుపేరు గలపులహాశ్రమమునకుఁ బోయెను. అనంతర మచ్చటఁ దా నేకాకి యై మృగదేహావసానకాలమును బ్రతీక్షించుచు, సంగమునకు మిక్కిలి భయపడుచు, నెండినయాకులను మాత్రమే భక్షించి కాలమును బుచ్చుచుఁ దనకు మృగత్వము లభింప హేతు వగుప్రారబ్ధము నశింప నెదురుసూచుచు, నదీజలమందుఁ బ్రవేశించి సగమువఱకు మునిఁగి, మృగశరీరమును విడిచిపెట్టెను. ఇది యెనిమిదవ యధ్యాయము.

---

ఓరాజా! ఆంగిరసగోత్రమందుఁ బుట్టినవారిలో శ్రేష్ఠుఁ డగు నొకద్విజవరుండు కలఁడు. అతఁడు శమదమాదిగుణములు కలవాఁడు. అంతఃడింద్రియనిగ్రహముచేతను, బహిరింద్రియనిగ్రహముచేతను, నవశనాదిరూప మగుతపంబుచేతను, వేదాధ్యయ

నముచేతను, దానముచేతను, శీతోష్ణాదు లగుద్వంద్వముల సహించుటచేతను, సంతోషముచేతను, వినయముచేతను, శాస్త్ర జన్య మగుజ్ఞానముచేతను, ననూయారాహిత్యముచేతను, జ్ఞాన యోగముచేతను, బ్రహ్మానందానుభవరూప మగుభక్తియోగము చేతను, మిక్కిలి ప్రఖ్యాతి వహించెను. ఆముని కిరువురు భార్య లు కలరు. వారిలోఁ బెద్దభార్యయం దతనికిఁ దనతో సమాన మై, వేదార్థశ్రవణము, సత్స్వభావము, సౌందర్యము, గొప్పతి నము, మొదలగుగుణములు గలతొమ్మండ్రుపుత్త్రులు పుట్టిరి. ఆ విప్రునికి రెండవభార్యయం దిరువురు కవలపిల్లలు పుట్టిరి. ఆమి థునములో మగశిశువు, పరమభాగవతోత్తముఁ డగుభరతుఁడే. అతఁడు మొదట రాజర్షి యై, భక్తాగ్రగణ్యుఁ డై ప్రారబ్ధకర్మ వశమువలన మృగరూపమునొంది తత్కర్మమవసానమునొందిన వెంటనే మృగశరీరమును విడిచి విప్రుఁ డై యాంగిరసున కుద యించెను. అతని కిదియే కడపటిజన్మము. భరతుఁ డట్లు విప్ర జన్మము నొందియు, భగవదనుగ్రహమువలనఁ బూర్వజన్మజ్ఞా నము గలవాఁ డగుటచే, సోదరాదిసంబంధంబువలనఁ దనకుఁ దొంటివలెనే యనర్థము సంభవించునేమో యనిభయపడుచుఁ గర్మబంధవిధ్వంసకము లగు, భగవత్కథాశ్రవణము, స్మరణ ము, తద్గుణకథనము మొదలగు సత్కర్మములను మాత్రమే యొనర్చుచు, భగవంతునిపాదపద్మములు మనంబున నిలిపి ధ్యానించుచు, లోకమునకు వెఱ్ఱివానివలెను గానవచ్చుచుం డెను. ఆవిప్రుఁడు వెఱ్ఱివానివలెఁ గానవచ్చుచున్నను నా విప్రునికిఁ బుత్రప్రేమచే నతనియం దాదరము గలిగి, తండ్రి యుపదేశమువలననే పుత్త్రుండు శిష్టుండు గావలయు నని తలం

చి, స్నాతకమువఱకుఁ గలకర్మంబుల నన్నింటిని యథావిధిగా నొనర్చి, యుపనీతునకు విహితములు కాకపోయినను, శౌచాచమనాదికర్మనియమములను నేర్పెను. మఱియు నాబ్రాహ్మణుఁడు పితృసన్నిధియె యధ్యయనమునకుఁ దగిన దని తనకుమారునికి వేదము చెప్ప నిశ్చయించి, భూర్భువరాదు లగువ్యాహృతులతోఁ గూడి, యోంకారము మొదటఁ గలదియుఁ ద్రిపదయు నగు గాయత్రిని వసంతగ్రీష్మర్తువులు నాలుగుమాసములు చెప్పియు, నతనికి వచ్చునట్లు చేయలేకపోయెను. ఇట్లావిప్రుఁడు తనపుత్త్రునియం దధికానురాగ ముంచి, బ్రహ్మచర్యావలంబికి వలసిన శౌచాచమనాదులును, నధ్యయనము, గురుశుశ్రూషయు, నగ్నిహోత్రవిధియు మొదలగుసత్కర్మము లన్నియుఁ, దనపుత్త్రున కలవఱుపఁ దలంచి, దురభిమానవంతుఁడై పుత్త్రునకు నేర్పియు, మనోరథసిద్ధి నొందలేక, వర్తించుచునంతలో నప్రమత్త మగు మృత్యువుచే గ్రస్తుండయి గృహమునందె మృతి నొందెను. ఆ బ్రాహ్మణుండు కాలధర్మము నొందుటం జూచి యతనిరెండవ భార్య తనకవలపిల్లలను, సవతి కధీనులను గావించి సహగమనం బొనర్చి పతిలోకమున కేఁగెను. తల్లిదండ్రులు పరలోకమున కేఁగినతరువాత గేవలము కర్మానబోధక మగువేదత్రయమునందే స్థిరబుద్ధు లగునతనిపుత్త్రులు నతనిప్రభావము నెఱుంగనివారై యతఁడు జడుం డని తలంచి తండ్రివలె యుక్తకర్మాదులను నేర్ప మానుకొనిరి. ద్విపాత్పశువు లనఁబడునాయూరిజను లాజడ విప్రునిఁ జూచి 'యున్మత్తా!' యనియు, 'జడుఁడా!' యనియు, 'ఓ చెవిటివాఁడా!' యనియుఁ బిలుచుచుండ విని యతఁ డందులకుఁ దగినవిధంబునఁ బ్రవర్తించుచుండెను. మఱియు నతఁడు, నిత్య

మై, పుణ్యపాపాదినిమిత్తరహిత మై, సిద్ధమై, దోషాదిరహితమై యున్నజ్ఞానానందమే స్వరూపముగాఁ గలవాఁ డగుటచేతను, శీతోష్ణాది ద్వంద్వములవలనఁ గల్గుసుఖదుఃఖాదులచేఁ బ్రయుక్త మగు దేహాత్మాభిమానము లేనివాఁ డగుటచేతను, నెట్టిపనులవలనఁగాని, సంప్రాప్త మయినయన్నాదికము స్వల్ప మైనను, నధిక మయినను, గుత్సిత మయినను, నింద్రియప్రీతికై కాక. కేవలము ప్రారబ్ధక్షయమునకు హేతు వగు దేహమును ధరించుటకు మాత్రమే భక్షించుచుండెను. ఇంతేకాక యావిప్రుండు శీతమునందును, నాతపమందును, వర్షమునందును, మహోక్షమువలె శరీరమును వసనాదులచే నావరించుకొనక ప్రవర్తించుచుఁ బరిపుష్టిఁ జెంది కఠినములై యున్న సర్వావయవములతో నొప్పుచు, నేలపై శయనించుటచేతను, నభ్యంగనాదులు లేక పోవుటచేతను, దట్ట మగుమాలిన్యముచే బ్రహ్మతేజస్సు తిరోహితము కాఁగా, బాహ్యమలముచేఁ బ్రకాశింపని మహారత్నమున కెనవచ్చుచుఁ, గుత్సితవస్త్రము నొకదానిని మొలయందుఁ దాల్చి మిక్కిలి మలిన మయినజన్నిదముచేత ద్విజన్ముఁ డని గుఱితింపఁబడుచు, యోగీశ్వరప్రవర్తనము దెలియంగనియవివేకులచే నిందింపఁబడుచు, గాలము పుచ్చుచుండెను. అతఁడు కూలివలన నాహారాదికమును గోరుచున్నవాఁ డగుటచే సమస్తకార్యములను జేయుచుండెను. ఒకప్పుడు తనసోదరుల ధాన్యక్షేత్రములను జక్కఁజేయఁ బ్రేరితుఁడై పోయి యక్కార్య మొనర్చుచుండెను. కాని యిచ్చట బురద తీయుటవలన క్షేత్రము సమమగు నని కాని, యిట బురద తీసిన విషమ మగు నని కాని, యెఱుంగఁడు. ఇట్లు ప్రతిదినమును శ్రమపడుచుఁ దనసోదరులు పెట్టిన

స్వల్పాహారమును దినుచుండెను. అంతలో దేహధారణ చేయఁ జాలనప్పుడు నూఁకలను, దెలికపిండిని, నూకను,నులవలను,మినుములను, వంటపాత్రలందంటి మాఁడియున్నయన్నమును సుధారసతుల్యముగ నెంచికొని తినుచుండెను. ఓపరీక్షిన్నరేంద్రా! ఆభరతునియద్భుతచరిత్ర మొకటి కలదు. చెప్పెద. సావధానచిత్తుండవయి వినుము. ఆకాలమున నొకచోరనాయకుఁడు కలఁడు. వాఁడనపత్యుఁడై తనకు సంతానము గల్గినచో భద్రకాళికి నరబలి యిచ్చెద నని సంకల్పించుకొనెను. అంతఁ గొంతకాలమునకు వానికిఁ బుత్త్రుఁడు గలిగెను. అప్పుడు వాఁడు తన యనుచరులను బిలిచి "దైవవశమువలన లభించినయొకపురుషునిఁ గొనిరం" డని యాజ్ఞాపించెను. అతని యనుచరులును బురుషపశువునిమిత్తమంతటను బరిభ్రమించుచుఁ గటికిచీఁకట్లకు నిలయమగురాత్రియందుఁ గానలేక మగిడి వచ్చుచు, వీరాసనస్థితుఁడై మృగవరాహాదులనుండి సస్యములను రక్షించుచున్నయాభరతునిఁ గాంచి, సర్వసులక్షణములు గలవానినిగాఁ దెలిసికొని, తమపతికి బలి యిచ్చుటకుఁ దగినవాఁడు లభించినందుల కానందించి వికసితవదనులై వాని దృఢముగా బంధించి భద్రకాళీమందిరంబును బొందించిరి. అనంతర మాచోరులు,

**—{ వృషలునిసేవకులు భరతునిఁ గాళీమందిరమునకుఁ బలియిచ్చుటకై గొనివచ్చుట. }—**

విశసనవిధిచేత స్నానము చేయించి, యొకక్రొత్తవస్త్రముచే వాని నాచ్ఛాదించి, భూషణాదులచే నలంకరించి, భుజింపఁజేసి ధూపాదు లొసంగి, చందన మలంది, పూలదండలచే మెడను దిలకించి, బలివేళఁ జేయువలసినస్తోత్త్రంబు లొనర్చి, మృదంగాదు

లను మ్రోయించి, యాపురుషుని భద్రకాళియెదుటఁ గూర్చుం డఁబెట్టిరి. అనంతరము వృషలరాజు పురోహితుఁ డగుచోరుఁ డా తని రక్తముచేతను, మద్యముచేతను, భద్రకాళిని బూజింపఁ దలంచి, భద్రకాళీమంత్రములచే నభిమంత్రితంబును నతిభయం కరంబును నగుఖడ్గంబును గైకొని వానిఁ జంప నుంకించుచుం డెను. అంతట రజస్తమోగుణప్రచురులును, ధనమదముచే మర్యాదల నతిక్రమించినవారును, నగునాచోరులు, భగవత్కు థలతోఁ గూడినబ్రాహ్మణకులమును దుచ్ఛమునుగా భావించి దుష్టమార్గమందు వర్తించుచుఁ, బరమాత్మసామ్యమును బొంది బ్రహ్మర్షి యగునాంగిరసుకుమారుఁ డై, యెవ్వరితోను ద్వేషిం పక, సర్వభూతహితుఁ డై యున్నయాభరతుని సంహారమును దారుణకర్మముగా నెంచి యాభద్రకాళి దుస్సహ మగుబ్రహ్మ తేజంబుచేఁ దిరస్కృతురా లై తనశరీరము క్రమక్రమముగా మంటలెక్కుటచే నట నుండఁజాలక శీఘ్రముగాఁ బ్రతిమనుండి వెడలివచ్చెను. ఆకాళి యంతతో నూరకుండక యొడలిమంటకుఁ దోడు మహారోషాగ్ని యావేశించి సంతాపముఁ గల్గించుటచే సహింపలేక భయంకరముగా బొమముడి వెట్టి కుటిలము లగు దంష్ట్రలచేతను, నెఱ్ఱనినేత్రములచేతను, భీకరవదనము కలదై, యీప్రపంచము నంతను సంహరింప నుద్యుక్త యైనట్లు మహాట్ట హాసమునుఁగావించి యచ్చటనుండి లంఘించి పాపిష్ఠులును, గర్వి ష్ఠులును నగునాఖలులశిరంబుల నాకత్తిచేతనే ఖండించి, తదీయ కంఠములనుండి స్రవించురక్తమును గాఢముగాఁ ద్రావి, రక్త పానజనితమదముచేఁ బరవశయై తనగణములతోఁ గూడ నుచ్చై స్స్వనముతో నాడుచుఁ బాడుచు వారిశిరఃకందుకములతోఁ

గ్రీడలాడెను. ఓయీ! భద్రకాళీసమారాధనము విపరీతముగా ఫలించిన దేమి? యని సందేహింపకుము. మహాత్ములవిషయమై చేయుహింసారూప మగునపరాధము సర్వవిధములచేఁ దనయందే పరిణమించును. కావున మహాత్ముఁ డగుభరతునికిఁ జేయఁ దలంచిన మహాపదను నావృషలులే యనుభవించిరి. ఆవృషలులు తన్నుఁ జంపఁ గొనిపోవుచున్నప్పుడు భరతుఁడూరకుండుట యద్భుత మని యూహింతు వేమో; యది యంత యద్భుతము కాదు. ఓనరేంద్రా! భాగవతు లగుపరమహంసులు దేహాదులందాత్మభావమును విడిచి మిక్కిలిదృఢ మగుదేహాత్మాభిమానగ్రంథిని విప్పికొన్నవారు. వారు సర్వభూతములందును స్నేహము గల్గియుందురు. కావుననే వా రెవ్వరియందును వైరము లేనివారయి యుందురు. ప్రత్యక్షముగా భగవంతునికాలచక్రము చేతను నానాభావములచేతను, సంరక్షింపఁబడుచుందురు. భగవంతుని పాదమూలము లాశ్రయించినవారి కెందునుండియు భయ ముండదు. అట్టి మహాత్ములు తమశిరంబును ఛేదింప నున్నవారిపై నిగాని క్రోధము వహింపరు; మరణమునకు భయపడరు. అట్లె పరమభాగవతోత్తముఁ డగుభరతునకుఁ దన్నుఁ బంధించి కొనిపోవువారిపైఁ గ్రోధము గాని, మరణ మగుటవలనఁ దొందరపాటు గాని కలుగలేదు. ఇది తొమ్మిదవయధ్యాయము.

---

ఓరాజేంద్రా! భరతునితరువాతివృత్తాంతము వినుము. ఆకాలమున సింధుసౌవీరదేశములకు రహూగణుఁ డనునొకరాజు గలఁడు. అతఁడు తత్త్వజ్ఞానంబు దెలిసికొనుతలంపుతో గపిలమహామునిచెంత కరుగ నిశ్చయించుకొని శిబికారూఢుఁ

డై పోవుచు నిక్షుమతీతీరమున విడిసెను. తరువాత నారాజు గమనత్వరతోఁ గూడికొని శిబికావాహకుల వేగముగాఁ గొనిరమ్మని వాహకాధిపతి కాజ్ఞాపింప, వాఁడు చని వారిని వెదకుచు, బలిసినశరీరము గల్గి, యౌవనవంతుఁడై దృఢతరగాత్రుఁడై మహోక్షమువలె భారవహనసమర్థుఁడై యున్నయాభరతునిఁ జూచి "యితఁడు శిబికను వహింప మిక్కిలి సమర్థుఁ"డని నిశ్చయించి బలాత్కరించి కొనిపోయెను. అందులకు భరతుఁడర్హుఁడు కాకపోయినను నమ్మహానుభావుఁడు శిబికను మోవసాగెను. అట్లతఁడు తక్కినవారితో నాశిబికను వహించి శరపాతముదూరము నడిచెను. కాని యతని కభ్యాసము లేకపోవుటచే వక్రముగా నడుచుచుండె. అందువలనఁ దక్కినవాహకులగమనము గూడఁ గుటిలమై యుండ నది రహూగణుఁడు కనిపెట్టి యావాహకులం గాంచి "ఓరీ వాహకులారా! ఎంత చక్కఁగా నడుచుచున్నారు! పల్లకిని విషమముగా మోయుచున్నారేమి?" అని సోపాలంభముగాఁ బలికెను. అనంతర మావాహకులు సాక్షేపము లగుప్రభువువచనంబులు విని, తమ్ము దండించునేమో యని శంకించుచుఁ దమప్రభువునుఁ గాంచి "ఓ మహాప్రభూ! మే మెంతమాత్రమును బ్రమత్తులమై యుండ లేదు. తమ సెలవుచొప్పునఁ జక్కఁగానే మోయుచున్నారము. కాని మాలో నీపురుషుఁ డిప్పుడే నియుక్తుఁడై నను, మా యంత శీఘ్రముగా నడువలేకున్నాఁడు. అందువలన మాగమనము గూడఁ గుటిల మగుచున్నది. మే మిఁక నితనితోఁ గూడి మోయఁజాలము" అని సవినయముగా విషమగతిహేతువును విన్నవించికొనిరి. దీని లగునావాహకులవాక్యంబులు విని, వాహకు

లలో నొక్కఁడు విషమముగా నడిచినఁ దక్కినవారుగూడ నట్లే నడువవలసియుండు నని నిశ్చయించుకొని, యింతకుఁ బూర్వము వృద్ధుల నుపాసించువాఁడై నను స్వభావముచేఁ బరవశుఁడై మనంబునఁ గొంచెము కోపము వహించి, నిగూఢబ్రహ్మతేజస్కుఁడై నివురుఁగప్పిననిప్పువలె నున్నయాభరతుని కిట్లనియె. 'ఓసోదరుఁడా! నీవు చాలదూరము నడిచివచ్చుటచేతను శిబికను వహించుటచేతను, మిక్కిలి పరిశ్రాంతుఁడ వయితివి. అక్కటా! ఎంతకష్టము! పాపము నీ వొక్కఁడవే దీర్ఘప్రయాణము చేయలేదు. అందులో నీవు ముదుసలివాఁడ వగుటచే దుర్బలుఁడ వయితివి. తక్కిన వారందఱును దీర్ఘప్రయాణము చేయలేదు. వారందఱు సుఖముగా నున్నారుకాఁబోలు? అందుచే నీవు వారితో సమముగా నడవలేకయు నున్నావు." అని యిట్లారాజు సాక్షేపముగాఁ బలికెను. అయినను నహంకారమమకారరూపమగునవిద్యచేఁ బరీతము లగు పంచభూతములును, శబ్దాదిగుణములును వాగాదక్రియలును దదింద్రియములును నంతఃకరణమును గలిగి సంతతమును వికారము చెందుచు నవయవసంస్థానవిశేష మయినతనచరమకళేబరమందును, దదనుబంధులయందును "నేను నాది" యనెడిమిథ్యాజ్ఞానము లేనివాఁ డగుటచే నాభరతుఁ డతనివాక్యములకును మనంబున సుంతేనియు నలుగక మాటలాడక తొంటియట్ల పల్లకిని మోచుచునడుచుచుండెను. కాని యప్పుడును బల్లకి విషమముగానే మోయఁబడుచుండెను. అందువలన రహూగణుఁడు ప్రకుపితచిత్తుండై, "ఓరీ! నీవు జీవచ్ఛవంబువలెఁ గానవచ్చుచున్నావు. నన్ను నల్పునిఁగా భావించుచున్నావు. అధిపతి నగునా శాసనము నతిక్రమించుచు

న్నావు. ప్రమత్తుఁడ వగునిన్ను దండింపక మానను. యముఁడు ప్రజలగర్వమును మాయించుచున్నట్లు నేనును దండనముచే నిన్ను సాధువునుగాఁ జేసెదను.'' అని యిట్లసంబద్ధవచనంబులు పలుకుచుండెను. అప్పుడు సర్వభూతహితుఁడును, బ్రహ్మసామ్య మొందుచున్నవాఁడును, జగదుత్పత్తిస్థితిలయములనుఁ దెలిసినవాఁడును నగుభరతుఁడు పోయినయాశ్చర్యము గలవాఁడైనను. నాశ్చర్యపడుచున్నట్లు గానవచ్చుచు, నబద్ధవచనంబులు పలుకుచు, "నేను నరదేవుఁడ" నని యభిమానమున నొప్పుచుఁ దమోగుణమిళిత మగురజోగుణము ప్రధానముగాఁ గలవాఁడగుటచేఁ దన్మూలమగుక్రోధముచేతను, మదముచేతను, వివశుఁడయి, భగవద్భక్తులను దిరస్కరించుచుఁ, దన్నుఁ బండితునిఁగాఁ దలంచుచు, యోగీశ్వరులప్రవర్తనమును జక్కఁగ నెఱుంగనియారహూగణునిఁ గాంచి యిట్లు పలికెను. 'ఓరాజా!

—— *జడభరతుఁడు రహూగణునకు బ్రత్యుత్తరంబు లిచ్చుట.* ——

నీవు వక్రోక్తులచే "దీర్ఘప్రయాణము చేయుటచే నలసితివి కాఁబోలు" నని నన్ను మందలించితివి. నీవు పల్కినయావచనము లోకదృష్టిచే సత్యమైననుం బారమార్థికదృష్టితోఁ జూడ నసత్యము కాకమానదు. ఆలోచింప నేను నిన్ను మోయలేదు. కాన వహించుటవలనఁ గల్గుబరువు గాని, తత్కృత మగుశ్రమము గాని నా కెంతమాత్రమును లేదు. 'దీర్ఘప్రయాణము చేయుట వలన నలసితివా?' యని యడిగితివి. నడుచువానికి గంతవ్యమగు భూమి యున్నచో నీ వన్నట్లనుకొనవచ్చును. కాని పాదోద్గమనము నాయందు లేనప్పు డది యెట్లు సరిపడును? 'నీవు మిక్కిలి బలిసియున్నా" వని పలికితివి. ఆబలుపు పంచభూతాత్మక మగు

దేహమం దున్నది కాని నాయందు లేదు. ఆత్మయాథాత్మ్య మును దెలిసినవా రట్లు తలంపరు. ఓరాజా ! స్థూలత్వము, కృశత్వము, శరీరభవము లగురోగములు, మనోవ్యాధులును, నాఁకలియును, దప్పియును, భయంబును, కలహంబును,గామం బును, వంచనమును,విషయాసక్తియును, కోపంబును, నాత్మ కాని దేహమునం దాత్మయనుబుద్ధిని గల్గించునహంకారమును, మోహంబును మొదలగుబాహ్యాంతరవికారములు శరీరసంబంధముచే నాకుఁ గల్గుచున్నవి కాని వాస్తవముగా నాకు లేవు. ఇంతే కాక నీవు నన్నుఁ గాంచి "జీవన్మృతుండ" వని పలికితివి. జీవత్వ మన శ్వాసవాయువులు గల్గుటయే కాని వేఱుగాదు. మృతత్వ మనఁ బూర్వావస్థను విడుచుటయే కదా! ఓరాజా! ఈరెండును నుత్పత్తివినాశములవలె వికృతి మగు దేహమునకుఁ గన్పించుచు న్నవికాని యాత్మకుఁ గాదు. "భర్త నగునాశాసనమును మీఱుచున్నా" వని యంటివి కదా! ఆలోచింపఁ బ్రభుత్వ మెవ్వనియందు నియతమై యుండునో, వాఁడు శాసించినది మోయుట యుక్తమే. కాని యది పరమేశ్వరునకు మాత్రమే కలదు. కాన యతఁ డాజ్ఞాపించినది జీవులు చేయకతీఱదు. అట్టి నియతప్రభుత్వము నీయందు లేదు. కాలవశమున నీవు రాజ్య పదభ్రష్టుండ వయినచో నీప్రభుత్వము తొలంగును. కావున నీకు శాసింప నర్హత లేదు. నీ కాయర్హత లేకున్నను నున్న దని యనుకొనుచున్నావు. కాని యది భ్రాంతిమూలక మని నామ తము. ఓనరేంద్రా ! "నీవు భృత్యుఁడవు. నే నధిపతిని" అనెడి వైషమ్యబుద్ధికి నుంతేనియు నవకాశము లేదు. వ్యవహారము మాత్రమే కాని స్పష్టముగా నున్నట్టు గానరాదు. ఇట్లుండఁగా

నెవ్వఁ డీశ్వరుండు? ఎవ్వఁడు భృత్యుఁడు? కాన నీ వీశ్వరుండవును గావు. నేను భృత్యుండను గాను. మాప్రవర్తనము నీ కనిష్ట మైనచో మే మేమి చేయుదుము? కార్యస్థితిని వే ఱొకవిధము గాఁ జేయుట యెవ్వనికిని నలవి కాదు. మఱియుఁ " ప్రమత్తుఁ డ వగునీకుఁ దగినచికిత్సను జేసెద " నని పలికితివి. కాని బ్ర హ్మోపాసనమును జేయుచు, మన్త్తునివలెను, మూఁగవానివ లెను, గ్రుడ్డివానివలెను, జడునివలెను బ్రవర్తింపవలె నని కోరు చున్న నాకు నీచేయుదండన మేమిపనిని చెయును? తర్జనతాడనా దులను గోరుచుండిననాకు నీవు చేసినతర్జనతాడనాదిక మనిష్ట ము కాదు. అట్లు కాక నేను బ్రహ్మనిష్ఠుండను గాన ప్రమ త్తుఁడ నగుసంసారి నై చేష్టలు దక్కి యున్నవాఁడ ననియె యను కొనుము. అట్లయినఁ బూర్వమందే సంసారవ్యసనవీక్షితుఁడ నైన నాకు నీవు చేసినదండనాదికము పిష్టపేషణమువలె వ్యర్థమే. " అని యిట్లు భరతుండు రాజాడినవాక్యములకుఁ దగినట్లు ప్ర త్యుత్తర మిచ్చి శాంతిస్వభావమున నొప్పుచు, దేహాంతరమును సంపాదించుపుణ్యపాపకర్మములనుండి నివృత్తుండై పుణ్యాపుణ్య రూప మగుప్రారబ్ధకర్మమును ననుభవముచే నశింపఁజేసికొనుచు బూర్వమువలె రాజశిబికను వహించెను ఓపాండువంశపావనా! సింధుసౌవీరదేశాధిపతియుఁ దత్త్వజిజ్ఞాసయం దధికారము గల్గి యున్నవాఁడును నగురహూగణుఁడు, బహువిధములగునధ్యాత్మ శాస్త్రములచే సమ్మతమై, యజ్ఞానవిమోచకమయియున్న యాభ రతునివచనమును విని మిక్కిలి విస్మయము చెందుచుఁ, బల్లకి నుండి దిగి, యావిప్రునిపాదపద్మములపయిఁ బడి నమస్కరించి తన్ను క్షమింప వేఁడుకొనుచు నిట్లనియె. " ఓ మహానీయా !

బ్రహ్మవర్చస్సును గప్పిపుచ్చి బ్రాహ్మణులలో సంచరించుచున్ననీ వెవండవు? నీవు బ్రాహ్మణుఁడ వయినట్లు నీవు దాల్చినయజ్ఞ సూత్రమే చెప్పుచున్నది. సర్వజనులచేతనుఁ బరిభవింపఁబడువేష ము గలవాఁ డగుటచే నీ వవధూత వగుట నిక్కము. నీ వెవనికుమారుఁడవు? ఎవనిశిష్యుఁడవు? నీ వెచ్చటివాఁడవు? నీ విచ్చటికి వచ్చినకతం బెద్ది? ఆలోచింప నాకు క్షేమముగల్గింప వచ్చినచో, నీవు కపిలమహాముని వా యేమి? ఓయార్యా! ఇంద్రుని వజ్రాయుధమునకు జంకను. శంకరునిత్రిశూలమునకును భయపడను. యమునిదండమునకుఁ గూడ భీతి నొందను. అగ్ని యస్త్రమునకుఁ గాని, సూర్యునిశస్త్రమునకుఁ గాని, వాయువు నాయుధమునకుఁ గాని, కుబేరునియాయుధమునకుఁ గాని, భయ మొందను. కాని బ్రహ్మకులావమానమునకు భయపడుచున్నాను. కావున నిదివఱకు నే నెఱుఁగక జేసినయవమానమును క్షమింపుము. దయ యుంచి నావచనంబులకుఁ బ్రత్యుత్తర మిమ్ము. నీవు సంగములను వదలి, విజ్ఞానరూప మగునీప్రభావమును గప్పిపుచ్చి యితరులకు దురవగాహ మగునభిప్రాయము గల్గి, జడునివలెఁ జరించుచున్నావు. నీవాక్యములు యోగశాస్త్రసందర్భితము లై యున్నవి. ఓసాధువరా! నీవచనములయభిప్రాయంబు సూక్ష్మ బుద్ధిచేతనైనను దెలిసికోలేకున్నాను. ఓమహాత్మా! బ్రహ్మతత్త్వ విదులలో నగ్రేసరుఁడును, హితోపదేష్టయును, నిత్యమును, న పరిచ్ఛిన్నమును నగుజ్ఞానకళచేత నవతరించినవాఁడును, యోగీశ్వరుఁడును, నగుకపిలమహామునిని సమీపించి సంసారమందు రక్షక మగున దెద్దియో యడిగి తెలిసికొన నూహించి పోవుచున్నాను. నీవు గూఢవేషముఁ దాల్చి ప్రపంచసందర్శనార్థము సంచరించు

చున్న కపిలమహామునివా యేమి? సంసారాసక్తుఁడ నై జ్ఞానర హితుండ నై యున్న నావంటివాఁడు యోగీశ్వరు లగుమీవంటి మహానుభావులరీతుల నెట్లుగాఁ దెలిసికొనఁగలఁడు? ఓవిప్రవర్యా! దేహాతిరిక్తుఁడ నైనను, దేహసంబంధము గలనాకు యుద్ధకర్మ ము లాచరించినప్పుడు శ్రమ గలుగుచుండెను. అందుచే భార వాహకుఁడ వగునీకును శ్రమము గలుగు నని తలంచుకొని యిట్లు పలికితిని. ఇది లోకవ్యవహారమూలకము గాని వాస్తవముకాదు. ఇంతియ కాక యసత్యాదులగు దేహాదులవలనఁగలుగుశ్రమయు నసత్యమే! కాన తత్ప్రయుక్త మగుశ్రమయు నసత్యమే యని యేల యనరాదు? అందువేని చెప్పెదను. భ్రాంతివిషయ మగు ఘటాదు లుదకము గొనివచ్చుటఁ జూడలేదు. కాని విద్యమాన మగుఘట మట్లుచేయుటను జూచుచున్నాము. అందువలన నర్థ క్రియాకారి యగుటవలన ఘటాదులు సత్యము లనవచ్చును. అట్లె దేహాదు లర్థక్రియాకారు లగుటవలన సత్యములు. తత్సం బంధమువలనఁ గలుగుశ్రమయును సత్యమే; కాన యీలోకవ్యవ హార మనుభవసిద్ధమై ఆత్మకు స్వతస్సిద్ధ మగుదుఃఖాదులు లేక పోయినను, దేహసంబంధమువలన నది సంభవింపక మానదు. తప్తపాత్రగత మగునగ్నితాపము తన్మధ్యమం దున్నశీతలోద కమును దహింపఁజేసి దానియందుండుతండులముల నుడికించుచు న్నది. అట్లె నిదాఘతప్త మగుశరీరమువలన నింద్రియాదులు ను, వానివలనఁ బ్రాణంబులును, వానివలన మనంబును, నందువ లన నాత్మయుఁ దప్తము కావచ్చును. కావున, విదువఁ దరము కాని దేహేంద్రియప్రాణాంతఃకరణసంబంధ ముండుటవలనఁ బు రుషునికి సుఖదుఃఖాదులను గలిగించుసంసారము లభింపక మా

నదు. ఓయీ! పూర్వమే తాపత్రయార్తు లగువారికి దండనము గల్గించిన నది వ్యర్థ మగునని భావింపరాదు. కర్మవశమున నధిపతి నై దుర్మార్గవర్తు లగుజనులను శాసించుటయు, సన్మార్గవర్తులను బరిపాలించుటయు నాకు విహితము. ఎవఁడైనను జేయు దండనమునకు భయపడి స్వవర్ణాశ్రమధర్మములచే భగవంతు నారాధించుచుఁ దన్మూలమునఁ బాపరాశిని దొలగించుకొనని చో, నప్పుడు నాచేయుదండనము నీ వన్నట్లు పిష్టపేషము కాక సఫలమే యగుచున్నది. అయిన నది నీవంటిమహానుభావునకుఁ దగనిది. కావున నోయార్తబంధూ! ఓవిప్రవర్యా! నేను నరదేవుఁ డనునభిమానముచే సజ్జనతముఁడ వగునిన్నుఁ దిరస్కరించి ఘోరపాప మార్జించుకొంటిని. సజ్జనాపమానరూప మగునాపాపము తొలంగునట్లు మైత్రీయుక్తము లగుచూపుల నాపైని బఱపుము. ఆలోచింప నీవు విశ్వహితుఁ డైనపరమేశ్వరునకు సఖుండవు. నీవు సమస్తమును బ్రహ్మస్వరూపమునుగాఁ జూచుచున్నావు. నీకు దేహాత్మాభిమానము గాని, బ్రహ్మముకంటె నతిరిక్తమగుస్వతంత్రవస్తువు కల దనెడియభిమానము గాని లేదు. అట్టి నీకు నాచేసినయవమానమువలని వికారము లేకపోవచ్చును. అయినను మహాత్ములఁ దిరస్కరించుటవలన, మావంటిజంతువు శంకరునివలె నతిసమర్థుఁ డయినను, స్థావరత్వమును బొందక మానఁడు' ఇది పదవయధ్యాయము.

---

అని యిట్లు ప్రార్థించుచున్నరాజుం గాంచి బ్రాహ్మణుం డిట్లనియె. 'ఓరాజా! ప్రకృతికంటె వివిక్త మగుపరమాత్మతత్వజ్ఞాన మెట్టిదియో యెఱుంగనినీవు, తాదృశజ్ఞానవంతులు చేయవలసిన

వాదములను జేయుచున్నావు.తత్త్వత్రయమును దెలిసినపండితులు, దేహాత్మాభిమానముచేతను,స్వతంత్రాభిమానముచేతను గలుగుచున్న స్థాల్యాయావనాదిధర్మములును, దేహాలకుఁబరస్పరంబును నిరూపితమగుస్వస్వామిభావసంబంధమును, దక్కినవియును, బరమార్థము లని గ్రహింపరని చెప్పవలసియుండఁగా నీ వట్టి ధర్మములు పరమార్థము లని తలంచుచున్నావు. కావున నీవు జ్ఞానవంతులలో శ్రేష్ఠుండవు కావు. నీ వాత్మాభిమానాదులను విడువనిచో నీ కా పరమార్థము తెలియదు. తత్త్వత్రయస్వరూపమును బ్రతిపాదించెడివేదాంతశాస్త్రము పరిశీలింపక యీయభిమానాదులు తొలఁగవు. ఓరాజా! విస్తృతములును, గృహమేధు లాచరింపఁదగినవియు నగుయజ్ఞాదికర్మముల నిరూపించువేదపూర్వభాగములు తత్త్వత్రయబోధను జేయఁజాలవు. కాన వానివలన నభిమానాదులఁ దొలఁగించుతత్త్వజ్ఞానము గలుగదు. అవి కర్మములం దభిరుచిని గల్గించునే కాని జ్ఞానాభిరుచిని గల్గింపనేరవు. అట్టిజ్ఞానము గల్గించునవి యుపనిషద్వాక్యము లని యెఱుంగుము. ఇంతియ కాక,గృహమేధులు సంపాదించునైహికాముష్మికసుఖములు స్వప్నసుఖంబులవలెనే స్వల్పంబులును నశ్వరంబులు నై యుండును. అట్టి గృహస్థసుఖములు హేయము లని పరిగణింపనివానికి వేదాంతవాక్యము లైనను దత్త్వజ్ఞానము గలిగింపనేరవు. ఓరాజా! తత్త్వత్రయజ్ఞానమున కొక్క వేదాంతశాస్త్రశ్రవణమే కాక సంసారసుఖవిరక్తియుఁ గారణ మని తెలియుము. సంసారసుఖవిరక్తి సామాన్యముగా లభింపదు. పురుషునిమనంబు రజోగుణముచేఁ గాని, సత్త్వగుణముచేఁ గాని, తమోగుణముచేఁ గాని యుద్రిక్త మైనప్పు

డది జ్ఞానేంద్రియవ్యాపారములచేతను,కర్మేంద్రియవ్యాపారము లచేతను,బుణ్యపాపకర్మము లాచరించి తన్మూలమున నుత్కృష్ట శరీరమును గాని యపకృష్టశరీరమును గాని సంపాదించుచున్నది.ఆమనం బిట్లు వర్తించుచున్నంతకాలము నీపురుషుఁడు స్వయముగా వికారములు లేనివాఁడైనను, వాసనాధీన మగుస్వరూపముతోను, నంతఃకరణముతోను, వర్తించుచు వాసనావశమువలన విషయాసక్తుఁడై, సత్త్వాదిగుణముల కనురూపముగాఁ మెలఁగుచు, వికారములను బొందుచుఁ బంచభూతాదు లగుపదాఱుపదార్థములకును ధారకుఁడై, నామములతోఁ గూడ దేవమనుష్యాది రూపభేదముఁ గనుచు, నాదేవాదిశరీరములచే నంతర్గతము లగు రాగద్వేషాదులును, బాహ్యంబు లగుగమనాదులును నగుకర్మములను బుణ్యాపుణ్యములను జేయుచున్నాఁడు. ఓ రాజా! పురుషుఁ డిట్లు సంసారచక్రమందు వర్తించుచు, నాసంసారచక్రమందుఁ బర్వతకూటమువలె నిశ్చలుండై ప్రకృతిపరిణామరూప మగు నంతఃకరణము గలిగి, తనకు ధారకుఁడగుపరమాత్మకుఁ దాను శరీరభూతుఁడై వర్తించుచుండియు దాని నెఱుంగఁజాలక దైవవశమువలనఁ బ్రాప్తము లగుసుఖదుఃఖములను,దద్వ్యతిరిక్త మగుదుర్నివారమోహామునుబొందుచున్నాఁడు. మఱియు, "నేను దేవుఁడను" నేను మనుష్యుఁడను" "నేను స్థూలుఁడను" "నేను కృశుఁడను" అను బాహ్యాకారవిషయ మగు స్థూలవ్యవహారంబును "నేను సుఖిని" "నేను దుఃఖిని" "నే నిచ్ఛగించుచున్నాను" "నేను ద్వేషించుచున్నాను" అనెడి యాంతరంగికమగు సూక్ష్మవ్యవహారమును, దేహాత్మాభిమానము వలన, స్వస్వరూపముచే సర్వదా ప్రకాశించుజీవునివిషయమై ప

రఁగుచున్నదికాని స్వభావవిరుద్ధముగ లేదని తెలియుము. ఓమనుజాధిపా! పురుషుఁడు సంసారబద్ధుఁడగుటకును,ముక్తుఁడగుటకును మనంబె కారణము. మనంబు గుణానురక్తమగునప్పుడుసంసారమును గల్గించుచు,గుణానురక్తముకానప్పుడు మోక్షమును గల్గించుచు నున్నది. కావున సంసారమోక్షములకును దేవమనుష్యాదిభేదములు గలుగుటకును మనంబే ముఖ్యకారణం బని యెఱుంగుము.దీపము ఘృతసిక్తమగువత్తియందు వ్యాపించుచుఁబొగతోఁగూడినజ్వాలగా మాఱుచున్నది. ఆదీపమే తాదృశవర్తిగతము కానప్పుడు ధూమరహిత మగుస్వస్వరూపముతోనే వర్తించుచున్నది. అట్లె మనంబు త్రిగుణానురక్తమై యున్నప్పుడు తద్గుణానుసారు లగుపుణ్యాపుణ్యరూపకర్మములచే రాగద్వేషాదివృత్తులు గలదగుచున్నది. ఆగుణత్రయముచేఁ గలుషితము కానప్పుడు స్వస్వభావరూప మగుసత్వగుణము కలదగుచున్నది.ఆమనంబునకుఁ బదునొకండువృత్తులు కలవు. అందుఁ గర్మేంద్రియంబుల వ్యాపారములకు విషయము లై క్రియాకారము లైనవి యైదు. అట్లె జ్ఞానేంద్రియంబుల వ్యాపారములకు విషయములై జ్ఞానాకారము లైనవి యైదు. ఇవి గలసి పదియైనవి. పదునొకండవది యహంకారమమకారరూప మగునభిమానమే. ఓ రాజా! ఆపదునొకండువృత్తులలో జ్ఞానాకారము లగునైదింటికిని, గంధము, రసము, రూపము, స్పర్శము, శబ్దము, నాఁబడుతన్మాత్రలు విషయములు. క్రియారూపము లగువానికి విసర్గాదు లగుకర్మములు విషయములు. అహంకారమమకారరూప మగునభిమానమునకు శరీరము విషయము.ఆవిషయక్రమమును వివరించి చెప్పెదను వినుము. ఘ్రాణేంద్రియవృత్తికి గంధంబును,

చక్షురింద్రియవృత్తికి రూపంబును, త్వగింద్రియవృత్తికి స్పర్శమును, రసనేంద్రియవృత్తికి రసంబును, శ్రోత్రేంద్రియవృత్తికి శబ్దంబును, విషయభూతంబు లగుచున్నవి. *అట్లె పాయువృత్తికిఁ బురీషోత్సర్జనమును, నుపస్థేంద్రియవృత్తికి సంభోగంబును, పాదేంద్రియవృత్తికి గమనంబును, వాగింద్రియవృత్తికి భాషణాదులును, పాణీంద్రియవృత్తికి దానాదులును, విషయభూతము లగుచున్నవి. "ఇది నాహస్తము" "ఇది నాశరీరము" అని మమాభిమానముచే స్వీకృత మగునది తదభిమానమునకు విషయ మగుచున్నది. దానిఁ బదునొకండవ దానిఁగాఁ జెప్పుచు, నాత్మ కానిపదార్థమం దాత్మబుద్ధిని గల్గించునహంకారమును బండ్రెండవవృత్తిఁగాఁ జేర్కొనుచున్నారు. దానికిని శరీరము విషయ మగుచున్నది. ఓరాజా! పృథివ్యాదిభూతపంచకముచేతను, వానియసాధారణగుణము లగుగంధాదితన్మాత్రలచేతను, వాసనచేతను, బుణ్యాపాపరూపకర్మములచేతను, గాలముచేతను, మనస్సునకు వికారము లయినపదునొకండువృత్తులును, మొదట నూఱులకొలది యై, పిమ్మట వేలకొలది యై, తరువాతఁ గోట్ల

---

* ఓరాజా! గంధాదులయొక్కయుఁ; దద్విషయము లగుజ్ఞానములయొక్కయు వృత్తులకు భేదము గలదు గాన యిట విషయవిషయిభావ ముపపన్న మగుచున్నది కాని విసర్గాదులే కర్మేంద్రియములకు వృత్తులై యుండఁగా నవియే మగుడ వానికి విషయము లగుట సముచితము కాదని శంకింపఁ బని లేదు. విసర్గాదులు క్రియాస్వరూపములు. సామాన్యముగాఁ గ్రియలు వ్యాపారాంశముచేతను, ఫలాంశముచేతను, రెండువిధములై యుండును. కాన వ్యాపారాంశములను వృత్తులఁగాను, ఫలాంశములను విషయములఁగాను విభజించుకొని విషయవిషయిభావము నమర్చుకొనవలెను.

కొలఁదిదై యొప్పుచున్నవి. ఈవికారము లన్నియును, జీవాధి ష్ఠిత మగుమనస్సునకే చెందియుండును. కాని కేవలము మన స్సునకుఁ జెందవు. ఆజీవాధిష్ఠితమనంబునకైనను గర్మమువలనఁ జెందుచున్నవి కాని స్వతస్సిద్ధంబుగా సంభవింపలేదు. పుణ్య పాపరూపకర్మము లాచరించి తత్ఫల మనుభవించుజీవునకును, జీవాధిష్ఠిత మగుమనస్సునకును బ్రకృతిమూలము లగునీప్రవృత్తు లన్నియును గలవు. అవి యన్నియుఁ బ్రవాహమువలన నిత్య ములై, సుషుప్తియందొకప్పుడు తిరోహితము లగుచుండును. వృత్త్యాయత్తము లగుసుఖదుఃఖాదులు లేనివాఁడై పరమాత్మ యాప్రవృత్తులను వీక్షించుచుండును. ఓమానవేంద్రా! కర్మము లాచరించి తత్ఫలము ననుభవించుచున్న జీవునకు సాక్షిభూతుం డై యుండియుఁ దత్కర్మభోగము లేక స్వయంప్రకాశుఁ డగు పరమాత్మప్రకృతిపురుషులకు సంభవింపనిధర్మములతో నొప్పు చున్నాఁడు. ఆపరమాత్మప్రకృతిపురుషులలోఁ బ్రవేశించి నియం తయై ధారకుఁడై యున్నాఁడు. అతఁడు జగదాదియందుఁ గా రణభూతుఁడైనవాఁడు. అతఁడు స్వయంప్రకాశుఁడు. అతఁడు స్వరూపమువలనఁగాని స్వభావమువలనఁ గాని జననాదివికార ములు లేనివాఁడు. అతఁడు బ్రహ్మాదులకుఁ గూడ నీశ్వరుఁడు. అతఁడు జీవసమూహమునకుఁ బ్రాపకుఁడై యాధారుఁడై వెల యుచున్నాఁడు. అతఁడు సృష్ట్యాదిలీలలచే నొప్పుచున్నాఁడు. అతఁడు సమస్తభూతములకు నాధారభూతుఁడై యున్నాఁడు. ఆపరమాత్మ తనమాయచే జీవునియందుఁ దిరోహితుఁ డగు చుండును. కానఁ బ్రకృతికి వశంవదు లగువారికిఁ గానరాఁడు. ప్రకృతిపరవశు లగుపురుషులకుఁ గానరాకపోవుటచే నతఁడు సర్వ

వ్యాపి కాఁడని భావింపరాదు. వాయు వదృశ్యుఁ డయ్యు, స్వస్వరూపముచేఁ జరాచరభూతములలోపలఁ బ్రవేశించి ప్రేరణ చేయుచున్నట్లుగానే భగవంతుఁడగుపరమాత్ముఁడును, చేతనాచేతనరూపమగుజగంబున నియామకుఁడై ప్రవేశించియు, సామాన్యులకుఁ గానరాక వర్తించుచుండును. ఓనరేంద్రా! దేహి జ్ఞానోదయము వడసి యహంకారమమకారరూపమగు నభిమానమును నిరసించి దేహగేహాదులందు సంగము వదలి, మనంబును నింద్రియంబులను జయించి పరమాత్మతత్త్వమును దెలిసికొననియంతకాలంబును సంసారమందుఁ బడి పరిభ్రమించుచున్నాఁడు. అట్లయిన దేహికిఁ బరమాత్మతత్త్వ మెప్పుడు దెలియునో చెప్పెదను వినుము. సంసారతాపములకు క్షేత్రమై, జీవునిసంసారముక్తులకుఁ గారణమై, యున్నమన స్సెప్పుడు శోకమును, మోహమును, రోగమును, లోభమును, వైరానుబంధంబును, మమకారమును విడిచిపెట్టునో, యప్పుడే పరమాత్మతత్త్వమును దెలిసికొనుచున్నాఁడు. కావున నీయంతఃకరణము సహజశత్రువని యెఱుంగుము. ఉపేక్షితమగుటచే నది మిగుల వర్ధిల్లి, కావుననే నదియెక్కుడుబలము గలిగి వర్తించుచు నప్రియమును గల్గించును. అది యాత్మాపహారము చేయఁగలంతశక్తి గలది. నీ వప్రమత్తుఁడ వయి హరిచరణోపాసన మనెడియస్త్రమును జేపట్టి యాయంతఃకరణమును జయింపుము. అప్పుడు నీ కాత్మతత్త్వ మలవడును. ఇది పదునొకండవయధ్యాయము.

---

## రహూగణుఁడు భరతునిఁ గొన్ని ప్రశ్నంబు లడుగుట.

అని పల్కినభరతునివచనంబులు విని రహూగణుండు సంత

సించుచు నిట్లనియె. "ఓమహానుభావా! కృతాపరాధుండ నైనను నాయందు విరోధము లేక మావంటిలోకులను రక్షించునిమిత్తము దేహమును ధరించి యున్ననీకు నమస్కారము. సమస్తజనులచేతను బరిభూత మగుతుచ్ఛబ్రాహ్మణవేషముచే నిగూఢుండ వై, నిత్యమును బరమాత్మానుభవము గలనీపాదంబుల కభివందనంబుల నొనర్చుచున్నాను. ఓవిప్రోత్తమా! జ్వరపీడితునకు మంచియౌషధంబువిధంబునను, గ్రీష్మతాపముచే సంతప్తుం డగువానికి శీతలోదకంబుచందంబునను, గుత్సిత మగుదేహాత్మాభిమాన మనెడిమహాసర్పముచే దష్టుండ నై వివేకహీనుండ నై యున్ననాకు నీవచనంబు లమృతతుల్యంబు లయ్యె. కావున నాసంశయంబులు తొలంగునిమిత్తము నిన్నుం గొన్నిప్రశ్నంబు లడుగందలంచితిని. వానిం దర్వాత నడిగెదను. కాని యధ్యాత్మతత్త్వముచేం గ్రథిత మగుటవలన నీ విప్పుడు చెప్పిన వచనములు దుర్బోధము లైనవి; వానినే సులభముగాం దెలియునట్లు వివరించి మున్ముందు చెప్పుము. అందులకై నాచేతంబు కుతూహలపడుచున్నది. ఓయోగీశ్వరా! లోకమునం గ్రియాకలాప మొనర్చునప్పుడు, చెమ్మట, యాయాసము మొదలగునవి గల్గుట ప్రత్యక్షముగాం జూచుచున్నాము. 'నీవు శ్రమ చెందితివి' 'నేను శ్రమ చెందితిని' అనువ్యవహారముచేం గూడ నీయర్థము దృఢమూల మగుచున్నది. ఇట్లుండ శ్రమాదు లాత్మకు లేవని నీవు వచించితివి. ఆనీవాక్యమందలి తత్త్వమును సుఖముగాం దెలిసికొనవలెనని నామనంబు క్లేశ మొందుచున్నది." అని యిట్లడుగుచున్న రాజునకు భరతుం డిట్లనియె. ఓరాజేంద్రా! పృథివీవికార మగు శరీరము గలజీవుండే యొకానొకకర్మవిశేషమువలన మూఢమి

యందు సంచరించు చున్నయీవాహకజనమై యున్నది. ఇట్లు చరింపనిది పాషాణాదిరూపముగానుండి యచరము లని పిలువఁబడుచున్నవి. కర్మవిశేషమువలననే జీవునిశరీరమునకుఁ జరాచరత్వము సంభవించుచున్నది. ఆపృథివీవికారమునకు మొదటఁ బాదములు వానిపైఁ జీలమండలు, వానికి మీఁదుగాఁ బిక్కలును, వానిపై మోఁకాళ్లును, దరువాత నూరువులును, బిమ్మట నడుమును, వక్షఃస్థలంబును, మెడయును, భుజశిరస్సులును, దానియందు దారుమయ మగుశిబికయును, దానిపై సౌవీరరాజను నీశరీరమును గ్రమముగా నున్నా రని వ్యవహార మున్నది. అందుఁ బాదము మొదలు భుజశిరస్సులవఱకుఁ గలమాంసపిండములకుఁ బాదాదులనెడివ్యవహారము వచ్చినట్లె శిబికయందున్న యీమాంసపిండమునకుఁ గూడ సౌవీరరాజని వ్యవహారము వచ్చుచున్నది. ఏమాంసపిండమునందు సౌవీరరాజని వ్యవహారమున్నదో, దానికిని నీకును స్వరూపముచేతను, స్వభావముచేతను, మిక్కిలి భేద మున్నప్పటికిని, భేదము లే దని దాదాత్మ్యాభిమాన మొనర్చుకొని "నేను సింధుదేశములకు రాజ" నని చెడుమదంబున నంధుఁడ వయి మూర్తియందు రాజత్వబుద్ధి నారోపించుచున్నావు. ఇంతే కాక వాహనము మోయుటవలనఁ గల్గుదుఃఖంబు చేతనే, దీనులై, దయనీయులై యున్న యీవాహకజనమును, బలాత్కారముచే వెట్టిపనులం జేయించుకొనుచు, దయాగహితుఁడవయి వర్తించుచున్నావు. నీ వాత్మయందు రాజత్వబుద్ధి నారోపించుకొంటివి. కనుకనే నిగ్రహాదికర్తృత్వముగూడ నాత్మనిష్ఠ మగునట్లు తలంచుచుంటివి. రాజత్వ మారోపింపనిచో నీకర్తృత్వబుద్ధి కలుగనే కలుగదు. అ

ట్లాత్మయందుఁ గర్తృత్వారోపణాదికము కేవలము భ్రాంతి మూలకము. మఱియు నీవు "సమస్తజనులను రక్షించుచున్నా" నని గర్వించుచున్నవాఁడ వగుటచేతను, దేహాత్మభ్రాంతిచే నుద్రిక్తుఁడవగుటచేతను, దేహాత్మవివేకము గలపండితసభలోఁ బ్రకాశింపకున్నావు. కానవచ్చుదేహజాత మంతయును నశ్వరమే. చరాచరాత్మక మగుదేహజాతము బ్రహ్మాండంబున నుద్భవించి నశించుచున్నది. కావున నీదేహజాత మంతయు నస్థిర మైనది. అస్థిర మగుదేహాదులను స్థిరంబు లనుకొనుటయును, భ్రాంతి మూలకమే. అట్లస్థిరము లగుటవలన నబాధిత మగువ్యవహార ముచే నూహింపఁదగిన దయి. యాత్మారోపిత మగురాజత్వాదివ్యవహారమునకును, స్థూలత్వాదివ్యవహారమునకును మూల మైనది. దేహాత్మభ్రాంతికంటె నితర మైనది లేదు. దేహాదిజాతము నకు లయస్థాన మగుక్షితిమండలము నిత్య మనుకొందువేమో. అదియు దేహాదులవలెె ననిత్యమే. మనంబున కధిష్ఠాత యగు నీశ్వరునిసంకల్పరూప మగు ప్రకృతి పరమాణుసమూహముచే భూమండలమును గల్పించుండఁగాఁ గార్యమగునదియు నిత్యము కాకమానునా ? ఓరాజేంద్రా ! కృశించినదియు, స్థూల మైనదియుఁ, జిన్నదియుఁ బెద్దదియు, నిర్జీవ మైనదియు, జీవసహిత మైనదియు, నగునీచరాచరప్రపంచ మంతయు, నాత్మకంటె భిన్న మయినది శరీరజాత మంతయుఁ బంచభూతములచేతను, వానిపరిణామస్వభావముచేతను, నంతఃకరణముచేతను, సత్త్వాది గుణక్షోభక మగుకాలముచేతను, గల్పింపఁబడుచున్నది. కాని యాత్మసంబంధము దీనికి నుంతేనియును లేదు. కావున దేహాదు లాత్మకంటె వేఱయిన వని సూక్ష్మబుద్ధిచేఁ దెలిసికొనుము. దేహా

ములకంటెను భిన్న మగునాత్మస్వరూపమును జెప్పెదను వినుము.

భరతుఁడు రహూగణునకాత్మస్వరూపమును జెప్పుట.

ఆత్మ జ్ఞానస్వరూప మయినది. అది వాస్తవముగాఁ గర్మసంబంధము లేనిది అది పురుషార్థభూత మైనది. అది యంతటను జ్ఞానముచే నేకాకారమై యున్నది. దానికి బాహ్య మనియు నాంతర మనియుఁ బ్రదేశభేదము లేదు. అది గుణములచే సర్వవ్యాపకమై, సత్యమై యొప్పుచున్నది. అది దీపాదులవలెఁ గాక తననిమిత్తమే ప్రకాశించుచున్నది. దాని కళనాదు లగుషడూర్ములును లేవు. అది భగవచ్ఛబ్దముచేఁ జెప్పఁబడుచున్నది ఆత్మతత్త్వమును దెలిసినపండితు లందఱును, దాని వాసుదేవాత్మకముగాఁ జెప్పుచున్నారు. ఓరహూగణా! ఆత్మజ్ఞానము కృచ్ఛ్రచాంద్రాయణాదితపంబులచేతను, నుపవాసాదులచేతను, వైదికకర్మములచేతను, నిక్షేపముల దానముచేయుటచేతను, గృహస్థధర్మములచేతను, వేదాభ్యాసముచేతను, జలోపాసనముచేతను, నగ్న్యుపాసనముచేతను,సూర్యోపాసనముచేతను, నెంతమాత్రమును లభింపదు. కాని యది కేవలము భగవద్భక్తుల పాదపరాగసేవచేత లభించును. మహాత్ములు గాన భగవద్భక్తులు సంతతమును గ్రామ్యకథలను జెప్పుకొనక యుత్తమశ్లోకుఁ డయిన వాసుదేవునిగుణముల వర్ణించుకొనుచుఁ గాలముఁ బుచ్చుకొందురు. కావున నమ్మహాత్ములసేవ చేయుచు సర్వకాలములందును వారు నుడువుచుండుసత్కథలను వినుటవలన ముముక్షువు మనంబు వాసుదేవునియందుఁ బ్రవేశించును. గృహమేధిసౌఖ్యములందు విరక్తుఁడవయి మహాత్ములసేవ చేయుదువేని నీ కాత్మజ్ఞానము గల్గు. ఓరాజా! నేను బూర్వజన్మమందు భరతుం

డనెడిరాజ నై ప్రసిద్ధి జెందితిని. అప్పుడు నే నైహికసుఖములందును, స్వర్గాదులందును నపేక్ష విడిచి భగవదారాధనమును సల్పుచు నొకానొకమృగమునందుఁ బుత్రప్రేమ నుంచి భగవదారాధనము విడిచి సర్వకాలములందును దాని వర్ధింపసాగితిని. ఆజన్మమును విడిచి మృగసంబంధముచే రెండవజన్మమందు మృగమ నై పుట్టితిని. ఓవీరా ! వాసుదేవార్చనప్రభావము నే వర్ణింపలేను. భగవదర్చనప్రభావమువలన జనిత మగుస్మృతి నన్నామృగజన్మమందు సైతమును వదలలేదు. పిమ్మట నే నామృగశరీరమును విడిచి బ్రాహ్మణుఁడ నై పుట్టితిని. ఇప్పుడు నేను జనసంపర్కాదులకు భయపడుచు,నిస్సంగాభిలాషి నై గృహాదులందుఁ బ్రవేశింపక యేకాకి నై సంచరించుచుందును.ఓరాజేంద్రా! సంగ మెప్పుడును జీవుని బద్ధునిఁగాఁ జేయుచుండును. కాన జ్ఞానులస్నేహము చేసి యందువలనఁ గలుగుజ్ఞాన మనెడినిశాతకరవాలమును బూని దేహమందును, దదనుబంధులందును గల సంగ మనువృత్తమును ఛేదించి భగవంతుని చేష్టితంబులను జెప్పుటచేతను వినుటచేతను, భగవద్భక్తిని బొంది సంసారాటవియందుఁ జరించువాని కవధి యైనభగవంతునిఁ జెందును." ఇది పండ్రెండవయధ్యాయము.

---

అని చెప్పి వెండియు బ్రాహ్మణుం డిట్లనియె. "ఓరాజేంద్రా! జీవసమూహము మాయచే దురతిక్రమ మగుకర్మమార్గమందుఁ బ్రవేశింపఁజేయఁబడి సత్త్వరజస్తమోగుణములచే విభక్తములగుశుభాశుభకర్మములందుదృష్టిగల్గి, పురుషార్థత్రయమునందు నాసక్త మై, కర్మముల సంపాదించుకొని, వర్తకుఁడు ధనమును

గొంత తీసికొని ధనార్జనమునకై యడవి కేఁగినట్లు,తనయొనర్చిన కర్మకలాపమును గొని కర్మఫలజనితము లగుజన్మముల సంపాదింప సంసారాటవిం ద్రిమ్మరుచున్నది. అంతియ కాని సుఖంబు చెందలేదు. వనమందు సంచరించుచున్నవానిఁ గొట్టి తద్ధనమును జోరు లపహరించినట్లు, సంసారాటవియందుఁ జరించుజీవసమూహమును బాధించి యింద్రియములు భగవదారాధనరూప మగు ధనము నపహరించును. ఘోరాటవియందు సృగాలాదు లగు క్రూరజంతువులు మేఁకను హింసించినట్లు దారపుత్త్రాదులు "నీవు నాభర్తవు" "నీవు మాతండ్రివి" అని సమీపించి ప్రమత్తునిఁగాఁ జేసి హింసించుచుండురు. మఱియు, లతలచేతను, దృణగుల్మాదులచేతనుదుర్గమ మగునరణ్యమునఁ బ్రవేశించి జనుఁడచ్చట భయంకరము లగునీఁగలచేతను, దోమలచేతను, బరివృతుఁడై పర్వర్తించినట్లు, జీవుఁ డనంతము లగుకర్మబీజములవలన నుత్పన్నము లగుఫలవృక్షములకు క్షేత్రమువంటిగృహస్థాశ్రమమందు వర్తించుచుఁ గారణాంతరములవలన రాజభటాదులచే దలుమఁబడుచుండును. జీవుఁ డట్లు వర్తించుచు గంధర్వపురము వలె నస్థిర మగుమనుష్యశరీరమును జూచి, నిత్య మని భావించుచుండును. మఱియు వాఁ డొకొక్కప్పుడు దుర్జను లగునితరుల సువర్ణాదికమును జూచి తన కుపకారము గల్గించునని తలంచి స్వీకరించి యాదుర్జనులచే నుపహతుఁ డగుచుండు. జీవుఁడు ధనమం దాత్మబుద్ధి గల్గి వర్తించుచు, దప్పి గొన్నవాఁడు మృగతృష్ణలోనుండి జలమును సంపాదింప నడవియందుఁ బర్వెడునట్లు ధనార్జనమునకై సంసారమందుఁ గ్రుమ్మరుచుండు. ఓరాజా! నరుఁ డడవియందుఁ జరించునప్పుడు వాయువువలనఁ బ్రబలినపరాగము

దిక్కులను గప్పి యంధకారబంధురముగాఁ జేసి గ్రుడ్డివానిఁగాఁ జేయుటచేఁ దనమార్గమును గానలేఁడు. అట్లే జీవుఁడును గృహస్థాశ్రమమందుఁ జరించుచు భార్యయందలియనురాగాతిశయము చేఁ గనులు గానక రజోగుణముచే నపహృత మగుజ్ఞానము గలవాఁడై, ధర్మమర్యాదలను దెలియఁజాలకుండు. అడవియందు వర్తించునరుండు కనఁబడకుండఁ జెవులుచిల్లులువడునట్లు చేయుఝిల్లీనాదంబులకును, గుడ్లగూబల కఠోరధ్వనులకును, మనంబున బాధజెందుచు, దప్పిగొని యెండమావులందలిజలంబును గైకొనఁ బర్విడుచుండును. ఆఁకలి గొని విషవృక్షముల నాశ్రయించుచుండును. అట్లే జీవుఁడు సంసారమందుఁ గ్రుమ్మఁచు, ఝిల్లీరవంబులవలెఁ గర్ణశూలము లగుశత్రువు లాడువాక్యములకును, గూబలధ్వనులవలె నప్రియము లగురాజభటుల దుస్సహవాక్యములకును, మనంబునఁ బీడ నొందుచు, క్షుత్పిపాసితుఁ డయి మృగతృష్ణాజలమువలె సుఖాభాసము గల్గించుధనాదులను సంగ్రహింప నెంచి, విషవృక్షసమానులును, బరోపకారరహితులునునగు పాపిష్ఠుల నాశ్రయించుచుండు హేయము లగుసుఖముల ననుసరించు చుండును. అరణ్యగామి యగునరుఁడు తోయంబు లేనినదులకై పోవుచు నచ్చట జలాదులను బొందలేక తిననన్నము లేక యట్టిటు మట్టాడుచు, నొకచో దావాగ్నిఁ బొంది దానివలనఁ దాప మందుచు, శోకాతురుఁడై మిక్కిలి నిర్వేదము చెందునట్లు, జీవుండును, నిష్ఫలము లగుపాషండాశ్రమములఁ జేరుచు, నన్నాదులు లేక దాయాదుల నాశ్రయించుచు, నొకప్పుడు దావాగ్నితుల్యమును, నభిమతవస్తుశూన్యమగుటచే దుఃఖదంబు నగుగృహంబును జెంది దుఃఖాతురుండై

యక్షులవంటి రాజులు తనప్రాణతుల్యమగు ధనం బపహరింపఁగా నేమియుఁ జేయలేక నిర్వేదము నొందుచుండు. ఓరాజా! అట్లు జీవుండు ధనంబును రాజభటాదులపాలు గావించుకొని దుఃఖితచిత్తుండై యొకప్పుడు దుఃఖాతిశయంబున మూర్ఛిల్లును. ఒకప్పుడు గంధర్వపురమువలె నస్థిర మగు బంధువర్గమును సమీపించి సుఖవంతుఁడనైతి నని ముహూర్తకాలము మోదమందుచుండును. పాంథుఁడు పర్వతాదుల నధిరోహింపఁ దలంచి ముండ్లచేతను, పాషాణంబులచేతను జిఱుతాలచేతను బాధితము లగుపాదంబులు గల్గి, ఎదురు దాని నెక్కలేక విచారముచే విమనస్కుఁ డగుచున్నట్లు జీవుండు పర్వతమువలె దురారోహము లగుయజ్ఞాదికర్మకలాపము నాచరింప నెంచి కంటకపాషాణతుల్యము లగువిఘ్నములచే నుపహతుఁడై యమ్మహాకార్యముల నాచరింపఁజాలక దుఃఖితమనస్కుఁడయి, ప్రతిక్షణమందును జఠరాగ్నిసంతప్తుఁడై భార్యాదులను మిక్కిలి కోపించుచుండును. ఈదేహియొకప్పుడు కొండచిలువవంటి నిద్రచే గ్రస్తుండై యేమియు నెఱుంగఁజాలఁడు. వీఁడు సర్పతుల్యులగు దుర్జనులచేఁ బీడితుఁడై శవమువలెఁ బడియుండును. వీఁడు వివేకమును బూర్తిగా విడిచి దుఃఖంబనెడి చీకటినూతియందుఁ బడుచుండును. ఒకానొకప్పుడు జీవుఁడు స్వల్పసుఖజనకములగు పరదారధనాదుల నపేక్షించి తదధిపతులచేఁ బీడితుఁడై యవమానింపఁబడు. ఒకవేళ నతికష్టంబునఁ బరదారాదులను బొందఁ గల్గినను వా రతని వంచించి యాస్వల్పసుఖంబులను నపహరింతురు. ఒకప్పుడు దేహి శీతాదిబాధలకుఁ దాళఁజాలక వానిఁ దొలంగింపఁజాలు వస్త్రంబులను, గృహంబులను సంపాదింపఁ

దలంచియు సంపాదింపఁజాలక, తద్బాధలకు దుఃఖమందుచుండు. మఱొకప్పుడు తనస్వల్పధనము నభివర్ధింప నెంచి వీఁడు క్రయ విక్రయాదిరూప మగు వ్యవహారమును జేయుచు, ధనవాంఛచే నెవ్వరితోను విద్వేష మొందుచుండును. మఱియు సంసారమార్గ మందు వర్తించుచు దేహి ధనంబును బోఁగొట్టుకొని, తద్దుఃఖా తిశయముచే శయనింపక కూర్చుండక గృహమందు నిలువక విహరింపక మగుడ ధనంబును సంపాదింప నెంచి పరులవలనఁబొం దఁజాలనప్పుడు పరులనుండి యపహరింపఁ బొటువడి యవమా నమును బొందుచుండు. దేహి యిట్లు ధనవ్యత్యాసముచేఁ బలువు రతో వైరమును సంపాదించుకొని వివాదములను జేయుచు దుర త్యయమగు సంసారమార్గమందు భయంకరము లగుశ్రమలచే తను, ధనబాధలచేతను, ద్వేషాదులచేతను విపన్నుండై మృత ప్రాయుఁ డగుచుండు. ఆసంసారమార్గమందు వర్తించుచు దేహి మృతినొందినపిత్రాదులను గుఱించి విలపించుచుఁ దన కుదయిం చిన పుత్త్రాదులను గుఱించి సంతసించు మార్గము నెప్పటికిని విడువఁజాలఁడు. ఓరాజా! ఆసంసారమార్గమును దాఁటింపఁ జేయుసాధన మెద్దియును నిందు లేదు సుమీ! ఈమార్గమును సామాన్యులా దాఁటలేరు. భూనిమిత్తకమగు ద్వేషమునువహించి బలంబున దిగ్గజంబుల ధిక్కరించెడిశూరులు పరస్పరంబును బో రాడి యుద్ధభూమియందుఁ బ్రాణములను విడుచుచున్నారు. కాని వారైనను భూతదయగల్గి ద్వేషము విడిచినయోగీంద్రుఁడు పొం దెడు వైకుంఠమును బొందఁజాలరు. ఓరాజా! దేహి, లతా తుల్యములగు కామినీ భుజముల నూఁతఁగాఁ గొని, యావనితా లత నాశ్రయించి, మధురవచనంబులను బలుకుచున్న బాలకులం

దధిక మోహము గల్గి, సంసారమందు వర్తించుచుండు. మఱియు భగవత్సంబంధి యగు కాలచక్రమువలనఁ గల్గు జననజరామరణాదులకు భయమందుచు, దత్పరిహార మొనరింప బకములతోను గృధ్రములతోను సమానులగు పాషండదైవతములందు భక్తియుక్తుండగుచున్నాఁడు అట్లు వర్తించుచు నాదేవతల సేవించుటవలన ఫలంబు లేదని తెలిసికొని పిమ్మట నిర్మలమగు బ్రాహ్మణవంశంబున నుద్భవించి, యాబ్రాహ్మణులకు విహితములగు నుపనయనాద్యాచారములను దుష్కర్మవాసనచే నప్రియము లని భావించుచు సదాచారభ్రష్టులయి వానరతుల్యులగు శూద్రప్రాయులతో స్నేహముచేసి వారిస్త్రీలను వివాహమాడి రహస్యమందు వారితో సంభాషించుచుఁబరస్పరము భావలోకన మొనర్చుటచే నింద్రియసుఖం బొంది, మరణకాలమును మఱచి ద్రుమతుల్యము లగుగృహంబులందుఁ గ్రీడించుచు, నధిక మగు మైథునేచ్ఛ గలవాఁడగుటచే మిక్కిలి దీనుఁడై పుత్త్రులందును భార్యలయందును వాత్సల్యంబున వర్తించుచు, సంసారబంధనంబునఁ దగులువడి దానిఁ దప్పించుకొన నశక్తుండై యుండును. మఱియు నొకానొకప్పుడు మృత్యుభయంబువలన, గిరికందరమువలె భయంకరమగురోగాదిదుఃఖములం బడిలతవంటికర్మవాసన నవలంబించి వర్తించును. అనంతర మాదుఃఖంబు నతిప్రయాసముచేఁదప్పించుకొని దేహివర్ణాశ్రమాచారనిష్ఠులగు జనముతోఁ గలసి మసలుచుఁ బూర్వమునవలెఁ బ్రవృత్తిమార్గ మభిలషించుచున్నాఁడు. ఓయరిందమా! పెక్కేలి? భగవన్మాయవలన సంసారమార్గమందు వర్తించుచు దేహి యిప్పటికిని పారమును జూడలేదు! ఓరహూగణా! ఆకారణమువలన నీవును భూతములను

దండింపక వానితో మైత్రి చేసి విషయాసక్తుండవు కాక, ప్రకృతి
సంబంధ మనెడివృక్షంబును ఖండింప భగవదారాధనరూప
మగుకత్తిని గొని సంసారమార్గమునకుఁ బార మగు హరిపద
మును బొంది సుఖ మొందుము.'' అని యిట్లుపదేశించినభర
తునివాక్యంబు విని రహూగణుం డిట్లనియె ఓయోగేశ్వరా !
ఓధీరా! సమస్తజన్మములందును మానవజన్మ మెంత శోభన
మైనది! భగవంతుని యశోగుణములను వర్ణించుటవలన నిర్మ
లమగు చిత్తములు గల మీవంటి మహాత్ముల స్నేహమును
సంపాదింపఁ గల జన్మంబు లే జన్మంబులు కాని తక్కినవానితో
నేమి ప్రయోజనము? భగవద్భక్త సంగముఁ బడయఁజాలనిచో
దేవాది జన్మంబులును వ్యర్థంబు లే. ఓమహాత్మా ! ముహూర్త
కాలముమాత్రమే సంభవించిననీసమాగమమువలన దురూహ
మగు మూలము గలయవివేకము నశించినది. దీనిఁ జక్కఁగా
నాలోచింప, నిరంతరమును మీవంటి మహాత్ములపాదపద్మముల
నుపాసించి తత్పరాగముచే సమస్తపాపములును దొలంగించు
కొన్న వానికి వాసుదేవునియందు నిర్మలభక్తి గలుగుట కెంత
మాత్రమును సందేహము లేదు ఇది యొకయాదృచ్ఛికమును
గాదు. లోకంబున జ్ఞాను లేరూపంబునఁ జరింతురో తెలిసికొనుట
కష్టము. కావున నందఱకును వందనంబు లాచరించెదను. మహా
త్ములకు నమస్కారము. బాలుర కెల్లరకును వందనంబులు. నీవం
టి యౌవనవంతుల కెల్లను నమస్కారములు. తమమాహాత్మ్య
మును గప్పిపుచ్చి మెలఁగువటువుల కందఱకు నభివందనంబులు.
అవధూతవేషమున భూమియందుఁ జరించుబ్రాహ్మణులకు నమ
స్కారములు. ఆమహాత్ములవలన మావంటిరాజులకుమంగళంబులు

ప్రాపించుఁగాక" యనెను. ఓపరీక్షిన్నరేంద్రా! అపరిచ్ఛిన్నమగు ప్రభావము గల్గి యాబ్రాహ్మణుఁడు తనకు రహూగణుఁడవమాన మొనర్చినప్పటికిని నతనికిఁ బరమకారుణికస్వాంతంబున నాత్మతత్త్వం బుపదేశించి బద్ధస్నేహుండగు నతనిచే నమస్కృతుం డై యింద్రియంబులను నూర్ములనునంతఃకరణమునుజయించినవాఁ డగుటచే నిండిన మహార్ణవంబువడువున నిశ్చలుం డై భూమండలంబున విహరింపఁజొచ్చెను. సౌవీరపతి యగురహూగణుం డును నాజడభరతునివలన నధ్యాత్మతత్త్వంబును జక్కఁగాఁ దెలిసికొని యప్పుడే యవిద్యారోపిత మగు దేహాత్మాభిమాన మును విసర్జించెను. ఓరాజేంద్రా! భగవద్భక్తులయుఁ దదాశ్రితులయుఁ, బ్రభావ మీకీతిగానే యుండును" అని వచించిన శుకుం గాంచి,పరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె.."ఓమహాభాగవతా! సమస్తమును దెలిసిన నీవు జీవలోకమునకు సంప్రాప్త మగు సంసారమార్గమును జక్కఁగా బోధించితివి. కాని యింద్రియం బుల దొంగలుగాను, దారసుతాదులను సృగాలాదులుగను, కల్పించి పరోక్షముగా వర్ణించితివి. అది యధికవివేకవంతులకు సులభముగాఁ దెలియుటకు సందియము లేదు.అదినావంటియవ్యుత్పన్నవివేకునకుఁ జక్కఁగా దెలియదు. కాన నీవు నాయందు దయ యుంచి యతికష్టంబునఁ దెలియఁదగినయీనీపరోక్షవచనములను బ్రత్యక్షోపయుక్తము లగుశబ్దంబులను బ్రయోగించి తదీయార్థము మావంటివారి కవగత మగునట్లు వివరింపుము" అనిన విని శుకుం డి ట్లనియె. ఇది పదుమూఁడవయధ్యాయము.

---

ఓరాజా ! సత్త్వరజస్తమోగుణంబులచేఁ గర్మంబులు నా

త్త్వికములనియు, రాజసములనియుఁ, దామసములనియుఁ ద్రివిధంబులయ్యె. అందు సుఖసాధనములు సాత్త్వికములు. దుఃఖసాధనంబులు రాజసకర్మములు. ప్రమాదాలస్యాదులను సాధించునవి రజస్తమోమూలకములు ఆయాకర్మములవలన దేహాత్మాభిమానులకు, దేవమనుష్యాను రాది దేహపరంపర గలుగుచున్నది. ఆదేహాపరంపరకు సంయోగము. వియోగము బాల్యయౌవనాద్యవస్థలును సంభవించుచుండును. ఇదియే సంసారము. ఇది యనాదిగా వచ్చుచున్నది. తాదృశసంసార మనుభవించుటకు ద్వారభూత మగు నింద్రియవర్గము గలదు. ఆసంసారమార్గము ఘోరంబగు నరణ్యమువలె దుర్గమ మయినది. ఈకానవచ్చుజీవలోక మంతయును భగవంతుండగు విష్ణువునకు వశవర్తినియగు మాయచే దుర్గమ మగు సంసారమార్గమందుఁ ద్రోయఁబడి ధనసంపాదనాసక్తిగల వర్తకసమూహామువలె స్వదేహానిష్పాదితము లగు పూర్వోక్తకర్మముల సంపాదించి ఫలకాలంబున వాని ననుభవించుచు, విఫలంబులును, బహువిఘ్నంబులచే నుపహతములు నగుచేష్టల నొనర్చుచు, శ్మశానమువలె నశుంగళరూపమగు సంసారగహనమందుఁ దిరుగుచు, సమస్తతాపంబులనుదొలంగించునదియు వాసుదేవునిచరణారవిందములకు మధుకరతుల్యు లగు భక్తులచే ననుసరింపఁ బడుచున్నదియు నగుభక్తిమార్గమునుబొంద లేదు సంసారాటవియందింద్రియంబులనిపించుకొనుచున్నను, గర్మముచే నవి దొంగ లని తెలిసికొనుము. వర్తకాదులు ధర్మోపయోగార్హ మగుధనమునతికష్టముచే నార్జించుకొనుచుండఁ జోరు లపహరించుచుందురు. అట్లె యింద్రియంబులు సాంసారికసుఖభోగముచేఁ గుబుద్ధియును నజి

తేంద్రియుండును నగుపురుషుం డతికష్టముచే సంపాదించిన పరలోక హితకర మగు భగవదారాధనరూప మయిన ధర్మమును, దర్శనముచేతను, స్పర్శనముచేతను, శ్రవణముచేతను, నాస్వాదనముచేతను, నాఘ్రాణముచేతను, నంతఃకరణవృత్తు లగుసంకల్పవ్యవసాయములచేతను నపహరించుచున్నవి. మఱియుఁ బేరుచే దారపుత్త్రాదు లని వ్యవహరింపఁబడుచున్నారు; కాని వారు కేవలము క్రియచే సృగాలాదులను మింతురని నమ్ముము. తోఁడేళ్లు నక్కలు మొదలగునవి రక్షింపఁబడు చున్న మేఁకపిల్లను బలాత్కారమున నపహరించును. అట్లె దారపుత్త్రాదులును, నతిలుబ్ధుఁడైన గృహాశ్రమావలంబి యాత్మాపహారమున కిష్టపడకున్నను వాఁడు చూచుచుండఁగనే యాత్మాపహారమును జేయుచుందురు. ఇంతే కాక గృహస్థాశ్రమము సస్యక్షేత్రమువంటిది సస్యక్షేత్రమున నున్న వృక్షాదులను ఛేదించి దహించి దున్నుచున్నను, నందలి బీజంబులును మూలంబులును బూర్తిగా నశింపక బీజావాపనకాలమం దది లతలచేతను, బోదలచేతను, తృణంబులచేతను, దుర్గమం బగుచున్నది. అట్లె గృహాశ్రమరూపమగుకర్మక్షేత్రమునందుఁగూడఁ గర్మబీజంబులు పూర్తిగా నశింపక యుచితకాలమందుఁ బ్రబలి విజృంభించుచున్నవి. గృహము కామనులకుఁ బెట్టెవంటిది. కర్పూరభాజనమునందలికర్పూరముపూర్తిగా నశించినను దద్వాసనలు మిగిలియున్నట్లు గృహమందలి కర్మము నశించినను దద్వాసనలు మిగిలియుండకమానవు. కర్మక్షేత్రమగు నిట్టిగృహాశ్రమమందు, దేహి ప్రవర్తించుచుండును. క్షేత్రమందలిధాన్యాదికము మిడుతలును, బక్షులును, దస్కరులును, మూషికములును నపహరించినట్లు గృహాశ్రమక్షేత్రమందువర్తించు

చున్నవాఁడు బహిఃప్రాణంబుగా నెంచుకొనుచున్న ధనాదులను మశకతుల్యులగు నీచపురుషు లపహరించుచుందురు. ఒకానొకప్పుడు దేహి సంసారమార్గమందుఁ బరిభ్రమించుచు, నహంకారమమకారములచేతను, విషయాభిలాషచేతనుఁ బుణ్యాపుణ్యరూపకర్మవాసనలచేతను, గలుషిత మగుమనంబుచే గంధర్వపురంబువలె ననిత్యము లగు స్వశరీరమును, బుత్త్రాదులశరీరములను నిత్యము లని భావించుచుఁ బానమందును భోజనమందును, మైథునాదులందును వ్యసనములందును, నధికాసక్తి గలిగి మృగతృష్ణవలె సుఖాభాసకములగు విషయములనుగూర్చి యనుసరించుచు నొకానొకప్పుడు రజోగుణకలుషితమగుమనంబుగలవాఁడై సకలదోషంబుల కునికిపట్టయి యగ్నిపురీషమై యున్నసువర్ణమును నగ్నిని గోరుచున్నవాఁడు కొఱవిదయ్యమునువలెఁ జేపట్టుచున్నాఁడు. ఆ దేహి యొకప్పుడు నివాసంబులను, క్షేత్రములను, ద్రవిణంబును, దక్కిన తన్ననుసరించి బ్రతుకువానియందును మిక్కిలి యభినివేశము గల్గి సంసారాటవియం దట్టిట్టు గ్రుమ్మరుచున్నాఁడు. మఱియు నొకప్పుడు పెనుగాలిచే నుత్థితమగు పరాగంబుచే నావృతనేత్రుఁ డయినప్పుడు దిక్కులం గాంచక వర్తించునట్లు దేహి సుడిగాలికిఁ దుల యగులలనరజోగుణాతిశయముచే నజ్ఞత్వమును గల్గించుచుఁ దనతోడపై గూర్చుండి యాకాలంబున రాత్రివలె నప్రకాశకమగు ననురాగముచే జ్ఞానంబు నావరింపఁ దదనురాగచ్ఛన్నబుద్ధియై ధరాపరాగముచే గ్రుడ్డివాఁడగు మానవునివలె వర్తించుచు, ధర్మమర్యాదల నతిక్రమించినఁదులకు సాక్షిభూతులగు దేవతల నెఱుంగఁడు. వేఱొకప్పుడు పురుషుఁడు శబ్దాదివిషయములు పురుషార్థశూన్యంబు లనియొక

మాఱు దెలిసికొనియున్నను దాను దేహచింతచే నాత్మవిషయకమగు స్మృతిని గోల్పోయి మృగతృష్ణాజలమున కెనవచ్చుచు నపురుషార్థము లయినను బురుషార్థములుగాఁ గానవచ్చు శబ్దాది విషయముల ననుసరించి పర్విడుచుండును. మఱియొకప్పుడు మిక్కిలి పరుషములయిన గుడ్లగూబలయు, ఝిల్లీకీటకములయు నినాదములవలెఁ బరుషములై సంభాషణంబున సంభ్రమంబు గల్గించు శత్రుజనులయు రాజభటాదులయు నపమానవచనంబులు కర్ణశూలంబులై, కర్ణమూలంబులను హృదయంబును బీడించుచు నుండ దీనుండై వర్తించును. ఇంకొకప్పుడు పురుషుఁడు సుకృతహీనుండై విషతిందుకాది వృక్షములకును గాకిపొండ మొదలగు విషలతలకును, విషకూపంబులకును, నెనవచ్చుచుఁ దమధనములచే దుష్టము లగు నిహలోకసుఖంబులు గాని, యదృష్టంబు లగు కీర్త్యాదులుగాని సంపాదింపలేక జీవచ్ఛవంబులవలె వర్తించుధనవంతులసమీపమునకు ధనాభిలాషియై జీవన్మృతుండై పోవుచున్నాఁడు. వేఱొకప్పుడు వేదములను, దేవతలను, బ్రాహ్మణులను నిందించుదురాత్ములప్రసంగంబులచే వంచితుండై నిర్జలమగు నదీగర్తములోఁ బడినవాఁడు జలము పొందకపోవుటయే కాక శిరంబు పగిలి తదీయమగు బాధలను బొందుచున్నట్టు లిహలోకమున సుఖప్రాప్తి పొందకపోవుటయే కాక పరలోకమందు దుఃఖప్రాప్తిని గూడ కల్గించు పాషండకులమం దుదయించును. మఱియు జీవుఁ డెప్పుడు పరులఁ బీడించియు నాహారాదులను సంపాదింపలేఁడో, యప్పుడు కుశాదితృణములు మాత్రమే గల్గుపితృపుత్త్రాదులను భక్షించుచుండును. వేఱొకప్పుడు వాఁడు భోగ్యపదార్థరహితుఁడై, దుఃఖపరంపరకు నిలయమయి, కావునే దా

వాగ్నితుల్యమై, యున్నగృహంబును బొంది, యిష్టవస్తువులు ల భింపకపోవుటచేతను, ననిష్టంబుల నివర్తించుకొనలేకపోవుటచే తను, జనించు దుఃఖాగ్నిచే మిక్కిలి సంతప్తుండై "అక్కటా! నేను సుకృత మాచరింపక మందభాగ్యుండ నైతి"నని పశ్చాత్తా పంబు నొందును; మఱియు నొకప్పుడు కాలంబుచేఁ బ్రతికూల మయినరాజకులము రాక్షససదృశమై, ప్రియాతమధనరూప మగు ప్రాణముల నపహరింప జీవలక్షణము లగుహార్దాదులను విడిచి శవంబుపలె నుండును. వాఁడింకొకప్పుడు సంకల్పవికల్ప రూప మగుమనోరథము ననుసరించ వచ్చినపితృపుత్త్రాదులు కా లాంతరమం దుండనివా రగుటచేతను, బురుషాంతరులచే ననుభ వింపఁబడనివా రగుటచేతను స్వప్నదృష్టపదార్థములవలె ననిత్యు లైనను, నిత్యు లని తలంచుచు, స్వప్నసుఖముంబోలె బిత్రుపు త్త్రాదిసుఖంబును క్షణమాత్ర మనుభవించును. మఱియు గృ హస్థులగువారికిఁ గర్మవిధులుపర్వతమంతయుప్పగానున్నవి. దేవా! యధికధనముచేతను,శరీరాయాసముచేతను, సాధ్యములయినయ జ్ఞాదికర్మకలాపములకుప్పను యథావిధిగా నాచరించినసమాప్తి చేయఁ దలంచి యారంభించి మధ్యకాలమున లోకసంబంధంబు లగు దుఃఖంబులచేతను, దదితరవిఘ్నములచేతను బీడితచిత్తుఁ డై, పర్వత మధిరోహింపఁ దలఁచి పోయి మధ్యమార్గమున గం టకపాషాణాదులచే దుర్గమమగు క్షేత్రమునం బడినపురుషునివలె మిక్కిలి ఖేదంబును బొందును. ఒకప్పుడు వాఁడు దుస్సహమగు శరీరములోనున్న జఠరాగ్నిచే సత్వహీనుఁడై కృశించి తనభా ర్యపై మిక్కిలి కోపము వహించును. అట్లు కోపించి వాఁడు కొండచిలువవంటి నిద్రచే గ్రస్తుండై తన్నును నితరులను బ్ర

కాశింపఁజేయుని యజ్ఞానంబున మునింగి యరణ్యమువలెనే జః
శూన్యమగు ప్రదేశమున శయనించి బ్రాహ్మణత్వాదుల బాహ్య
కారము నేమియు నెఱుంగక దూరముగాఁ బరిహరింపఁబడినశః
మువలె నుండును. వాఁడు మఱొక్కప్పుడు క్రూరసర్పములవంటి
దుర్జనులచే విఱువఁబడిన కోఱపన్ను వంటిగర్వము గలవాఁడై :
ద్రాదుల కవకాశ మిచ్చి,యాయవమానంబునకుఁ జిత్తంబు సంత
తంబును దుఃఖించుచుంటఁ జేసి విజ్ఞానంబును గోల్పోయి
చీకఁటికూపమువంటి మహాదుఃఖమందు గ్రుడ్డివానివలెఁ, బడ
చుండును. మఱొకప్పుడు వాఁడు సుఖలేశము లగువిషయోపభో
గములను వెదకుచుఁ దత్సాధనము లగుపరదారపరధనముల స్వీ
కరింపఁ బ్రారంభించి పరులచేఁగాని తత్ప్రభువులచేఁ గాని మ
తుఁడై నరకప్రాయ మగుకారాగృహమందు బద్ధుం డగును. ఓ
రాజా! జీవున కిట్టిదురవస్థలు సంప్రాప్త మగుటవలన నిహలోకఁ
బున నైనను బరలోకమున నైనను బ్రవృత్తిమార్గమందుఁ గ
ర్మమే సంసారమునకు జన్మక్షేత్రం బని నుడువుచున్నారు. ఓర
జా! కారాగృహబద్ధుఁ డయినవాఁ డతికష్టముచే నాబంధంబ
ను దొలంగించుకొని యాధనాదికము ననుభవించుచుండ వేఱొ
కఁడు వచ్చి హరించును. వానివలన మఱియొకఁ డపహరించును
ఇట్లాధనాదికము హద్దు లేకుండ నపహృతమగుచుండును గా
తనచే ననుభవింపఁబడదు. వేఱొకప్పుడు వాఁడు శీతంబునకున
వాతంబునకును, నాతపంబునకును, నాధిదైవికంబులును, నా
భౌతికంబులు నాఁబడు మిగిలినతాపంబులకును, దగిన ప్రతీక
రంబుల నొనర్పసమర్థుండు కాక యెడతెగనిదుఃఖంబునకుగు
రైయై వర్తించును. మఱియొకప్పుడు వాఁడు తనయొద్ద నున్న స

ల్పధనంబును వర్ధింపనెంచి వ్యవహారము చేయుచు, నితరులయొద్ద నుండి కొంత ద్రవ్యమును స్వీకరించుచు, ధనలోభము చే జనవి ద్వేషమును బొందుచుండును. ఒకప్పుడు వాఁడు తనధనంబును సర్వంబును గోల్పోయి కావుననే తల్పములు నాసనములు మొదలగు భోగ్యపదార్థంబులు లేమిఁ దననుోరథంబులు వ్యర్థంబులగుటచే విచారించుచుఁ దత్సంపాదనము కై యన్యధనంబును స్వీకరింప నుద్యుక్తుండయి యందువలన నవమానాదులను బొందుచుండును. ఇట్లు ధనవ్యత్యాసముచే వైరానుబంధంబులను వర్ధించుకొనియు నాజాత్యాభిమానమగు పూర్వవాసనచే నావైరవిషయములనే వివాహాదిక్రియచే సంబంధంబును గూర్చుకొనుచుండు. ఇట్లు నానావిధంబు లగుక్లేశముల చేతను వక్ష్యమాణంబులగు రాగద్వేషాదుల చేతను, విస్తృత మగుసంసారమార్గమందు నాపదలను బొంది మృతు లయినపిత్రాదులను విడిచి పుట్టినపుత్త్రాదులందు మనుకారముంచి మగుడ నదేని విపత్తి సంప్రాప్తమైన నో మనంబున దుఃఖించుచు, మోహమునొందుచు దీనాలాపంబులు పలుకుచుఁ గన్నీరు కాల్వలుగట్ట నేడ్చుచు,మగుడఁ దనకుఁ బుత్త్రాదు లుద్భవించినచో నెక్కుడుగా సంతసించుచు, రాఁబోవు దుఃఖంబులకు భీతిల్లుచు, నొకప్పుడు తనపుత్త్రాదుల గుణచేష్టలను వర్ణించుకొనుచు,ఖేదమోదంబులచే మోహమందుచు,సాధుకర్మవర్జితుఁడై యిప్పటికిని జీవలోక మానంసారమార్గము పారంబును బొందలేకుండెను. తాదృశసంసారమార్గము పారంబును జేర్చునదియాధ్యాత్మికయోగము చేతను,గర్భయోగము చేతను ననుగృహీత మగుభక్తియోగము తక్క వేఱొక్కటి లేదు. మఱియు నిరతిశయానందరూప మగుపరమాత్మనుబొం

దుటకుపాయభూత మయినయోగానుశాసనమును, శాంతస్వభావులై ప్రాణంబును జయించి మననశీలురై సర్వభూతహితులైన మహాత్ములాచరింపఁ గలుగుదురు కాని వానిని దిగ్గజంబుల జయింపఁగల్గియు మనంబును జయింపఁజాలని రాజర్షులెంతమాత్రమును బొందలేరు. ఇంతేకాక వా "రీభూమి నాది" యని మమతాభిమాన ముంచికొని పరస్పరమును వైరానుబంధముగల్గి యుద్ధము చేయుచు నాభూమిని విడిచి మృతినొందుదురు. ఓరాజా సంసారమార్గమందు వర్తించువారికి సుఖదుఃఖంబులును, రాగద్వేషంబులును, భయాభిమానంబులును, మోదఖేదంబులును, శోకమోహంబులును, మాత్సర్యంబును, నీర్ష్యావమానములును క్షుత్పిపాసలును, ఆధివ్యాధులును, జన్మంబును, జరామరణాదులును, దప్పక సంభవించుచుండు. మఱియు భగవన్మాయారూప యగు ప్రమద స్వయముగాఁ గౌఁగిలించుకొని యాపురుషుల వివేకాత్మకమగు జ్ఞానంబును నశింపఁజేయును. అందువలన వారలా స్త్రీలకు క్రీడాభవనంబులు నిర్మింప నారంభించి తత్ప్రవృత్తివిషయులై యాకులహృదయులై యావిహారగృహమందు వర్తించుపుత్రులను బుత్రికలను, గళత్రములను, గనుఁగొనుచు, వారి మృదుమధురభాషణములును, వీక్షణంబులును, చేష్టలను, హృదయంబు నపహరించుచుండ నేమియుఁ జేయలేక యింద్రియంబుల జయింప నసమర్థుండు కావున తనయాత్మను దుఃఖనరకంబునఁ ద్రోయుచున్నాఁడు. ఓ రాజా! పరమాణువు మొదలు ద్విపరార్థపర్యంతంబును గలుగు కాలమే స్వరూపముగాఁ గల్గి మిక్కిలి శీఘ్రముగాఁ బరిభ్రమించుచు బ్రహ్మ మొదలు తృణమువఱకుఁ గలజీవుల యాయుర్దాయముల లవఘు

టికాదిరూపముగా లెక్కించుచుఁ బ్రమత్తులగువారి యాయువు నపహరించుచున్న భగవంతుం డగువిష్ణుని కాలచక్రమువలన మరణము సంభవించునేమో యని భయమందుచు నాచావును దప్పించికొని యమరత్వము వడయనెంచి, యాకాలచక్రమాయుధంబుగఁ జేసికొని వర్తించు వాసుదేవునిఁ దిరస్కరించి, రాఁబులుగులవంటివారును, గృధ్రములవంటివారును, గొంగలవంటివారును, నార్యజనులు చెప్పిన సిద్ధాంతంబులనుండి బహిష్కృతులును నగుపాషండదేవతలను పాషండదేవతాసంకేతంబులచే నభిముఖముగాఁ జేసికొని యారాధించుచుందురు. వారెప్పుడా పాషండదేవతలవలన ఫలంబును బొందలేక వారిచే వంచితులగునట్లు తెలిసికొందురో యప్పుడే వారు బ్రహ్మకులమున నుద్భవించి యజ్ఞపురుషుఁ డగువాసుదేవునారాధనరూపములును బ్రాహ్మణులకు విహితంబులును నగు నుపనయనాదు లయిన శ్రౌతస్మార్తకర్మంబులను నొనరింప నిష్టపడక, పిమ్మట శూద్రకులంబును బొందుదురు. అచ్చట నట్టివాఁడు, నిగమోక్తములగు నాచారములవలనఁ దనకుఁ శుద్ధిలేకపోవుటచే శూద్రస్త్రీని బెండ్లియాడి దానియందు సంతానమును గనితత్కుటుంబభరణమునకుఁ బాటుపడుచు వానరజాతివలె గ్రామ్యసుఖంబు లొందుచుండును. ఆశూద్రకులమందుఁ బ్రతిబంధంబు లేకపోవుటచే యుక్తములగు దేశకాలములఁ బ్రతీక్షింపకుండఁ గ్రీడించుచు మిక్కిలి విషయాతురమైన బుద్ధితో వర్తించుచుఁ బరస్పరముఖావలోకనాదులగు గ్రామ్యకర్మములచేఁ గాలావధిని మఱచి వర్తించును. మఱియు వాఁడు, వానరము దారసుతాదులతో వృక్షమందుఁ గ్రీడించునట్లు దారసుతాదివత్సలుండై వృక్షమువలెఁ గేవల

మైహిక సుఖంబులను గల్గించు గృహంబున విహరించుచు సంసార బంధనముచే వివశుండగు. దేహి యిట్లు సంసారమార్గమందు సుఖదుఃఖంబుల ననుభవించుచు, మృత్యు వనెడి గజమువలనఁ గల్గుభయముచేఁ గొండగుహ కైన యగురోగాద్యాపదలందుఁ బడి తన జీవనమునకు హేతుభూత మగుకర్మరూప మయిన లత నూఁతగాఁ గొని యాయాపద నుండి యతికష్టముచే విముక్తుఁడయి యిట్లనవరతంబును, సంసారమార్గంబునఁ జరించుచు నరశరీరము దాల్చినజీవసమూహమును బొందుచుండును. ఇట్లు మీఁదనున్న లోకాంతరములందు వర్తించువారు గూడ నీసంసారమార్గమందుఁ బరిభ్రమించుచున్నా రని యెఱుఁగుము. ఓరాజేంద్రా! గరుత్మంతుని గమనమహిమ నీఁగ లెఱుంగఁజాలనట్లు మహాను భావుఁడగుఋషభపుత్త్రునిమార్గంబును మనంబుచేతనైన నను సరింప నేనృపాలుండును నర్హుండు కాఁడు. ఓరాజా! ఋషభపుత్త్రుఁ డగునాభరతుండును భగవదర్పితచిత్తుండు కావున, విడువఁ దర ము కాకపోయినను, మనోహరు లగుపుత్త్రులను, హితులను, రాజ్యంబును, ధనంబును, కళత్రములను, యౌవనవంతుఁడై యుండియే మలమునుంబోలె విసర్జించెను. ఓనరేంద్రా! యాభర తుండు వానిని కేవలము విసర్జించుటయే కాదు. వానియందత నికి సుంతేనియు నభిలాషమే లేదు. ఆలోచింప భారతవర్షరూప మగుభూమండలంబును, బుత్త్రులను, ధనములను, స్త్రీలను, దేవేంద్రాదులకు సైతమును బ్రార్థనీయము లై, యతనిదయ నభిలషించుచు స్వయముగా వరించిన సంపదలను, మనంబున నైన సుంతేనియు నభిలషింపలేదు. ఇది యద్భుతము కాదు. సర్వకాలములందును వాసుదేవునిపాదారవిందములను డెందం

బునఁ గొల్చుమహాత్ములు భగవత్సేవకంటె మోక్షము సైతము స్వల్పమని తలంచు చుందురు. అట్టివారి కీ చంచలసంపద లందు వైరాగ్యము గలుగుట యుక్తమేకదా? ఓరాజేంద్రా! తనకు సంప్రాప్తమైనమృగశరీరంబును విడువ నెంచి యాభరతుండు వాసుదేవు నుద్దేశించి, 'ఓదేవా! యాగభోక్తవై, యాగప్రభువవై, యాయా యవతారంబులచే వర్ణాశ్రమధర్మంబులను సంరక్షించుచు ధర్మానువర్తు లగువారని రక్షించుటలో నేర్పు వహించి, యధ్యాత్మయోగమే శిరంబుగాఁగ వర్తించుచు, భక్తి యోగగమ్యుండవై, ప్రకృతికి నియంతవై, చిదచిత్తులు శరీరముగాఁ గలిగి యాశ్రితులసంసారబంధంబును హరించునీపాదంబుల కభివందనంబు''లని పలికి ముక్తుం డయ్యె. ఓనరేంద్రా! భగవద్భక్తులచే నుతింపఁబడు నిర్మలగుణంబులకును, భూతహితాచరణము మొదలగు సత్కర్మంబులకును నిలయు మైనయీభరతునిచరిత్రము యశస్కరం బనియును. మంగళావహ మైనదనియు, నాయుర్దాయము గల్గించుననియు, ధనప్రాపకమనియు స్వర్గసాధనమనియు, ముక్తిసాధనమనియు, నుతింపఁబడు చున్నది. ఎవ్వఁ డా చరిత్రంబును వినునో, చెప్పునో, యనుమోదించునో, యాపురుషుఁడు స్వయముగనే సమస్తవాంఛితంబులును పొందుచున్నాఁడు. పరులను గోరవలసినది యొక్కటియును లేదు. ఇది పదునాల్గవయధ్యాయము.

---

## శుకుఁడు భరతసంతతిని దెలుపుట.

ఓరాజేంద్రా! భరతునిసచ్చరిత్రంబును వర్ణించితిని. ఇఁక నతనిసంతతిని వర్ణింతును వినుము. ఆభరతునకు సుమతి యను

నాత్మజుండు కలడు. అనుమతి ఋషభుం డాచరించిన యోగచర్య నవలంబించి వర్తించుచుండఁ గొందఱు పాషండులు పాపీయ మగు స్వబుద్ధిచే నతఁడు బౌద్ధదేవత యని కల్పింతురు. కాని యతఁ డట్టివాఁడు కాఁడు. అనుమతికి గృధ్రసేనయందు దేవతాజిత్తను కొడుకు కలిగె. ఆ దేవతాజిత్తున కాసురి యను భార్యయందు దేవద్యుమ్నుం డను తనయుం డుద్భవించె ఆ దేవద్యుమ్నునకు ధేనుమతి యను భార్యయందుఁ బరమేష్ఠి యను నాత్మజుం డుదయించె అతనికి సువర్చల యను భార్యయందుఁ బ్రతీహారుఁడు పుట్టెను. ఆప్రతీహారుఁడు పెక్కుర కధ్యాత్మవిద్య నుపదేశించి యాయుపదేశంబువలననే నిర్మలాంతఃకరణుం డై పరమపురుషు నుపాసించెను. ఆప్రతీహారునకుఁ బ్రతిహర్త యనియు, ప్రస్తోత యనియు, నుద్గాత యనియు ముప్పురు పుత్త్రులు గలిగిరి. వారు ముప్పురును, యాగాదిక్రియలందు మిక్కిలి నిపుణులు. వారిలోఁ బ్రతిహర్త స్తుతి యనుభార్యవలన "అజుఁడు, భూమ" యను నిర్వురఁ దనయులం బడసె. అజానుజుఁ డగు భూమ, ఋషికుల్య యనుభార్యవలన నుద్గీథ యనుపుత్త్రుఁ గాంచె. ఆయుద్గీథను దేవకుల్య యను భార్యయందుఁ బ్రస్తరుఁ డుదయించె. ఆప్రస్తరునకు విరక్తయందు విభు వనుసుతుం డుద్భవించె. ఆవిభునకు భారతియందుఁ బృథుషేణుఁడును, నతని కాకూతి యను పత్నియందు నక్తుం డనువాఁడును గలిగిరి. ఆనక్తుండు కృతి యను భార్యవలన గయుం డనువానినిఁ బడసె.

## గయోపాఖ్యానము.

ఓరాజేంద్రా! రాజర్షులలో గయుం డుదారకీర్తి యని ప్రఖ్యాతి వహించె అతఁడు లోకంబును రక్షింపఁదలంపుచే శుద్ధసత్త్వమూర్తి

నవలంబించిన విష్ణువునంశసంభూతుండనియుఁ బ్రశస్తమనస్కుం డనియుఁ బ్రఖ్యాతి వహించెను. మఱియు ధర్మాద గుణములచే మహాపురుషుఁ డయ్యెను. అమ్మహాత్ముఁడు తనకులధర్మం బని ప్రజలను భయమువలన రక్షించుచు నాహారాదు లిడి పోషించుటయు నిష్టవరంబుల నిచ్చి సంతసింపఁ జేయుచుఁ గుమార బుద్ధితో శ్లాఘించుచుండెను. అట్లె తన కాశ్రమధర్మమని పంచ మహాయజ్ఞంబుల నొనర్చుచుఁ దత్ఫలంబు లన్నివిధంబులచేతను బ్రహ్మాది దేవతలకంటె నధికుండును మహాపురుషుండును నగు పరబ్రహ్మమందు ముఖ్యమైనపురుషార్థంబని సమర్పించుచు నుండెను. ఆగయుండు కులధర్మమగు ప్రజాపాలనాదులచేతను, బ్రహ్మవిదుల పాదపద్మంబుల సేవించుటవలనఁ బ్రాప్తమగు భగవద్భక్తియోగముచేతను మాటిమాటికిని నంతఃకరణంబును నిర్మలముగాఁ జేసికొని దేహాత్మభ్రాంతిని వదలి తనయాత్మయం దంతరాత్మగా నుండి ప్రత్యక్షమగు పరమాత్మతత్త్వం బెఱింగి దేహాత్మభ్రాంతిని స్వాతంత్ర్యాత్మభ్రాంతిని విడిచి భూమండలంబును జక్కఁగాఁ బరిపాలించెను. పాండవేయా! పూర్వకాలవృత్తాంతంబులు తెలిసిన మహాత్ములాగయుని మాహాత్మ్యము గాథలను గొన్నింటిని జెప్పిరి. వానినిఁ జెప్పెద నవధరింపుము. అతఁ డొనరించినకర్మములవంటి కర్మములచే నేపురుషుం డాగయుని ననుసరింపఁగలఁడు? ఆ గయుఁడు శ్రుతివిహితంబులగు యజ్ఞాదుల నొనర్చినవాఁ డు. అతఁ డెక్కువ తెలిసినవాఁడు. అతఁడు వర్ణాశ్రమధర్మంబులను రక్షించినవాఁడు. అతఁడు సమస్తసంపదలను బొందెను. అతఁడు సత్పురుషుల కధిపతి యయ్యు వారిని సేవించువాఁడు. ఇట్టిమహాగుణంబులు

గలవాఁడు భగవదంశసంభూతుం డగుగయుండు దక్క వేఱొక్కరుఁ డెవఁడు గలఁడు? సత్యము లగునాశీర్వచనంబులు గల శ్రద్ధా మైత్రీ దయాదు లగు దక్షకన్యకలు తమతేజంబులచే నే వాని శ్రేష్ఠునిఁగ నొనర్చిరో, భూదేవి యెవనిగుణములందు వాత్సల్యము గల్గి స్రవించుచున్నపాదుగు గలదై నిష్కాముఁడైన యెవనిప్రజల కోర్కులను నెఱవేర్చుచుండెనో, యాగయుని నెవఁ డనుకరింపఁగలఁడు? ఓరాజేంద్రా! వేదంబులును వేదోక్త కర్మంబులును నిష్కాముండైనయాగయునికోర్కుల నిచ్చుచుండెను. యుద్ధమందుఁ దిరస్కృతులై రాజు లందఱు నతనికి బలులఁ దెచ్చి యిచ్చుచుండిరి. ధర్మపరిపాలనంబు చేతను, దక్షిణాదులచేతను బూజితు లయినబ్రాహ్మణులు లోకాంతరమువిషయమై తా మొనర్చిన ధర్మఫలంబులలో నాఱవపాలు గయునకు నొసంగుచుండిరి. అమ్మహాత్ముఁ డింద్రునకు మదంబు గల్గించునంతటి సోమపానంబులు గలయాగంబుల నొనర్చెను. ఆగయుఁ డంతరాయంబులఁ బొరయనిభక్తియోగంబుచే సమర్పించిన యాగాదిఫలమ్మును యాగశరీరకుఁ డయినపరమాత్మ స్వయముగాఁ బ్రీతితో స్వీకరించెను. విశ్వంబునకుఁ బ్రాణభూతుం డగు నాభగవంతుండు ప్రీతుం డగుటచేఁ జతుర్ముఖుండు మొదలు తృణమునవఱకుఁ గల దేవమనుష్యతిర్యగాదులకు సంప్రీతి గల్గుట నాబ్రహ్మాదు లందఱును నాగయునియం దెక్కుడుప్రేమ గలవారైరి. ఇట్టియుదార చరిత్రము గలగయుని ననుకరింప లోకంబున నెవండు సమర్థుండు? ఆగయునకు జయంతి యనుకళత్రమందుఁ జిత్రరథుండును, స్వాతివరుండును, ధనుండును, నను మువ్వురు పుత్త్రు లుదయ మందిరి. వారిలోఁ జిత్రరథున కూర్జయందు

సమ్రాట్టనెడి తనయుం డుద్భవించెను. ఆసమ్రాట్టునకు నుత్కలయందు మరీచి జన్మించెను. మరీచికి బిందుమతియందు బిందుమంతుఁ డుదయించెను. బిందుమంతునకు సుషేణయందు మధు వుదయించెను. మధువునకు సుమనస్సునందు వీరవ్రతుం డుద్భవించెను. ఆవీరవ్రతునకుఁ బ్రబోధయందు మధు వనియుఁ బ్రమధు వనియు నిరువురు తనయులు జన్మించిరి. వారిలో మధునకు సత్యయందు భౌమనుండు గల్గెను. ఆభౌమనునకు దూషణయందుఁ ద్వష్ట యనుకుమారుండు జనించెను. ఆత్వష్టకు విరోచనయందు విరజుఁడు సంభూతుండయ్యె. ఆవిరజునకు విషూచియందు శత్రుజిత్తు మొదలగు నూర్వురు తనయులును, నొకకన్యకయును గల్గిరి. ఓరాజా! కడపటివా రయినశత్రుజిదాదులకు జనకుండగువిరజుండు, విష్ణువు దేవగణంబులనుంబోలెఁ బ్రియవ్రతవంశంబునువంశకీర్తిచే నలంకరించెను." ఇది పది యేనవయధ్యాయము.

---

అని నుడువుచున్న శుకుంగాంచి రాజేంద్రుం డిట్లనియె, ఓమునీంద్రా! సూర్యునికిరణము లెంతవఱకుఁ బ్రసరించునో, యెంతవఱకుఁ జంద్రుండు శుక్లపక్ష కృష్ణపక్షములందు నక్షత్రగణంబులతోఁగూడ సంచరించునో, యంతవఱకుఁగలభూమండలము వైశాల్యాదులను గుఱించియు, దీనియం దున్న జంబూద్వీపాదులను గుఱించియు నీవు సంగ్రహంబుగా వచించితివి. కాని విశేషించి చెప్పలేదు. ఇప్పుఁడా భూమండలమానంబును, దదవాంతరభేదములను, నామములను, విస్తారముగా వినఁ గుతూహలంబున నున్నాఁడ. భూమండలముల వైశాల్యాదులను వినుటవలన నేమిలాభమని యందువేమో? అందు లాభము లేక

పోలేదు. ఈభూమండలమంతయు సత్వాదిగుణపరిణామ మగు భగవంతుం డగు పరమాత్మస్థూలరూపము. భగవంతుని స్థూల శరీరమందు మనం బావేశించియున్నచోఁ బిమ్మట సత్వాదిగుణ రహితమై, యంగుష్ఠప్రమాణము గలదై స్వయంప్రకాశమై, వాసుదేవాది శబ్దంబులచే బోధిత మగు పరమాత్మయం దావే శించి స్థిరంబుగా నుండుటకు సమర్థ మగును. కావున గురూత్త మా ! యీభూమండలము మానలక్షణాదుల నడుగుచున్నాను" అని యడిగిన నరేంద్రునకు మునీంద్రుం డిట్లనియె. 'ఓమహా

శుకుండు రాజునకు భూపరిమాణాదులనుఁ జెప్పుట.

రాజా ! అనంత మయినబ్రహ్మాండము భగవంతునిమాయాగుణ ము లగుసత్వాదుల పరిణామమే. అది భగవంతునివిభూతి. భగ వద్విభూతి కంతర్గతము లగు లోకములనామములను రూపంబు లను, నన్నింటిని బూర్తిగా, మనంబున నూహించుటకుఁగాని వాకొనుటకుఁగాని దేవతలకుఁ గలంత యాయుర్దాయంబుగల పురుషుండైనను సమర్థుండు కాఁడు. కావున భూగోళమం దుండు ముఖ్యము లయినయవాంతరభేదంబులను, నామములను, మాన ములను, లక్షణంబులను వివరించెదను. ఓరాజా! ప్రసిద్ధ మగునీ జంబూద్వీపము భూవలయ మనుపద్మంబునకుఁ గోశంబులవలెఁ దనర్చుద్వీపాదుల కంతర్వర్తియై యంతఃకోశంబువలెఁ దనర్చు చున్నది. ఈద్వీపము లక్షయోజనంబుల వైశాల్యముగల్గి తామ రపాకునవలె సమవర్తులమై యున్నది. ఇందు, దొమ్మిదివర్షంబులు గలవు.అందొక్కొక్కటితొమ్మిదివేలయోజనంబులపరిమాణంబు గలది. అఖండముగా నుండు జంబూద్వీపము నీలము, శ్వేతము శృంగవంతము, నిషధము హేమకూటము హిమాలయము,

మాల్యవంతము, గంధమాదనము, నాఁబడు నెనిమిది పర్వతంబులచే నసంకీర్ణముగా విభజింపఁ బడినది. ఆతొమ్మిదివర్షంబులలోను, నిలావృతము మధ్యప్రదేశంబున నున్నది. ఆయిలావృతమునకు మధ్యమందుఁ గులగిరుల కధిపతి యగు బంగారుకొండ గలదు. అది యౌన్నత్యమునందు లక్షయోజనముల ప్రమాణము కలది. అది భూమండల మనెడికమల మునకుఁ గర్ణికవలెఁ దనర్చుచున్నది. దానియూర్ధ్వభాగము ముప్పదిరెండువేల యోజనముల వైశాల్యము కలది. ఆపర్వతరాజము మూలమందుఁ బదాఱువేల యోజనములపరిమితి గలిగి భూమండలంబున కంతర్భాగంబును బ్రవేశించియున్నది. ఇలావృతవర్షంబున కుత్తరోత్తరంబునఁ గ్రమముగా నీలము, శ్వేతము, శృంగవంతము నాఁబడుపర్వతములు మూఁడును, రమ్యకము, హిరణ్మయము కురువు నాఁబడు వర్షములమూఁడింటికిని సీమాపర్వతములై యున్నవి. అవి తూర్పునకు దీర్ఘముగా వ్యాపించి యున్నవి. ఆపర్వతములు పూర్వపశ్చిమములందు లవణసముద్రము నంటి వర్తిల్లుచున్నవి. అవి రెండువేలయోజనముల విస్తీర్ణతచే నొప్పుచున్నవి. వానిలోఁ దొలుతొలుతదానికంటె నుత్తరంబున నుండుపర్వతము దైర్ఘ్యంబునఁ బదునొకొండవవంతుచేఁ దఱిగి (అనఁగా నీలముకంటె శ్వేతమును, శ్వేతముకంటె శృంగవంతమును బదునొకండవవంతుచేఁ బొట్టివై) యున్నవి. అట్లె యిలావృతమునకు దక్షిణమున నిషధము, హేమకూటము, హిమాలయము నాఁబడు పర్వతములు తూర్పునకు దీర్ఘముగా వ్యాపించి నీలాదులతో సమానము లగుపరిమాణములు గల్గి నీలాదులవలెఁ బదివేల యోజనంబులపొడవున వర్తిల్లుచుఁ గ్రమముగా హరివర్షము

నకును, గింపురుషవర్షమునకును, భారతవర్షమునకును, సీమా పర్వతము లగుచున్నవి. అట్లె యిలావృతమునకుఁ దూర్పునను గంధమాదనమును, పడమట మాల్యవంతమును, నీలనిషధపర్వతములపర్యంతమును వ్యాపించి రెండువేలయోజనములప్రమాణము గలవై భద్రాశ్వమునకును, కేతుమాలమునకును మర్యాదాపర్వతము లగుచున్నవి. మఱియు మేరువునకు నలుదెసలను, మందరము, మేరుమందరము,సుపార్శ్వము,కుముదము నాఁబడు నాలుగుపర్వతము లయుత యోజనపరిణామము లయి ప్రతిబంధకములయి వఱలును. అందు మేరువునకుఁ దూర్పున మందరమును, దక్షిణమున మేరుమందిరమును, బడమట సుపార్శ్వమును నుత్తరమునఁ గుముదంబును వరుసగా వెలయుచుండును. ఆనాలుగు గిరులందును గ్రమముగా మామిడిచెట్టును, నేరెడుచెట్టును, గదంబవృక్షంబును, వటతరువును, బదునొకొండువేల యోజనముల యౌన్నత్యము గల్గి విలసిల్లు. ఆతరురాజముల శాఖాసమూహములు నూఱుయోజనములవఱకువిస్తరించి యున్నవి. మఱియు నాగిరులందుఁ గ్రమముగా క్షీరములతోను మధువుతోను, చెఱకురసముతోను, నిర్మలజలముతోను, నొప్పు నునాల్గు హ్రదంబులు కలవు. ఓరాజా! స్నానపానాదులచే నాహ్రదములను సేవించు గంధర్వగణములు స్వభావసిద్ధము లగు నణిమాదు లగునష్టైశ్వర్యములనుగాంచిపరఁగుచున్నారు.ఆగిరులందు నాలుగుదేవోద్యానములు గలవు. అవి క్రమముగా నందనమనియుఁ, జైత్రరథ మనియు, వైభ్రాజమనియు, విశ్వతోభద్రమనియుఁ జెప్పఁబడును. అందు దేవతాలలామలు సురవరసహిత లై గంధర్వులు సంతతము తమమహిమను గానము

చేయుచుండ సంతసంబున విహరించుచుందురు. మందరశిఖరము నకుఁ గ్రిందుగా నున్నదై, పదునొకండువందల యోజనముల యౌన్నత్యమున నొప్పుచు నున్నదేవచూతము, మందరశిఖరము లంతేసి యమృతతుల్య ఫలములను ఫలించు చున్నది. ఆఫలములు బాగుగాఁ బరిపక్వము లై క్రిందఁ బడి శిథిలములు కాఁగా వానివలనఁ బ్రవహించురసము మధురమై సుగంధము కలదై, యితరసుగంధములచేఁ బరిమళితమై మిక్కిలి యరుణకాంతుల నొప్పుచు "అరుణోద" యను నదీ రూపము నొంది మందరశిఖరమునుండి క్రిందికిఁ బ్రవహించి యిలావృతవర్షము పూర్వభాగము నంతను దడుపుచున్నది. పార్వతీదేవియనుచర స్త్రీ లాయరుణానదీరసమునుఁ బానము చేయుచుందురు. ఆలలనాలలామల యావయవములను స్పృశించి వచ్చువాయువే సకలదిశలయందును బదియోజనములదూరము దాఁక సువాసనను బ్రసరించు నని చెప్పవలసియున్నప్పుడా స్త్రీల శరీరము లెంతపరిమళవంతము లై యుండునో వేఱె చెప్పవలయునా? మేరుమందరశిఖరంబున జంబూవృక్షము కలదని చెప్పితిని. దానిఫలములుగజశరీరములంతప్రమాణము గలవై సూక్ష్మబీజము లయి యుండును. ఆ ఫలములూర్ధ్వమునుండి క్రిందఁ బడి శిథిలములై రసప్రవాహమును బ్రవహింపఁ జేయుచున్నవి. ఆప్రవాహమే జంబూనదియని పేరొందియిలావృతవర్షముదక్షిణ భాగమును, దన్నును దడుపుచున్నది. ఆనది యట్లు ప్రవహించుచున్నప్పు డుభయతీరంబులందును గలమన్ను తద్రసముతో సంయుక్తమై వాయ్వగ్నిసంయోగమువలన విపాకము నొంది సువర్ణ మగుచున్నది. జంబూనదివలనఁ గలిగినది గనుక నే దానికి

జాంబూనదమనెడి నామము లభించినది. ఆసువర్ణమును దేవతలు తమ యువతీలలామలతోఁగూడ గిరీటములు కడియములు మొలత్రాళ్లు మొదలగు నాభరణంబులుఁగా నిర్మించికొని సతతంబును ధరించుచున్నారు. సుపార్శ్వపర్వతమున గొప్పకదంబవృక్షము గల దని చెప్పితిని. ఆవృక్షరాజముకోటరంబులనుండి యైదుసందిళ్లంత స్థూలములగు నైదుమధుధారలు సుపార్శ్వశిఖరమునుండి క్రిందికిఁ బాఱుచు నిలావృతముపశ్చిమభాగమును, నాపర్వతప్రాంతమును బరిమళింపఁజేయు చున్నవి. ఆమధుధారలను బానముచేసినవారి ముఖపరిళముచేఁ బరిమళితమగువాయువు నూఱుయోజనంబులదాఁక నెత్తావులను బ్రసరింపఁజేయుచున్నది. అట్లె కుముదపర్వతమం దున్న వటవృక్షము శతవలిశ మనెడినామమున నొప్పుచున్నది. దానిస్కంధములనుండి కొన్నినదములు ప్రవహించుచున్నవి. అవి, పాలు మొదలగు పానీయములును భక్ష్యములు,వసనములు భోగస్థానములును శయ్యాదులు విభూషణములు మొదలగుకోర్కులను నెఱవేర్పఁజాలినవి. అవి కుముదపర్వతశిఖరమునుండి క్రిందికిఁ బ్రవహించుచు, నిలావృతము నుత్తరభాగంబున నున్నలోకులను సంతసింపఁజేయు చున్నవి. ఆనదములను స్నానపానాదులచే సేవించువారికి యావజ్జీవమును సుఖముతప్ప, నొకప్పుడయినను శరీరము ముడుతలు పడుట, తల నరయుట, శ్రమము రోగము చెమటదుర్వాసన ముదుసలితనము మరణము నపమృత్యువు శీతోష్ణములవలనఁ గలుగువైవర్ణ్యము, రాగద్వేష భయాభిమానాదులును సంభవింపనేరవు. భూమండల మనెడి కమలమునకుఁ గర్ణికవలెఁ దనర్చు మేరువునకుఁ జుట్టును గురంగము కురరము

కుంభము వైకంకతము త్రికూటము శిశిరము పతంగము రుచకము నిషధము సితివాసము కపిలము శంఖము వైదూర్యము చారువిహంగము ఋషభము నాగము కాలాంజనము నారదము మొదలగు పర్వతములు కేసరములవలెఁ దనర్చుచున్నవి. మఱియు జఠర దేవకూటపర్వతములు మేరువునకుఁ దూర్పున వేయియోజనముల దూరమునఁ బ్రవర్తిల్లుచుఁ బదునెనిమిదివేలయోజనముల దైర్ఘ్యము గలిగి రెండేసివేలయోజనముల యున్నతత్వమును, వైశాల్యమును గలవై యుత్తరమునకు విస్తరించుచునొప్పుచున్నవి. దైర్ఘ్యమునందును, నౌన్నత్యమునందును, వైశాల్యమునందును సమానము లగు పవన పారియాత్ర పర్వతములు మేరువునకుఁ బశ్చిమభాగంబునను దక్షిణంబునఁ గ్రమముగాఁ దూర్పునకు విస్తరించుచున్న కైలాసకరవీర పర్వతములును నుత్తరంబునఁ ద్రిశృంగమకర పర్వతములును గలవు. ఈ యెనిమిది పర్వతములచేతను బరివృత మైన మేరుపర్వతము దర్భలచేఁ బరివృత మగు నగ్నిహోత్రునిచందమునఁ బ్రకాశించుచున్నది ఆమేరువు మూర్ధంబున మధ్యభాగమునందుఁ బదివేలయోజనముల వైశాల్యము గల్గిసమచతురశ్రమై, శాతకౌంభి యనుపేర నొప్పుచున్న చతుర్ముఖుని పురంబు నిర్మితమై యున్నది. దానికిఁ జుట్టును, నష్టదిక్కులందును నష్టదిక్పాలు రగునింద్రాదులచేఁ బాలితము లగు నెనిమిది పురంబులు గలవు. అవి ప్రత్యేకము రెండువేలయేడువందల యోజనముల వైశాల్యమున నొప్పుచుఁ, గ్రమముగా నమరావతి, తేజోవతి, సంయమని, కృష్ణాంగన, శ్రద్ధావతి, గంధవతి, మహోదయ, యశోవతి యనునామంబుల వెలయుచున్నవి.

ఇది పదాఱవ యధ్యాయము.

ఓరాజా ! యోగస్వరూపుఁ డగువిష్ణుమూర్తి వామనరూపమున నవతరించి ముల్లోకములను బాదముచేఁ గొల్చుచుండెను. అప్పు డుపరిభాగంబున బ్రహ్మాండకటాహామంత రంధ్రము గల యతని వామపాదాంగుష్ఠద్వారమున బాహ్యజలము లన్నియు లోనికిఁ బ్రవేశించినవి. ఆజలధారలు త్రివిక్రముని పాదతూళనముచేఁ గల్గిన కుంకుమ మనెడి కింజల్కములచేఁ దనరారుచు, స్వభావముచేతనే సకలదురితముల నిరసింప సమర్థములై సమస్తలోకములపాపముల నెల్ల నాచమనము చేసినంతనే తొలంగునట్లుచేయుచు, భగవత్పది యనునామమునఁ బిలువఁబడుచు విష్ణుపద మనునామము గలయాకసంబునఁ జిరకాలంబునకు నదీరూపముగా నవతరించెను. ఆయూర్ధ్వంబుననే ధ్రువమండల మొప్పుచున్నది. దృఢసంకల్పుఁడును, భక్తశ్రేష్ఠుండును, నగుధ్రువుండు, దినదినమును వర్ధిల్లెడి భక్తియోగమునఁ బ్రేమాతిశయముకలవాఁడై, దానిచే సంతరంగము ద్రవించుచుండ, నేత్రము లుత్కంఠతచే వివశములై యర్ధనిమీలితములై బాష్పజలమును వెల్లిగొలుపుచుండ, నందువలన నొడలినిండఁ బులకాంకురంబు లెగయుచుండ నాభగవత్పదీజలప్రయును మాకులదేవత పాదోదక మని యత్యాదరంబున శిరంబునఁ దాలుచుచున్నాఁడు. మఱియు సప్తర్షులు తత్ప్రభావము నెఱింగినవారై, సర్వాంతరాత్ముఁ డగు వాసుదేవునిగూర్చి యం దవిచ్ఛిన్నభక్తియోగము దమకు లభించుటకే ధర్మార్థకామాది పురుషార్థములను, కైవల్యమును నిరసించినవారై తమకు సంప్రాప్తమగుభక్తినిగూర్చి ముముక్షువులవలె, నీ గంగానదియె మాతపంబునకు ముఖ్యఫలం బనితలంచుచు సగౌరవముగా జటాకిరీటములందు వహించు

చున్నారు. ఇట్లు ధ్రువునిచేతను, సప్తర్షులచేతను బహూకృతయై గంగ యనేకసహస్రకోటులసంఖ్యను మీఱిన విమానములచే సంకుల మయిన యాకాశమార్గమువలన నవతరించుచు, నిందు మండలము నావరించి దిగి దిగి మేరుమూర్ధమున నున్నబ్రహ్మ

### గంగానదికి వేఱువేఱు నామంబులు గల్గుట.

పురంబు ప్రవేశించె ఆపురంబున గంగానది నాలుగుపాయలుగ విభక్తంబై సీతయనియు,నలకనందయనియుఁ, జక్షువనియు, భద్ర యనియు, వ్యవహరింపఁబడుచు, నాల్గుదిక్కులకుఁ బ్రవహించుచు సముద్రములకుఁ బ్రవహించుచున్నవి. అందు సీతానదిబ్రహ్మపుర మునుండి బయలు వెడలి మేరువునకుఁ గేసరములవలెఁ దనర్చు చున్న పర్వతశిఖరాగ్రములందు ముందుగాఁబడి పిమ్మట నట నుండి క్రిందికిఁ బ్రవహించుచు, గంధమాదనశిఖరమునఁ బడి భద్రాశ్వవర్షము మధ్యమునుండి తూర్పుగాఁ బ్రవహించి, లవణ సముద్రమును గలయుచున్నది. అట్లె చక్షున్నది మాల్యవన్న గాగ్రంబునంబడి క్రిందికి దిగి యప్రతిహత మగువేగమునఁ గేతు మాలవర్షంబున వ్యాపించి పశ్చిమాభిముఖంబుగాఁ బాఱి పశ్చి మ సముద్రంబునఁ గలియుచున్నది. అట్లె భద్రానదియు మేరు శిఖరంబు నుండి స్రవించుచు, నొకగిరిశిఖరమునుండి మఱియొక గిరిశిఖరమ[illegible] మూర్ధ్వముగా నెగయుచుఁ గ్రమముగా నీలశ్వేత పర్వతశిఖరం[illegible]స్పృశింపకయే శృంగవచ్ఛిఖరంబునఁ బడి యు చ్చటినుండి క్రింద[illegible] కురువర్షమునంతట వ్యాపించిప్రవహించి యుత్తరసముద్రంబునఁ గలియుచున్నది. అట్లె [illegible]లకనందయు మేరువందున్నబ్రహ్మపురమునుండి దక్షిణమునకు దిగి [illegible]ధ్యమున నున్నపర్వతశిఖరంబుల స్పృశింపకయే యతిక్రమించి హేమ

కూట హిమాలయ పర్వతముల శృంగముల నస్ఖలితవేగముచే భేదించుకొని కర్మక్షేత్ర మగుభారతవర్షంబునం బడి ప్రవహించుచు దక్షిణసముద్రమునఁ గలియుచున్నది. ఇంతియ కాక మేరువు మొద లగుపర్వతములందుఁ బుట్టిననదులు ప్రతివర్షమందును నూఱులకొలంది ప్రవహించుచున్నవి. ఈజంబూద్వీపమునందును, భారతవర్షమే పుణ్యాపపరూపకర్మముల ననుభవించుటం జేసి కర్మక్షేత్ర మనిపించుకొన్నది. *తక్కిన యెనిమిదివర్షం

---

* ఇందు భారతవర్షము దక్కఁ దక్కినవి పుణ్యశేషానుభవయోగ్యదేశంబులని చెప్పంబడినందుపై శంకించుచున్నాఁడు. ఓయీ! ఈచెప్పినది మిక్కిలి విరుద్ధముగా నున్నది. ఇష్టాపూర్తాదు లగుపుణ్యకర్మము లాచరించినవారుధూమాదిరూప మగుపితృయానమార్గముచే, జంద్రలోకమునుబొంది యచ్చటసుఖానుభవముచేఁ బు[illegible]ములను క్షీణింపఁ[illegible]జేసికొని మగుడ నీలోకమునకువచ్చుచున్నారని చెప[illegible]కర్మ[illegible]మురు. అ[illegible]తులు చెప్పుచున్నవి. శ్రు॥ "యావత్సంపాతముషిత్వా[illegible]మేవాధ్వానం పునర్నివర్తంతే" అనఁగాఁ గర్మానుభవమగునంతవఱకచ[illegible]టనుండిమగుడ నీమార్గంబుననే మగిడివచ్చుచున్నారనియర్థము. ఇందులకువ[illegible]టనుండిమగుడ[illegible]త్రియొకశ్రుతి "ప్రాప్యాంతంకర్మణస్తస్యయత్కించేహకరోత్యయం తస్మా[illegible]ల్లోకాత్పునరేత్యస్మై లోకాయకర్మణః" అనఁగా నీలోకంబునఁ జేసికొన్నకర్మ[illegible]లనుభవించుచునవి యంతము పొందునంతవఱకునచ్చట నేయుండిమగుడఁ గ[illegible]ర్మశేషసహితులై యీలోకమునకు వచ్చుచున్నారని భావము. అట్లుండఁ బుణ్యశేషానుభవయోగ్యము[illegible]ని ప్రశ్నించుచు[illegible]వ ముండు టెట్లు? వారికేవర్షములు భోగస్థానము లగు టెట్లు? అని యుం[illegible]పరాము. వారు త్తరలోకములం దనుభవింపఁగాఁ గొంతకర్మము మిగిలి దనిఁ[illegible]మునని తప్పక చెప్పితీరవలెను. అట్లైకాక వారికర్మము పూర్తిగానశించినశ్రు[illegible]మే చెప్పినచోఁ గర్మనిమిత్త మయినజన్మమే యుండదు. ఇట్లు చెప్పుట వె[illegible] "రమణీయచరణారమణీయయోనిమాపద్యేరన్ బ్రాహ్మణయోనిం[illegible]వా క్షత్రియయోనిం వైశ్యయోనించ" అను శ్రుతిప్రమాణము. ఇందులకు స్మృ॥ [illegible]

బులును, బుణ్యాత్ములకుఁ దా [illegible] ననుభవింపఁగా మిగిలినపుణ్యము లనుభవింప నుపభోగస్థానములై యున్నవి. కావుననే వానిని భూలోకస్వర్గము లని చెప్పుదురు. అట్టి పుణ్యము లనుభవింపఁ దగినవే కాని భారతవర్షమువలెఁ గర్మక్షేత్రములు కావు. ఓరాజా! ఆవర్షములందలి పురుషులకుఁ ద్రేతాయుగమం దున్నవారికిం బలెసుఖముగాఁ గాలము వర్తించుచుండును. వారు దేవతల కైన వచ్చుచుందురు. అచ్చటివారు పదివేల యేనుగులబలము గలవారై యుందురు. మఱియుఁ బదివేలవర్షము లాయుర్దాయము గలవారై వజ్రకాయులై బలముచేతను, వయస్సుచేతను, [illegible]ములగు సురతాది సౌఖ్యములు గల్గియుందురు. వారికళత్రములు [illegible] నాయువొకసంవత్సరము మాత్రమున్న దనఁగాఁ గర్భమును దాల్చి యొక్క సంతానమును మాత్రమే కందురు. కావున నచ్చటివారికిఁ గళత్రసుఖ మెప్పుడును దఱుఁగ నేరదు. మఱియు నచ్చటి కాననవృక్షములు సర్వఋతువులందును లభించెడి కుసుమగుచ్ఛంబులచేతను, ఫలంబులచేతను గిసలయములచేతను మిక్కిలి నమ్రములైన శాఖాసముదయములతోను లతలతోను మిక్కిలి శోభిల్లుచుండును. అట్టి రమణీయ కాననములందును, నాశ్రమములందును, పర్వతపుఁజఱియలయందును వికసించిన నానావిధతామరసంబులచే సంతుష్టిఁ జెందు రాజహంస

---

మాశ్చస్వకర్మనిష్ఠాః ప్రేత్యకర్మ ఫలమనుభూయతతో౽తి శేషేణ విశిష్టదేశ జాతి కులరూపాయుః శ్రుతివృత్తసుఖమేధసో జన్మ ప్రతిపద్యంతే॥ అని ప్రమాణమున్నది. కావున నుత్తరలోకములం దనుభవింపఁగా మిగిలిన పుణ్యకర్మముచే నతిశయింపఁబడినగొప్పభోగములనుభవించుటకు నాయాదేశములందుఁ బుట్టుట సంభవించుచున్నది.

లును, జలకుక్కుటములును
లును, జక్రవాకాహంలున , కన్నెలేడిపిట్టలును, బెగ్గురుపక్షు
తములచేతను, మధుపం, జతలుగట్టి చేయుచున్న మధురకూజి
లగు తామరకొలంకు ఝంకారములచేతను, బ్రతిధ్వనితము
నున్న మనోహరములందును, జలక్రీడాదివినోదము లొనర్చుచు,
విలాసములచేహంగు లగుదేవకాంతల మన్మథసంబంధు లగు
చూపులచేతను, మందహాసములచేతను, మనోహరము లగు
గల దేవపత్తు, నాకృష్టము లగు చిత్తంబులును, జూపులును
నతిముదముల తమతమ దేవతాగణములచేఁ బూజితు లగుచు
తొమ్మిదిమన యథేష్టముగా విహరించుచుందురు. ఓరాజా! ఈ
ద్వర్షాధిశ్రములందును భగవంతుఁ డగునారాయణుండు తత్త
వర్షములకి యగుమహాపురుషునిచే సంసేవింపఁబడుచు, నాయా
మగు నం దున్నపురుషుల ననుగ్రహించుటకై పరిదృశ్యమాన
గుణపస్తుసజాతీయ మని యూహింపఁ దరము కాని కల్యాణ
డునుశిష్ట మగు స్వరూపముచే నిప్పటికిని బ్రత్యక్షు మగుచుం
దక్క ఇలావృతవర్షమున భవానీదేవిశాపముచే శంకరుండు
నెఱింవేఱొక్కపురుషుండు గానరాఁడు. భవానిశాపనిమిత్తము
డను కాని యెఱుంగక కాని యావర్షమునకుఁ బోయినవాఁ
మునరులతో గూడ స్త్రీత్వంబును బొందును. ఇలావృతవర్ష
శాప బ్రవేశించినవారికి స్త్రీత్వము రావలయు నన్నభవాని
భపనిమిత్తమును నవమస్కంధమున వక్కాణించెద. అచ్చట
భవానీదేవి యధిపతిగాఁ గలయర్బుద సహస్రసంఖ్య గల స్త్రీ
సమూహములచే సేవింపఁబడుచు భవుండు తనకుఁ గా
భూతముగను, వాసుదేవాదిరూపమున నున్న పరమపురుష
నాల్గు వ్యూహములలో నాల్గవదియు, తమోగుణమున కధి

త్రియు నగుమూర్తిని దనచిత్త ... న సమాధిరూపమగునుపాయముచే సాక్షాత్కరించుకొని ముం ... ను చెప్పఁబోయెడుమంత్రాత్మకమగు వాక్యమును జపించుచు స్తోత్రము చేయుచుండును. ఓ పరమాత్మా! [1] భగవంతుఁడవును [2] మహాపురుషుఁడవును, వాసుదేవుఁడవును, [3] సర్వగుణనిధానమవును, [4] అనంతుఁడవును, [5] అవ్యక్తుండవును నగు నీకు నమస్కారము. ఓయీశ్వరా! నీపాదపద్మములు సేవకుల కుపాసింపఁదగి ప్రాప్యములై యుండుచున్నవి. నీవు సంపూర్ణమగు నైశ్వర్యాది షట్కమునకాధారభూతుఁడవు. నీవు భక్తులందు మిక్కిలి వాత్సల్యము కలవాఁడవయి వారిసంసారబంధమును దొలంగించుచున్నావు. నీవు సమస్తభూతముల య

---

1. ఈవిశేషణముచేఁ బరబ్రహ్మము జ్ఞానాదిషడ్గుణములచే నిండినవాఁడని తెలియవచ్చుచున్నది.

2. ఈవిశేషణముచేఁ బరబ్రహ్మము నిఖిలప్రపంచకముయొక్క సృష్టిస్థితిలయములుగావించి మహాపురుషత్వంబునుబొందుచుండు. శ్రు॥ "వేదాహమేతం పురుషం మహాంతం" అని పురుషసూక్తమునఁ జెప్పఁబడుటచేతను, "తస్మాద్విరాడజాయత" అని సమస్తప్రపంచమునకును గారణత్వముఁ బ్రతిపాదించుటచేతను పరబ్రహ్మమునకు మహాపురుషత్వము స్థిరమగుచున్నది.

3. 'సర్వగుణ'యని చెప్పుటచేఁ జేతనాచేతనముల కూహింపఁదరముకానివై జగత్కారణ మగుట కుపయోగించుచు నాశ్రితుల కార్యముల నెఱవేర్పఁదగిన సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము, వాత్సల్యము, సౌశీల్యము, సౌలభ్యము, జ్ఞానశక్తి, మొదలగునసాధారణగుణము లున్నట్టు తెలియుచున్నది.

4. 'అనంత' అనుటచే భగవంతుఁడు రూపముచేతను గుణములచేతను ననంతుఁడని తెలియవచ్చుచున్నది.

5. 'అవ్యక్త' అనుటచే నింద్రియాదులకు గోచరుండు కాఁడనుట స్పష్టము.

భ్యుదయంబునకును హేతుభూతుండవు. నీసంకల్పముచేత నేజీవు లు బంధమును మోక్షమును బొందుచున్నారు. అట్టి మహాపురుషుఁడ వగు నిన్ను సేవించుచున్నాను.ఓపరమాత్మా! సమస్తమును సర్వకాలములందును జూచుచున్నప్పటికి నెవ్వనిజ్ఞానముకొంచెమైనను బ్రకృతిగుణకార్యములగు రాగద్వేషాదులచే క్రోధాది గుణములఁ జయింపలేని మావంటివారి జ్ఞానమువలెఁ గలుషత్వ మందదో, యట్టిభగవంతుఁడ వగు నిన్ను సంసారమును జయింపఁదలంపు గలయేపురుషుండు సంతసంబున సమాదరించి భజింపఁడు? ఓపరమపురుషా! దేహాత్మాభిమానము గలవారికి నీవు మద్యపానముచేఁ దామ్రలోచనములు గల్గి మత్తుఁడవై యున్నట్లు, మాయచేఁ గానవచ్చుచుందువు. కాని నీవు వాస్తవముగా నప్రాకృతమై స్వేచ్ఛ చేస్వీకృతమై కర్మవశ్యముగాక యున్న దివ్యమంగళవిగ్రహుండవు కదా! అట్టివాఁడవు కనుక నే నాగకన్యకలు నీపాదపంకజస్పర్శమువలన సంచలితహృదయేంద్రియ లై "గామపరవశల మగుమేము రాగాదిదుర్గుణములకుఁ బ్రతిభట మగుశుద్ధసత్వస్వరూపుఁడ వగునీపాదముల స్పృశింప నెట్లుగా సమర్థుల మగుదు"మని తలంచుచు నిశ్శంకముగా నీకుఁబూజలొనర్ప సమర్థులుగాకపోయిరి. ఇట్టిమహానీయుఁడ వగునిన్నెవ్వాఁ డాదరించి సేవింపఁడు? ఓవాసుదేవా! వేదాంతము లెవ్వనిఁ జిదచిదాత్మకమగు ప్రపంచము సృష్ట్యాదులకు హేతు వనిచెప్పుచున్నవో, ఎవనిని సత్వాదులగు ప్రకృతిగుణముల కవశునిఁగాను, స్వరూపముచేతను, స్వభావముచేతను దేశకాలవస్తువులచే నపరిచ్ఛిన్నునిగాను నుడువుచున్నవో, ఎవఁడుసహస్రఫణములలో నొకదానియందు భూమండలము నావగింజంత సులభముగా

వహించుచున్నాఁడో, యట్టియమేయప్రభావుఁడ వగుని న్నెవం డు సంతసమున నాదరింపఁడు? ఓయీశా! మహత్తత్త్వాభిమా నమున నొప్పుచు,జగన్నిర్మాణమున కుపయుక్తములగు జ్ఞానాదు ల కాశ్రయుండై యస్మదాదులకంటె నాద్యుండగు కమలాస నుండెవనివలనసంభవించెనో,యాసీవలన నే నేనును ద్రివిధాహం కారసంపాదనమునిమిత్తము సముద్భూతుండనై యహంకార ప్రవర్తనమున కుపయోగించునట్లు నీవొసంగినజ్ఞానముచే దేవాది శరీరములందుఁ ద్రివిధమగు నహంకారమును బ్రవర్తింపఁజే యుచున్నాను. ఓమహాత్మా! మహత్తత్త్వము,సాత్త్వికరాజసతా మసను లను త్రివిధాహంకారము, బ్రహ్మమొదలగు మేమును సూత్రబద్ధములగుపశులవలె నీకు వశులమయి నీయనుగ్రహము వలన నీబ్రహ్మాండమును, దదంతర్వర్తియగు వస్తుజాలమును, సృ జించుచున్నాము. సత్త్వాదిగుణపరిణామములగు దేహేంద్రియా దులసంబంధముచే స్వాత్మపరమాత్మజ్ఞానసహితుఁడై సంసారబ ద్ధుఁడగు జీవుం డెవనిచే నిర్మిత మగుకర్మగ్రంథియైనమాయను సులభముగాఁ దరింప నుపాయము నెఱుంగఁడో, ప్రకృతిసంబంధ నాశనమును, దత్సంబంధమును జేయ సమర్థమగుజ్ఞానము గల యట్టినీకు నమస్కార" మని యిలావృతవర్షమున భవుండు నుతించుచుండు. ఇది పదునేడవయధ్యాయము.

---

ఓపరీక్షిన్నరేంద్రా! అట్లె, భద్రాశ్వవర్షాధిపతియును ధర్మ సుతుండును భద్రశ్రవుఁడను పేరు గలవాఁడును, సేవకముఖ్యులు ను, రాక్షసాపహృతము లగు వేదములను నుద్ధరించి తెచ్చుటవలన

శుకుఁడు రాజునకు భద్రాశ్వాదులందలి విశేషములను జెప్పుట.

ధర్మస్వరూపమును, హయగ్రీవాభిధానము గలదియు భగవంతుఁడగు వాసుదేవునకు మిక్కిలి ప్రియము నగు శరీరమును దృఢసమాధిచే సాక్షాత్కరింపఁ జేసికొని చెప్పఁబోయెడి మంత్రమును జపించుచు నిట్లు స్తోత్రము చేయుచుందురు. "ఓపరమేశ్వరా! నీవు సంపూర్ణమగు షాడ్గుణ్యము గలవాఁడవు. నీవు పూర్వోత్తరభాగములగు వేదాదులందుక్తమగు ధర్మమే స్వరూపముగాఁ గలవాఁడవు. నీవు నీయనుగ్రహాతిశయముచే జీవులను రజస్తమంబులకు లోఁబడకుండునట్లు జేసి బ్రహ్మప్రాప్తిరూప మగు ముక్తిని గల్గించువాఁడవు. అట్టినీకు నమస్కారము గావించుచున్నాము. లోకమున దేహులు పితృాదులమరణమును గన్నులారఁ గాంచియు నట్లై తామును మృతినొందవలయునని తలంపరు. మఱియుఁ జచ్చినపితృపుత్రాదులనుదహించివచ్చి యప్పుడయినఁ దామస్థిరులని తలంపక వారు సంపాదించినధనాదులచే జీవింపఁదలంచుచు శబ్దాదివిషయసుఖముల ననుభవించుచు సర్వదా పాపకార్యములనే ధ్యానము చేయుచుందురు. మానవాదు లనిత్యులయినట్లు ప్రత్యక్షముగాఁ జూచినను లోకుల కట్టిబుద్ధి జనింపకపోవుట భగవంతునిమాయావైభవమె. ఔరా! ఏమియాశ్చర్యము! ఇది మిక్కిలి విచిత్రముగా నున్నది. ఓపరమాత్మా! వేదాంతవిద్యను నభ్యసించినకవీశ్వరులు ప్రపంచ మనిత్య మని చెప్పుచున్నారు. కాని తా మట్లనుసంధానము చేయలేకున్నారు. అట్లై యధ్యాత్మవిద్యల నభ్యసించి స్వాత్మపరమాత్మజ్ఞానము గల పండితులును నీ విశ్వము నశ్వర మని చెప్పుచున్నారే కాని యనుసంధాన

ము చేయలేకున్నారు. వారు నీమాయచే మోహితులై పుత్త్ర మరణాదినిమిత్త మగుదుఃఖమును బొందుచున్నారు. కావున నీయీకృత్యము మిక్కిలి యాశ్చర్యముగా నున్నది. జన్మమరణాది సంసారమును నశింపఁజేయు నీకు నమస్కారము. ఓపరమేశా! వాస్తవముగా నీవు కర్తవైనను జగత్సృష్టిస్థితిలయాదికార్యము లొనర్చుటచేతను, స్థూలసూక్ష్మము లగు చిదచిత్తులు శరీరముగాఁ గలవాఁడ వగుటచేతను, ప్రపంచగతము లగువికారాదుల కాశ్రయుఁడ వగుటచేతను విశ్వసృష్ట్యాదికర్మము జీవునకువలె నీకును జ్ఞానసంకోచాదులకుఁ గారణములగుచున్నవని తలంచుట యుక్తమే కాని విశ్వోద్భవాదికర్మములు లీలారూపము లగుట చేతను, ప్రకృతిపురుషరూప మగుశరీరమునకే కార్యకారణరూపావస్థ లంగీకరించుటచేతను, విశ్వోద్భవాదికర్మము నీకుఁ బ్రతిబంధకము కాదు. సర్వదా వికారాదులు గలుగుటకుఁదగినసంబంధ మున్నను, జీవునికి శరీరగతకౌమారయౌవనాదివికారములు గలుగనట్లు, నీ కావికారములు గలుగకపోవుట చిత్రము. ఓదేవా ! ఒకానొకదైత్యుఁ డందినప్రళయమున వేదముల నొకదైత్యుఁ డపహరింపఁగా, నీవు నరహయస్వరూపముదాల్చి హయగ్రీవుండ వని ప్రఖ్యాతి వహించి వానిఁజంపి యావేదములఁ గొని వచ్చి యాచించుచున్న బ్రహ్మ కర్పించితివి. అట్టియమోఘచేష్టలుగలనీకు నమస్కారము'' అని యిట్లు నుతించు చుందురు. హరివర్షమున భగవంతుఁడు నరహరిరూపమున నెలయుచుండును. భగవంతుఁడు నరసింహావతార మెత్తుటకుఁ గారణము ముందుముందు చెప్పెదను. ఆహరివర్షమునందు భగవంతునితో సమానమగు గుణములు గలవాఁడును, భక్తశ్రేష్ఠుండును, దై

్యదానవకులములను బవిత్రముచేయు చున్నశీలాచారములు గలవాఁడును, నగుప్రహ్లాదుండు, బ్రయోజనాంతరరహిత మగు నవిచ్ఛిన్నభక్తియోగముచే నావర్షమం దున్నప్రజలతోఁ గూడఁ దనకుఁ బ్రియతమ మగునరసింహాకృతిని ధ్యానము చేయుచు నిట్లు నుతించుచుండును. "నరసింహస్వరూపుఁడ వగు నోభగవంతా! నీకు నమస్కారము. సమస్తతేజస్సులను బ్రకాశింపఁజేయు నీకు వందనము. ఓదేవా! మాకుఁ బ్రత్యక్షము కమ్ము. ఓవక్రనఖా! ఓవజ్రదంష్ట్రా! బహుళము లైనమాకర్మాశయములను, దొలంగింపుము తొలంగింపుము. మాభయములు పోవునట్లు మాకు సాక్షాత్కరింపుము. జగంబునకు మంగళ మగుఁగాక, దుర్గతులు నిర్మలమనస్కు లగుదురుగాక. భూతములు పరస్పరము మంగళములను గోరుకొనుచుండుఁగాక. వానిమనస్సు శమాదిగుణయుక్త మగుఁగాక. మామతియు, భూతములమతియు, ఫలాదులనపేక్షింపకయే యధోక్షజునియందుఁ బ్రవేశించుఁగాక. ఓ పరమేశ్వరా! గృహములయందును భార్యాసుతులందును ధనంబులయందును బంధువులందును మాకాసక్తి లేకుండుఁగాక. కేవలము భగవద్భక్తులందు మాత్రమే మాకట్టియాసక్తి గల్గుఁగాక. భగవద్భక్తులస్నేహముచే స్థిరమగు మనస్సులు గలవారు, ప్రాణధారణకుపయుక్త మగునంతమాత్ర వస్తువులచేతనే పరితుష్టిఁ జెందుచు నతిశీఘ్రముగా ముక్తిఁ జెందినట్లు లింద్రియపోషణమందుఁ దత్పరు లై శబ్దాదివిషయములందు సక్తచిత్తు లగు వారికి ముక్తి సిద్ధింపనేరదు. అట్లుండ గృహాదులందలి యాసక్తి వలన మా కేమిలాభము? ఏహరి తనభక్తులతో స్నేహము చేసి వారు నుడువుచున్న తనచరిత్రములను వినునట్టిపురుషుఁ

శ్రవణపుహారములనుండి లోపలికిఁ బ్రవేశించి తనపాదపంకజములనుండి యుదయించిన గంగానది శరీరమలములనెల్ల లోపలిమలమును దొలఁగించునో యట్టిముకుందునిపాదముల నెవఁడు సేవింపఁడు? ఐహికాముష్మికఫలములను గోరనిభక్తివిశేషము భగవంతునియం దేపురుషునకుఁ గలదో వానిని నింద్రాదిదేవతలును శమదమాదిగుణములును ననుసరించుచుండును. నీయందు భక్తిని నెలకొల్పక శబ్దాదులందు మనంబును బ్రవేశింపఁజేసి వర్తించువానికి భగవద్భక్తులకు లభించినమహాగుణము లెట్టుగా లభించు? ఓమహనీయా! ఆలోచింప మీనములకు జలమే జీవనాధారమైనట్లు* శరీరాదులకెల్ల నీవేజీవనాధారమవు. కావునఁ దాను వయస్సౌందర్యాదులచేతను గృహపుత్ర ధనాదులచేతను సంపూర్ణుఁడైనను భగవంతుఁడగునిన్ను విడిచి గృహాసక్తుఁడైనఁ జో నప్పుడు దంపతులకు వయోరూపాదులవలనఁ గల్గుక్షణికసుఖమే కాని నిరతిశయానందమును బొందఁ జాలఁడు. నీభక్తి నిరతిశయసుఖమునకు హేతు వగుచుంటం జేసియు, విషయాసక్తునకు దుఃఖహేతు వగుటం జేసియు రజోగుణజాతములగు రాగము విషాదము కోపము గర్వము పేరాస భయము దైన్యము వ్యా

* భగవంతుఁడే యెల్లరకును ధారకుఁడనుటకు శ్రు॥ "కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాద్య దేష ఆకాశ ఆనందోనస్యాత్" అనఁగా నిరతిశయానంద రూపమును సర్వప్రకాశమును నగు పరమాత్మ యుపాసితము కానిచో నెవఁ డైహికాముష్మికసుఖసంపాదనముచే జీవించు నని శ్రుత్యభిప్రాయము. ఈ యర్థమే వాల్మీకిరామాయణమున "నచసీతాత్వయాహీనా నచాహమపి రాఘవ। మహూర్తమపి జీవావో జలాన్మత్స్యావివోద్ధృతా" అని యున్నది. కావున భగవంతుని విడిచి యొకముహూర్తమైనను జీవించుట కష్టము.

[redacted]యిదలగు వానికి మూలమై సంసారచక్రపరివర్తనమునకు హేతువయిన గృహమును విడిచి నరసింహస్వరూపుఁడవగునీపాదపద్మములను భజించువారి కెందువలనను భయ ముండదు." అని హరివర్షంబునఁ బ్రహ్లాదాదులు పరమేశ్వరుని నుతించుచుందురు. ఓరాజా! ఇఁకఁ గేతుమాలమున నుపాసనీయులును నుపాసకులను నెవ్వరో తెలిపెదను. ప్రజాపతికి రాత్ర్యభిమానదేవత లనెడిపుత్త్రికలును నహరభిమానదేవు లనెడి పుత్త్రులును గలరు. రాత్రిందివాధిష్ఠాత లగువారలే శతవత్సరరూప మగు నాయుర్దాయమును బరిగణించుచుందురు. వారలే కేతుమాలవర్షమున కధిపతులు. మహాపురుషుఁ డయిననారాయణునిచక్రకాంతులకు భీతచేతస్కు లగుటం జేసి యేవారల గర్భస్థశిశువులు గర్భాధానము మొదలుకొని సంవత్సరాంతమున విగతజీవులయి పడుచున్నవో, యట్టి రాత్ర్యభిమాన దేవతలకును నహరభిమానదేవతలకు లక్ష్మికిని బ్రియంబును జేయఁ దలంచి భగవంతుఁడు కేతుమాలవర్షంబున ప్రద్యుమ్నరూపంబున వర్తించుచుండును. అచ్చట నాపరమపురుషుండు మిక్కిలిసుందర మగు గతివిలాసముచేతను మనోహరమగు మందహాసవిలసితము లగు దృష్టిలీలలచేతను గించిదున్నత మగు సుందరభ్రూమండలముచేతను సుందర మగు రమావదనారవిందసంపదచేఁ బాను సంతసించుచు రమాదేవిని సంతసింపఁ జేయుచు విలసిల్లు చుండును. మాయామయ మగు భగవంతునియారూపమును లక్ష్మీదేవి సమాధియోగనిష్ఠురాలై, రాత్రులయందు రాత్ర్యభిమానదేవతలతోను బవళుల నహరభిమానదేవులతోను గూడికొని సేవించుచు నీవిధమున జపించి స్తోత్రము చేయుచుండును. 'ఓదేవా!

నీవు సమస్తేంద్రియంబులకు నధిపతివి. నీవు ప్రకృతిపురుషులకు సంభవింపనేరని జ్ఞానగాంభీర్యాదిగుణములకు నిధానమవు. మఱియు నీవు కర్మేంద్రియవ్యాపారములకును జ్ఞానేంద్రియ వ్యాపారములకు సంకల్పాధ్యవసాయాదులకును బంచమహాభూతములకును నియంతవు. నీవు మనస్సహితములగు నేకాదశేంద్రియములును బంచమహాభూతములును శరీరముగాఁ గలవాఁడవు. నీవు వేదస్వరూపుఁడవు. వ్యష్టితత్త్వసంఘాతమే శరీరముగాఁ గలవాడవు. ఓమహానీయా! నీవు జీవశరీరమున వెలయువాఁడవు. వెక్కేల? నీవు సమస్తప్రపంచస్వరూపుఁడవు. మఱియు మనస్సామర్థ్యము గలవాఁడవై పటుతరమగునింద్రియశక్తిచేతను దనరారుచు నిరతిశయప్రీతికి హేతువవై, స్వీయములందు నిరతిశయప్రీతిగలవాఁడవై భగవత్స్వరూపుఁడ వయియున్న నీకు నమస్కారములు. ఓమహానీయా! నిరుపాధికుఁడ వయ్యు సమస్తేంద్రియంబుల కధిపతి వగు నిన్ను నువ్రతములచే నారాధించి లోకంబున స్త్రీలు పతినిగోరుకొనుచున్నారు. అట్లు కోరి తెచ్చుకొన్న భర్తలా స్త్రీలకు నిరతిశయప్రీతివిషయము లగుపుత్త్రులను ధనములను నాయువులను రక్షింపఁజాలకున్నారు. ఆస్త్రీలపతులు కర్మవశ్యు లయి యుండఁగా వారెట్లు వారికిఁ బ్రియవస్తువుల రక్షించి * పతి యనునామమును సార్థకపఱుచుకొనఁగలరు. నిరుపాధికరక్షకత్వము గలనీవే పతిశబ్దవాచ్యుఁడవు గాని తక్కినవా రెట్లగుదురు? ఓపరమేశ్వరా! మఱియుఁ గర్మవశ్యుండవు కాకపోవుటచే నీకెందునుండియుభయము సంభవింపనేరదు. సకలభయంబులనుండియు రక్షింపఁ గల

* పతి అనఁగా "పాతి, భార్యాప్రియవస్తూని రక్షతీతి పతిః" భార్యకిష్టములగు వస్తువులను రక్షించినవాఁడే యని భావము.

నీకుఁ గలదుగాని వేఱొకనికి లేదు. కావున నీవే నిరుపాధిక పతి శబ్దవాచ్యుండవు కాని తక్కినవారు కారు. వారు కర్మవశ్యులై కావుననే సోపాధికులై యుండఁగా భయములనుండి యెట్లు రక్షింపఁగలుగుదురు? కావున నీవొక్కఁడవే పతివి. మఱియొక పతి యున్నచో నన్యోన్యము భయంబు సంభవింపక మానదు. నీవొక్కఁడవే యైనచో నాత్మలాభముకంటె నన్యమైన దధికమని తలంపవు. మఱియు లోకమునఁ బతిసుతధనాదులందుఁ బరాయణ యగునే స్త్రీ యుక్తవిధశక్తిగల నీపాదపద్మముల కారాధనముచే యదో యట్టి స్త్రీకి, నీవొకానొకప్పు డర్చితుం డయ్యు నట్టి క్షుద్ర ఫలంబునే యొసంగుచుందువు. నీవు, ప్రీతివిషయ మయినపురుషార్థమ నయియున్న నీకంటె నితరమగు నపురుషార్థములు గోరుకొనునప్పుడు తాదృశమూఢ స్త్రీ కట్టిఫలమునె యిచ్చుచుందువు. అల్పకాలస్థాయి లగునావస్తువులను బొంది యవి కర్మవశమువలన నశింపఁగానే మిక్కిలి దుఃఖమును బొందును. కావున నిన్నుఁ బతిగాఁ బడసిన నాకుంబోలె లోకమున నెవ్వతెకును సౌఖ్యంబు లేదు. 'ఓలక్ష్మీ! నీవే లోకమందుఁ బురుషార్థమ వగుచుండఁగా నీవన్నెట్లు సరిపడు' ననియందువేని వినుము. ఆలోచింపఁగా బ్రహ్మ, యీశ్వరుండు, దేవేంద్రుఁడు మొదలగువారు శబ్దాములం దాసక్తులై నీపాదారవిందశరణముఁ జేయకుండ నితరమగుతపంబును జేయుచున్నారు. కాని యందువలన నన్నెంతమాత్రమును బొందలేరు. ఓయమేయా! నిరతిశయప్రీతివిషయుఁడ వయిననీవే హృదయముగాఁ గల నేను నీయారాధనముఁ జేయనిచో నెట్లు సంతసింతును? కావున నీపాదారవిందములుగొల్చువారలే నన్నుఁ బొందఁగలరు కాని తక్కినవారు పొందలేరు. సర్వపురుషార్థరూపుఁడ

వగు నోపరమేశ్వరా! సర్వపుషార్థదాయి యని నుతింపఁదగిన నీహస్తమును దయాసూచకముగా నీభక్తులతలలం దుంచుచున్నట్లు నాశిరంబునందును నుంపుము.'నీ విదివఱకే నాపరిపూర్ణ దయకుఁ బాత్రురాలవయి యుండఁగా నీవిట్లు ప్రార్థించెదవేమి'యనియడుగవచ్చు. నీవు మాయారూప మగుశ్రీవత్సమువలె నన్ను హృదయమందు ధరించుచున్నావు. *అయిన నీకుజ్ఞానులు ప్రియతము లయినట్లు నేను గాను. కావున నన్ను నీభక్తులఁ జూచిన కనికరపుఁజూపుతోఁ జూడవలయును. ఆనీభక్తులం దట్టిదయ యేల యుదయించునో నేఁ జెప్పఁజాల. ఈశ్వరుండవగు నీచేష్టితము నూహింప నెవ్వరు సమర్థులు?' అని యిట్లు లక్ష్మి భగవంతునిఁ బ్రార్థించుచుండును. ఇఁక రమ్యకవర్షమునం దుపాస్యులును నుపాసకులు నెవ్వరో తెలిపెద వినుము.రమ్యకవర్షమునకు మను వధిపతి. అతఁడు యుగాంతమందుఁ జూచిన భగవంతునికి ప్రియతమ మగుమత్స్యరూపమును నవిచ్ఛిన్నభక్తియోగముచే నారాధించుచు నిట్లు నుతించును. 'ఓదేవా! నీవు

—◆ రమ్యకవర్షముఁగూర్చి దెలుపుట. ◆—

శుద్ధసత్వమూర్తివి. నీ వింద్రియశక్తికిని. మనశ్శక్తికిని, శరీరశక్తికిని నధిష్ఠాతవు. మఱియు నీ వవతారములలో మొదటివాఁడవు. వ్యష్టిజాతమున కంతరాత్మవై మత్స్యస్వరూపుఁడవగునీకు నమస్కారము. ఓమహనీయా! నీరూపము లోకపాలాదుల కెంతమాత్రమును గోచరంబు గాదు.నీవు వేదాత్మకమగు

---

* ఇందులకుఁ బ్రమాణము "ప్రియోహి జ్ఞానినో త్యర్థ మహం సచ మమ ప్రియః, జ్ఞానీత్వాత్మైవమే మతమ్" ఇత్యాదులు.

నాదము గలవాఁడవు. లోకమున మానవుఁడు కఱ్ఱబొమ్మను సూత్రమునకు బంధించి స్వవశము గావించికొని యాడించుచున్నట్లు నీవు నావేదాత్మకమగు నాదముచేఁ జిదచిదాత్మకమగు నీలోకంబును స్వవశము గావించికొని నియమించి యీశ్వరుండ వని పిలువఁబడుచున్నావు. ఓయీశ్వరా! ఇంద్రాదిదేవత లందఱును మాత్సర్యరహితులై యైకమత్యమున నొప్పుచుఁ జరాచరాదులచేఁ బరిదృశ్యమానమగు ప్రపంచమును రక్షింపఁ బ్రయత్నించియు నట్లు చేయ నసమర్థు లయిరి. కావున జగన్నేతృత్వము నీకుఁ దక్కఁ దక్కినవారి కలవడనేరదు. అట్టియసాధారణశక్తి గలనీకు నమస్కారము. ఓపరమాత్మా! ఒకానొకదైనందిన ప్రళయమున మహాతరంగంబులతో ఘూర్ణిల్లు సముద్రంబున నోషధులకును లతాగుల్మాదులకు నాధారమగు నీక్షోణీమండలమును నన్నును ధరించి మహావిక్రమమున నందఁ జరించుచు రక్షించితివి. నీకుఁగాక తక్కినవారి కెవ్వరి కట్టిశక్తి గలదు? జగంబునకుఁ బ్రాణనిరూపణ చేయుటయే స్వభావముగాఁ గలయట్టి నీకు నమస్కారము" అని సర్వదా నుతించుచుండును. హిరణ్మయవర్షమందు భగవంతుఁడు కూర్మరూపము నొంది వర్తించుచుండును. పితృగణంబుల కధిపతి యగునర్యముఁడు భగవంతునికిఁ బ్రియతమ మగునాకూర్మరూపము నావర్షమం దుండు జనులతోఁగూడ నుపాసించుచు నిట్లు స్తోత్రము చేయుచుండు. "ఓదేవా! సమస్తజంతువులును, సద్గతిము లగు హేయగుణములును గల్యాణగుణములును సద్వారకముగాను నద్వారకముగను నీకు సంభవించుచుండును. మఱియు నీవు సముద్రమధ్యమున మందరపర్వతమూలమున నుండి సాధారణముగా గోచరుండవు

కావు. నీశరీరము ప్రాకృతసంబంధి కానేరదు, నీవు కాలముచేఁ బరిచ్ఛిన్నుండవు కావు. నీవు మహామహిమగలవాఁడవు. మఱియు సమస్తమున కాధారభూతుండవు. అట్టి నీకు నమస్కారములు కావించుచుందుము. ఓదేవా! నానావిధజాతిగుణాదులచే నిరూప్యమయి భోగ్యవస్తురూపముగాఁ బ్రతీయమాన మగు నేప్రపంచము నీప్రకృతిచే నిర్వర్తింపఁబడు చున్నదో, యాబ్రహ్మాత్మకత్వముగాఁ బ్రతీయమాన మగుటచే దేనికిఁ బ్రకాశము లేదో, నీవా ప్రపంచమే శరీరముగాఁ గలవాఁడవు. మఱియు లెస్సగా జ్ఞానమును బ్రవర్తింపఁ జేయుచున్నావు. అట్టి నీకు నమస్కారము. ఓదేవా! చరాచరరూప మని ద్వివిధముగాను నవాంతరభేదముచే జరాయుజము లనియు, స్వేదజము లనియు, నండజము లనియును, నుద్భిజ్జము లనియుఁ జతుర్విధములు గానుఁ బరిదృశ్యమానమగు నీ ప్రపంచము నీకు శరీరవిశేషమై తనర్చుచున్నది. కావున స్వర్గము, గగనము, భూమి, పర్వతము, నది, సముద్రము, ద్వీపము, గ్రహము, నక్షత్రము, మొదలగు శబ్దములచే నీ వొక్కండవే చెప్పఁబడుచున్నావు. అనంతములగుటచే లెక్కింపఁ దరము కాని విశేషములును, దేహాదినామములును, బృథివ్యాదిరూపములును నాకారముగాఁ గలిగి, ప్రకృతిపురుషకాల శరీరకుండవన నొప్పునీయందుఁ బృథివ్యాదితత్త్వయాథాత్మ్యము నెఱిఁగినకపిలాచార్యాదిమహామహులు మందబుద్ధులు సుఖముగా గ్రహించునిమిత్త మిరువదినాల్గు తత్త్వములనియు నిరువదియైదుతత్త్వములనియు సంఖ్యను గల్పించిరి. కాని వాస్తవముగా నవాంతరభేదముల నెంచిన లెక్కింపఁ దరము గాదు. నీవనంతమగు విభూతులు గలవాఁడవగుటచే నీ

యందుఁ బరికల్పితమగు సంఖ్య వాస్తవబుద్ధిచేఁ దిరస్కరింపఁ బడక మానదు. తాదృశసాంఖ్యజ్ఞానముచేఁ దెలియఁబడు* నీకు నమస్కారములు. ఇంకఁ గురువర్గమునందుఁ గల యుపాస్య

---

* భగవంతునికి విభూతిభూత మగుజగంబున కానంత్యము కలుగఁగా భగవత్స్వరూపమున కానంత్య మెట్లంగీకరింపవచ్చును? భగవత్స్వరూపమునకుఁ గల్గునానంత్యము ప్రకృతిపురుషులచేతఁ గదా కలుగవలెను? ప్రకృతిపురుషుల కానంత్య మంగీకరించినప్పుడే యది యలవడును. కావునఁ బ్రకృతిపురుషులు దేశకాలవస్తుపరిచ్ఛిన్నులు కారని యందువా? అగుదురని యందువా? వానికట్టిసాధారణగుణ మంగీకరింతువేని పరమాత్మకు వానికి భేదమే లేకపోవలసివచ్చును. అంగీకరింపనిచోఁ దాదృశప్రకృతిపురుషనిరూపిత మగుభగవత్స్వరూపము గూడఁ గాలాదిపరిచ్ఛిన్నమే కావలసివచ్చునని యందువేనిసమాధానము వినుము. 'అనంతమ్' అనఁగా దేశముచేతను, గాలముచేతను, వస్తువులచేతను పరిచ్ఛిన్నము కాకపోవుటయే కదా? ఈమూఁడింటిచేతను నపరిచ్ఛిన్నమగుట పరమాత్మయందు స్థిరపడియేయున్నది. మఱియు దేశపరిచ్ఛేద మనఁగా నీవస్తు విచ్చట నున్నది, యిది యిచ్చట లేదు, అనునది. ఇది యీకాలమం దున్నది యిది యీకాలమందు లేదు; అనునది కాలపరిచ్ఛేదము. ఇది యీవస్తువు ఇది యీవస్తువు కాదు; అనునది వస్తుపరిచ్ఛేదము. పైనిఁ జెప్పఁబడినమూఁడింటిచేతను బరబ్రహ్మస్వరూపము పరిచ్ఛిన్నము కాదు. పరబ్రహ్మమన్నికాలము లందుండుటచేతను, నన్నిదేశములం దున్నను దనశరీరభూతమగు వస్తురూపము గానున్నవాఁ డగుటచేతను, నెట్లు పరిచ్ఛిన్నుఁ డగును. అతఁ డంతట నున్నవాఁ డగుటచే నీప్రదేశమందున్నాఁడు లేఁడని కాని సర్వకాలములందున్నవాఁ డగుటచే నీకాలమున నున్నాఁడు లేఁడని కాని, సమస్తవస్తువు లతనికిశరీరభూతమగుటచే నీవస్తు వితనిరూప మిది కాదని కాని, చెప్ప వలనుపడదు. కావున పరబ్రహ్మము త్రివిధము చేతను బరిచ్ఛిన్నుఁడు కాలేఁడు. కాన యపరిచ్ఛిన్నత్వము సిద్ధమగుచున్నది. జీవు లణుస్వరూపు లయినప్పటికిని, ధర్మభూతజ్ఞానము

లను నుపాసకులను దెల్పెదను వినుము. కురువర్షమునందు భగవంతుఁడు వరాహరూపమున వర్తించుచుండును. భూదేవి యు

---

సంసారదశయందుఁ గర్మముచే సంకుచిత మగుచున్నను ముక్తిదశయందు దానికి "సచానంత్యాయ కల్పతే" యని యెంతయు ఆనంత్య మంగీకరించుటవలనను, "అనేన జీవే నాత్మనాఽనుప్రవిశ్య" యనుటచేఁ బరబ్రహ్మము చేతనములకంతరాత్మ యగుటలో జీవుఁడు ద్వారక మగుటచేతను, వాస్తవముగా జీవుఁడు నిత్య మగుటచేతను జీవులకును దేశకాలములచే నానంత్యము సంభవించుచున్నది. ప్రకృతికూడఁ గారణావస్థలయందు నిరతిశయసూక్ష్మదశను గార్యావస్థయందపరిచ్ఛిన్న మగుచున్నది. కాని ప్రకృతిపురుషుల కున్న యానంత్యమునకును బరమాత్మ కున్న యానంత్యమునకును గొంచెము భేద మున్నది. పరబ్రహ్మమునకుఁ గార్యావస్థయందును గారణావస్థయందును స్వరూపముచేతను చేతను నానంత్యము సంభవించుచున్నది. జీవునికి దేశకాలములవలన నానంత్యము సంభవించుచున్నను నది ధర్మభూతజ్ఞానద్వారమై యున్నది. కావున దానికి సంకోచము లేనిముక్తిదశయందు మాత్రమే సంభవించుచున్నది. సంసారదశయందు లేదు. అట్లె ప్రకృతికిని దేశకాలాపరిచ్ఛిన్నత్వము కార్యదశయం దున్నను గారణావస్థయందు లేదు. మఱియు ప్రకృతిపురుషులకు భేద ముండుటవలన నీవస్తు విది కాదని వస్తుకృతపరిచ్ఛిన్నత్వము ప్రకృతిపురుషులకు సంభవించుచున్నది. ఈప్రకృతిపురుషులు పరమాత్మకు శరీరము లగుటచే "ఈజీవుఁడు పరమాత్మరూపము కాదు" ఈప్రకృతి పరమాత్మరూపము కాదు" అని పరిచ్ఛిన్నత్వము సంభవింప నేరదు. బ్రహ్మము సర్వాత్మకము కాన సామానాధికరణ్యాత్మక మగువస్తుపరిచ్ఛేద మున్నప్పటికిని నతనిగుణములకు వస్తుపరిచ్ఛేదత్వ మెట్లని తలంపరాదు. బంగారు మొక్కటి యని యనుకొనుచున్నను బదివన్నెబంగారమునకంటె తొమ్మిదవవన్నె బంగారమునకును బరిశుద్ధియుఁ బ్రకాశము బరువు మొదలయినవి తఱిగి యుండును. సువర్ణముకంటె వెండి గురుత్వాదులలో దఱిగియుండును. కావున నట్టినికర్ష

చ్ఛటిపురుషులతోఁ గూడ నవిచ్ఛిన్న భక్తియోగము గలదయి యావరాహరూపుఁడయిన భగవంతుని నారాధించుచు నీయుపనిషద్వాక్యము జపించుచుండును. 'ఓదేవా! నీవు మంత్రప్రతిపాద్యు లగునింద్రాదులు శరీరముగాఁ గలవాఁడవు. అసోమకము లగుయజ్ఞములును, ససోమకము లగుక్రతువులును, నీకు స్వరూప మగుచున్నవి. నీవు యోగస్వరూపుఁడవు, మఱియు సంసారనిరోధకము లగుకర్మములు గలవాఁడవు. నీవు జ్ఞానశక్త్యాదులనుగుణములు గలవాఁడవు శ్వేతవరాహరూపమున వెలయుచున్నవాఁడవు. భగవంతుఁడవు, అట్టినీకు నమస్కారంబులు. ఓపరమాత్మా! ప్రకృతిపురుషేశ్వరులతత్త్వము తెలిసినపండితులు గుణపరిణామభూతము లగుభూతములందు సర్వజ్ఞుఁడ వగునీస్వరూపమును సాక్షాత్కరించుకొనఁ దలంపుగలవారై, మథనసాధనకాష్ఠముచే దారువులం దగ్నివలె వివేకసాధనమగుమనస్సుచే వివేచించి పంచవింశతితత్త్వంబులకంటె వేఱుగాఁ జేసి చూచుచున్నారు. ఇట్లు కవులచే నుపాస్యమానుం డగునీకు నమస్కారము, ఓమహాత్మా! ఆత్మానాత్మజ్ఞానముగలబుద్ధిమంతులచే భూతకర్మజ్ఞానేంద్రియములసంఘాతరూప మగుశరీరమందు దేహముతోడను, నింద్రియములతోడను, గుణత్రయముతోడను, జీవాత్మలతోడఁ గూడఁ బ్రకృతిపురుషవిలక్షణ మని చూడఁబడుచున్నస్వరూపముగలవాఁడ వై మాయాకృతిదొలంగించియున్న నీకు నమస్కారము. ఓదేవా! స్వార్థమగుటలో నీప్సితము గా

---

ము భగవద్గుణంబులకు లేదు గాన "యిది యీగుణము గా" దని వస్తుపరిచ్ఛేదము వచ్చుచున్నది. వర్ణాదులచే బంగారమునకు భేదముండుటచేఁ బాదృశవస్తుపరిచ్ఛేదము సంభవింప నేరదు.

కున్నను జీవానుగ్రహార్థ మీప్సిత మగుచున్న సృష్టిస్థితిలయములు ప్రకృతిగుణము లగుసత్త్వాదులవలనఁ జేయుచున్నావు గదా! సంకల్పరూపజ్ఞానము గలయట్టినీసన్నిధియందు సత్త్వాది గుణమయయు, నీకు శరీరభూతమును నగుప్రకృతి యయస్కాంత శిలసన్నిధియందు లోహమువలెఁ దిరుగుచున్నది. నీవు సత్త్వాది గుణములకును బుణ్యాపాపరూప కర్మములకును సాక్షివై వఱలుచున్నావు. అట్టినీకు నమస్కారము. ఎవఁ డాదియం దాదివరాహరూపముఁ దాల్చి, రసాతలమును బొందియున్ననన్ను దంష్ట్రాగ్రమున నిల్పి మదపుటేనుఁగువలె నెదిరించి వచ్చుచున్నహిరణ్యాక్షు సంహరించి ప్రళయకాలసముద్రమునుండి విలాసముగాఁ బైకిఁ గొనివచ్చెనో, యట్టియమేయశక్తి నగునీకు వందనములు" అని భూదేవి నుతించుచుండును. ఇది పదునెనిమిదవ యధ్యాయము.

---

ఓ రాజా! కింపురుషవర్షమునందు భగవంతుఁడు శ్రీరామస్వరూపమును దాల్చి వర్తించుచుండును. అచ్చట జగత్కారణభూతుఁడును, లక్ష్మణున కగ్రజుండును, సీతాభిరాముండు నగు నమ్మహాపురుషుని తదీయపాదకమలసేవాసక్తుఁడును, బరమభాగవతోత్తముండును నగుహనుమంతుండు కింపురుషవర్షస్థు లగుప్రజలతోఁ గూడి యవిచ్ఛిన్నభక్తిపరుండయి యుపాసించుచుండును. మఱియు నతఁడు భగవంతుఁ డగుశ్రీరామునిపరమమంగళకథను సమీపమున గంధర్వులు గానము చేయుచుండఁ గింపురుషవర్షస్థులలో శ్రేష్ఠుఁ డయినయార్ష్టిషేణునితోఁ గూడ సర్వదా వినుచుండుటయే కాక తానును స్వయముగా నిట్లు జపించుచుండును.

దేవా! బ్రహ్మాదులచే నుతింపఁబడుచున్న నీకు నమస్కారము. నీవు ప్రాజ్యము లగులక్షణములును, శీలమును వ్రతములును గలవాఁడవు. సంయత మగుచిత్తము గలవాఁడవు. నీవు లోకులచే నుపాసింపఁబడుచున్నావు. సాధువాద మేదో, యసాధువాద మేదో తెలిసికొన సమర్థుండవు. బ్రాహ్మణసంరక్షణమందు బద్ధకంకణుండ వయి యున్నాఁడవు. నీవు జగత్కారణత్వమున కుపయుక్తము లగుకల్యాణగుణములు గలవాఁడవు. నీవు రాజాధిరాజవు. అట్టినీకు నమస్కారము. ఓపరమేశ్వరా! నీ వెప్పుడును రాగద్వేషాదులచే దూషితుండవు కాక, జ్ఞానస్వరూపుఁడ వయి యొప్పుచున్నావు నీవు నిత్యాసంకుచితమగుధర్మభూతజ్ఞానముచే రజస్సు మొదలగు దుర్గుణములను దత్కృతము లగుసృష్టిస్థితిలయముల నెడియవస్థలను నిరసించుచున్నావు. నీ వశనపిపాసాదులనుపదూర్ములు లేనివాఁడవు. నీవు దీపాదులవలెఁ బరులనిమిత్తముగాక నీనిమిత్తమే ప్రకాశించుచున్నవాఁడవు. నీవునిశ్చలజ్ఞానమునకు గోచరుండ వగుచుందువు. నీకు శరీరభూతు లగు ప్రకృతిపురుషులవలననే నామరూపములు గల్గుచున్నవి కానిప్రత్యక్షముగా నట్టివి లేవు. అన్నివేదాంతములందుఁ బ్రసిద్ధుండవును బురుషశ్రేష్ఠుండవును నగునీకు నమస్కారములు గావించెద. ఓదేవా! నీవు మర్త్యులకు సంసారదోషములను దెలిపి యాయావర్ణాశ్రమములకు విహితము లగునీశ్వరారాధనరూపయాగాదిధర్మముల నుపదేశించి సాధుపరిత్రాణముఁ గావించుకొఱకు స్వస్వభావమునువిడువకయే శ్రీరామరూపముగా నవతరించితివి. నీవు మర్త్యశిక్షణమే ముఖ్యఫలముగా నెంచుకొని యవతరించినను రావణాదిరాక్షసులవధ యానుషంగికముగా

సమకూరినది మానవశిక్షణమే నీయవతారమునకు ముఖ్యఫలము. కానిచో, నిరతిశయమును నపరిచ్ఛిన్నంబు నగునానందస్వరూపము సర్వదా క్రీడించుచు విషయాసక్తిరహితుఁడ వయియున్ననీకు సీతావియోగాదికష్టములును, దత్కృతము లగుదుఃఖంబులును నెట్లుగాఁ గల్గినవి? సంసారము నిరతిశయదుఃఖావహం బని మనుజులకుఁ దెలుపుటకే సీతావియోగాదికృతదుఃఖంబుల ననుసరించితివి. అట్లు గాక రావణాదిరాక్షసవధార్థమే యైనచో దక్కినయవతారములందుంబోలెఁ దాదృశదుఃఖాదులనుభవింపకయే యాక్రూరులం జంపవచ్చునుగదా? సర్వశక్తిసముపేతుండ వగునీ వేమి చేయ సమర్థుండవు కావు? ఓమహానీయా! శ్రీరామరూపమవలంబించి పరబ్రహ్మమ వగునీవు సంసారధర్మములను బూర్తిగాఁ దొలంగించుకొని ని న్నాశ్రయించిన వారియందు నిరతిశయప్రేమ గలవాఁడవు. *లోకములు నీయందు వసించుటచేతను, నీవు లోకమం దంతటను నంతరాత్మరూపముగా వసించుటచేతను, వాసుదేవుండ వని పిలువఁబడుచున్నావు. నీవిట్లు జగదంతర్భూతుండ వయియున్నను శబ్దాదివిషయమునం దొకదానియందైనను సక్తుండవు కానేరవు. కావుననే సీతావియోగాదికృత మగుదుఃఖంబుల ననుభవింపలేదు. అట్లై* నిన్ను సర్వకాలములందును సేవించుచు నిన్నువిడిచియుండ

---

* "సర్వత్రాసౌ సమస్తంచ వసత్యత్రేతి వై యతః । తత స్స వాసుదేవేతి విద్వద్భిః పరికీర్త్యతే,, అని వాసుదేవశబ్దనిర్వచనము చేయఁబడినది.

† లక్ష్మణుఁడునుసీతయును రామునకు నిత్యానపాయు లెట్లగుదురనిశంకింప నవసరములేదు. లక్ష్మణుఁడు భగవంతునకు నివాసము, శయ్య, ఆసనము, అంశుకము, వర్షాతపాదులను నివారించుట మొదలగునుపచారములను దనశరీరభేద

నొల్లని సీతాలక్ష్మణులను మానవశిక్షనిమిత్తమే విడిచితివి. అట్లు కానిచో మిత్రభావముచేఁ బొందినవానిని విడువనేరనని పల్కెడి నీవు నిత్యానపాయు లగు సీతాలక్ష్మణుల నెట్లు విడుతువు? ఓమహానీయా! నీవు శరణాగతుఁడయిన పాపిష్ఠునైనను రక్షింతు నని దీక్షవహించి శ్రీరామరూపమున నున్నపరబ్రహ్మమవు. అట్టి నీకు బ్రాహ్మణాదిజన్మము సంతోషదాయకము కాదు. తిర్యక్కులందుఁ గూడ ననుగ్రహము గలవాఁడవగుటచే సౌందర్యాదులును నీకు సంతోషకరములు కావు బుద్ధి సంతోషకరము కాదు. ఆకారము సంతోషకరము కాదని నిక్కము చెప్పవచ్చును. వెనుకఁ జెప్పినబ్రాహ్మణత్వాదులే నీకు సంతోషదాయకములై తదితరము లసహ్యకరము లయినచో శేషావతారమగులక్ష్మణునితో నిత్యము సహచరుండవయి వర్తించునీవు పశుత్వధర్మపురస్కారముగా సృజింపఁబడినకోఁతుల మయినమాతో సఖ్యము చేయుదువా? ఓదేవా! ఎవఁడు భక్తానుగ్రహార్థము మనుజాకృతి నవలంబించెనో, యెవఁ డుత్తరకోసలములం దున్నప్రజల

---

ములచేతనే చేయుచు భగవంతుని విడువనొల్లక యుండు శేషాహియొక్కయవతారమె రామాయణమందు "భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే। అహం సర్వం కరిష్యామి జాగ్రతస్స్వపతశ్చ తే। కురుష్వ మా మనుచరం వైధుర్యం నేహ విద్యతే। కృతార్థోఽహం భవిష్యామి తవచార్థః ప్రకల్ప్యతే" అని లక్ష్మణుండు తనకు నిత్యకింకరత్వమునుఁ బ్రార్థించెను. కావున లక్ష్మణుఁడు రాముని నొకప్పుడును విడువనివాఁడు. అట్లే సీతయు "నిత్యైవైషా జగన్మాతా లక్ష్మీర్నిత్యానపాయినీ" యనియు, "రాఘవత్వే భవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని। ఆద్యేష్వప్యవతారేషు విష్ణోరేషానపాయినీ" అనియుఁ జెప్పఁబడుటచే సీత రామునకు నిత్యానపాయిని యగుచున్నది.

కండలుకును స్వర్గసుఖ మలవడఁ జేసెనో, యెవఁడు నిరతిశయప్రీతి విషయుఁడో, యెవఁ డుపకారాభిజ్ఞుఁడో, యట్టి శ్రీరాముఁడ వయిననిన్ను సురలైనను, రాక్షసులైనను, మానవులైనను, వానరులైనను సర్వప్రకారముల సేవించినచో వారిని దప్పక నీవను గ్రహించుచున్నావు” అని యిట్లు హనుమదాదులు సర్వదా నుతించుచుందురు. ఓరాజా! భారతవర్షమున భగవంతుఁడు

శుకుఁడు భారతవర్షమున నుపాస్యులను జెప్పుట.

నారాయణుఁ డనునామమున నొప్పుచుండును. అతఁడు కల్పాంతమువఱకు బదరికావనమందు నివసించి తపంబొనర్చుచుండు. ఆతఁ డట్లు చేయుచు నాత్మసాక్షాత్కారమున కుపయుక్తములగు కర్మయోగమును, జ్ఞానయోగమును, మనోనిగ్రహమును, నణిమాదు లగు నైశ్వర్యములను, బ్రాణజయమును, బాహ్యేంద్రియనిగ్రహమును వర్ధించుచుండును. పరమేశ్వరుం డగునతం డెందునిమిత్త మిట్లాచరించుచున్నాఁడో సామాన్యులకుఁ దెలియదు కాని యాలోచింప నుముక్షువులందఱిట్లాచరింపవలసిన దని లోకశిక్షనిమిత్తమే యు ట్లొనరించుచుండును.అంతియకాని యతనికి ఫలాపేక్ష లేదు. అట్టి నారాయణుని నారదమహర్షి వర్ణాశ్రమధర్మముల ననుసరించుచున్న భారతవర్షజనులతోఁ గూడి భగవంతునిచే సముక్తములగు సాంఖ్యయోగ కర్మయోగములను సాధనముగాఁ జేసికొని పంచరాత్రముచే భగవదనుభవమును సావర్ణిమనువున కుపదేశించుచుఁ బరమభక్తితో నారాధించు చుండును. మఱియు నిట్లు స్తోత్రముచేయు చుండును. “ఓదేవా! నీవు నిరతిశయ మగుసౌశీల్యము కలవాఁడవు.నీకు దేహేంద్రియాదులకు ధర్మములగు నశనాయాది పదార్థములు

లేవు. నీవు ముముక్షువులకు ధనమువంటివాఁడవు. నీవు నిరతిశయకల్యాణగుణములు కలవాఁడవు. మఱియు సమస్తదోషములను నిరసించుచున్నవాఁడవు. నీవునిరతిశయమగు హితము నుపదేశించుచుందువు.నీవెప్పుడును సంకోచమునొందని యపరిచ్ఛిన్నమగు నానందమే స్వరూపముగాఁ గలవాఁడవు. నీవు సర్వభూతములకు నధిపతివి. అట్టినీకు నమస్కారములు'' అని పల్కినారదుం డిట్లు గానముచేయుచుండును. "ఓమహానీయా ! చిదచిదాత్మక మైనయాప్రపంచమునకు సృష్ట్యాదియందుఁ గర్త యగుచున్న నెవఁడు నేనే కర్తయని యభిమానమును పొందఁడో, యంతరాత్మస్వరూపమున సమస్తదేవాదిశరీరములం దవభాసించుచున్నను నెవండు దద్గతము లగుగుణములచే సంకుచితజ్ఞానవంతుండు కాఁడో, సర్వదా ప్రకృతిపురుషసంబంధ మున్నను నెవఁడు జీవుని సంసారిత్వాది గుణములచేతను, బ్రకృతిసంబంధులగు జాడ్యాదిగుణములచేతను స్పృశింపఁబడఁడో, యట్టిమహానీయుఁడవును, స్వతుల్యాధికవస్తురహితుఁడవును చరాచరజగంబునకు సాక్షిభూతుండవును నగు నీకు వందనంబులు. ఓయోగేశ్వరా! భగవంతుఁడు హిరణ్యగర్భుఁడు శరీరధారులు తమతుచ్ఛదేహములందును దదనుబంధులందును నుపేక్ష యుంచినవారై మరణకాలమందు భక్తియుతుండై హేయగుణరహితుఁడ వగు నీయందు మనస్సును నిల్పుటే యోగచాతుర్య మని పలికియున్నాఁడు. అట్లు చేయఁగలుగుట మహాకార్యము కదా! ఓనారాయణా ! ఐహికసుఖము లగు గృహపశుపుత్త్రాదులందును, నాముష్మికములగు స్వర్గాదులందును గొందఱాసక్తులయి సర్వదా తమభార్యాదులును, బుత్త్రులును, ధనములును నిరపాయముగా

నుండవలయు నని చింతించుచుందురు. వారు శాస్త్రాదులను జక్కఁగా నభ్యసించినను గుత్సిత మగు కళేబరత్యాగమునకు భయపడుచుందురు. అట్టివారి శాస్త్రాభ్యాసాదులు కేవలము వ్యర్థములు గదా! కళేబరత్యాగాదులకు భయపడనివారు నీయను గ్రహమును సంపాదించినవారే కదా! కావున నో మహాప్రభూ! మాయందు దయయుంచి నిరుపాధిక మగుయోగమును మా కొసంగుము. మేము దానివలన నీకుత్సితకళేబరమందున్నదియు, నుపాయాంతరములచే విషువఁ దరము కానిదియు నహంకార మమకారరూప మైనదియు నగు నవిద్యను సుఖముగా విడుతుము" అని సర్వదా నుతించుచుండు. ఓ రాజేంద్రా! ఈభార

**శుకుండు భారతవర్షమునఁ గలనదీశైలములని రూపించుట.**

తవర్షమునందును మలయము; మంగళప్రస్థము, మైనాకము, త్రికూటము, ఋషభము, కూటకము, కోల్లము, సహ్యాము, వేదగిరి, ఋశ్యమూకము, శ్రీశైలము, వేంకటము, మహేంద్రము, వారిధరము, వింధ్యము, శుక్తిమంతము. ఋక్షగిరియుఁ, బారియాత్రము, ద్రోణము, చిత్రకూటము, గోవర్ధనము, దైవతకము, కకుంభము, నీలము, కాకముఖము, ఇంద్రకీలము, రామగిరి మొదలగుపర్వతములు పెక్కులు గలవు. ఇంకను నూఱులకొలంది పర్వతములు గలవు. ఆపర్వతములం దుద్భవించిన నదీనదంబులును పెక్కులుగలవు. అవియన్నియును మిక్కిలిపుణ్యదాయకము లయినవి. భారతవర్షీయు లానదులందుఁ దానము లాడి వానినామ స్మరణంబు గావించి పవిత్రులగుచున్నారు. ఆనదులలోఁ జంద్రమస, తామ్రపర్ణి, యవటోద, కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, పయోద, శర్కావర్త, తుంగభద్ర, కృష్ణవేణి,

భీమరథి, గోదావరి, నిర్వింధ్య, పయోష్ణి, తాపి, రేవ, శిల, సురస నర్మద, చర్మణ్వతి, మహానది, వేదస్మృతి, ఋషికుల్య, యత్రిసమ, కౌశికి, మందాకిని, యమున, సరస్వతి, దృషద్వతి, గోమతి, సరయువు, భోగవతి, సుషమ, శతద్రువు, చంద్రభాగ, మరుద్వృధ, వితస్త, విశ్వ, మొదలగునవి మహానదులు. సింధువు, శోణ, నదము లనఁబడుచున్నవి. ఓరాజా ! ఈభారతవర్షమునందుఁ బుట్టినపురుషులు సత్త్వరజస్తమోగుణకల్పితములును బుణ్యపాపరూపములును నగు తమకర్మములచే బహువిధము లగు గతులను సంపాదించుచున్నారు. *అందు సాత్త్వికకర్ములకు దివ్యగతియు, రాజసకర్ములకు మానవలోకగతియు, తామసకర్ములకు నధోలోకగతియుఁ గలుగుచుండును. కర్మానుసారముగా ఓనరపాలా! ఈవర్షమునందే బ్రహ్మక్షత్త్రియాదివర్ణములును, వారలకు విహితములగు ధర్మములును మోక్షసాధనములగు ననేకధర్మములును నిర్ణీతములై యున్నవి. పురుషుఁడు పుణ్యాపుణ్యరూప మగునవిద్యను ముందుగా నిరసించుకొని దానివలన భగవత్ప్రసంగము నలవఱుచుకొనవలెను. ఆభగవత్ప్రసంగము మోక్షసాధనమైనది. దానివలననే భగవంతునియం దనన్యఫలక మగు భక్తి యుదయించును. ఏపురుషుఁడు సర్వభూతస్వరూపుఁడును. † దేవమనుష్యాదుల నామరూపములచేఁ జెప్పఁబడని

---

* ఇందులకుఁ బ్రమాణము. ఊర్ధ్వంగచ్ఛంతి సత్త్వస్థా, మధ్యేతిష్ఠతిరాజసాః। జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః॥ అనెడి భగవద్గీతావాక్యము.

† ఇందు దేవమనుష్యాదినామముచేఁ జెప్పఁబడనివాఁ డనుటచే వానిచేఁ జెప్పఁబడుజీవునికి వ్యాప్తి గలుగుచున్నది. దేహముకంటె వ్యతిరిక్తుఁడను

వాఁడును, దేహముకంటె వ్యతిరిక్తుఁడును నితరమగు నాధార ము నపేక్షింపనివాఁడును, ముక్తులకంటెను నిత్యసిద్ధులకంటెను బరుండగువాఁడును సమస్తము తనయందుఁ గలవాఁడును నగు పరమాత్మయందు ఫల మపేక్షింపకుండ భక్తిని నెలకొల్పునో, వానికిఁ దత్కాలమందే యపవర్గము లభించును. ఓరాజా! ఊర్ధ్వలోకమునందు వసించిన దేవత లీభారతవర్షముప్రశస్తత్వమును గుఱించి యిట్లు గానము చేయుచున్నారు. "అయారే! భారతవర్షమందు వాసుదేవునిఁ బ్రత్యక్షముగా సేవింప సాధన మగు మానవరూపము నొందినవా రెంత భాగ్యవంతులు? అవురా! వా రెట్టిసుకృతము నాచరించుకొనిరో కదా! సాధన ము లక్కఱలేకుండఁగనే భగవంతుని సాక్షాత్కరింపఁ జేసికొను చున్నారు! ఇంతియకాక భగవంతుఁడు స్వయముగానే వీరికిఁ బ్రసన్నుం డగుచున్నాఁడు. ఆలోచింప వీరెంతో సుకృతము చేసికొనుటచేతనే వీరికిట్టిదిసంభవించినది. లేనిచోసంభవించునా? మాకీమానవజన్మమందుఁ గోర్కి వొడముచున్నది. స్వర్గాదులు సుఖకరంబులని మూఢు లనుకొనుచుందురు. కాని యచ్చటనేమి సౌఖ్యము కలదు? అచ్చట శ్రీనారాయణునిపాదపద్మస్మృతియే లేదు. నిరతిశయము లగునింద్రియసుఖములవలన మత్తులై యచ్చటివారు భగవంతుని స్మరింపనే స్మరింపరు. తాదృశతుచ్ఛ

టచే జడమునకును, 'నాధారాంతర మపేక్షింపని' అనుటచే ముక్తజీవులకు, 'ముక్తాదులకంటెఁ బరుఁ' డనుటవలన నిత్యసిద్ధులకును, వ్యావృత్తి గల్గుచున్నది. ఆలోచింపఁ బ్రకృతికంటెను, బద్ధజీవులకంటెను, ముక్తజీవులకంటెను, నిత్యజీవులకంటెను. బరుఁడయినవాఁడయి భగవంతుఁడు వెలయుచున్నాఁడని తెలియవచ్చుచున్నది.

మగుస్వర్గము నపేక్షించి దుష్కరము లయినతపంబు లాచరించుచుందురు. యాగము లొనర్చుచుందురు. వ్రతములను దానములను సల్పుచుందురు. ఇట్లు దుష్కరకార్యములవలన నస్థిరఫలమగు స్వర్గమును బొందినను నేమిలాభము గలదు? ఈభారతవర్షమందు మరణశీల మగు శరీరముచేతఁ జేయఁబడినక్రియాకలాపమును భగవంతునికి సమర్పించి భగవదుపాసకులయి జన్మజరామరణాదులు లేని శ్రీవైకుంఠమును బొందుచున్నారు. ఇట్లుండ నొకకల్పముకాల మాయు వున్నప్పటికి మగుడ జన్మము గల్గించెడియూర్ధ్వలోకప్రాప్తికంటె క్షణకాల మాయువు గలవారైనను నాశరహిత మగుమోక్షపదవిని బొందింపఁజాలినభారతవర్ష నరజన్మప్రాప్తియే మిక్కిలియుత్తమ మైనది కదా? కావున నేప్రదేశమున నారాయణునికథారూపము లగు సుధావాహినులు ప్రవహింపవో, ఏప్రదేశమున భగవత్కథాషస్మృతినదులను సేవింపఁ దలఁపు గలసాధుజను లుండరో, ఏస్థలము నిత్యోత్సవము పక్షోత్సవము మాసోత్సవము మొదలగుగొప్పయుత్సవములును భగవంతునారాధనరూపము లగుయజ్ఞములు నుండవో, యాస్థలము బ్రహ్మదేవునిలోక మైనను సేవింపఁదగినది కాదు. ఈభారతవర్షమున నెవ్వరు భగవంతునిఁ గీర్తించి, పూజించి ప్రదక్షిణనమస్కారము లొనరించి సందర్శించి తదీయ మగుతులసి నాఘ్రాణించి దేవతామాల్యమును దీసికొని తన్నివేదితప్రసాదాదులను గైకొని భగవత్సేవను గాంచి తదనుగ్రహము సంపాదింపఁదగిననరజన్మమును బొందియుఁ బునర్జన్మరహిత మగుముక్తికై యత్నింపరో, వారు వ్యాధునివలనఁ దప్పించుకొన నవకాశము గల్గియు నచ్చటనే విహరించి తద్బం

ధనంబునకుఁ జిక్కినపత్నులవంటివా రని నిశ్చయింపవచ్చును. భగవంతుఁ డవాప్తసమస్తకాముఁ డయినను నేకరూపుఁ డయినను భారతవర్ష వాసులు యాగములందు నగ్నీంద్రాదుల నామములచేఁ బిలిచి మంత్రపూర్వకముగా శ్రద్ధతో నర్పించుచున్న హవిర్భాగంబులను సంతోషముతో గ్రహించు చున్నాఁడు. పరిపూర్ణుఁ డగుభగవంతుఁ డట్లుగ్రహించుటయాగకర్తల కోర్కుల నెఱవేర్చుటకేకదా? ఇట్లు భగవంతునారాధించి యతనివలనఁ గోర్కులను బడయుభారతవర్ష వాసులదే భాగ్యముగాని తక్కినవారి దా భాగ్యము? మఱియు మానవులు భగవంతు నారాధించి యేయేపురుషార్థములను గోరుకొందురో, యాభగవంతుఁ డా యాపురుషార్థములనువారికొసంగుచుండుట సత్యమే. తాఁ గోరిన పురుషార్థమును బొందియుమానవుఁడుమఱియొకపురుషార్థమును గూర్చి భగవంతుని నారాధింప, వాని కాతఁడు నిరతిశయనిత్యపురుషార్థము నొసంగక యనిత్య మగుదానినేయొసంగును. ఫలమున పేక్షించి కోరువారి కట్లొయిచ్చుచుండును. కాని యేమహాత్ములతనిపాదపద్మములను నిష్కాములై భజించుచుందురో వారికి సమస్తవాంఛాపూర్వక మగుస్వరూపమునే యొసంగుచుండును. కావున నాభారతవర్షీయులలో ముముక్షువులభాగ్యము నిరతిశయ మైన దని చెప్పవచ్చును. మఱియు నీభారతీయులు తమలో "మాకు భారతవర్షమందు భగవత్స్మృతి గల్గించు నరజన్మము సంభవించినచో భగవంతు నారాధించి నిరతిశయసుఖరూపమగుమోక్షము నందవచ్చును. కావున మే మొనరించినయాగాది పుణ్యకర్మములు స్వర్గసుఖ మనుభవింపఁగా మిగిలియున్న

చో దానివలన మాకు భారతవర్షమున నరజన్మము సంప్రాప్త మగుఁగాక" యని కోరుకొనుచుందురు. ఓరాజేంద్రా! సగరకుమారు లశ్వమును వెదకుటకై భూమిని ద్రవ్వి నిర్మించినయుపద్వీపము లెనిమిది జంబూద్వీపమునకుఁ గల వని కొందఱు చెప్పుచున్నారు. అవి స్వర్ణప్రస్థము, చంద్రశుక్లము, ఆవర్తనము, రమణకము, మందహారిణము, పాంచజన్యము, సింహళము, లంక యనునామములచేత వ్యవహరింపఁబడుచున్నవి. ఓ రాజోత్తమా! జంబూద్వీపమునఁ గలవర్షవిభాగములనుయథాక్రమముగా వర్ణించి నీకుఁ జెప్పితిని. ఇది పందొమ్మిదవయధ్యాయము.

---

## శుకుఁడు ప్లక్షాదిద్వీపములవృత్తాంతమును చెప్పుట.

అని రాజునకుఁజెప్పి వెండియు శుకుం డిట్లనియె. "ఓరాజేంద్రా! ఇఁకఁ బ్లక్షాదిద్వీపములపరిమాణమును, లక్షణములను, నచ్చటి విశేషాంశములను జక్కఁగ విభాగించి యథాక్రమముగా వర్ణించెద. జంబూద్వీపమంతప్రమాణము గల లవణసముద్రముచే జంబూద్వీపము పరివేష్టింపఁ బడినట్లును, మేరువు జంబూద్వీపముచేఁ బరివేష్టిత మగునట్లును, నాలవణసముద్రమును రెండులక్షలయోజనములపరిమితి గలప్లక్షద్వీపముచే బాహ్యోద్యానవనముచే నగరమువలె నన్నివైపుల నావృతమై యున్నది. ఓరాజా! యాద్వీపమందు జంబూవృక్షమంతప్రమాణమున నొప్పుప్లక్షవృక్ష మున్నది. దానిచేతనే యాద్వీపమున కాపేరు వచ్చినది. మఱియుఁ బ్రకాశబహుళమయి యున్నతమయినయాప్లక్షవృక్షము మొదట నేడుజ్వాలలు గలయగ్నిహోత్రము వెలయుచుండును. ప్రియవ్రతునికుమారుఁ డగునిధ్మజిహ్వుఁ డా

ద్వీపమును జిరకాలము పరిపాలించి దాని నేడువర్షములుగా విభజించి యావర్షములనామములతో నొప్పుచున్న తనకుమారుల కేడ్వుర కొసంగి తాను భగవదుపాసనాత్మక మగుయోగముచే సంసారముక్తుం డయ్యె. శివ మనియు, యశస్య మనియు,సుభద్ర మనియు, శాంత మనియు, క్షేమ మనియు, నభయ మనియు, నమృత మనియు నావర్షంబులు వ్యవహరింపఁబడు. ఆవర్ష నామములచేతనే యాప్రియవ్రతునికుమారులును వ్యవహరింపఁబడిరి. ఆవర్షములలో నేడునదులును, నేడు పర్వతరాజములును సుప్రసిద్ధము లయినవి. ఆపర్వతములు, మణికూటము, వజ్రకూటము, ఇంద్రసేనము, జ్యోతిష్మంతము, ధూమ్రవర్ణము, హిరణ్యగ్రీవము, మేఘమాలము. నాఁబడునామంబులచేఁ బిలువఁబడుచుండును. ఆమహానదు లేడును నరుణ, నృమణ, యాంగిరసి,సావిత్రి, సుప్రభాత, ఋతంభర, సత్యంభర యనునామంబులు గలవి. ఆయరుణాదినదులందు స్నానపానంబు లాచరించువారికి రజస్తమోగుణంబులు తొలంగి సత్వగుణం బలవడును. ఆద్వీపమున నాలుగువర్ణములవారు వెలయుచుందురు. వారికి బ్రాహ్మణాదిసంజ్ఞలకుమాఱుగా హంసు లనియుఁ,బతంగు లనియు, నూర్ధ్వాయను లనియు, సత్యాంగు లనియు, నాలుగువర్ణసంజ్ఞలు గలవు. వారికి వేయువత్సరంబు లాయువు గలదు. వారిసంతానములు సౌందర్యంబున దేవతల మింతురు. వారు వేదోక్త మగుకర్మయోగముచే వేదమయుఁడును, సూర్యుఁడు శరీరముగాఁ గలఁవాఁడునునగుభగవంతునిసర్వదాపూజించుచుందురు. "ఓదేవా! నీవు జగంబునకుఁగారణంబవు. నీవువికారాదులు లేని వాఁడవు. నీవు నిరతిశయఫలము నొసంగువాఁడవు. నీవు బంధమోక్షము

లకు హేతుభూతుండవు. నీవు జగద్విగ్రహుండవు. అట్టి నీకు శరీరమై సూర్యుఁ డనునామమున నొప్పుజీవవిశేషుని శరణునొందుచున్నాము" అని జపించుచుందురు. ఓరాజేంద్రా ! ప్లక్షాదులం దైదు వర్షములందును బరమాయువును, నింద్రియపటుత్వమును, మనోబలమును, దేహబలమును, బుద్ధిబలమును, సామాన్యముగా నెల్ల వారికిని సహజములై యుండును. ప్లక్షద్వీపమునందుఁ గల సమస్తవిశేషములనువర్ణించి చెప్పితిని. ఇఁక శాల్మలద్వీపమునువర్ణిం

## శాల్మలద్వీపవృత్తాంతకథనము.

చెదను. వినుము, ఓరాజా! రెండులక్షలయోజనములవైశాల్యము గలప్లక్షద్వీపమంతపరిమాణము గలయిక్షురససముద్రముచే నావృతమైనట్లు నాలుగులక్షలయోజనములవైశాల్యముగలశాల్మలద్వీపముగూడ నాలుగులక్షలయోజనములవైశాల్యము గలసురాసముద్రముచే వర్తులముగాఁ బరివేష్టితమయి యున్నది. ఆ శాల్మలద్వీపమునఁ బ్లక్షవృక్షమంతయౌన్నత్యము గలశాల్మలీవృక్షము గలదు. కావుననే దానికాపేరు గల్గినది. గాయత్ర్యాదు లగుఛందస్సులే యవయవములుగాఁ గలవాఁడును, బక్షులకధిపతియు నగుగరుత్మంతున కావృక్షము నిలయమై యుండునని చెప్పుదురు. పూర్వ మాద్వీపమును బ్రియవ్రతునికుమారుఁడగుయజ్ఞబాహుఁడు చిరకాలము పరిపాలించి, దానినేడు వర్షములుగా విభజించి తనకుమారులకేడ్వురకును బంచి యిచ్చెను. ఆవర్షాధిపతులును నావర్షములును, సురోచనము, సౌమనస్యము రమణకము, దేవబర్హము. పారిబర్హము, ఆప్యాయనము, అభిజ్ఞాతము నాఁబడునామములచే వ్యవహరింపఁబడుచుందురు; ఆయేడువర్షములందు నేడువర్షపర్వతములుగలవు. అవి స్వరస మని

యు, శీతశృంగ మనియు, వామదేవ మనియుఁ గుముదమనియు ముకుంద మనియుఁ, బుష్పవర్ష మనియు, శతశ్రుతి యనియుఁ, బిలువఁబడుచుండును. ఆవర్షములం దేడుమహానదులు గలవు. అవి యనుమతి, శినీవాలి, సరస్వతి, కుహూవు, రజని, నంద, రాక, యనునామములచే వ్యవహృతము లగుచుండును. అచ్చటి పురుషులు శ్రుతధరు లనియు, విద్యాధరు లనియు, వసుంధరు లనియు, నిషంధరు లనియు నాలుగువర్ణములవారై యుందురు వారు వేదోక్తములగువర్ణాశ్రమధర్మములచే వేదప్రచురుండును బరమపురుషునికి శరీరంబు నగుచంద్రుఁ డనుజీవవిశేషుని నారాధించుచు నిట్లు నుతించుచుందురు. "ఏమహానుభావుఁడు శుక్లపక్షమందు దేవతలకును, గృష్ణపక్షమునఁ బితృదేవతలకును, స్వకిరణములచే నన్నమును విభాగించి యిచ్చుచున్నాఁడో, ఆచంద్రుఁడు మా కందఱకును బ్రభు వయి మాకు సుఖము గల్గించుఁగాక" అని ప్రార్థించుచుందురు. ఓరాజా! ఇఁకఁ గుశద్వీపవృ

కుశద్వీప వృత్తాంతము.

త్తాంతంబు వినుము. శాల్మలద్వీపమునురాసముద్రముచే నావృతమై యున్నట్లు గుశద్వీపము శాల్మలముకంటె ద్విగుణవిశాలమయి తనతోసమముగా నెనిమిదిలక్షలయోజనముల వైశాల్యము గలఘృతసముద్రముచే నావృతమైయున్నది. ఆద్వీపమునకు గుశద్వీప మని వ్యవహారము గల్గించునదై యగ్నివలెఁ బ్రకాశబహుళమై యున్నకుశస్తంభ మొకటి బ్రహ్మచే నందు నిర్మింపబడెను. ఆకుశస్తంభము బాలతృణములకాంతులచేఁ బదిదిక్కులును బ్రకాశించుచున్నవి. ఆద్వీపమునకుఁ బ్రియవ్రతునికుమారుఁడు హిరణ్యరేతనుం డధిపతి. వాఁడు దానిఁ గొంత కాలము

పరిపాలించియాద్వీపము నేడువిధములఁగా విభజించి వసువు, దానుఁడు, దృఢరుచి, నాభిగుప్తుఁడు, సత్యవ్రతుఁడు, విప్రనాముఁడు, దేవనాముఁడు నాఁబడుతన యేడ్వురుకొమరులకుఁ బంచియిచ్చి తాఁ దపంబును కరిగె. ఆవర్షాధిపతులనామములచేతనే యావర్షములును వ్యవహరింపఁబడుచున్నవి. ఆవర్షములం దేడువర్షపర్వతములు గలవు. వానికిఁ గ్రమంబుగా బభ్రువనియుఁ, జతుశ్శృంగ మనియుఁ, గపిల మనియుఁ, జిత్రకూట మనియు, దేవానీక మనియు, నూర్ధ్వరోమ మనియు, ద్రవిణ మనియు, నామంబులు చెల్లుచుండు. మఱియు నందు మహానదు లేడు రసకుల్యయు, మధుకుల్యయు, శ్రుతవిందయు, మిత్రవిందయు, దేవగర్భయు, ఘృతచ్యుతియు, మంత్రమాలయు, నను నామంబులతోఁ బ్రఖ్యాతంబులై యుండు. ఆనదీజలములస్పర్శముచేఁ గుశద్వీపవాసులు పాపరహితు లయి కుశలులు, కోవిదులు అభియుక్తులు, కులకులు నాఁబడునాలుగువర్ణములతో వెలయుచు, నగ్నిశరీరకుఁ డయిన భగవంతునిఁ గ్రియాచాతుర్య మొప్పఁగా నారాధించుచు నిట్లు నుతించుచుందురు. "ఓవీతిహోత్రా! నీవు శ్రీపరమేశ్వరుని శరీరభూతమ వయితివి. అట్టి భగవచ్ఛరీరభూతు లగునింద్రాదులకు యాగసంబంధి యగుహవిస్సును గొనిపోయి యిచ్చుచుందువు. కావునఁ బరమపురుషునికి శరీరభూతు లగునింద్రాదుల నుద్దేశించి చేసినమాయాగముచేఁ దదంతరాత్మ యగుపరమాత్మకుఁ బ్రీతిని గల్గింపుము." అని సర్వదా యగ్నినిఁ

క్రౌంచద్వీప వృత్తాంతము.

బ్రార్థించుచుందురు. ఓరాజేంద్రా! కుశద్వీపము ఘృతసముద్రముచే నావృత మయినట్లు కుశద్వీపమునకుఁ బిమ్మటఁ బదాఱు

లక్షలయోజనములవై శాల్యము గలక్రౌంచద్వీపము దానితో సమానపరిమాణము గలదధిమండ సముద్రముచేఁ బరివృత మగు చుండును. ఆద్వీపమందుఁ గ్రౌంచపర్వతము కలదు. ఆక్రౌంచము పూర్వము కుమారస్వామి బాణములచే భిన్నమై దధిమండమున విలీనం బయి వరుణునిచే సురక్షిత మగుచు నిర్భయమై యుండును. ఆక్రౌంచముచేత నే దాని కాపేరు గలిగినది. ఆద్వీపంబును బ్రియవ్రతునికుమారుండు ఘృతపృష్ఠుం డనువాఁడు పరిపాలించెను. పిమ్మట నతఁ డాద్వీపమును నేడుభాగములుగా విభజించి తనకుమారుల కేడ్వురకును నొసంగి స్వయంప్రకాశుండును నిరతిశయ మంగళరూపము గలకీర్తి గలవాఁడును నగుపరమాత్మయందు స్థిరమనస్కుం డయి తదీయపాదసన్నిధిని జెందెను. ఆఘృతపృష్ఠునికుమారు లామోదుడు,మధువహుఁడు, మేఘపృష్ఠుఁడు, సుదాముఁడు, ఋషిజ్యుఁడు, లోహితార్ణుఁడు, వనస్పతి, యను నామంబులతోఁ బరఁగుచుండురు. వారినామంబులచేత నే యాద్వీపంబులును వ్యవహరింపఁబడుచున్నవి. వర్షములను విభాగించెడిపర్వతము లం దేడుగలవు. అవి శుక్లమనియు, వర్ధమానమనియు, భోజనమనియు, నుపబర్హణమనియు, నానందమనియు, నందనమనియు, సర్వతోభద్రమనియుఁ బిలువఁబడుచుండును. ఆవర్షములం దేడునదులు నుప్రసిద్ధంబు లయినభయ, యమృతౌఘ,యార్యక, తీర్థవతి, తృప్తిరూప, పవిత్రవతి, శుక్ల, యను నామంబులతో వ్యవహృతంబు లగుచున్నవి. ఆనదులజల మతిపవిత్రమైనది. గురువు లనియు, ఋషభులనియు, ద్రవిణకులనియు, దేవకులనియు నాలుగువిధములుగా విభక్తు లయినయావర్షపురుషు లానదుల విమలజల

ము నుపయోగించుకొనుచు జలశరీరకుం డయినపరమపురుషుని నుదకాంజలులతో నారాధించుచు నిట్లు నుతించుచుందురు. "ఓజలములారా! మీరు పరమపురుషునికి శరీరభూతములై వఱలుచున్నారు. అట్లై భూర్భువస్స్వర్లోకముల మూఁడింటికిని బవిత్రత గల్గించుచున్నారు. అట్టిమిమ్మును స్పృశించు చున్నమా పాపములను హరింపుఁడు." అని ప్రార్థించుచుఁ గ్రౌంచద్వీపవాసులు పరఁగుచుందురు. ఓరాజా! క్రౌంచద్వీపము దధిమంద

### శాకద్వీపవృత్తాంతము.

ముచేతం బోలె నది శాకద్వీపముచేఁ బరివేష్టిత మై యున్నది. ఆద్వీపముముప్పదిరెండులక్షలయోజనములయాయామము గలది. అది స్వమానముచే నొప్పుక్షీరసముద్రముచేఁ బరివేష్టితమై యున్నది. దానియందు గొప్ప శాకవృక్షమున్నది. తదీయపుష్ప పరిమళములచే నది యాద్వీపము నెల్లను బరిమళింపఁజేయుచు దానికి శాకద్వీప మనునామమును గల్గించుచున్నది. ఆద్వీపమును బ్రియవ్రతునికుమారుఁడు మేధాతిథి పరిపాలించి తన పుత్రనామములతో వ్యవహృతము లగువర్షముల నేడింటి విభజించి కుమారులకిచ్చి తాను భగవంతుఁ డగువాసుదేవునియందు మనంబు నిలిపి తపోవనంబు ప్రవేశించె. పిమ్మట నతనికుమారులు తమతమభాగములను జక్కఁగఁ బరిపాలించిరి. వారు పురోజవుఁడు, మనోజవుఁడు, వేపమానుడు, ధూమ్రానీకుఁడు, చిత్రరథుఁడు, బహురూపుఁడు, విశ్వాధారుఁడు ననునామములు గలవారు. ఆనామములే యాయా వర్షంబులకు సైతము చెల్లు. ఆవర్షముల కేడు మర్యాదాగిరులు గలవు. అవి యీశానమనియు,నురుశృంగమనియు, బలభద్రమనియు, శతకేసరమనియు,

సహస్రస్రోత మనియు, దేవపాల మనియు. మహానస మనియు నేతన్నామంబులచే వ్యవహరింపఁబడుచున్నవి. మఱియు నా యేడువర్షములందును నేడునదులు గలవు. అవి యనఘయు, నాయుర్దయు, నుభయస్పృష్టియు, నపరాజితియుఁ, బంచపదియు, సహస్రస్తుతియు. నిజధృతియు నాఁబడు నామంబులచేఁ బిలువఁ బడుచున్నవి. ఈవర్షములందలి ప్రజలు, ఋతవ్రతులు, సత్యవ్రతులు, దానవ్రతులు, నువ్రతులు నను వర్ణవిభేదము గలవారై ప్రాణాయామాదులచే రజస్తమంబులఁ దొలంగించుకొని నిశ్చల సమాధి నవలంబించి వాయుశరీరకుఁ డగుపరమపురుషు నారాధించి "వాయుశరీరకుఁడ వగునోపరమాత్మా! ఎవఁడు, ముఖ్య ప్రాణరూపముగా సమస్తజీవులలోను బ్రవేశించి చిహ్నభూతము లగు ప్రాణాదివృత్తులచే సమస్తమును వర్ధించుచున్నాఁడో యెవనియధీన మై యీజగం బంతయు వర్తించుచున్నదో, నిఖిలాంతర్యామి వగునట్టి నీవు మమ్మును రక్షింతువు గాక" యని నుతించుచుందురు. ఓరాజేంద్రా! క్షీరసాగరమునకుఁ దరు

పుష్కరద్వీప వృత్తాంతము.

వాతఁబుష్కరద్వీప మున్నది. అది యిఱువదినాల్గులక్షల యోజనముల వైశాల్యము గలది. అది తనయంత పరిమాణ గల శుద్ధజలార్ణవముచేఁ బరివేష్టిత మయి యున్నది. ఆద్వీపమున గొప్ప కమల మొకటి కలదు. దాని కొకలక్షపత్రములు గలవు. అవి యగ్నిశిఖవలె నమలములై సువర్ణమయము లయి వఱలు చుండును. దానియందు బ్రహ్మ యధివసించి యచ్చటిప్రజలచే సేవింపఁబడుచుండును. ఆపుష్కరము బ్రహ్మ కాసన మగుటచే నతనికిఁ బుష్కరాసనుఁ (కమలాసనుఁ)డను నామము కల్గించు

టయే కాక, యాద్వీపంబునకును బుష్కరద్వీప మని నామము కల్గించుచున్నది. దాని మధ్యభాగమునందుఁ బదివేల యోజనముల యౌన్నత్యంబును, నంతియ విస్తృతియుఁ గలమానసోత్తర మనుపర్వత మొకటి యున్నది. అది యంతర్బహిర్భాగంబుల నున్నవర్షములకు మర్యాదాగిరి యై యున్నది. ఆగిరియందు నాల్గుదిక్కులందును నింద్రయమవరుణకుబేరులపురంబులు గలవు. ఆ యింద్రాదిపురములకు మీఁదుగా మేరువునకుఁ బ్రదక్షిణముగాఁ దిరుగుచున్నసూర్యునిరథంబునకుఁ జక్రమై దేవతల కహోరాత్రరూప మయి సంవత్సర మనుపేరు గలదై యుత్తరాయణ దక్షిణాయనము లను నవయవములతో వెలయుచు బండిచక్రమువలెఁ బరిభ్రమించుచుండును. ఆ పుష్కరద్వీపమును బ్రియవ్రతునికుమారుఁడు వీతిహోత్రుఁడు మొదటఁ బరిపాలించి రమణకధాతకు లనెడి తన యిర్వురుకుమారులకును బంచియిచ్చి సత్కర్మశీలుఁ డయి తనసోదరులవలెఁ బరమపురుషునందు భక్తిసంయుతుఁడై పరమపదము నొందెను. ఆవర్షములందుండుప్రజలు చతుర్ముఖశరీరకుఁడయినభగవంతునిఁ,గర్మయోగ విశిష్ట మయిన భగవదుపాసనముచే నారాధించుచుందురు. ఇట్లు నుతించుచుందురు."ఓ దేవా! నీవు పరబ్రహ్మమునకు శరీరభూతుండవు. నీవు చరాచరాత్మకప్రపంచమును సృజించి కర్మప్రచురుండ వగుచున్నావు. పరమాత్మకు శరీరమ వగునిన్ను జనులందఱును దేవమనుష్యాది కార్యవర్గమును గుఱించి సమష్టిరూపుఁడ వగుటచేఁ గార్యజాతముకన్న నభిన్నునిఁగాఁ దలపోసి యవ్యభిచరితముగాఁ బూజించుచుందురు. జగత్కర్తవై జనవంద్యుండ వగు నీకు నమస్కారము" అని యావర్షస్థజనము బ్రహ్మను శ్లా

షించుచుందురు. ఓరాజా ! సప్తద్వీపాత్మక మగు భూమండల మును వర్ణించి చెప్పితిని. తిరువాత వానినిగూర్చి చెప్పెద వినుము. ఆశుద్ధజలసముద్రమునకుఁ బరముగా లోకాలోకము కంత రాళమునుండి లోకాలోక మను పేరు వహించినపర్వత మొకటి కలదు. ఓరాజేంద్రా ! అలోక మనఁగా నేమి యని నీకు సంది యము కలుగవచ్చును. దానిని వివరింతును. వినుము. మేరువు మధ్యభాగము మొదలుకొని మానసోత్తరము వఱకును వ్యా పించి యున్న భూమి, యొకకోటి యేఁబదియేఁడులక్షల యేఁబది వేల యోజనముల పరిమితిచే నొప్పుచున్నది. శుద్ధోదధి మొదలు లోకాలోకముదాఁకఁ గలభూమియునంతియపరిమాణముగలది. లోకాలోకశుద్ధజలసముద్రములకు మధ్యభాగమున నున్నభూమి కాంచనమయమై, యద్దమువలె నిర్మలమై జలశూన్యమై యు న్నది. ఆభూమియం దుంచినవస్తువును దేనినైనను మగుడఁ బొందలేము. ఆలోకాలోకపర్వతమునకు వెలుపట సమస్త జంతుశూన్యమై యున్నభూమి కలదు. ఓనరేంద్రా ! మేరువు మొదలుకొని లోకాలోకమువఱకుఁ గలదంతయు లోక మనఁ బడుచున్నది. లోకాలోకమునకుఁ దరువాతిభాగ మలోక మని చెప్పఁబడుచున్నది. లోకాలోకముల కంతరాళమున నాపర్వత ముండి వ్యవస్థ చేయుచున్నది. కావున దాని కా పేరు గల్గుచు న్నది. ఆలోకాలోకము భూరాదిలోకత్రయంబునకును నవ్వల వృత్తాకారముగా భగవంతునిచేఁ గల్పింపఁబడినది. భూరాది లోకములు మూఁడును దాని కంతర్వర్తులై యే యున్నవి. కా వున సూర్యుండు మొదలు ధ్రువునివఱకుఁ గల జ్యోతిర్మండల ముల కాంతిసమూహములు దమకుఁ గ్రిందుగా నున్నవానిని

మాత్రమే యంతటను బ్రకాశింపఁజేయుచున్నవి. కాని యాచక్రవాళము ప్రతిబంధమై నిల్చుటం జేసి యవతలిభాగమును బ్రకాశింపఁ జేయలే కున్నవి. కావుననే సూర్యప్రకాశము కలది లోకమనియు లేని దలోక మనియు నన్న యవయవార్థము సరిపడుచున్నది. అది ధ్రువమండల మంతయున్నతముగా నుండుటచేతను, ముల్లోకములును దాని కంతర్భాగములయి యుండుటచేతను లోకాలోకముల కెల్లయైవిలసిల్లుచున్నది. ఓరాజేంద్రా! ఈరీతిగా భూమండలముపరిమితి యేఁబదికోట్ల యోజనము లని ప్రకృతిశాస్త్రజ్ఞులచే నూహింపఁబడుచున్నది. ఆలోకాలోకము భూమండలమునకుఁ గలయేఁబదికోట్ల యోజనములపరిమాణము లోను నాల్గవవం తగు పండ్రెండుకోట్ల రేఁబదిలక్షల యోజనముల యౌన్నత్యముచేతను దదనుగుణ మగు నాయామము చేతను విలసిల్లుచున్నది. ఆచక్రవాళము నుపరిభాగమున నాల్గు దిక్కులందును నిఖిలజగద్గురుం డగుబ్రహ్మ ఋషభ మనియుఁ, బుష్కరచూడ మనియు, వామన మనియు, నపరాజిత మనియుఁ బిలువఁబడు నాల్గుకరీంద్రములను సకలలోకములక్షేమము కొఱకు నిల్పెను. ఆద్విరదపతులకును, నింద్రాదులకును, నానావిధసామర్థ్య మలవడుటకుఁగా సర్వోత్కృష్టుండును, బరమపురుషుండును, బ్రకృతిపురుషుల కధిపతియు నగువాసుదేవుండు సమస్తమునకు నంతరాత్మ యై వర్ణాశ్రమోచిత కర్మయోగము చేతను, బ్రకృతికంటె వివిక్త మగు నాత్మయాథాత్మ్యజ్ఞానము చేతను, వైరాగ్యముచేతను, ననుగృహీత మయి యణిమాద్యష్టైశ్వర్యపర్యంత మగునుపాసనముచే దర్శనీయ మగు శుద్ధసత్త్వ

మును దివ్యమంగళవిగ్రహమును దాల్చి, తన పరిచారకులలో వరిష్ఠు లగు విష్వక్సేనాదులచేఁ బరివేష్టితుం డై భుజాదండము లందుఁ జక్రాదిసాధనములు వెలుఁగొందఁ దనమాయచేఁ గల్పిత మగులోకముల రక్షణమందు బద్ధాదరుం డై సకలలోకముల సుఖమును గోరుచు నాగిరిశ్రేష్ఠమందుఁ గల్పాంతముదాఁక నివ సించుచుండును. ఓరాజా! లోకాలోకమున కంతర్వర్తి యైన భూపరిమాణముఁ జెప్పుటచే దానికవతలనున్న భూపరిమాణము గూడఁ *జెప్పినట్లైకదా! ఆలోకాలోకమున కవతల విశుద్ధమగు

* భూమండల మేఁబదికోట్లయోజనములపరిమితి గలదని పెద్దలు చెప్పుచున్నారు. ఆభూమండలమునకు మధ్యమున మేరు వున్నది. ఆమేరువుదగ్గఱ ప్రారంభించి యండభిత్తివఱకును, తిన్నగా నాల్గుదిక్కులకునునడచినచో నిరువదియైదుకోట్లయోజనములదూర ముండును. అండభిత్తియొక్క దక్షిణభాగ మువెంబడి ఉత్తరపుకొనవఱకు నడిచినచో నేఁబదికోట్లయోజనములదూరముండును. అట్లేపడమటనుండి తూర్పునకునడిచిన నంతయే దూరముండును. మేరువు మొదలండభిత్తివఱకుఁ గలభూభాగమున జంబూద్వీపభాగ మేఁబదివేల యోజనములపరిమితి గలది. అట్లే తక్కినద్వీపములయొక్కయు సముద్రముల యొక్కయుఁ బరిమాణముఁ గలిపినచో రెండుకోట్లయేఁబదిమూఁడులక్షలయేఁబదివేలయోజనములపరిమితి సాగరసప్తకములోను, ద్వీపసప్తకముతోనుగూడినభూమికిఁ గలదని స్పష్టమగుచున్నది. మంచినీటిసముద్రమునకు తరువాతిభూమి యొక్కకోటి యేఁబదియేడులక్షల యేఁబదివేలయోజనముల పరిమితి గలది. దానికంటెఁ బరముగానున్న యాదర్శభూమి యెనిమిదికోట్లముప్పదితొమ్మిది లక్షల పరిమాణముకలది. వీనినిగలిపి గణించినచోఁ బండ్రెండుకోట్ల యేఁబది లక్షల యోజనములపరిమాణ మని తెల్ల మగుచున్నది. అట్లే లోకాలోకపర్వతముకంటెఁ బరముగా నున్నది. పండ్రెండుకోట్ల యేఁబదిలక్షలప్రమాణ మని పరిశేషన్యాయముచే స్పష్ట మగుచున్నది. వర్తులాకారముగా నున్నభూమి

యోగప్రభావముగలయోగీశ్వరులు మాత్రమే సంచరింపఁగలుగుదురు. భూమండలమునకు మధ్యమున మేరు వున్నది. ఆమేరు వునకు మీఁదుగా భూమ్యాకాశముల నూర్ధ్వాధఃకర్పరములకు మధ్యమున సూర్యుఁ డుండు. ఆ సూర్యునకు నండభిత్తికి నెలు చూచినను నిరువదియైదుకోట్ల యోజనముల పరిమాణము. ఈ యండము నశ్వరమైనది కాన నిది మృతండ మని పిలువఁబడు చున్నది. ఆ మృతండమువలన నయినవాఁడు కాన సూర్యుండు మార్తండుఁడని చెప్పఁబడు చున్నాఁడు. ఈయండముమధ్యభాగము హిరణ్మయమై యున్నది. ఈ హిరణ్మయాండ ముత్పత్తిస్థానముగాఁ గలవాఁడు కాన; బ్రహ్మ హిరణ్యగర్భుఁడని చెప్పఁబడుచున్నాఁడు. సూర్యబ్రహ్మల కీయండమువలననె యూరెండు నామములును గలిగినవి. *సూర్యుఁ డండపరిమాణమునకే యు

రొక్క నాభిప్రదేశము మొదలు రెండవప్రక్క వాస్థలమునకు నిరువదియైదు కోట్లపరిమితి కలదు. అట్లె రెండవవైపునఁ జూచిన నంతే యుండును. దీని వలన భూవలయ మేఁబదికోట్లయోజనముల పరిమాణ మని తెలియఁదగినది.

* భూమండలపరిమాణము నిట్లుగాఁదెలిసికొనవలెను. భూమండల మేఁబది కోట్లయోజనములపరిమితి గలది. వానికి మధ్యమందు మేరు వున్నది. మేరు మూలము మొదలుకొని యండగోళముపర్యంతము నలువైపులను నాలుగువిధములుగా విభజింపవలెను. ఇట్లు విభజింపఁబడిన నాలుగుభాగములు మొదట సన్నముగానుండి తరువాతఁ గ్రమక్రమముగా విశాలమగుచు, అనఁగాఁ ద్రికోణాకారముగా నుండును. అందొక్కొక్కభాగమున మేరువు మొదలుకొని యండభిత్తిపర్యంతమును దిన్నగా నడిచినచో నిరువదియైదుకోట్ల యోజనము లదూర ముండును. ఆభాగములలో నొకొక్కదానిపరిమాణము పండ్రెండుకోట్లయేఁబదిలక్షలు. ఏలాగున ననఁగా, జంబూద్వీపపరిమాణము లక్షయోజనము

వధి కాఁడు. మఱియు దిగ్విభాగమునకుఁ గూడ నవధి యగుచు

---

ఉ. కావున మేరువు మొదలు లవణోదధిపర్యంతమును గలనాల్గుభాగములలో నొకదానిపరిమాణము. జంబూద్వీపమందుఁ గలవిభాజకరేఖలలో నొకదాని కొననుండి వేఱొకదానికొనకు నడిచినచో నేఁబదివేలయోజనములు. కావున మేరువు మొదలు లవణోదధిపర్యంతము గలయొక్కొక్కభాగ మిరువదియైదు వేలయోజనంబుల వైశాల్యము గలది. అట్లె తక్కిన మూఁడుభాగములపరిమాణము నుండును. వానినాల్గింటిపరిమాణమును సంకలనము చేసినచో లక్షయోజనములపరిమాణమును సరిపడును. అట్లె యాయాద్వీపములందును సముద్రములందును గలవిభాజకరేఖలకు మధ్యమున నున్న నాల్గుభాగములలోను నొక్కొక్కదానిపరిమాణ మేఁబదివేలయోజనములు. నాలుగుభాగముల మొత్తము రెండులక్షలయోజనములు. ఇట్లె శుద్ధోదధిపర్యంతము నుజూచుచుండవలెను. కావున నొక్కొక్కభాగమునందు మేరువు మొదలుకొని శుద్ధోదధిపర్యంతము నుదిన్నఁగానడిచినచో 2,53,50,000 యోజనములదూరముండును. ఆశుద్ధోదధి మొదలుకొని లోకాలోకపర్యంతమునుఁ బోయినచో 1,57,50,000 వేల యోజనములపరిమితి యుండును. లోకాలోకము మొదలుకొని యండభిత్తిపర్యంతము గలలోకభాగము 8,39,00000 వేలయోజనములపరిమితి గలదు. కావున మేరువు మొదలుకొని యండభిత్తివఱకుఁ గలయొకవైపుపరిమాణము 12,50,00000 వేలయోజనములు. అట్లె తక్కిన మూఁడుభాగములు నంతపరిమాణము కలవి కాఁగా సంకలనముచే భూమండలపరిమాణము 50,0000000 యోజనంబులపరిమాణంబును సరిపడును. కావున దక్షిణమున నున్న యండభిత్తినుండి యుత్తరమున నున్నయండభిత్తికి ఋజుగమనంబునఁ బోయినను బూర్వభిత్తి మొదలుకొని పశ్చిమభిత్తిదాఁకఁబోయినను 50,0000000 యోజనములపరిమితియేయుండును. ఇచ్చట మఱియొకవిశేషము. భూమండలము నాల్గుభాగంబులుగాఁ జేసినప్పు డందులో నొకటి పండ్రెండుకోట్లయేఁబదిలక్షలయోజనముల

న్నాఁడు. ఓరాజా! సూర్యునవధిగాఁ జేసికొనియె పూర్వదక్షిణాది దిక్కులును, గగనంబును, స్వర్గలోకమును, భూమిని, భోగమోక్షప్రదేశములను, నరకములను, నతలాది లోకములను, బూర్తిగా విభజించుచున్నారు. ఇంతియకాక భగవదాత్మకుఁడయిన సూర్యుండు, దేవతలు తిర్యక్కులు మనుష్యులు లతలు వృక్షములు మొదలగు సమస్తజీవనికాయముల దృగింద్రియములకు నధిష్ఠాతయై యున్నవాఁడు. ఇది యిరువదవయధ్యాయము.

---

పరిమితిగలది. ఆభాగములో మేరుమూలము మొదలుకొని లవణోదధిపర్యంతమునుగొల్చినచో జంబూద్వీపభాగము 50,000 వేలయోజనములపరిమాణము కలది. పిమ్మట లవణోదధిభాగమును గొల్చిన లక్షయోజనములుండును ప్లవద్వీపపరిమాణము రెండులక్షలయోజనములు. దానితరువాతనున్న యిక్షుసముద్రము రెండులక్షలయోజనములపరిమితి గలది. తరువాత శాల్మలద్వీపపరిమాణము నాలుగులక్షలు. సురాసముద్రమునింతియె. పిమ్మటఁగుశద్వీపమును ఘృతసముద్రమును పదాఱులక్షలయోజనములు. ఇట్లె శుద్ధోదధిపర్యంతముగలతక్కినవానిపరిమాణములనుసంకలనము చేయఁగా 2,53,50000 యోజనములసంఖ్య సరిపడును. తరువాతఁ గాంచనభూమి 1,57,50000 యోజనములు. అట్లె లోకాలోకము మొదలు మరల లోకాలోకముదాఁక నడచినచో 10,14,00,000. భూమియొుఁ దక్కినపరిమితి గలది. ఇట్లు భూమండలము 50,00,00,000 యోజనముల విస్తీర్ణత గలది యని యెఱుంగునది.